శ్రీమతే రామానుజాయ నమః



"సత్యం వద ధర్మం చర"



# ద్వితీయభాగము



నైమిశారణ్యములో శిష్యసమేతముగా వేంచేసియున్న శ్రీవిఖనస మహర్షి



వేపూరి శేషగిరిరావు

శ్రీమతే రామనుజాయ నమః



ధర్మో రక్షతి రక్షితః

# వేదాంత చూర్ణిక

సంఖ్యాప్రాశస్త్యము

ద్వితీయ భాగము

ఈ గ్రంథము

శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి

Edit 5/1362/2000 తేది 16-8-2001

ఆర్డరుననుసరించి

శ్రీవారి యొక్క ద్రవ్య సహాయముతో ముద్రితము వారికి
నా హృదయపూర్వక నమస్కృతులు
ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమో నమః

అంకితం



ధరణి కలియుగ ప్రత్యక్ష దైవమీవు,
'డు' 'ము' 'వు' లెరుగని వాడను శ్రమఫలింప,
శోధనమొనర్చి "వేదాంతచూర్ణిక"నెడి,
గ్రంథమును వ్రాసి యొసగితి కాన్కగాను,
స్వీకరింపుము దయతోడ శ్రీనివాస.
సంకలనకర్త : వేపూరి శేషగిరిరావు

**చతుర్థ పుష్పం**

ప్రథమ ముద్రణ. విషు (వృష) మార్గశిర-శుద్ధ-వైకుంఠ ఏకాదశి 26-12-2001

ప్రతులు : 1000

మూల్యం . రూ. 100/-

ముఖచిత్రం . మధు ఆర్ట్స్, ఏలూరు

హక్కులు . సర్వహక్కులు రచయితవి



ప్రతులకు

**1. వేపూరి శేషగిరిరావు**

**కస్తూరి పబ్లికేషన్స్**

వంగూరు, పెదవేగి మండలము

పశ్చిమగోదావరి జిల్లా,

ఫోన్ : 79582

**2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

**విజ్ఞానభవన్, 4-1-435**

బ్యాంకు స్ట్రీట్, హైదరాబాద్ - 500 001

వారి ఇతర బ్రాంచీలు

డి టి పి **జి.వి.ఎస్. మూర్తి** (రత్నగర్భ), ఏలూరు

ఫోన్స్ . 21815, 33252

ముద్రణ : **వేంకట్రామా అండ్ కో**, ఏలూరు

ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఫోన్ . 30036

శ్రీమతే రామానుజాయ నమః



ఓం

శ్రీగురుపాదుకాభ్యాం నమః

పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ**

**రామానుజ జీయరు స్వామి వారు**

శ్రీమతే రామానుజాయ నమః - శ్రియై నమః - శ్రీమతే నారాయణాయ నమ :



# ఓం నమః పరమాత్మనే



పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం।
ధర్మ సంస్థాప నార్థాయ
సంభవామి యుగే యుగే॥

శ్రీమతే రామానుజాయ నమః





శ్రీ వేపూరి చినరామయ్య
సీతారామమ్మ

గ్రంథకర్త
తల్లిదండ్రులు

తండ్రి జననము : 1903
మరణము : 13-12-1973
తల్లి జననము : 1918
మరణము : 12-2-1998



శ్రీ వేపూరి శేషగిరిరావు
కస్తూరి

గ్రంథకర్త
దంపతులు

# పరిచయం

ఈ "వేదాంత చూర్ణిక" (సంఖ్యా ప్రాశస్త్యము) గ్రంధకర్త వేపూరి శేషగిరి రావు వేంగీ మండలం (పెదవేగి) లోని వంగూరు అనే ఒక కుగ్రామంలో వెలమ వంశంలో చిన్నరామయ్య సీతారామమ్మల కనిష్టపుత్రుడు నేనూ ఆ గ్రామస్తుడనే మేమిద్దరం బాల్యస్నేహితులం అమూల్య స్నేహం మాది

హైస్కూలు చదువు పూర్తి చేసుకుని శేషగిరిరావు ప్రభుత్వోద్యోగిగా సర్వే అండ్ లాండ్ రికార్డ్సు డిపార్టుమెంటులో స్థిరపడి వివిధ ప్రదేశాలలో పనిచేసి జూలై ౧౯౯౪లో రిటైరై జీవనోపాధికి లోటులేని జీవితం గడుపుతున్నాడు సహధర్మచారిణితో

ఈ రచయితకు చిన్నప్పటి నుండి క్రీడలపై ఆసక్తిమెండు సాంఘిక నాటకాలలో వైవిధ్యంగల అనేకపాత్రలు ధరించి నటించి అనేక బహుమతులు పొందిన కళాకారుడు మరియు రెండు సన్మానములు జరిగినవి 1. 'సత్యహరిశ్చంద్ర'లో విశ్వామిత్ర పాత్రధారిగా ఏలూరులో 15-7-1993, 2. 'రక్తకన్నీరు'లో మామ పాత్రధారిగా వేంకటాపురంలో 11-3-1998.

కళారంగంలో సినిమా నటుడు కీర్తిశేషులైన శ్రీ నాగభూషణం గారి 'రక్తకన్నీరు' నాటకంలో హాస్యపాత్రను పోషించి, స్వరాష్ట్రంలోనే కాకుండా మహారాష్ట్రలో బొంబాయి, షోలాపూర్ తదితర ప్రదేశాలలో ప్రదర్శనలలో పాల్గొని నటుడిగా ప్రేక్షకుల మన్ననలందుకున్నాడు.

నేను కూడా చిన్నప్పటి నుండి నాటకాలంటే సరదా పడేవాణ్ణి కాని నేను పౌరాణికాల్లో మాత్రమే నటించేవాడిని మా గ్రామంలోనే ఉత్సాహవంతులైన, నాలాగా మధుర కంఠ స్వరము కలిగిన నా యీడు యువకులను ప్రోగుచేసి ప్రోత్సహించి వారితో కలిసి ప్రతి సంవత్సరము మావూరిలోని దేవాలయముల వద్ద శివరాత్రి, శ్రీరామనవమి సందర్భంలో ఏదో ఒక పౌరాణిక నాటక ప్రదర్శన చేసేవాణ్ణి

నా మిత్రుడు శేషగిరిరావును కూడా ప్రోత్సహించి పౌరాణిక నాటకాల్లో నటింపచెయ్యాలనే పట్టుదలతో గాత్ర సౌలభ్యముననుసరించి మిత్రుని చేత విలన్ పాత్రలు, హాస్య పాత్రలు ధరింపచేయాలనే ఉద్దేశంతో, మావూరికి సమీపంలో వున్న ఏలూరు పట్టణంలో ఒక హార్మోనిస్టు వద్ద

యిద్దరమూ కలిసి కొన్ని సంవత్సరాలు రాగాలు నేర్చుకున్నాము ఇద్దరమూ కలిసే నటించేవాళ్ళం ఏ పౌరాణిక నాటకంలోనైనా దూరప్రాంతాల్లో ఇతరుల నాటకాలు కూడా యిద్దరం కలిసి వెళ్లి చూచేవాళ్లం మా నాటక ప్రదర్శనలు మావూరికే పరిమితం కాకుండా పరిసర ప్రాంతాలకు కూడా విస్తరింపచేశాం అనేక తీర్థప్రదేశాల్లో మేము ప్రదర్శనల్లో పాల్గొని జంట నటులుగా జీవించాం దాదాపు మూడు దశాబ్దాలు

మాకు మావూళ్లోనే మరొక బాల్యమిత్రుడున్నాడు అతని పేరు శివలెంక ప్రకాశరావు మేము రోజూ మావూరి నుండి ఏలూరు వెళ్లి హైస్కూలులో విద్యాభ్యాసం చేసేవాళ్లం మేము ప్రతిరోజు తిరిగి వచ్చేటప్పుడు మార్గ మధ్యంలో వున్న తమ్మిలేటి ఇసుక తిన్నెలలో కూర్చుని పిచ్చాపాటి కబుర్లు చెప్పకుంటూ, ఛందస్సును గూర్చి చర్చించుకునే వాళ్లం వచ్చీరాని పద్యాలు వ్రాయటం అలవాటు చేసుకున్నాం

ఆ తరువాత బ్రతుకు తెరువుకోసం మాదార్లు వేరయ్యాయి ప్రకాశరావు తెలుగు లెక్చరరుగా స్థిరపడి రిటైరైనాడిప్పుడు నేను ఢిల్లీ, ముంబాయిలలో కొన్ని సంవత్సరాలు ఉద్యోగం చేసి, కారణాంతరాలవల్ల మళ్లీ మావూరు తిరిగి వచ్చేశా

నాటకరంగంలో కీర్తి ప్రతిష్ఠల కన్నా వ్యయప్రయాసలే అధికమన్న జీవితపాఠం నేర్చుకొని, నేనూ శేషగిరిరావూ మా దృష్టి సాహిత్యరంగం వైపు మరల్చాం అతడు గద్యరచన నేను పద్యరచన. నేను శిష్యశతకం, భారతీశతకం, గోపికాస్వాంతం అనే పుస్తకాలు వ్రాశాను రేడియోలో కూడా స్వీయ కవితాగానంచేసే అదృష్టం కూడా కలిగింది అనేక మంది కవులతో పరిచయం ఏర్పడింది అనేక అవధానములలో పృచ్ఛకునిగా కూడా నాకు గుర్తింపు లభించింది

నా మిత్రుడు శేషగిరిరావును కూడా పద్యరచనకు ప్రోత్సహించా తత్ఫలితంగా, ఏలూరులోని సర్ సి ఆర్ రెడ్డి కళాశాలలో ఆంధ్రశాఖలో లీడరుగా పనిచేస్తున్న శ్రీ బండ్లమూడి సత్యనారాయణ గారు, నేనూ, అందించిన సహాయ సహకారాలతో శేషగిరిరావు మిత్రశతకం వ్రాసి అచ్చువేసి పాఠకులకందించి, ప్రశంసలు పొందటం జరిగింది

ఈ గ్రంథ రచయిత నవంబరు, 1984లో శ్రీశ్రీశ్రీ త్రిదండి చినజీయరు స్వామి వారిని దర్శించి శంఖ చక్రముద్రాకింతుడై (ధర్మపత్నీ సమేతంగా) వారి దివ్యాశీస్సులు పొందటంలో కృతకృత్యుడైనందువలన అతనికి

జ్ఞానోదయం కలిగి అది రచనా శక్తికి దోహదపడిందని నావూహ. నాకు పరిచయమున్న కవులందరినీ నా మిత్రునికి పరిచయం చేశాను

కవులు రచయితలు వ్రాసిన గ్రంధాలలో వారి మనస్తత్త్వాలూ, అనుభవాలూ, ఏదో ఒక మారుమూల చోటు చేసుకుంటాయి జీయరు స్వామి గురుదర్శనం లభించిన యనంతరం యీ రచయిత లౌకిక విషయాల నుండి తన గమ్యాన్ని, భక్తి, ముక్తి మార్గాల వైపు మరల్చుకున్నాడు అతనిది సంపూర్ణ వైష్ణవతత్త్వము నాది శివ కేశవుల కభేదం (విష్ణు రూపాయ నమశ్శివాయ) అనేతత్త్వం ఈ విషయంలో మామధ్య అప్పుడప్పుడూ చిన్న చిన్న వాగ్వివాదాలు తలెత్తినా రాజీపడేవాళ్లం

ఈ రచయిత బృహత్తర వేదాంతచూర్ణికకు నామధేయం నేనే సూచించాను ఇది వ్రాయటానికి శక్తికి మించిన దీర్ఘకాల కృషి నిర్విరామంగా చేశాడు చిన్నప్పటి నుండి హాబీగా ఎన్నెన్నో గ్రంధాలు, (పత్రికలు, వ్యాసాలు, పురాణాలు, ఇతిహాసాలు, జర్నల్స్, మతగ్రంధాలు, శాస్త్ర ప్రామాణిక గ్రంధాలు, భారత, రామాయణ, భాగవతాదులు) చదివి, చదివినదాన్ని ఒక కాగితం మీదో, పుస్తకంలోనో భద్రపరచుకొని భగవత్కటాక్షంతో ఆ విషయాలన్నీ యధాతధంగా పాఠకలోకానికి అందించాలనే తపనతోనే యీ గ్రంధ రచన చేశాడు మిత్రుడు ఇది ఒక రకంగా విచిత్ర నిఘంటువు.

ఈ గ్రంధానికి తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం లభించింది ఫలితంగా యీ గ్రంధాన్ని శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి అంకితం చెయ్యాలనే సదుద్దేశం, సంకల్పం రచయితకు కలగటం ముదావహం

ఈ రచయిత తన గ్రంధాలలో తన సమకాలీన మిత్రుల కవుల పేర్లను పేర్కొనటం, భావిచరిత్రలో సాహితీ లోకానికి ఎంతో ఉపయోగకరం ఈ గ్రంధ రచయితకు మిత్రుడిగా నేను ఎంతో గర్వపడుతున్నా అభినందిస్తున్నా ఆనందిస్తున్నా శ్రీ తిరుమలేశుని కృప సదా శేషగిరిరావుపై ప్రసరించునుగావుతమని ఆశీర్వదిస్తున్నా

వంగూరు

30-9-2001

పరిగొండ శ్రీరామరావు

ఓం నమః పరమాత్మనే

# తలలోని తలపులు

తలలో పుట్టిన భావాలు పుంఖాను పుంఖాలుగా మొలకెత్తి సంకల్ప వృక్షంగా శాఖోపశాఖలై విస్తరించి అక్షర ఫలాలనందిస్తుంటే ఆరగించి, రసాస్వాదన చేసి, స్వరూప స్వభావాలు సంతరించుకొని నా శ్రమ ఫలితంగా వెలువడినదే యీ "వేదాంత చూర్ణిక"(సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము.

తరతరాలుగా వస్తున్న సనాతన ధర్మాలనూ, సత్సాంప్రదాయాలనూ, భారతీయ సంస్కృతినీ క్రోడీకరిస్తూ 1 నుండి 7 సంఖ్యలలో ఆర్ష సాంప్రదాయాల సారాంశమును పొందుపరుస్తూ "వేదాంతచూర్ణిక" ప్రథమభాగమును ౨౦౦౮వ సంవత్సరములో ముద్రింపించి పాఠక మహాశయుల కరకమలములందుంచాను ఈ గ్రంథమును ఆమూలాగ్రముగా పఠించిన మాన్యులు తమ అమూల్య ప్రశంసలను నాకు పంపించారు మరియు మూడవ గ్రంథమైన శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రముపై కూడ మహనీయులు తమ అమూల్య సందేశములను సూచనలను పంపించారు

ఈ రెండు గ్రంథములపై వచ్చిన ముఖ్య విషయములను "వేదాంత చూర్ణిక" (సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము గ్రంథాంతమున పొందుపరుస్తూ, తమ అమూల్య ప్రశంసలను పంపించిన ఆత్మీయ కవిమిత్రులకు నమస్సృియాపూర్వక కృతజ్ఞతార్పుదాభివందనములు

ఈ వేదాంతచూర్ణిక(సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము 8 నుండి 108 సంఖ్యల ప్రాశస్త్యమును ప్రస్తావిస్తూ, నా బుద్ధికి తోచినరీతిగా, అందరికీ ఉపయోగకరమైన విషయాలను, అనేక ప్రామాణిక గ్రంథాలు (పరిశీలనా గ్రంధ పట్టిక చూడుడు) పఠించి, పరిశీలించి, శ్రమించి, పరిశోధించి, పరిశోధనకందని గడ్డు సమస్యలను నిష్ణాతులను సంప్రదించి నిగ్గుతేల్చిన విషయాలను సేకరించి ఈ గ్రంథములో నిక్షిప్తము చేయుట జరిగినది అయితే కొన్ని సంఖ్యలకు విషయ సేకరణ చేయలేకపోతున్నందులకు చింతిస్తున్నాను

శ్రీ గ్రంథముల రచనకు స్ఫూర్తి నిచ్చినది చెన్నై రామకృష్ణ మఠంవారు

ఫిబ్రవరి 1978 సంవత్సరములో ప్రచురించిన "శ్రీరామకృష్ణప్రభ" లోని "అష్టావక్ర విజయము" అనే వ్యాసములో 13 శ్లోకములు మాత్రమే ఈ 13 శ్లోకముల నాధారముగ తీసుకొని "వేదాంతచూర్ణిక" రెండు భాగములుగ వ్రాయుట నాకే ఆశ్చర్యముగా వుంది ముందుగా "శ్రీరామ కృష్ణమఠం" వారందరికి నా కృతజ్ఞతా భివందనములు వినమ్రుడనై ఇందు ముఖముగా తెలియపరచుకొనుచున్నాడను

ఈ గ్రంథ రచనకు ఏదో తెలియని అదృశ్యశక్తి నాకు ఉత్సాహమునిచ్చి ముమ్ముందుకు నడిపించింది ఆ అదృశ్యశక్తి మూడు రూపములలో నున్నది ఒకటి గురువర్యులు పరమహంస పరివ్రాజకాచార్యులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి ఆశీస్సు**, రెండు **సర్వాంతర్యామి శ్రీకృష్ణపరబ్రహ్మము యొక్క అనుగ్రహము**, మూడు **నిఖిల యజ్ఞనిర్వహణాసక్త చిత్తమును కలిగించిన వాగ్దేవి కరుణాకటాక్షము.**

ఈ ప్రస్తుత గ్రంథములో 260 విషయములను ప్రస్తావించటము జరిగినది శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళితో ఈ గ్రంథము సంపూర్ణము

ఈ గ్రంథమును ముద్రింపించుటకుగాను ఆర్థిక సహాయము సమకూర్చిన **శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము** వారికి నా కృతజ్ఞతాభివందనములు

రంగస్థల నటునిగా నన్ను, నా అనుభవాలను, నా జీవిత విశేషములను "భువనవిజయం" శీర్షికలో "వార్త దినపత్రిక" 30-3-2001 ద్వారా ప్రచురించి వెలుగులోకి తీసుకొని వచ్చిన సంఘసేవా తత్పరులు **శ్రీమాన్ బి.కె.ఎస్. ఆర్. అయ్యంగార్కి**, 'వార్త' రిపోర్టర్ **శ్రీ ఎల్ శ్రీనివాస గార్కి**, "వార్త" సంపాదకులకు నా కృతజ్ఞతాభివందనములు

ఈ గ్రంథములో అందరూ తెలుసుకోదగిన, ఆసక్తికరమైన విషయములు చోటుచేసుకున్నవి ఆస్తిక మహాశయులకు ఎంతగానో ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథ సంకలనమునకు అన్నివేళలా, అన్ని విధములా నామనసెరిగి సంపూర్ణ సహకారములందించిన నా ధర్మపత్ని **ల.సౌ. కస్తూరికి** నామనః పూర్వక శుభాశీస్సులు

నాకు పుత్రులు లేరు అను విషయాన్ని మరపిస్తూ వృద్ధాప్యదశలో నాకు నా శ్రీమతికి చేదోడువాదోడుగా వుండి అన్నివిధాలా సహకరించిన నా

అల్లుడు **చి. కారంగుల భాస్కరరావు**, మా ఏకైక కుమార్తె **ఐ.సౌ. సుభాషిణి**, దౌహిత్రి, **చి. జిగీష**, దౌహిత్రుడు **చి. సాయికృష్ణ**లకు నా శుభాశీస్సులు

ఈ గ్రంథ రచనకు సహకారములందించిన జ్ఞానవృద్ధులు, ఉభయ భాషా ప్రవీణ **శ్రీ నందిభొట్ల సత్యనారాయణ** ఏలూరు వార్కి, ఆంధ్రోపన్యాస కులు రీడర్ ప్రౌఢకవి **శ్రీ బండ్లమూడి సత్యనారాయణ** ఏలూరు వార్కి, త్రిభాషా సహస్రావధాని, సరస్వతీపుత్ర, సహస్రకమల బిరుదాంకితులు **శ్రీ పద్దిపర్తి పద్మాకర్** ఏలూరు వార్కి, వ్యాకరణ ప్రవీణ, భాషాప్రవీణ **శ్రీ శ్రీపాద రామకృష్ణ** ఏలూరు వార్కి, మధురకవి, కవితా భూషణ **శ్రీ కలపర్తి వేంకటేశ్వరరావు** ఎంఎ బిఇడి ఏలూరు వార్కి, నా బాల్యమిత్రులు, సహజ కవితాధురీణ **శ్రీ వరిగొండ శ్రీరామమూర్తి** వంగూరు వార్కి, వీరి సోదరులు మౌనవ్రత దీక్షా దక్ష శిఖామణి **శ్రీ వరిగొండ నాగేంద్రరావు** డబుల్ ఎం ఎ, ఇంగ్లీషు డిప్లమా హోల్డరు వంగూరు వార్కి, నా బాల్యమిత్రులు ఆంధ్ర శాఖ రీడర్ **డా. శివలెంక ప్రకాశరావు** ఎం ఎ పిహెచ్‌డి కాకినాడ వార్కి, సహృదయులు **శ్రీ అమరవాది జగన్నాథాచార్యులు**, భద్రాచలం వార్కి, నా చిరకాల విశ్రాంత సహోద్యోగులు, నా శ్రేయోభిలాషులు, పరోపకార పరాయణులు **శ్రీ కటకం వెంకట సుబ్బారావు** ఏలూరు వార్కి, నా హితైషులు, సంఘ సేవాతత్పరులు **శ్రీ గురజాపు ఈశ్వరరావు** ఏలూరు వార్కి, సత్యవాది **శ్రీ కె.వి. హనుమంతరావు** ఏలూరు వార్కి, కళాపిపాసి, కవి, సువర్ణ హస్తాకంకణధారి, తెనుగుదర్బారు అధినేత, కార్యదర్శి **శ్రీ కురెళ్ళ లక్ష్మణరావు** ఏలూరు వార్కి, బంధువు అంతకన్న ఆప్తమిత్రుడు దివ్యశ్రీ **మేచినేని వేంకట రంగారావు** చెన్నై వార్కి, వీరి సోదరులు సహృదయులు **శ్రీ మేచినేని రాధాకృష్ణ** చెన్నై వార్కి, పరులసేవయే తన కర్తవ్య ముగా భావించు నా మేనల్లుళ్లు 1. **శ్రీ కారంగుల ప్రకాశరావు**, హైదరాబాద్ వార్కి, 2. **శ్రీ కారంగుల బాలమోహన రావు** చెన్నై వార్కి, 3. **శ్రీ కారంగుల రవిచంద్రశేఖర్** వంగూరు వార్కి, బాల్యమిత్రుడు **శ్రీ గొల్లంగి రామారావు**, విశాఖపట్టణం వారికి, మరియు అర్చకులు **శ్రీమాన్ వేదాంతం సత్యనారా యణాచార్యులు** వంగూరు వార్కి, నా బాల్యమిత్రుడు, న్యాయవాది దివ్యశ్రీ **ద్రోణంరాజు వెంకట సుబ్బారావు** గార్కి భాష్పాంజలితోను మరియు సర్వాంగ సుందరంగా డి.టి.పి చేసిన **శ్రీ జివిఎస్ మూర్తి** ఏలూరు వారికి, ముద్రాప కులు **శ్రీ వేంకట్రామా అండ్ కో** ఏలూరు వారికి నా హృదయపూర్వక నమస్సు మాంజలులు

వంగూరు — విద్వద్విధేయుడు

8-10-2001 — వేమూరి శేషగిరిరావు



ఓమ్ శ్రీ గురుపాదుకాభ్యాం నమః
శ్రీమతే రామానుజాయ నమః



# వేదాంత చూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము)

## ద్వితీయ భాగము

## విషయ సూచిక

| విషయము | పుట సంఖ్య |
|---|---|


ఇష్టదేవతాస్తుతి

### ఎనిమిదవ సంఖ్య

| | | |
|---|---|---|
| 1. | శ్లోకము | 1 |
| 2. | ఓమ్ నమో నారాయణాయ | 2 |
| 3. | వినాయకుని పేర్లు - 8 | 3 |
| 4 | అష్టమ సంఖ్యతో కృష్ణుని అనుబంధం | 3 |
| 5 | శ్రీకృష్ణుని భార్యలు 8 మంది | 4 |
| 6. | అష్టలక్ష్ములు | 4 |
| 7 | అష్టాక్షరీ మంత్రధ్యానము | 4 |
| 8. | శ్రీశైల శిఖరముగాక 8 శిఖరములు | 4 |
| 9. | బ్రహ్మాండమును మోయు 8 దిగ్గజములు | 4 |
| 10 | అష్టదిగ్గజములు (కవులు) | 5 |
| 11. | అష్టాంగ నమస్కారము | 5 |
| 12. | శివుని అష్టమూర్తులు | 5 |
| 13 | దేవుని పూజించుటకు ఏవేవి కావలయును | 5 |
| 14 | జ్ఞాన అష్టాంగములు | 6 |
| 15 | తల్లిదండ్రుల గురువుల ధిక్కరించువాడు | 6 |
| 16. | ఆసనములు - 8 | 7 |
| 17 | దూలత్రయ గృహదోషము | 7 |
| 18 | కంచములు తొలిచిన నీళ్ళను చల్లు దిశలకుఫలము | 7 |
| 19. | నామాయ 8 విధములు | 7 |

| | | |
|---|---|---|
| 20 | తుమ్ముల శకునము | 8 |
| 21. | బ్రహ్మనిష్ఠుని బ్రహ్మచర్యము | 8 |
| 22 | దశరథుని మంత్రులు 8 మంది | 9 |
| 23 | జన్మహేతు లక్షణము | 9 |
| 24 | అష్ట ధర్మములు | 9 |
| 25 | దుర్జన లక్షణములు | 9 |
| 26. | అష్టైశ్వర్యములు | 9 |
| 27 | మూర్ఖులు 8 విధములు | 9 |
| 28. | ధ్యానసమయమున వర్జనీయములు | 10 |
| 29 | శ్రీరామచంద్రమూర్తి | 10 |
| 30 | ప్రయాణవిషయములు | 10 |
| 31 | పరమాత్మయొక్క స్వరూపము గీత 8/9,10 | 11 |
| 32. | శ్రీకృష్ణ సంకీర్తనము | 13 |
| 33. | అష్టాంగములు | 14 |
| 34. | సంధ్యావందనము | 14 |
| 35. | సాత్త్వికభావాలు - 8 | 17 |
| 36 | జపవిధానములు - 8 | 17 |
| 37. | ఉష్ణనరకాలు - 8 . | 18 |
| 38. | శీతనరకాలు - 8 | 18 |
| 39. | స్వయం వ్యక్తములు - 8 | 18 |
| 40. | అష్టప్రకృతులు | 18 |
| 41 | దిక్కులు, దిక్పాలురు వారి వివరములు | 19 |
| 41A | ధర్మరక్షణము | 19 |
| 42 | విష్ణుపురాణమందలి 8 శ్లోకములు ముఖస్థములు చేయదగినవి | 19 |
| 43 | భావనా సుమములు | 21 |
| 44. | అష్టసిద్ధులు | 21 |
| 45. | అష్టావధానము | 21 |

## తొమ్మిదవ సంఖ్య

| | | |
|---|---|---|
| 46 | శ్లోకము | 22 |
| 47. | నవరసములు | 22 |
| 48. | మానములు | 22 |

49. నవవిధభక్తులు 23
50. నవరత్నములు 29
51 శ్రీరామానుజాచార్యుల వారి ధర్మ సందేశములు 29
52 నవరత్నములు ధరించవలసిన రోజులు 29
53. నవగ్రహములు 30
54 నవగ్రహాల దృష్టి 30
55 నవబ్రహ్మలు 30
56 మనస్సు చేయు పాపములు - 9 31
57. నవద్వీపములు 31
58 అష్టదిక్పాలకుల స్థలనిర్ణయము 31
59. యోగవిఘ్నములు - 9 32
60 ప్రపంచోత్పత్తి లక్షణము 32
61. నవరాత్రులు 33
62 ఈ తొమ్మిది దాచుకొనతగినవి 36
63 ఈ తొమ్మిది తాపులు తప్పిన శోభించరు 36
64 నవధాన్యములు 37
65 సత్పురుషుల స్వరూపము 37
66. స్నానములు 37
67. స్త్రీలు బంధములే 38
68 నవగ్రహస్తోత్రము 38
69 చమకము 38

## పదవ సంఖ్య

70 శ్లోకము 39
71. దశావతారములు 39
72. అర్జునుని పది నామములు 42
73. గాయత్రీదేవి పది హస్తముల ధరించు ఆయుధములు 43
74. లక్ష్మీగణపతి పదికరముల ధరించు ఆయుధములు 43
75 హనుమంతుడు పది చేతుల ధరించు ఆయుధములు 43
76. దశనాడులు - స్థాన నిర్ణయము 43
77 శుద్ధములు అశుద్ధములు 44
78. ఉపవాయువుల లక్షణము 44

| | | |
|---|---|---|
| 79 | భక్తిలో ఆసక్తులు | 45 |
| 80 | మన్మథావస్థలు - పది | 45 |
| 81. | యమములో పది | 46 |
| 82. | నియమములో పది | 46 |
| 83. | దశదానములు | 47 |
| | **పదకొండవ సంఖ్య** | |
| 84 | శ్లోకము | 47 |
| 85 | శాస్త్రప్రకారము మన ఇంద్రియాలు - 11 | 47 |
| 86 | ఆదిత్య హృదయము | 48 |
| 87. | మంత్రసిద్ధి | 48 |
| 88. | నరప్రమాణ సూత్రము | 49 |
| 89. | నిత్యసాధారణ విధులు | 49 |
| 90 | బీజాక్షరములు | 50 |
| | **పండ్రెండవ సంఖ్య** | |
| 91 | శ్లోకము | 50 |
| 92. | ద్వాదశ జ్యోతిర్లింగాలు | 51 |
| 93. | పండ్రెండవ సంఖ్యయొక్క ప్రాముఖ్యత | 53 |
| 94 | సంతానములు 12 విధములు | 53 |
| 95. | ద్వాదశరాసులు | 54 |
| 96 | సాధువులు పరమాత్మను పొందవలయునన్న | 55 |
| 97 | అవధూత 24 మంది గురువుల నుండి నేర్చుకొన్నది | 55 |
| 98. | శుకుడు పరీక్షిత్తునకు భక్తి మార్గమును తెలుపుట | 55 |
| 99. | సాధ్యులు | 56 |
| 100. | భక్తుని లక్షణంబుల గూర్చి యొక్కొక్క రొక్కొక్క విధముగా జెప్పిరి | 56 |
| 101. | యజ్ఞములు - 12 | 58 |
| | **పదమూడవ సంఖ్య** | |
| 102. | శ్లోకము | 58 |
| 103. | దేవుడు దేవాలయము | 59 |
| 104 | కశ్యపప్రజాపతి భార్యలు 13 మంది | 59 |
| 105 | శ్రీ అంటే 13 అర్థములున్నవి | 60 |

## పదునాల్గవ సంఖ్య

106 చతుర్దశేంద్రియములు - వాని అధిష్ఠానదేవతలు 60
107 చతుర్దశమనువులు 60
108. చతుర్దశ విద్యలు 61
109 చతుర్దశలోకములు - వాని స్థానములు 61

## పదునైదవ సంఖ్య

110. పంచదశీయంత్రము 62
111 పదునైదు నేత్రములు 62

## పదునాఱవ సంఖ్య

112. వినాయకుని 16 నామములు 63
113 షోడశమహారాజులు 63
114 కలియుగమున 16 నామములు 63
115 శ్రీకృష్ణుడు 16 వేల మందిని వివాహమాడెనా? 64
116. షోడశోపచార పూజ 66
117. దక్షప్రజాపతి 66
118 కరణమునకు అర్థములు 67
119. సంవత్సరములో నిత్యమూవచ్చు తిధులతో పండుగలు 67
120. గృహద్వార సంఖ్యకు ఫలము 68
121. ఋతుకాల సంభోగ నిర్ణయము 69

## పదునేడవ సంఖ్య

122 పదునేడు తత్త్వములు 74
123 శ్రీకృష్ణావతారము 75
124. కుమారస్వామి పేర్లు 75
125. భారతదేశమందలి పుణ్యక్షేత్రములు 75

## 18వ సంఖ్య

126. శ్రీవేదవ్యాసాష్టాదశనామావళి 76
127. అష్టాదశ శక్తి పీఠములు 76
128 శ్రీ మల్లిఖార్జునుని క్షేత్రములు 77
129 నమస్కార నిషేధ సమయములు 77
130 పదునెనిమిది జాతులు 77

131 గీతకు గల 18 పేర్లు 78
132 వృషభాసుర సంహారము 78
133 అష్టాదశ పురాణములు 78
134. మహాభారతము 82
135 శబరిమలైలోని 18 మెట్ల విశిష్టత 85
136. వసుదేవునికి 18 మంది భార్యలు 86
137. ప్రహ్లాద అజగర సంవాదములో 87
138 కల్పసూత్రములు పదునెనిమిది 87
139. రాగాదులు - 18 88


## 19వ సంఖ్య


140 నేలపై నుంచరానివి 88
141 శ్రీ భగవద్గీత - 10/4,5


## 20వ సంఖ్య


142. శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని సంబోధించుచు వాడిన పేర్లు 89


## 21వ సంఖ్య


143 భగవంతుని ఇరువదియొక్క అవతారములు 89
144 ఇక్ష్వాకు వంశము 91
145 సృష్టి వివరణ 91
146. నరకలోకవర్ణన 91
147 అశ్వమేథయాగము 92
148. ఇరువది యొక్క అక్షరములు గల గాయత్రి మంత్రములు 92
149 పవనముక్తాసనములు 93
150. శ్రీకృష్ణ గాయత్రీ మంత్రము 94


## 22వ సంఖ్య


151. శ్రీరామ గాయత్రీ మంత్రము 94
152 శ్రీ సుబ్రహ్మణ్య గాయత్రీ మంత్రము 94
153 ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ధ క్షేత్రములు 94


## 23వ సంఖ్య

154 ఆంజనేయ మంత్రము 100
155 శ్రీకృష్ణ గాయత్రీ 100
156. జరాసంధుడు కృష్ణునిపై యుద్ధము చేయవచ్చుట 100

## 24వ సంఖ్య

157 గాయత్రీ మంత్రము 100
158. కౌరవుల బలాబలములు 113
159. ఇరువది నాలుగు వేల శ్లోకములు 114
160. ఇరువది నాలుగు తత్త్వములు ప్రకృతి లక్షణము 114
161. జ్ఞాని లక్షణములు 115

## 25వ సంఖ్య

162. శ్రీరామచంద్రమూర్తి 115
163. తత్త్వములు ఇరువది ఐదు 116

## 26వ సంఖ్య

164 దైవీలక్షణములు 117
165. ఛందస్సులు ఇరువదియాఱు 117
166. అవధూత యదు సంవాదము. ఉద్ధవగీత 117
167. శతకోటి ఆపై సంఖ్యలు 118

## 27వ సంఖ్య

168 శ్రీ భగవద్గీతలో శ్రీకృష్ణునకు పెట్టి పిలిచన పేర్లు 119
169. నక్షత్రమాల 119
170. భరతుడు 120
171 నక్షత్రములు ఇరువదియేడు 121
172. 27 నక్షత్రములకు దేవతా నిర్దేశము 122
173. ముహూర్తభాగము 122
174. శృంగార ప్రబంధములు 128

## 28వ సంఖ్య

175. ముచుకుందుని వృత్తాంతము 128

29వ సంఖ్య

176. శ్రీరాముని అశ్వమేథయాగము 129

30వ సంఖ్య

177. సీతాన్వేషణము 130

31వ సంఖ్య

178 శ్రీ చక్రపూజా విధానములో ముద్రలు 131

32వ సంఖ్య

179. భక్తులు చేయకూడని పనులు 134
180. వసిష్ఠుడు 136
181. అన్నమయ్య 137
182. గ్రంథము 137
183 స్వామి వారికి జరుపబడు అర్చనలో 32 ఉపచారములు 137
184. భారతీయులు వినాయకుడిని 32 రకాలుగా ఊహించారు 137
185. ఊర్ధ్వముఖము 32 అక్షరములు గల మంత్రము 138
186. కలియుగ తారకమంత్రము 138
187. వాల్మీకి మొదటి శ్లోకము 138

33వ సంఖ్య

188. భాగవత ప్రశస్తి 138
189. ముప్పది మువ్వురు 139
190. దేవాలయ దేవతలు 139

37వ సంఖ్య

191. ఆదిత్యుడు 140

39వ సంఖ్య

192. ఆంధ్ర మహాకవులు 141

40వ సంఖ్య

193. పాండవుల బలాబలములు 144

41వ సంఖ్య

194. సంజయుని శ్లోకములు 146

**43వ సంఖ్య**

195 శుభశకునములు 146

**48వ సంఖ్య**

196. ఆదిత్య హృదయము 146
197. విష్ణువుయొక్క పేర్లు 148
198 శివునియొక్క పేర్లు 149

**49వ సంఖ్య**

199. రంతిదేవుడు 150

**50వ సంఖ్య**

200 శ్రీ శంకరాచార్యుల వారి ప్రశ్నోత్తరి 150
201 బ్రహ్మబీజము 153
202 బ్రహ్మాసనము 153
203. భరతుడు 153
204. సౌభరి మహాముని 154
205. దేవదానవ ప్రముఖుల యుత్పత్తిక్రమము 154
206. చక్రరూప రఘురాముడు 154

**52వ సంఖ్య**

207. మానిషాద శ్లోక వివరణ 157

**56వ సంఖ్య**

208 దేశములు 158

**60వ సంఖ్య**

209. వాలఖిల్యాఖ్యులగు ఋషివరులు 159
210. తెలుగు సంవత్సరములు, 60 160
211. విప్రుల సొమ్ము 161

**61వ సంఖ్య**

212 ప్రాణాయామము 162

**64వ సంఖ్య**

213 బలరామకృష్ణుల విద్యాభ్యాసము 163
214 అఱువది నాలుగు కళలు 163
215. తంత్రములు అఱువది నాలుగు 166

66వ సంఖ్య

216. అయిదేండ్ల ధ్రువుడు 169
217. అలర్కుడు 170

71వ సంఖ్య

218. విభూతియోగము 171

72వ సంఖ్య

219 రాగములు వాటి పేర్లు 172

78వ సంఖ్య

220 భరతుడు 175

82వ సంఖ్య

221 భారతము 176

84వ సంఖ్య

222. శ్రీమద్భగవద్గీతలో అర్జునుని శ్లోకములు 84 176
223. లోకములో 84 లక్షల జీవరాశులున్నవి 176
224 రతిరహస్యమున 84 బంధములున్నవి 177

88వ సంఖ్య

225. విభుడుగా అవతరించిన నారాయణుడు 177

96వ సంఖ్య

226. తొంబదియాఱు మాయలు 177
227. తొంబదియాఱు తత్త్వములు 178

99వ సంఖ్య

228. కపిలుడు దేవహూతికి భక్తియోగమును తెలుపుట 181

100వ సంఖ్య

229. కౌరవులు వందమంది 182
230. దితి నూఱేండ్లు గర్భభారమును వహించుట 183
231. నహుషుడు 183

232. ఋషభుడు 183
233. వజ్రాయుధము 183
234. ఇక్ష్వాకుడు 184
235 యాగసంరక్షణ 184
236. సముద్రమును దాటుట 184
237. సేతుబంధనము 184
238 మహర్షుల చరిత్ర 184
239. ఔర్వుడు 185
240. ప్రథమ సర్గము 185
241. మహతి 185
242. వసిష్ఠ మహర్షి 186
243. నూఱు అశ్వమేధ యజ్ఞములు 186
244. "ఏతి జీవనమానందోనరం వర్షశతాదపి" 186
245 దేవేంద్రుడు 186
246 మణిమాల 186
247. శతమానం భవతి 187

101వ సంఖ్య

248. నూటొక్కనాడులు 187
249. నూటొక్క పుత్రులు 187
250. శ్రీరాముడు రావణుని శిరము 101 సార్లు ఖండించుట 187
251 నూటొక్క వంశములు 187

102వ సంఖ్య

252 ధృతరాష్ట్రుని సంతానము 188

108వ సంఖ్య

253. ప్రాణప్రతిష్ఠ 188
254. 27 నక్షత్రములకు 108 భాగములు (పాదములు) 189
255. ఉపనిషత్తులు 189
256. దేవీస్థానములు నూటయెనిమిది 193
257. శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామావళి 194
258 శ్రీకృష్ణపరమాత్మ ధ్యానము 198
259 అమూల్యవాక్కులు - 108 199
260. శ్రీకృష్ణ అష్టోత్తర శతనామావళి 211

ఓమ్

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

శ్రీ గురుభ్యోనమః

శ్రీమతే రామానుజాయ నమః



# ఇష్టదేవతాస్తుతి

సుముఖశ్చైక దన్తశ్చ కపిలో గజకర్ణకః,
లమ్బోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః,
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచన్ద్రో గజాననః,
వక్రతుణ్డ శ్శూర్పకర్ణో హేరమ్బ స్స్కన్ద పూర్వజః,
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణు యాదపి

విద్యారమ్భే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా,
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే।

శ్రీరామకృష్ణప్రభ 8/98-3

విష్వక్సేనం సకల విబుధ ప్రౌఢ సైన్యాధినాథం
ముద్రా చక్రే కరతలయుగే శఙ్ఖదణ్డౌ దధానమ్,
మేఘశ్యామం సుఫణిమకుటం పీతవస్త్రం శుభాంగం
ధ్యాయేదేవం విజిత దనుజం సూత్రవత్యా సమేతమ్।

శ్రీమతే విష్వక్సేనాయ నమః

యావన్నమే నరదశా దశమీ దృశోఽపి।
రంధ్రా దుదేతి తిమిరీకృత సర్వభావా॥
లావణ్య కేళిభవనం తవ తావదేతు।
లక్ష్మీః సముత్క్వణిత వేణు ముఖేన్దు బింబమ్॥

*భావం : శ్రీకృష్ణా! నన్ను వార్ధక్యము చుట్టుకొని నాకు చూపు మందగించి ప్రపంచమంతయు అంధకార బంధురము కాకమునుపే లక్ష్మీ విహార స్థానమగు నీముఖమును వేణుగానమొనర్చు నీ ముఖారవిందమును ఒకసారి చూపుము*

సత్యం శౌచం దయాదానం భక్తిరేకా జనార్దనే,
దమనం దక్షతా చైవదేహిమే మధుసూదన॥

*భావం : సత్యము, శౌచము, దయ, దానము, జనార్ధనుని యందు భక్తి, ఇంద్రియ నిగ్రహము, నేర్పరితనమును నాకనుగ్రహింపుము*

వ్యాధినా రహితో దేహః ఆధినా రహితో మనః।
స్థిరా శ్రీర్నిత్య భక్తిశ్చ దేహిమే మధుసూదన॥

*భావం : వ్యాధిలేని దేహమును, చింతలేని మనస్సును, నిశ్చలమగు ఐశ్వర్యమును, ఎల్లప్పుడూ భక్తి నా కనుగ్రహింపుము.*

స్వామిత్వాం త్వాం చ వన్దే మమ ఖలు రసనాం మా కదా చిత్త్యజేధా,
మామే బుద్ధిర్విరుద్ధా భవతు న చ మనోదేవి మే యాతు పాపమ్,
మామే దుఃఖం కదా చిక్క్వ చిదపి విషయే ఉప్యస్తు మే నాకులత్వం,
శాస్త్రవాదే కవిత్వే ప్రసరతుమమ ధీర్మాస్తు కుణ్ఠా కదాపి.

*భావం : అమ్మా! సరస్వతీ! నిన్ను స్తుతిస్తున్నాను. నీకు నమస్కారం. నాజిహ్వనూ - వాక్కును ఎప్పుడూ త్యజించకు. నా బుద్ధి విరుద్ధమైనదిగా ఉండకూడదు ఓ దేవీ, నా మనస్సు పాపం వైపుకు వెళ్ళనీయకు. నాకెన్నడూ కొంచెమైనా దుఃఖం కలుగదుగాక! విషయ పదార్థ భోగాలవైపు మరలనీయకు. అమ్మా, శాస్త్రవాదం, కవిత్వంలో నా బుద్ధి (ఆలోచన) ఆగిపోకుండునట్లు చెయ్యి.*

నమోస్తుతే వ్యాస! విశాలబుద్ధే,
ఫుల్లారవిందాయత పత్రనేత్ర,
యేన త్వయా భారత తైల పూర్ణః,
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

*భావం : వికసించిన పద్మపు రేకుల వంటి నేత్రములు కలిగిన ఓ వ్యాసమహర్షీ! విశాలబుద్ధీ! మహాభారతమనెడి తైలముతో గీతాజ్ఞాన దీపమును వెలిగించిన వ్యాసమహర్షీ! నీకు నమస్కృతులు*

# గురుస్తుతి



బ్రహ్మానందం పరమ సుఖదం కేవలమ్ జ్ఞానమూర్తిమ్,
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వ మస్యాది లక్ష్యమ్,
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతమ్,
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

*భావం : బ్రహ్మానందుడు, పరమ సుఖాన్నిచ్చేవాడు. కేవలుడు జ్ఞానమూర్తి. సుఖదుఃఖ, రాగద్వేష, సీతోష్ణాలు మొదలగు ద్వంద్వాల కతీతుడు, "తత్త్వమసి" లక్ష్యార్థుడు. అద్వితీయుడు, శాశ్వతుడు, పవిత్రుడు, అచలుడు, బుద్ధి వృత్తులకు సాక్షిభూతుడు భావాతీతుడు, సత్త్వరజస్తమోగుణ రహితుడైనటువంటి సద్గురువునకు నమస్కరించెదను*

కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరంతో,
రాత్రౌ చ కృష్ణం పునరుత్థితాయే,
తే కృష్ణ దేహాః ప్రవిశంతి కృష్ణ,
మాజ్యం యథా మంత్రహుతం హుతాశే.

*ఏ మహనీయులు ధర్మసంస్థాపనార్థముగ అవతరించిన ఈ దేవకీనందనుని ఆరాధించు వ్రతముననే వ్రతదీక్షితులై ఈతని నామమునే స్మరియించుచు నిద్రాకాలమునను, నిద్ర నుండి మేల్కాంచు సమయమునను ఎవ్వరు స్మరించుచుందురో వారి దేహములు సారూప్యమున శ్రీకృష్ణదేహములై శ్రీకృష్ణునియందే వారు లీనమగుదురట. ఎట్లు? అగ్నియందు వ్రేల్చబడిన ఆజ్యాహుతివలెనట. అనగా సామాన్యమగు అజ్యము (నేయి)సామాన్యమే అయినది మంత్రములచే సంస్కరింపబడిన నేయి మంత్రస్వరూపము నొంది అగ్నియందు ప్రవేశించి ఆజ్యరూపమును కోల్పోయినది అట్లే జీవులును నిరంత కృష్ణభక్తిచే వారి దేహములు ప్రాకృత రూపముల వీడి కృష్ణమయములై శ్రీకృష్ణునియందే లయమగునని భావము.*

*భారతము*



శ్రీగురుభ్యోనమః
శ్రీమతే రామానుజాయ నమః





# వేదాంత చూర్ణిక
# సంఖ్యా ప్రాశస్త్యము

## ద్వితీయభాగము

## 8వ సంఖ్య

**1.** అష్టౌ శాణాః శతమానం వహంతి,
తథాష్టపాదః శరభః సింహఘాతీ,
అష్టౌవసూన్ శుశ్రుమ దేవతాసు,
యూపాశ్చాష్టౌ స్త్రి ర్వివహితః సర్వయజ్ఞః

*త్రాసునకు దారములు ఎనిమిది, సింహమును చంపగల శరభమునకు పాదములు ఎనిమిది. 1. అగ్ని, 2. పృథివి, 3. వాయువు, 4. అంతరిక్షము, 5. ఆదిత్యుడు,*

6. దివి, 7. నక్షత్రములు, 8. చంద్రుడు అనునవి ఎనిమిది వసువులు అని శ్రుతి "అగ్నిశ్చ పృథ్వీ చ వాయుశ్చాంతరిక్షం చ ఆదిత్యశ్చ ద్యౌశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణి చైతే వై వసవః" అని శ్రుతిచే చెప్పబడిన వసువులు.

అని శ్రీరామకృష్ణ ప్రభ 2/78 అష్టావక్ర విజయము అను శీర్షికలో వుంది

(ఆదిత్య హృదయము - 34 - అష్ట వసువుల పేర్లు ఈ విధంగా వున్నవి 1.ధ్రువుడు, 2 ధరుడు, 3. సోముడు, 4. అపుడు, 5. వైశ్వానరుడు, 6. అనిలుడు, 7 ప్రత్యూషుడు, 8. ప్రభావుడు అని వీరెనమండ్రు)

యజ్ఞమునకు ఎనిమిది కోణములందు యూపములుండవలయునని నియమము

## 2. ఓమ్ నమో నారాయణాయ

ఓంకార వర్ణాత్మక విశ్వమూర్తిం
బ్రహ్మర్షి భిస్సేవిత పాదపద్మమ్
శ్రీద్వారకా ఖ్యాత పురాధి వాసం
శ్రీ వేణుగోపాల మహం స్మరామి

నరార్చితం శ్రీమధురాపురి స్థితమ్,
పద్మాక్షమాలా సు గదా ధరం వరమ్।
నాగాది ధిగ్గోపకులైశ్చ సేవితం,
శ్రీవేణుగోపాల మహం స్మరామి తమ్॥

మోక్షప్రదం భోగకరం యశస్కరం,
వైరాగ్యసిద్ధి ప్రదమాత్మవేదినమ్,
అష్టాంగయోగా ద్యణిమాది సిద్ధిదం,
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

నామార్థ బోధన్నవ నీధిలోల జ(పం)
సోమాది భిర్వందిత పాదపంకజమ్।
భామాపతిం సుందర రుక్మిణీప్రియం
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

రాజత్ప్రభామండల మండితాంగకం
నీలాంబునాథం పరదీకుహాసనం।
శ్రీవేణు నాదైర్భవరోగ హారిణం
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

యక్షేశ్వరై స్సిద్ధగణైశ్చ పూజితం
గంధర్వ సంఘా ప్సరసా మతిప్రియమ్।
శ్రీగోపకన్యా రమణం మనోహరం
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

ణా వర్ణ సంశోభినిధాభి ధానం
శ్రీయోగి హృత్పంకజ చిత్రభానుమ్।
శ్రీసన్నిదిష్ణం మురళీధరం తం
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

యతీశ్వరారాధిత నైజరూపం,
బాలైశ్చ వృద్ధైస్తరుణైర్మనుష్యైః।
భక్త్యా సమభ్యర్చ్చి-- దివ్యమూర్తిం
శ్రీవేణుగోపాల మహం స్మరామితమ్॥

*అని స్మరించి నమస్కరించినయెడల సమస్త కోరికలు నెరవేరును.*

శ్రీ క్రోధన నామ సంవత్సర (1985) గుప్తపంచాంగం నుండి

# 3. వినాయకుని పేర్లు 8

1. *వినాయకుడు,* 2. *విఘ్నరాజు,* 3 *ద్వైమాతురుడు,* 4 *గణాధిపుడు,* 5. *ఏకదంతుడు,* 6. *హేరంబుడు,* 7. *లంబోదరుడు,* 8. *గజాననుడు.* అమరకోశము 19 నుండి

# 4. అష్టమ సంఖ్యతో కృష్ణుని అనుబంధం

1. *ఓం నమో నారాయణాయ (అష్టాక్షరి మంత్రము)*
2. 1 *మత్స్య,* 2 *కూర్మ,* 3. *వరాహ,* 4. *నారసింహ,* 5. *వామన,* 6. *పరశురామ,* 7. *రామ,* 8. *కృష్ణావతారం. అవతారాల్లో* (8) *ఎనిమిదోది*
3. *దేవకీదేవి ఎనిమిదో సంతానం కృష్ణుడు.*
4. *కృష్ణుడు తల్లి గర్భాన నివాసం ఎనిమిది మాసాలే.*
5 *ఎనిమిదో మాసానే జననం*
6 *జననతిథి = అష్టమి*
7. *కృష్ణుడి ధర్మపత్నులు ఎనమండుగురు అష్టమహిషులు*
8 *నాటి కృష్ణజన్మస్థానానికి ద్వారాలు ఎనిమిది*

*(అష్టమి = కష్టాలు తెచ్చిపెడుతుందని, అష్టమినాడేపని తలపెట్టరు. దానికో అపవాదున్నది అందువల్ల అతిథికి జరుగుతున్న అవమానాన్ని తుడిచివేయాలనే*

కాబోలు కృష్ణుడు అష్టమినాడు జన్మించి, దానికి ఎనలేని గౌరవం చేకూర్చినట్లు వాడుకైనదో కథ) శ్రీరామకృష్ణప్రభ 8/98 5,6

## 5. శ్రీకృష్ణుని భార్యలు 8 మంది

1. రుక్మిణి, 2. సత్యభామ, 3. జాంబవతి, 4. కాళింది, 5 నాగ్నజితి, 6. మిత్రవింద, 7. భద్ర, 8. లక్షణ. - భాగవతము

## 6. అష్టలక్ష్ములు

1 ఆదిలక్ష్మి, 2. ధాన్యలక్ష్మి, 3.ధైర్యలక్ష్మి, 4. గజలక్ష్మి, 5. సంతానలక్ష్మి, 6. విజయలక్ష్మి, 7. విద్యాలక్ష్మి, 8. ధనలక్ష్మి.

## 7. అష్టాక్షరీమంత్రధ్యానము

శుచిర్భూతుడై "ఓం నమోనారాయణాయ" అను అష్టాక్షరీ మంత్రముయొక్క ఓమ్ మున్నగు ఎనిమిది అక్షరములను క్రమముగ (అర్చామూర్తిని) పాదములు **ఓమ్**, మోకాళ్ళు **న**, తొడలు **మో**, పొట్ట **నా**, హృదయము **రా**, వక్షస్థలము **య**, ముఖము **ణా**, శిరస్సు **య**, లందు న్యాసమొనర్చవలెను లేక ఆ మంత్రము యొక్క 'య'కారము మొదలుకొని 'ఓమ్'కారము వఱకు గల ఎనిమిది అక్షరములను క్రమముగా శిరస్సు మొదలుకొని పాదముల వఱకు ఆ ఎనిమిది అంగములందు విపరీతక్రమముగ న్యాసమొనర్చవలెను భాగవత రత్నాకరము 368 పేజీ నుండి

## 8. శ్రీశైల శిఖరము గాక 8 శిఖరములు

శ్రీగిరియందు శ్రీగిరి (శ్రీశైలము) శిఖరము గాక ఎనిమిది శిఖరములు గలవు వాటి పేర్లేమన 1. తామ్ర, 2. జాహ్నవి, 3. చిత్ర, 4. భారతి, 5. చారుఘోషిణి, 6. అరుణి జయవిజయ, 7. వక్రపృథ్వీ, 8. అర్చిష్మతి మొ॥

శ్రీమదుత్తర మహాభారత సారోద్ధారము పంచమ భాగము - 649వ పేజి

## 9. బ్రహ్మాండమును మోయు 8 దిగ్గజములు

ఈ బ్రహ్మాండము యొక్క అధోభాగమునందును, మధ్యభాగము నందును పట్టుకొని నిలబెట్టు శక్తులు శ్రీవరాహ, కూర్మ, అనంతాది మహావిష్ణుశక్తులు గలవు. 8 దిక్కుల యందును

1. ఐరావతము, 2. కుముదము, 3. పుండరీకము, 4. వామనము, 5 అంజనము, 6. పుష్పదంతము, 7. సార్వభౌమము, 8 సుప్రతీకము అనెడి పేర్లు గల 8 దిగ్గజములు ఈ బ్రహ్మాండమును వహించుచున్నవి శ్రీ మ మహాభారత సా నాల్గవ భాగము 47

## 10. అష్టదిగ్గజములు (కవులు)

1. అల్లసాని పెద్దన, 2. నంది తిమ్మన, 3. అయ్యలరాజు రామభద్రుడు 4 ధూర్జటి, 5. పింగళి సూరన, 6. రామరాజ భూషణుడు, (భట్టుమూర్తి), 7 తెనాలి రామలింగ కవి, 8 తిమ్మరుసు మంత్రి మ బా సా 5వ బాగం 149

## 11. అష్టాంగ నమస్కారము

1 శిరస్సు, 2,3 రెండు చేతులు, 4,5 రెండు చెవులు, 6 గెడ్డము, 7,8 రెండు భుజములు ఈ ఎనిమిదింటితో గూడినది అష్టాంగ నమస్కారము గురువునకు నమస్కరించినప్పుడు రెండు చేతులను మార్చి పట్టుకొనవలయును అనగా ఆయన పాదములను శిష్యుడు కుడి చేతితో కుడి పాదమును, ఎడమ చేతితో ఎడమ పాదమును పట్టుకొనవలెను సాంధ్య దీపిక 175, 176

## 12. శివుని అష్టమూర్తులు

లింగపురాణం శివునికి సంబంధించిన వ్రతాలనూ అనుష్ఠానాలనూ తెలుసుకొనటానికి చాలా ఉపయోగకరమైనది ఉత్తరభాగంలోని ఒక అధ్యాయం గద్యమయం తాంత్రిక ప్రభావానికి నిదర్శనం. శైవదర్శనానికి సంబంధించిన బహుసత్యాలు కూడా ఇందులో వున్నాయి. ఉత్తరభాగంలోని 13వ అధ్యాయంలో శివుని సుప్రసిద్ధములయిన అష్టమూర్తులకూ గల వైదిక నామాలు పేర్కొనబడ్డాయి అవి యివి

1. పృథివీ మూర్తి - శివుడు
2. జలమూర్తి - భవుడు
3. అగ్నిమూర్తి - పశుపతి
4. వాయుమూర్తి - ఈశానుడు
5. ఆకాశమూర్తి - భీముడు
6. సూర్యమూర్తి - రుద్రుడు
7. సోమమూర్తి - మహాదేవుడు
8. యజమానమూర్తి - ఉగ్రుడు శ్రీశైలప్రభ 7/84 =63

## 13. దేవుని పూజించుటకు ఏవేవి కావలయును?

1. సాలగ్రామ శిల, 2.తామ్రపాత్ర, 3 జలము, 4. శంఖము, 5. పురుషసూక్తము, 6. చందనము, 7. గంట (చిన్నది), 8. తులసి యీ 8 దేవుని పూజించువారి కుండవలెనని హలాయుధుడనెను శ్రీ భగవత్పూజామాల

# 14. జ్ఞాన అష్టాంగములు

1 దేహేంద్రియంబులందు వైరాగ్యము, అనగా ఇంద్రియంబులను దాని దాని యిష్ట ప్రకారము విడిచిపెట్టక జాగ్రత్తగా నుండుట, ఇదే యమము అనబడును
2 సదా పరబ్రహ్మము నందు ప్రియముగా నుండుట, నియమము అనబడును
3 సకల వస్తువులందును ఆశలేకుండుట ఆసనము అనబడును
4 జగత్తు సర్వము స్వప్నము వంటిదనియు మిధ్య యనియు దృఢముగా తలంచుట, ప్రాణాయామము అనబడును
5. చిత్తమును బాహ్య వ్యాపారములందు పోనియ్యక సదా అంతర్ముఖమున ద్రిప్పుట, ప్రత్యాహారమనబడును.
6. చిత్తమును చలింపక నిశ్చలముగా నిలుపుట ధారణయనబడును
7. సత్యజ్ఞానానందమయమై సర్వసాక్షిగా నుండు పరబ్రహ్మనే నేను. నేనే ఆ పరబ్రహ్మమనెడు (సోహంభావమే) ధ్యానము అనబడును
8 ఆ ధ్యానమున్ను సకల తలంపులున్ను, సకల దృశ్యములున్ను, మఱచి, తాను తానై కేవల సాక్షిమాత్రముగా నుండుట, సమాధి అనబడును. ఇవియే జ్ఞాన అష్టాంగములు వీనివల్లనే (సద్యోముక్తి) అనగా ఈ జన్మమునందే ముక్తి కలదు యోగాష్టాంగములు క్రమేణ జన్మాంతరంబున ముక్తి కలుగుటకు సాధనంబులు

వాల్మీకి రామాయణము - బాలకాండ 67

యమ - నియమాసన - ప్రాణాయామ - ప్రత్యాహార
ధారణా - ధ్యాన - సమాధయోఽష్టావంగాని

# 15. తల్లిదండ్రుల, గురువుల ధిక్కరించువాడు

1. ఎవడు తల్లిదండ్రులను, గురువును గర్వముచే ధిక్కరించునో వాడు మూత్రపురీష బిలమందు దలక్రిందుగా మునిగియుండును.
2. వారి నవమానించువాడు గాడిదగాను;
3. బరుషముగ బలుకువాడు గోరువంకగను;
4. బీడించువాడు తాబేలుగను,
5 అపనిందలాడు వాడు ఖరముగాను;
6. నిందించువాడు కుక్కగను,
7 పరిభోక్త పురుగుగను,
8. మచ్చరించువాడు కీటకముగను పుట్టును

కావున నా చార్యుని, తల్లిదండ్రులను. అన్నను దానెంత యార్తుడైయున్నను

నవమానింపరాదు. అందు ముఖ్యముగ బ్రాహ్మణునకు దగదు. గురు నింద యాయువును దహించుననని యనుశాసన పర్వమందు గలదు వా రా బాలకాండ

## 16. ఆసనములు 8

1 వీరాసనము, 2. స్వస్తికాసనము, 3. పద్మాసనము, 4 యోగాసనము, 5. కూర్మాసనము, 6. భద్రాసనము, 7. సింహాసనాసనము, 8 చిత్రాసనము. ఇవి ప్రత్యక్షముగా జూచి తెలిసికొనబడదగినవి శ్రీ భగవద్గీతా గూఢార్థదీపికా - 198

## 17. దూలత్రయ గృహదోషము

1 తూర్పున స్నానగృహము, 2. ఆగ్నేయమున పాక (వంట) గృహమును, 3. దక్షిణమున శయన గృహమును, 4 నిఋతి గృహమున శస్త్రములను, 5. పశ్చిమ దిక్కున భోజన గృహమును, 6. వాయవ్య దిక్కున ధాన్య గృహమును, 7 ఉత్తరపు దిక్కున ద్రవ్యస్థాపన గృహమును, 8. ఈశాన్యమున దేవతా గృహమును నిర్మింప వలయును అట్లు కాక ఈశాన్యమున వంటలు చేయుచుండిన యెడల ఆ గృహము క్రమక్రమముగా క్షీణించును పైన వ్రాసిన ప్రకారము గదుల క్రమములు తప్పినయెడల అష్టకష్టములు కలుగుచుండును

## 18. కంచములు తొలిచిన నీళ్ళను చల్లు దిశలకు ఫలము

1. కంచమును కడిగి ఆ నీళ్ళను యింటికి తూర్పు భాగమున జల్లిన శుభము 2. ఆగ్నేయమున మానభంగము, 3 దక్షిణమున మృత్యుభయము, 4. నైఋతియందు రోగములు, 5. పశ్చిమ మందు సంపద, 6. వాయవ్యమందు శత్రుత్వము 7 ఉత్తరమున ధనము, 8 ఈశాన్యమున ఐశ్వర్యమును కలుగును

## 19. నామాయ 8 విధములు

1. భూమి, 2. నీళ్ళు, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశము, 6. చిత్తము, 7. బుద్ధి, 8. అహంకారము అని నామాయ ఎనిమిది విధములుగా (భేదములుగా) నున్నదని శ్రీకృష్ణపరమాత్మ గీత 7వ అధ్యాయము 4వ శ్లోకములో చెప్పాడు తన్మాత్రయనగా సూక్ష్మ భూతములు బుద్ధి శబ్దము చేత నహంకారమునకు కారణభూతంబైన మహత్తత్వంబును, అహంకార శబ్దము చేత నవిద్యతో కూడిన యవ్యక్తంబును చెప్పంబడును ఈ ప్రకృతి నా యొక్క ఈశ్వరమాయాశక్తి

గీత 7అ, 14 శ్లో॥ విష్ణుమాయ నెట్లు దాటవచ్చునో చెప్పెద వినుము ఫలాభిసంధిరహితముగా సమస్త కర్మముల నాచరించుచు విరక్తులై (లేక కర్మ పరిత్యాగము చేసి సన్న్యసించి) నన్ను శరణు జొచ్చినవారు సర్వభూత చిత్తమోహకర మైనదియు, నానా విధ జగదుపాదానాకారణముగా దోచునదియునగు నీ మాయను

(అనగా సంసార బంధము నుండి) దాటుదురు. 'దైవీమమమాయా' అను వాక్యమునకు తైత్తరీయ శ్రుతి ప్రమాణము ఏమనిన రాక్షసియనదగినదియు సామర్థ్యగలదియు నగు మాయను నెదురించి యుపనిషదర్థ విచారణ చేత, తండ్రి కొడుకును వలె స్వాధీనము చేసికొనియెద స్మృతి ప్రమాణమేమనిన కలగను స్వల్పకాలములోనే యనేక వత్సరములు గడచినట్లు భ్రమయెట్లు కలుగునో, అట్లు జాగ్రదవస్థయందు గలుగు ప్రపంచ భ్రమమును మాయా చమత్కారమని యెఱుగునది "మామేవ ప్రపద్యన్తే" అనగా ప్రపంచవాసనను మూలచ్ఛేదము చేసి బ్రహ్మమును దప్ప వేఱొక దానిని చింతింపకుండు బ్రహ్మనిష్ఠులని తాత్పర్యము. శ్రీభగవద్గీతా గూడార్థ దీపికా - 321

# 20. తుమ్ముల శకునము

1. తూర్పునందు తుమ్మినయెడల మృత్యువును,
2. ఆగ్నేయమందున దుఃఖమును,
3. దక్షిణమందు కార్యవిలంబమును,
4. నైరృతియందు నష్టమును,
5. పశ్చిమమందు లాభమును,
6. వాయవ్యము నందు మరణమును,
7. ఉత్తరము నందు సంపదయును,
8 ఈశాన్యము నందు గొప్ప లాభము కలుగును జ్యోతిషప్రభావము 164

ఉమ్మినప్పుడు, తుమ్మినప్పుడు, దంతముల యెంగిలి తగిలినప్పుడు, అసత్యమును పలికినప్పుడు, పాపాత్ములతో సంభాషించినప్పుడు, (ఆచమించుటకు ఉదకము సంభవింపనప్పుడు) తన కుడి చెవిని తాకవలయును తుమ్ము, ఆవులింత, అపాన వాయువు అపరాదు

ప్రభాసాది తీర్థములు గంగాదినదులు బ్రాహ్మణుని యొక్క దక్షిణ కర్ణము నందున్నవని మనువు వచించుచున్నాడు

అగ్ని, జలములు, వేదములు, చంద్రుడు, సూర్యుడు, వాయువు వీరందరు బ్రాహ్మణుని యొక్క దక్షిణ కర్ణము నందు నివసించుచుందురు. పరాశరస్మృతి - 173

# 21. బ్రహ్మనిష్ఠుని బ్రహ్మచర్యము

బ్రహ్మనిష్ఠుడు సర్వదా ప్రమాదరహితమగు, బ్రహ్మచర్యము నందుండి నిష్ఠను పూర్తి చేయవలయును. ఈ బ్రహ్మచర్యము 8 విధములు 1. స్త్రీ యొక్క ముఖ స్తనములను చూచుట, 2. హస్తములచే పట్టుకొనుట, 3 నాట్యనర్తనాదులను చూచుట, 4 విషయ సంబంధములగు మాటల నుచ్చరించుట, 5 వారితో కూడ నిర్జన స్థలమందుండుట, 6. విషయ సంబంధమైన సంగతిని విచారించుట, 7 విషయ ప్రవర్తనకొరకు

మార్గమూహించుట, 8 స్త్రీ యందు రమించుట, అనునీ ఎనిమిదిన్ని మైథునమందు చేరినవి బ్రహ్మము నందు మనస్సును ప్రవేశపెట్టుటయే నిజమగు బ్రహ్మచర్యము

శ్రీ శుష్క వేదాంత తమో బాస్కరము - 304

## 22. దశరథుని మంత్రులు - 8 మంది

1 విజయుడు, 2. సిద్ధార్థుడు, 3. దృష్టి, 4. జయంతుడు, 5. మంత్రపాలుడు, 6. అశోకుడు, 7. అర్థసాధకుడు, 8. సుమంత్రుడు

- వాల్మీకి రామాయణము బాలకాండ 419

## 23. జన్మహేతు లక్షణము

1 ఆత్మయందు మాయపుట్టె, 2 మాయనుండి అజ్ఞానము జనించె, 3 అజ్ఞానము నుండి అవివేకము పుట్టె, 4. అవివేకము నుండి అభిమానము పుట్టె, 5. అభిమానము నుండి రాగాదులు పుట్టె, 6. రాగాదుల యందు కర్మములుద్భవించె, 7, 8. కర్మముల నుండి సుఖ, దుఃఖములకు మూలమైన శరీరములు జనించె. ఈ విధమున దేహముల నెత్తి జనులు నిన్ను కనలేరు

శ్రీ భద్రాద్రి రామ శతకము 42వ పద్యము

## 24. అష్ట ధర్మములు

1. యజ్ఞములు చేయుట, 2. వేదములు చదువుట, 3. దానములు చేయుట, 4.తపస్సు చేయుట, 5. నిజము చెప్పుట, 6. ధైర్యము, 7. ఓరిమి, 8.ఆశలేకుండుట, అను ధర్మములు ఎనిమిది విధములుగా చెప్పబడినది.

శ్రీశైలప్రభ 12/85=22

## 25. దుర్జన లక్షణములు

1. రహస్యము వెల్లడించుట, 2.యాచించుట, 3. కఠినముగా మాట్లాడుట, 4. మనోనిశ్చలత లేకుండుట, 5. కోపము, 6. అబద్ధమాడుట, 7. జూదము, 8. స్నేహితుని నిందించుట మొదలగునవి దుర్జన లక్షణములు

శ్రీశైలప్రభ 12/85=23

## 26. అష్టైశ్వర్యములు

1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5 ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశిత్వము, 8. వశిత్వము అను నష్టైశ్వర్యములు మోక్షమునకు ఆటంకములు

వచన భాగవతము - 116

## 27. మూర్తులు 8 విధములు

శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ।
మనోమయీ మణిమయీ ప్రతిమాష్టవిధా స్మృతా॥

నా యొక్క ప్రతిమ (మూర్తి) ఎనిమిది విధములుగా నుండును

1. రాతిది, 2. కొయ్యది, 3. లోహపుది, 4. మట్టి, చందనము మొదలైనవానిది, 5. చిత్రమయమైనది, (బొమ్మ), 6 ఇసుకతో చేయబడినది, 7. మనోమయమైనది, 8 మణిమయమైనది  భాగవత రత్నాకరము, ఏకాదశ స్కంధము 944

## 28. ధ్యాన సమయమున వర్జనీయములు

1. సోమరితనము, 2 ఆవలింతలు, 3. నిద్ర, 4 తుమ్ము, 5. ఉమియుట, 6. భయము, 7. పాదములు తాకుట, 8. కోపము ధ్యానకాలమందు వర్జనీయము. శుచిర్భూతుడు కాక, శిరోజములు శుద్ధిగావింపక, గావించు జపధ్యానముల వలన ఇష్టదేవత కోపించి దహించును అతిగా భుజించి గాని, అస్థిమిత చిత్తముతో గాని జపధ్యానాలు చేయరాదు  శ్రీ సుందరకాండ శ్రీవిద్య - 30

## 29. శ్రీరామచంద్రమూర్తి

జ్ఞానమయుడై హరియై మహావిష్ణువై యెవడు రఘు వంశంబున దశరథునకు బుట్టి సర్వదాతయై **రా** జిల్లుచు **మ** హియందుండెనో యతడు రాముడని జ్ఞానులు ప్రకటించిరి ఎవనిచే **రా**క్షసులు **మ**రణము నొందిరో యతడు రామచంద్రమూర్తియని అభిరాముడని చెప్పబడును **రా** హువు **మ** ననిజము (చంద్రుని)వలె నెవడు రాక్షసులను మనుష్యరూపమున తేజోహీనులం జేసెనో వాడు రామచంద్రమూర్తి. **రా** జార్హులైన **మ** హీపతుల వంశముల నెవడు భూమిపై స్థాపించెనో యతడు రామచంద్రమూర్తి. తన నడవడిచే ధర్మమార్గమును, పేరుచే జ్ఞానమార్గమును, ధ్యానముచే వైరాగ్యమును తన్ను బూజించువారికి నైశ్వర్యమును నెవడిచ్చునోవాడు యథార్థముగ రామచంద్రమూర్తి అనంతుడు, నిత్యానందుడు (సత్యానందుడు పాఠాంతరము)  పద్మ పురాణము 234

జ్ఞాన స్వరూపుడునైన యెవనియందు యోగులు రమించుచున్నారో అట్టి యీ **రాముడే** పరబ్రహ్మమని చెప్పబడుచున్నాడు, శ్రీరాముడు

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము బాలకాండ 32

## 30. ప్రయాణ విషయములు

1. తూర్పునకు మంగళవారం, 2. దక్షిణమునకు సోమ, శనివారములు, 3. పడమరకు బుధ, గురువారములు, 4. ఉత్తరమునకు ఆది, శుక్రవారములు మంచివి (పంచాంగం), 5. రాహువు ఆది, గురువారములయందు తూర్పునను, 6 సోమ, శుక్రవారములయందు దక్షిణమునను, 7. మంగళవారమునందు పశ్చిమమునను, 8 బుధ, శనివారముల యందు ఉత్తరమునను ఉండును

కాబట్టి ఎడమవైపునగాని, వెనుక గాని యుండునపుడు ప్రయాణమును చేసిన కార్యసిద్ధి యును, కుడివైపున గాని ఎదురుగా గాని యుండునపుడు ప్రయాణమును చేసిన కార్యనాశనమును సంభవించును

## 31. పరమాత్మయొక్క స్వరూపము గీత 8/9, 10

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ - అ 8, శ్లో 9

ప్రయాణకాలే మనసా ఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్ - అ 8, శ్లో 10

*భావము : ఎవడు భక్తితో గూడుకొనినవాడై, అంత్యకాలము నందు యోగబలముచే (ధ్యానాభ్యాస సంస్కారబలముచే) ప్రాణవాయువును భ్రూమధ్యమున (కనుబొమ్మల నడుమ) బాగుగా నిలిపి, ఆ పిదప సర్వజ్ఞుడును, పురాణ పురుషుడును, జగన్నియామకుడును, అణువుకంటెను మిగుల సూక్ష్మమైన వాడును, సకల ప్రపంచమునకు ఆధారభూతుడును (సంరక్షకుడును), చింతింపనలవికాని స్వరూపము గలవాడును, సూర్యుని కాంతివంటి కాంతిగల వాడును (స్వయం ప్రకాశస్వరూపుడును) అజ్ఞానాంధకారమునకు అవలనుండువాడునగు పరమాత్మను నిశ్చలమనస్సుచే ఎడతెగక చింతించునో అతడు దివ్యస్వరూపుడైన సర్వోత్తముడగు ఆ పరమాత్మనే పొందుచున్నాడు*

*పరమాత్మ ఎట్టివాడో తెలుపుచు అతనినెట్లు ధ్యానించవలెనో ఆ పద్ధతియు చెప్పుచున్నారు ధ్యాతకు ధ్యేయ వస్తువుపై పూర్ణ విశ్వాసము కలుగవలెనన్నిన ముందుగా ఆతని స్వరూపము, మహిమ బాగుగ తెలిసికొనియుండవలెను ఒక వస్తువు యొక్క స్వరూప స్వభావములు పూర్తిగా తెలిసినపుడు మాత్రమే దానిని గూర్చి చింతించుటకు వీలు పడును గదా! కావున యిచట గూడ ధ్యానపద్ధతిని వివరించుటకు ముందుగా ధ్యేయ స్వరూపమగు పరమాత్మయొక్క స్వరూపము 'కవింపురాణం' అను శ్లోకము ద్వారా యెనిమిది లక్షణములతో చెప్పబడింది*

**1.** *కవి : పరమాత్మ కవి అనగా సర్వజ్ఞుడు. కవులకు కవి ఆ పరమ కవిని యెఱుగుటయే ముఖ్యమైన కవిత్వము*

**2.** *పురాణ పురుషుడు : ఆతడు సనాతనుడు, అనాది స్వరూపుడు ప్రపంచములోగల సమస్త దృశ్య పదార్థములకును ఆది కలదు. పరమాత్మకు ఆది లేదు ఆది*

కలదానికి అంతమున్ను ఉండును కావున దృశ్య వస్తువులు నశ్వరములు. పరమాత్మ శాశ్వతుడు

**3.** శాసకుడు : సర్వజీవులను, సర్వలోకములను శాసించువాడు, నియామకుడు, ప్రభువు చిన్న చిన్న రాజ్యాధినేతలనే జనులు కొల్చునపుడు బ్రహ్మాండ నియామకుడగు పరమేశ్వరునియెంత భక్తితో కొలువవలెను?

**4.** సూక్ష్మరూపి : అణువు కంటెను సూక్ష్మమైనవాడు. 'అణోరణీయాన్ మహతో మహీయాన్ అణువుకంటెను సూక్ష్మ తమమైనవాడని, మహద్వస్తువులకంటె మహత్తరమైనవాడని భగవంతుని గూర్చి ఉపనిషత్తులున్ను ఘోషించుచున్నవి కావున ప్రతి అణువునందును సూక్ష్మముగ వ్యాపించియున్న ఆ పరమాత్మ యొక్క సన్నిధానమును సర్వత్ర అనుభవించుచు భక్తి ప్రపత్తులు గలిగి యుండవలెను

**5.** సర్వాధారుడు : సమస్త ప్రపంచమును ధరించువాడు, పోషించువాడు, సంరక్షించువాడు, ఆధారభూతుడు. దృశ్య పదార్థములు జడములు చైతన్యము యొక్క ఆధారము లేనిదే అవి నిలువజాలవు, ఆ చైతన్యాధారమే పరమాత్మ

**6.** అచింత్యరూపుడు : ఇంద్రియమనంబులకు అతీతుడు కావున మనస్సుచే చింతించు టకు అలవికానివాడు. అయినను శుద్ధ మనస్సు నిరంతర ధ్యానముచే సముద్రమందు నదివలె ఆ పరమాత్మయందు లయమై తద్రూపమే అయి వెలయగలదు. మలిన చిత్తమునకు పరమాత్మ యెన్నటికిని విషయుడు కానేరడు శుద్ధ చిత్తముచే నాతనిని తెలిసికొనవచ్చును అనుభూత మొనర్చుకొనవచ్చును అయితే ఒకానొక దృశ్య వస్తువును తెలిసికొనినట్లు గాక, తత్స్వరూపమున లయమై తదాకారమై వర్తించుట ద్వారా ఆతని యనుభూతిని బొందవచ్చును. అట్లు కానిచో 'బుద్ధిగ్రాహ్య'మని (6వ అధ్యాయము, 21వ శ్లోకము) 'అనుస్మరేత్' అని ఈ శ్లోకమును ఏల చెప్పియుండును!

**7.** ఆదిత్యవర్ణుడు : ప్రకాశ స్వరూపుడని అర్థము సూర్యులను గూడ ప్రకాశింప జేయు జ్ఞాన సూర్యుడతడు (తస్యభాసా సర్వమిదం విభాతి)

**8.** తమస్సునకు పరమైనవాడు : మాయకు, అజ్ఞానమను చీకటికి విలక్షణుడై వాని కతీతుడై పఱగువాడు పరమాత్మ

ఈ ప్రకారమగు లక్షణములతో గూడిన పరమాత్మను అంత్యకాలమున మను జుడు ఏకాగ్ర చిత్తుడై, భక్తి భావముతో నిరంతరము చింతన చేయవలెను ఇచట అంత్య కాలమునకు ప్రయాణసమయమని పేరు పెట్టిరి అనగా అత్తరి సంభవించునదియు ఒకానొక ప్రయాణమే యనియు, అయితే దీర్ఘప్రయాణమనియు భావించి, ప్రయాణమునకు ముందుగా ఏ ప్రకారము వస్తువులన్నిటిని సర్దుకొని దారిబత్తెమును జాగ్రతగా గ్రహించి వెడలుదురో, అట్లే పరలోక ప్రయాణమునకు వలసిన పుణ్య సంపత్తిని ముందుగనే సేకరించి యుంచుకొనవలయును

అట్టి అంత్యకాలమున ఏ ప్రకారము పరమాత్మను ధ్యానింపవలసినది ఇట

*చెప్పబడినది 1. భక్తితో గూడుకొని, 2. యోగ బలముచే ప్రాణవాయువును లేక దృష్టిని భ్రూమధ్యమున నిలిపి నిశ్చల మనస్సుతో పైన తెలుపబడిన లక్షణములతో గూడుకొనిన పరమాత్మను ధ్యానింపవలెను ఇచట భక్తియు, యోగమును రెండును తెలుపబడినవి రెండును ధ్యానయోగికి అత్యావసరములని స్పష్టమగుచున్నది. అహంకారము చచ్చుటకు, భగవానుని అనుగ్రహము సంపాదించుటకు, భక్తి భావము చాలా అవసరమైయున్నది. అట్లే చిత్తము యొక్క ఏకాగ్రతకొఱకు ఇంద్రియ మనోనిగ్రహరూప యోగమున్ను అవశ్యకమై యున్నది కనుకనే 'భక్త్యా' 'యోగబలేన' అను పదములచే భక్తిని, యోగమును రెండింటిని బోధించిరి 'అనుస్మరన్' అని చెప్పుట వలన భగవంతుని ఎడతెగక చింతించుచుండవలెనని అర్థము. 'అచలేనమనసా' అని పేర్కొనుట వలన మనస్సు బహునిశ్చలముగ నుండవలెననియు, చపల చిత్తము పరమాత్మను గ్రహింపజాలదనియు నిరూపింపబడినది*

*ఈ ప్రకారమగు భగవద్ధ్యానము అంత్యకాలమున చేయవలెనని బోధింపబడినను అంత్యమున ఉత్తమ సంస్కారము కలుగు నిమిత్తము జీవితకాలమంతను ఆ ప్రకారముగ అభ్యాసము చేయవలయుననియే భావము లేనిచో ఇచట తెలుపబడిన 'యోగ బలము' (యోగబలేన) మరణకాలమున ఆకస్మాత్తుగా ఎట్లు చేకూరగలదు? కాబట్టి జీవితమందలి సర్వకాల సర్వావస్థలయందును ఆ పరాత్పరుని నిశ్చలమనస్సుతో, భక్తి భావముతో ఎడతెగక స్మరించుచు అంత్యకాలమున గూడ ఆ ప్రకారమే యుండవలెను అట్లు కావించినచో దానికి ఫలితము సాక్షాన్మోక్షమే*

*భగవదైక్యమే (పురుష ముపైతి దివ్యమ్) అహో! ఎట్టి అపూర్వ ఫలితము! కావున చిన్నచిన్న ప్రాపంచిక ఫలములకై రాత్రింబగళ్ళు శ్రమించువారు భగవానుని ఈ వాక్యముల నాలకించి నిరతిశయానందరూపమైన సర్వోత్తమ పరమాత్మ పదమునకై యత్నించుట శ్రేయస్కరము* గీతామకరందము = 620

## 32. శ్రీకృష్ణ సంకీర్తనము

చేతోదర్పణ మార్జనం భవ మహాదావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవ చంద్రికా వితరణం విద్యావధూ జీవనమ్!
ఆనందాంబుధి వర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మ స్వపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనమ్॥

*భావం : 1. హృదయమనే అద్దానికి అంటిన మాలిన్యాన్ని తొలగించేదీ,*
*2. సంసార దావాగ్ని సంతాపాన్ని హరించేదీ,*
*3. ఆత్మ సాక్షాత్కారమనే తామర పువ్వుకు ఆధారమైన జ్యోత్స్న వంటిదీ,*
*4 ఆత్మవిద్య అనే వధువుకు జీవనం లాంటిదీ,*
*5. పరమానంద సముద్ర జలాన్ని ఉప్పొంగింపజేసేదీ,*

6 ప్రతిసారీ అమృతాస్వాదనానుభూతిని కలిగించేదీ,
7. సర్వజీవులకూ శీతల స్నానానుభూతిని కలిగించేది, అయిన
8 శ్రీకృష్ణ సంకీర్తనం వర్ధిల్లుగాక శ్రీరామకృష్ణ ప్రభ 6/98=2

# 33. అష్టాంగములు

1. యమము : 1 అహింస (ప్రాణుల గష్ట పఱుపకుండుట),
2. సత్యం. (యధార్థమును జెప్పుట),
3. అస్తేయం (పరద్రవ్యాదులను దొంగిలింపకుండుట),
4. బ్రహ్మచర్యం (ఇంద్రియ నిగ్రహము),
5. అపరిగ్రహః (ఇతరులిచ్చుదానిని స్వీకరింపకుండుట),

2. నియమము : 1. శౌచం (పరిశుద్ధుడుగా నుండుట),
2. తపః (ఉపవాసము చేయుట మొదలగు వానిచే దన శరీరమును కృశింపజేయుట),
3. సంతోషః (దొరికిన దానితో తృప్తి బొందుట),
4. స్వాధ్యాయః (వేదమును చదువు చుండుట),
5 ఈశ్వరప్రణిధానము (భగవంతుని ధ్యానము చేయుట),

3. ఆసనము : 1. వీరాసనము, 2 స్వస్తికాసనము, 3. పద్మాసనము, 4 యోగాసనము, 5. కూర్మాసనము, 6. భద్రాసనము, 7. సింహాసనాసనము, 8. చిత్రాసనము - ఇవి ప్రత్యక్షముగా జూచి తెలిసికొనబడదగినవి

4. ప్రాణాయామము: ప్రాణవాయువును, రేచక, పూరక, కుంభకములను చేయుట

5. ప్రత్యాహారము : విషయములను విడచునట్లింద్రియములను త్రిప్పి (లోజూపు) తన్ను (ఆత్మను) చూచుకొనునట్టి లక్ష్య విశేషము.

6. ధ్యానము : ఎడ తెరపి లేక నూనె ధారవలె సర్వదా సగుణ బ్రహ్మమును గాని నిర్గుణ బ్రహ్మమును గాని తలంచుచుండుట

7. ధారణా : మూలధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, ఈయాధారములలో నొకదాని యందెప్పుడు మనస్సును నిల్పుట

8. సమాధి : స్వానుభవము (స్వస్వరూపానుభవము)

శ్రీ భగవద్గీతా గూడార్థ దీపికా = 195, గీత 4అ 28శ్లో

# 34. సంధ్యా వందనము

సంధ్యావందనము వైదిక కర్మానుష్ఠానమున అగ్రగణ్యమయినదగుటచే దాని సంపూర్ణ ప్రయోజనము బొందగోరు ఉపాసకులు యీ దిగువ పేర్కొనబడిన యంశముల

దెలిసియుండ దగును. ఇయ్యది సంగ్రహముగా తెలుపబడుచున్నది

**1.** బ్రహ్మ స్వరూపము **:** సృష్ట్యాదికంటె బూర్వము భూతాదిలోకములు గాని, చరాచర జీవ సంఘముగాని లేకుండె ఒక్క పరబ్రహ్మమే అద్వితీయమై అంతట నిండియుండెను ఆ పరబ్రహ్మము యొక్క సత్యశబ్ద వాచ్యము, ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేనిది కాదు ఒకప్పుడొక రూపము గలిగి మఱియొకప్పుడింకొక రూపమున నుండక, వికార రహితమై ఎల్లప్పుడు ఒకే విధముగా నుండునది ఈ బ్రహ్మము, సర్వమునకు కారణభూతము. ఇది జడము కాదు జ్ఞాన శబ్ద వాచ్యము - సర్వజ్ఞము - ఆద్యంతములు లేనిది బ్రహ్మము కంటె వస్త్వంతరము లేకుండు టం బట్టి దేశ భేదము చేతకాని, కాలభేదము చేతగాని పరిచ్ఛిన్నము కాక, అఖండమై స్వయం ప్రకాశమై సర్వవ్యాపియై వెలుంగును

**2.** సృష్టి **:** బ్రహ్మము సర్వశక్తి సమన్వితము అట్టి బ్రహ్మము నుండి అవ్యక్తము (మాయ) ఆవిర్భవించెను అందుండి ఆకాశాది పంచభూతములును జీవరాశియు జనించెను ఈ జీవరాశిలో పురుషుడు శ్రేష్ఠుడు

బ్రహ్మమన్నను ఆత్మయన్నను ఒక్కటియే సృష్టికాబడిన ప్రతి పదార్థమునందును బ్రహ్మము నిండియున్నది జీవుని ఉపాధి (శరీరము)లో నుండు బ్రహ్మమును ప్రత్యగాత్మయనియు, బాహ్య ప్రపంచమున నుండు బ్రహ్మమునకు పరమాత్మయ నియు నామములు.

**3.** జీవుడు, శరీరము **:** ఉపాధియందుండు ఆత్మ (బ్రహ్మము) అవిద్య (అజ్ఞానము) చే నావరింపబడి, మాయామోహితమైయుండును. ఈ మాయావృతుడైన ఆత్మను జీవుడని యందురు

జీవునకు మూడు శరీరములుండును ఈ మూడు శరీరములు పంచకోశములతో గూడినవి వాని వివరణ

**4.** కారణ శరీరము **:** పరబ్రహ్మము నుండి ఆవిర్భవించిన మలిన సత్వ ప్రధానమైన మాయ (అవిద్య) జీవునకు కారణ శరీరముగా ఏర్పడినది. ఇదియే సుషుప్త్యవస్థయు ఆనందమయ కోశమును అగును జీవుని స్థూల సూక్ష్మ శరీరములకును, సమస్త చేతనా చేతన జీవరాశి ఉత్పత్తికిని ఇది కారణమగుటచేత, దీనికి కారణ శరీరమని నామము. ఈ కారణ దేహాభిమానియగు జీవుడు, ప్రాజ్ఞుడు అను నామమున బరగును

**5.** సూక్ష్మ శరీరము **:** దీనికే లింగశరీరమనియు పేరు ఈ శరీరము చతుర్వింశతి (24) తత్త్వములతో నేర్పడినది వాక్కు, పాణి, పాద, ఉపస్థ, పాయువు (గుదము) అను పంచ కర్మేంద్రియములును, శ్రోత్రము, త్వక్కు, నేత్రము, జిహ్వా, ఘ్రాణము అను పంచ జ్ఞానేంద్రియములును, ప్రాణాది పంచవాయువులును, ఆకాశాది పంచభూతములును మనో, బుద్ధి, చిత్త, అహంకారములును కలిసి 24 తత్త్వములగును ఈ 24 తత్త్వములు శరీరముగా గలిగి జీవుడు, పూర్వకర్మలచే గలిగిన వాసనలతో

తైజసుడనబడును. ఇది ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశమగును. ఇందుగల మనస్సుయొక్క విషయము సంకల్ప వికల్పములు. బుద్ధియొక్క విషయము నిశ్చయము. చిత్తముయొక్క విషయము చంచలము అహంకారము యొక్క విషయము "నేను" అనెడి అభిమానము. ఈ నాలుగును అంతరింద్రియములు ఈ నాలుగు జ్ఞాతృతతో కలిసి అంతఃకరణమనబడును ఈ శరీరమున జీవుడు పూర్వకర్మ వాసనలు గలిగియుండును ఇందు జీవుడు స్వప్నావస్థ గలిగియుండును

**6.** స్థూల శరీరము **:** ఇది అస్థి, మాంస, చర్మ, నాడీ, రోమము మున్నగు **25** తత్త్వములు కలిగి, మనకు దృగ్గోచరమగు భౌతిక శరీరము దీనిది అన్నమయ కోశము. జీవుడు ఇందు జాగ్రదవస్థ కలిగి యుండును స్థూల శరీరాభిమానియగు జీవునకు విశ్వుడని నామము

**7.** శరీరత్రయ ధర్మములు **:** స్థూల శరీరము కర్మజము కనుక ఆయా జన్మలలో అనుభవింపదగిన కర్మఫలమున్నంత కాలము వఱకు ఇది నిలిచియుండి, అది తీరగనే క్షీణించును సూక్ష్మకారణ దేహములు సహజములు అవి ఎటువంటి ప్రళయ కాలముననును నశించక, అట్లే నిలిచియుండును స్థూల దేహపతనానంతరము జీవుడు సూక్ష్మ శరీరముతో గలసి కారణదేహమున చేరును కర్మశేషమనుభవించుటకై, ఈ రెండు దేహములతో గలిసి, జీవుడు తన పూర్వ కర్మానుగుణమైన దేహమున ప్రవేశించును

**8.** ముముక్షు (మోక్షము పొందగోరువాడు) వగువాడు, కారణదేహమునకు మూలమైన, అవిద్య వలన గలిగిన అజ్ఞానమును తొలగించయత్నించవలయును. అవిద్య, విద్య వలన నశించును అవిద్య నశించినచో, కారణ శరీరము నశించును దానియందు చేరియున్న (ఆశ్రయించియున్న) సూక్ష్మ శరీరము, ఆశ్రయరహితమై తనంతటదియే నశించును. ఇట్లు ఈ దేహద్వయము నశించుటచే, పునర్జన్మకు ఆధారము లేదు. ఇది మోక్షము. జన్మ పరంపర నుండి విడివడుట యగును.

ఇట్లు మోక్ష ప్రాప్తికి విద్య సాధనము విద్యయన బ్రహ్మవిద్య (స్కూళ్ళ చదువు కాదు) వేద శాస్త్రాభ్యాసము వేద శాస్త్రాభ్యాసము వలన సిద్ధాంతము బోధపడును ఇట్టి బ్రహ్మవిషయక జ్ఞానము మనస్సున స్థిరముగా నాటుకొనుటకు చిత్త సంస్కారము సత్త్వగుణ సంపత్తి కావలయును భగవదనుగ్రహము సంపాదించవలయును ఈ మూడిటిని చేకూర్చుకొనుటకు సాధనము సత్కర్మానుష్ఠానము సత్కార్మానుష్ఠానమున, అష్టాత్మ గుణములు కలిగి భగవదర్పితముగ వేదవిహిత కర్మల నాచరించుట ఈ వేద విహిత కర్మలలో ద్విజాతులకగ్రగణ్యమైనది త్రికాల సంధ్యావందనము దానిని అర్థయుక్త ముగా తెలిసిచేయుట లెస్స వేదవిహిత కర్మానుష్ఠానము, వేదశాస్త్రాభ్యాసము, అష్టాత్మగుణముల నలవరచుకొనుట వైదిక ధర్మమార్గలక్షణము ముముక్షువునకిది రాచబాట. తదన్యములు సాపాయములు

త్రికాల సంధ్యావందనము = 4

## 35. సాత్విక భావాలు 8

1. భగవత్స్మరణచే కలుగు జాడ్యము, 2. స్వేదము, 3. రోమాంచము, 4. కంఠభేదం, 5 శరీరకంపము, 6 వైవర్ణ్యము, 7. అశ్రుపాతము, 8. ప్రళయము

ఈ 8 సాత్విక భావములని చెప్పబడును శ్రీమదుత్తర మహాబారత సారోద్ధారము, 4వ బాగం 255

## 36. జప విధానములు 8

జపమాచరించే విధానాలు అనేకం అవి ఆచరించు పద్ధతుల్లో భేదాలుండవచ్చు సాంప్రదాయకంగా మనకు లభించే జపవిధానాలు 1 వాచిక జపము, 2. ఉపాంశు జపము, 3. మానస జపము, 4. లిఖిత జపము, 5. అఖండ జపము, 6. అజపా జపము, 7. షట్చక్ర స్థానములందు జపము, 8. పురశ్చరణము అని 8 విధములు

1. వాచికజపము : మంత్రాన్ని ఇతరులకు వినబడునట్లు ఉచ్చరించుట

2. ఉపాంశుజపము : మంత్రాన్ని ఇతరులకు వినీవినబడునట్లు ఉచ్చరించుట.

3. మానసజపము : నాలుక, పెదవులు కదల్చక మానసికంగా జపించుట 'బాహ్య పూజకన్నా వాచిక జపం పదిరెట్లధికం వాచికజపం కన్నా ఉపాంశు జపం పదిరెట్లధికం, ఉపాంశు జపం కన్నా మానసిక జపం పదిరెట్లధికం', అని మనుసంహిత వివరిస్తుంది. మానసిక జపం శ్రేష్ఠతమమయినప్పటికీ కుశాగ్ర బుద్ధి లేని వారికి ఈ విధానాన్ని శాస్త్రాలు చెప్పలేదు అట్టి వానికి మొదటి రెండు విధానాలు సరియయినవని చెప్పబడ్డాయి.

4. లిఖిత జపం : వాచిక, మానసిక జపము ద్వారా కాక, మంత్రాన్ని వ్రాయడం ద్వారా జపించే విధానమిది

5. అఖండ జపము: నిర్విరామంగా మంత్రాన్ని అనుకున్నంత సమయము, అనుకున్నన్నిసార్లు జపించడం అఖండ జపం. క్రమపద్ధతిలో సామూహికంగా ఈ జపం జరుపు తుంటారు.

6. అజపాజపము : మానసికంగా రోజుకి పదకొండుసార్లు ప్రతిశ్వాసతోనూ మంత్రాన్ని జపించుటనే అజపాజపమంటారు.

7. షట్చక్రస్థానములందు జపము : షట్చక్రస్థానములలో ఏదేని ఒక స్థానమునందు మనసు లగ్నం చేసి జపమాచరించడం. మూలాధారం స్వాధిష్ఠానం, మణిపురం, అనాహతం, విశుద్ధ, ఆజ్ఞాచక్రం అన్న ఆరు చక్రస్థానములు మనలో ఇమిడి ఉన్నవి

8. పురశ్చరణం : గురూపదేశాన్ననుసరించి ఒకానొక సాధన ఫలాన్ని పొందటానికి ఒక నిర్దిష్ట పద్ధతిలో జపము చేయుటనే పురశ్చరణం

ఈ విధానంలో సాధకుడు జపసంఖ్యను క్రమంగా ప్రతిదినమూ పెంచుకుంటూ లేదా తగ్గించుకుంటూ వస్తాడు ఉదాహరణకు అమావాస్యనాడు 1000 సంఖ్యతో ప్రారంభించి దినమునకు 1000 చొప్పున పెంచుకుంటూపోతే పౌర్ణమినాటికి జపసంఖ్య 15000కి చేరుకుంటుంది. అప్పటి నుండి దినానికి జపసంఖ్య 1000 తగ్గించుకుంటూ వస్తే అమావాస్యనాటికి తిరిగి 1000కి చేరుకుంటుంది ఈ రకంగా సాధకుడు గురూపదేశాన్ననుస రించి ఒకటి, రెండు, మూడు సంవత్సరాల వరకూ చేయవచ్చు. పురశ్చరణంలో అంతర్భాగంగా అన్నదానం మొదలగు పుణ్య కర్మలు నిర్దేశింపబడ్డాయి వాటికి బదులుగా అదనంగా జపమాచ రించనూవచ్చు. శ్రీరామకృష్ణ ప్రభ 2/95=28

## 37. ఉష్ణ నరకాలు 8

1. సంజీవ, 2. కాలసూత్ర, 3. సంఘాత, 4. రౌరవ, 5. మహారౌరవ, 6. తపన, 7 ప్రతపన, 8. అవీచి యివి 8 ఉష్ణ నరకాలు శ్రీరామకృష్ణ ప్రభ 2/95=38

## 38. శీతనరకాలు 8

1 అర్బుద, 2. నిరర్బుద, 3. అతత, 4. హాహవ, 5. ఉత్పల, 6. పద్మ, 7.మహాపద్మ, 8. హుహువ - ఇవి 8 శీతనరకాలు. శ్రీరామకృష్ణ ప్రభ 2/98/38

## 39. స్వయం వ్యక్తములు 8

మూర్త్యష్టకేషు బ్రహ్మైవ చిద్రూపేణ జడేస్థితః!
స్వయం వ్యక్తాని తాన్యష్టౌక్షేత్ర మర్చ్యా వినాయకం॥

*భావము : అందు మొదట స్వయంవ్యక్తము నెనిమిదింటిలో మొదటిది శ్రీరంగమను విమానము రంగనాథుడను నారాయణమూర్తియు మిగతా 7లో 2. శ్రీముష్ణము, 3. వేంకటాద్రియు, 4. గండక సాలగ్రామక్షేత్రము, 5. నైమిశము, 6. తోతాద్రి, 7. పుష్కర క్షేత్రము, 8. బదరీ నారాయణమును ఈ 8 క్షేత్రములందు జడముగా తోచెడి యర్చామూర్తులందు సాక్షాచ్చిన్మయుడగు నారాయణుడు ప్రకాశించును.*

*శ్రీ మదుత్తర మహాభారత సారోద్ధారము - పంచమ భాగము - 473*

## 40. అష్టప్రకృతులు

1. ప్రత్యయము రాక ముందున్న శబ్ద స్వరూపము, 2. ఉపాదాన కారణము, 3. ఒక ఛందస్సు, 4. పౌరవర్గము, 5. సత్వాదిగుణసామ్యావస్థ, 6. స్వభావము,

7. స్వామ్యాది (సప్త ప్రకృతులు - స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము) 8. అవ్యక్తము (అష్ట ప్రకృతులు అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు) శబ్ద రత్నాకరము - 750

# 41. దిక్కులు, దిక్పాలురు, వారి వివరములు

| దిక్కులు | దిక్కులను పాలించు వారు | దిక్పాలకుల భార్యలు | దిక్పాలకుల వాహనములు | కాపురముండు పట్టణములు | ధరించు ఆయుధములు |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | శచీదేవి | ఐరావతము | అమరావతి | వజ్రము |
| ఆగ్నేయమూల | అగ్నిహోత్రుడు | స్వాహాదేవి | తగరు(పొట్టేలు) | తేజోవతి | శక్తి |
| దక్షిణము | యముడు | శ్యామలాదేవి | మహిషము | సంయమని | దండము |
| నైరృతిమూల | నైరృతి | దీర్ఘాదేవి | నరుడు | కృష్ణాంగన | కుంతము (యీటె బల్లెము) |
| పడమర | వరుణుడు | కాళికాదేవి | మకరము | శ్రద్ధావతి | పాశము (త్రాడు) |
| వాయవ్యమూల | వాయువు | అంజనాదేవి | లేడి | గంధవతి | ధ్వజము |
| ఉత్తరము | కుబేరుడు | చిత్రలేఖ | గుఱ్ఱము | అలకాపురి | ఖడ్గము |
| ఈశాన్యమూల | సాంబమూర్తి | పార్వతీదేవి | వృషభము | కైలాసము | త్రిశూలము |

పెద్దబాలశిక్ష = 115

# 41A. ధర్మరక్షణము

అకారణాత్కారణాద్వా, కారణా కారణాన్న చ।
శరీర గ్రహణం వ్యాపిన్ ధర్మత్రాణాయ కేవలమ్॥ విష్ణు పురాణము 5-1-50

*భావము : పాపులవలె నరకమనుభవించుటకుగాని, పుణ్యులవలె స్వర్గమనుభవించుటకుగాని, మనుష్యులవలె సుఖదుఃఖములనుభవించుటకు గాని నీవు శరీరము గ్రహించినవాడవు కావు. కేవల ధర్మరక్షణ నిమిత్తమే శరీరము ధరించితివి*

# 42. విష్ణుపురాణ మందలి యీ 8 శ్లోకములు ముఖస్థములు చేయదగినవి

1. యస్మాద్బ్రహ్మా చ రుద్రశ్చ, చంద్రేంద్ర మరుదశ్వినః।
వసవశ్చ సహాదిత్యైస్తస్యస్తోష్యామి కిన్వహమ్ ॥

*భావము : బ్రహ్మ, రుద్రుడు, చంద్రుడు, ఇంద్రుడు, మరుత్తులు, అశ్వినులు, ఆదిత్యుల, తోడి వసువులెవని వలన గలిగిరో యట్టి వాని నేనేమని స్తుతింతును*

2. ఏకావయప సూక్ష్మాం శాద్యస్యైద మహిలం జగత్।
కల్పనా వయవ స్యాం శస్త స్యస్తోష్యామి కిన్వహమ్॥

*భావము : ఎవని యవయవము లందలి యొక సూక్ష్మాంశముచే సమస్త ప్రపంచము కల్పితమయ్యెనో, యెవని యవయవాంశ కల్పనము సంకల్పసిద్ధమో యట్టివాని నేనేమని స్తుతింతును*

3. సదసద్రూపిణో యస్య, బ్రహ్మాద్యాస్త్రి దశోత్తమాః।
పరమార్థం న జానంతి, తస్యస్తోష్యామి కిన్వహమ్॥

*భావము : సత్తు, అసత్తు తన రూపముగా గల బ్రహ్మము యొక్క పరమార్థమును దేవతోత్తములు కూడా నెఱుంగరో యట్టి వాని నేనేమని స్తుతింతును.*

4. బ్రహ్మాన్వైరర్చితో యస్తు గంధ పుష్పాను లేపనైః।
నందనాది సముద్భూతై స్సోర్చతేవా కథం మయా॥

*భావము : నందనవనాదులందలి సుగంధ పుష్పాను లేపనముల బ్రహ్మాదులెవని బూజింతురో యట్టివానినేనేమని యర్చింపగలను,*

5. యస్యావతార రూపాణి దేవరాజ సదార్చతి।
నవేత్తి పరమం రూపం సోర్చ్యతేవా కథం మయా॥

*భావము : ఇంద్రుడు పరమరూపము తెలియనివాడై యవతార రూపముల సదా యర్చించునో యట్టివాని నేనెట్లు లర్చింపగలను*

6 విషయేభ్య సమాహృత్య సర్వాక్షాణి చ యోగినః।
యమర్చయంతి ధ్యానేన సోర్చ్యతే వా కథం మయా॥

*భావము : ఇంద్రియములను, విషయములను నియమించి ధ్యానముచే యోగు లర్చించువాని నేనెట్లు లర్చింపగలను*

7. హృది సంకల్ప్య యద్రూపం ధ్యానే నార్చంతి యోగినః।
భావ పుష్పాదినా నాథ సోర్చ్యతే వా కథం మయా॥

*భావము : ఏ రూపమును యోగులు హృదయమందు సంకల్పించుకొని భావ పుష్పములచే నర్చింతురో నాథా యట్టివాని నేనెట్లులర్చింతును.*

8. సోహం దేవదేవేశ నార్చనా దౌ స్తుతౌన చ।
సామర్థ్యవాన్ కృపామాత్ర మనోవృత్తి ప్రసీదమే॥

*భావము : దేవదేవ యట్టి నేను నీయర్చనాదులందు స్తోత్రాదులందు సమర్థుడనుగాను. కావున గేవల కరుణయే మనోవృత్తిగా గల నీవు నన్నునుగ్రహింపుము.. అటుగాక నీవు మనుష్య భావమున మమ్ము మోసగింప జూచెదవా నీ పాలనకు లోపబడిన మమ్ముగాపాడవేని నీకు నరకము తప్పదు.*

- విష్ణుపురాణము - శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము - అరణ్యకాండము 22, 23

## 43. భావనా సుమములు

అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహః,
సర్వభూత దయాపుష్పం క్షమాపుష్పం విశేషతః,
శమః పుష్పం తపః పుష్పం ధ్యాన పుష్పం తదైవచ,
సత్యం చైవాష్టమం పుష్పం ఏత్తైస్తుష్యతి కేశవః

*యెనిమిది రకములైన భావనా సుమములచే శ్రీహరిని సంతోషపెట్టవలెనని పురాణవచనము అవి ఏవి అనగా* 1. *అహింస,* 2 *ఇంద్రియ నిగ్రహము,* 3. *భూతదయ,* 4. *సహనము,* 5 *మనోనిగ్రహము,* 6 *తపస్సు,* 7 *ధ్యానము,* 8 *సత్యము యీ* 8 *భావనాసుమములు భగవంతునకు అత్యంత ప్రీతికరములైనవి*

శ్రీమద్భాగవతము 70 స్వామి సుందరచైతన్యానంద తృతీయ స్కంధము

## 44. అష్టసిద్ధులు

1. *ఊహాసిద్ధి : పారమార్థికార్థం తెలుసుకొనే కోరిక కలిగి దాని కొరకు ప్రయత్నిస్తుండగా జన్మాంతర, సుకృతం చేత, సంస్కారబలం చేత, గురూపదేశం లేకుండానే యధార్థజ్ఞానం కలగడం*

2. *శబ్దసిద్ధి : నిరంతరాభ్యాసం లేదా కొద్దిగా సత్ సత్యశ్రవణం చేతనే జ్ఞానం పొందడం*

3. *అధ్యయన సిద్ధి : నిరంతరాధ్యయనం వల్ల కలిగిన జ్ఞానం.*

4. *ఆధ్యాత్మిక సిద్ధి* 5. *ఆధిభౌతిక సిద్ధి,* 6. *ఆధి దైవికసిద్ధి యీ త్రివిధ దుఃఖాలలో ఉదాసీనుడై వుండటం వల్ల శీతోష్ణాది ద్వంద్వాలకు అతీతుడై త్రివిధ జ్ఞానం కలగడం*

7. *సహృత్సిద్ధి : మిత్రుడి మూలకంగా జ్ఞాన కలగడం*

8. *దానసిద్ధి : ఆచార్యుడికి ఇష్టమైన వస్తువేదో గ్రహించి అది ఆయనకిచ్చి ఆయనను తృప్తిపరచి ఆయనద్వారా జ్ఞానాన్ని పొందడం* శ్రీరామకృష్ణప్రభ 1/95=29

## 45. అష్టావధానము

1. *నిషిద్ధాక్షరి,* 2. *న్యస్తాక్షరి,* 3. *సమస్య,* 4. *దత్తపది,* 5 *పురాణపఠనం,* 6. *అప్రస్తుత ప్రసంగం,* 7. *గణితము,* (*గంటలు కొట్టుట లేదా పుష్పములు వేయుట*), 8. *వర్ణన*

ఎనిమిదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 9వ సంఖ్య

## 46. నవై ప్రోక్తాః సామిధేన్యః పిత్రూణాం,
తథా ప్రాహుర్నవయోగం విసర్గం,
నవాక్షరా బృహతీ సంప్రదిష్టా,
నవయోగో గణ నామేతి శశ్వత్

*పితృయజ్ఞములో అగ్నిని ఉద్దీపింపజేయుటకు సమిధలను వేయునప్పుడు కొన్ని మంత్రములు చెప్పవలసియుండును. వాటికి సామిధేనీ మంత్రములని పేరు వాటి సంఖ్య తొమ్మిది*

*(ప్రకృతి, పురుష, మహత్, అహంకార, పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు) ఈ తొమ్మిదింటి సమ్మేళనమే సృష్టియని, విజ్ఞుల యభిప్రాయము. బృహతీ ఛందస్సు పాదములోని అక్షరముల సంఖ్య తొమ్మిది.* శ్రీరామకృష్ణ ప్రభ 2/78

## 47. నవరసములు

1. శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః।
భీభత్సాద్భుత శాంతాశ్చరసాః పూర్వైర్నవస్మృతీః।
2. రతి ర్హా సశ్చ శోకశ్చ క్రోధోత్సాహి భయం తథా।
జుగుప్సా విస్మయశమాః స్థాయీ భావా నవస్మృతాః ॥

1. *శృంగారమునకు రతియు,* 2. *హాస్యమునకు హాసము,* 3. *కరుణకు శోకము,* 4. *రౌద్రమునకు క్రోధము,* 5. *వీరమున కుత్సాహము,* 6 *భయానమునకు భయము,* 7. *భీభత్సమునకు జుగుప్స,* 8 *అద్భుతమునకు విస్మయము,* 9. *శాంతమునకు శమమును క్రమము స్థాయీ భావములని చెప్పబడుచున్నవి.*

కాశీ మజిలీ కథలు 3వ భాగము - 4వ పేజీ

## 48. మానములు

*ఈ కలియుగ ప్రమాణము* 4,32,000 *సంవత్సరములు అందు జరిగిపోయిన సంవత్సరములు* 5063 *కలియుగమున ఇంకనూ జరగవలసిన కాలము* 4,26,937*సం*॥

*ఈ సంవత్సరమునకే* 9 *విధముల లెక్కింపు శాస్త్రముల యందు కనబడుచున్నది అదెట్లన*

1. *బ్రాహ్మ్యము,* 2 *దైవము,* 3 *మానుషము,* 4. *పిత్ర్యము,* 5 *సౌరము,* 6. *సావనము,* 7. *చాంద్రము,* 8. *ఆర్షము,* 9 *బార్హస్పత్యము అని మానములు తొమ్మిది విధములుగా వున్నది.*

వాటి ప్రయోజనమేమన సౌరమానమునసనుసరించి గ్రహణాదులను లెక్కించవలయును సావనమానము ననుసరించి కర్మానుష్ఠానము స్త్రీ గర్భ నిర్ణయాదులను చేయ వలసియున్నది చాంద్రమానముచే వాస్తు విషయక గృహప్రవేశాదులు ఉపవాసాది వ్రతములు నిర్ణయించవదగియున్నది అని సిద్ధాంత గ్రంథములయందు చెప్పబడియున్నది

శ్రీమదుత్తరమహాభారత సారోద్ధారము - 4వ భాగము, 173, 175

# 49. నవవిధ భక్తులు

ఈ భక్తి సాత్త్విక, రాజస, తామస భేదములచే మూడు విధాలుగానూ, భావక్రియా తొమ్మిది విధాలుగానూ చెప్పబడింది భాగవతము సప్తమస్కంధములో నవవిధ భక్తి మార్గాలు నవనవోన్మేషంగా, హృదయంగమంగా వర్ణించబడినై భక్తిని తొమ్మిది విధాలుగా విభజించిన మొదటి గ్రంథము భాగవతమే అందుచేతనే యిది భక్తి సిద్ధాంతానికి పరమ ప్రమాణగ్రంథమైంది

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥
ఇతిపుంసార్పితా విష్ణౌ భక్తి శ్చేన్నవ లక్షణా।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యే ఉధీత ముత్తమమ్॥

1 భగవద్గుణ శ్రవణంచే పరీక్షిత్తు,
2 భగవంతుని కీర్తించుటచే నారదుడు (శుకుడని రామకృష్ణ ప్రభ 4/97=36)
3 నిరంతరనామ స్మరణచే ప్రహ్లాదుడు,
4. పాదసేవచే మహాలక్ష్మీ దేవి,
5. అర్చనచే పృథు చక్రవర్తి,
6. వందనంచే అక్రూరుడు,
7. దాస్యంచే హనుమంతుడు,
8 సఖ్యంచే అర్జునుడు,
9 ఆత్మ సమర్పణం వలన బలి చక్రవర్తి

మొదలగువారు భగవదనుగ్రహానికి పాత్రులైనారు

ఈ తొమ్మిది విధములైన భక్తి సాధనలను విష్ణువునందు ఎవడు ఆచరించునో అతడే చక్కగా చదివినవాడని నా అభిప్రాయము అని ప్రహ్లాదుడనెను.

నవ విధ భక్తి స్వరూపములు

**1.** శ్రవణము : శ్రవణము జ్ఞానము నందించును. ఆత్మానాత్మ వివేక జ్ఞానము నందించును శ్రవణము వలన సద్భావములు పెంపొందును సదాచారమలవడును సన్మార్గము తెలిసి వచ్చును సద్గతి లభించును

"హరికథలు వినెడి వారికి మరణాగతమోహ సంభ్రమము లేదనఘా"
యని భాగవతమునందే గలదు భగవంతుని దివ్య చరిత్రమును, అనంత కల్యాణ గుణములను ఆలకించుట శ్రవణమనబడును.

శ్రవణము చేయుట వలన శౌనకాది ఋషులు నైమిశారణ్యమున జ్ఞానులైరి శ్రవణము వలననే జనక చక్రవర్తికి జ్ఞానము కలిగెను శ్రవణము వలననే పరీక్షిత్తుడు ముక్తిని బొందెను ప్రబోధసమయమునకే అర్హత గల ముముక్షువునకు జ్ఞానము లభించునని శంకరాచార్యులు తెలిపియున్నారు

కథా త్రివేణీ సంగమ దేవభక్త్ ఆణినామ
తేథేంచె ఉత్తమ చరణ రజ వందితాం.
జళతీ దోషాంచె డోంగర శుద్ధ హోతే నారీ నర
గాతీ ఏకతీ సాదరజె పవిత్ర హరికథా!

"కథా శ్రవణము త్రివేణీ సంగమము వలె పవిత్రమైనది దేవుడు, భక్తుడు, భగవన్నామములు ఒక్క చోట చేరుచున్నవి భగవత్కథను, లీలలను వర్ణించుట కుపకరించు ఆ స్థలము పవిత్రమగుచున్నది కారణము ఆ ప్రదేశము మహాత్ముల పాదధూళికి నోచుకొనుచున్నది. కథాశ్రవణము పాప పర్వతములను దహించివేయును జనులందరిని పరిశుద్ధమొనర్చును వక్తను, శ్రోతను పవిత్రము" చేయును అని సంత్ తుకారాం గానం చేసాడు

**2.** కీర్తనము **:** కీర్తనయనగా భగవంతుని వైభవమును గానము చేయుటయని భావము కలియుగములో భగవన్నామ సంకీర్తనమే తరించుటకు ఏకైక తరుణోపాయమని శాస్త్రములు ఘోషిస్తున్నవి మహాత్ములు ప్రవచిస్తున్నారు "కలౌ సంకీర్త్య కేశవమ్" అని విష్ణుపురాణము ప్రవచించినది.

గీత్వాతు మమ నామాని విచరేన్మమ సన్నిధౌ
ఇతి బ్రవీమితే సత్యం - క్రీతోహం తస్య చార్జున।

"అర్జునా!ఎవరయితే నా నామమును గానము చేయుచు, నా సన్నిధానమునందే యుందురో అట్టి వారికి నేను ఋణపడి యున్నాను ఇది సత్యము" అని భగవానుడు ఆదిపురాణమునందు చెప్పియున్నాడు

భజన పరులకేల దండపాణి భయము, మనసా
అజ రుద్ర సురేశుల కాయాస్థాన మొసగు రామ॥భజన॥

యని త్యాగరాజస్వామి మృత్యుంజయుడై కీర్తించారు ఈ నవవిధ భక్తులలో మొదటిదైన శ్రవణమును విషయగ్రహణముగను, రెండవది యగు కీర్తనమును ఆచరణముగను గ్రహించిన ఇంకా సులభగ్రాహ్యమై భాసించును

'భగవద్గుణ శ్రవణ కీర్తనాత్ భగవద్గుణ శ్రవణ కీర్తనాదుల వలన పరమాత్మ ను పొందవచ్చు"నని నారదమహర్షి భక్తి సూత్రములో తెలిపినారు

**3.** స్మరణము : శ్రవణములో భగవల్లీలలు తెలియును. వైభవము అర్థమగును. ఆ తరువాత కీర్తనములో గుణలీలలను గానము చేయుట, సాధనలాచరించుట జరుగును కానీ భగవంతుని సదా మనస్సునందు నిలుపుకొనుటను స్మరణమందురు నిరంతరము పరమాత్మను స్మరించే అలవాటును మనస్సునకు కల్పించాలి. పరమాత్మను స్మరించుచున్న మనస్సు పరమాత్మయందే స్థిరపడి యుండును

'మా మనుస్మరత చిత్తం మయ్యేవ ప్రవిలీయతే'

"నన్ను స్మరించు మనస్సు నాయందే విలీనమై యుండును" అని పరమాత్మ భాగవతమునందు తెలిపెను

"స్మరవారం వారం చేతః స్మర నందకుమారమ్"

"చిత్తమా! మఱల మఱల నందకుమారుని స్మరింపుము"

అని సదాశివ బ్రహ్మేంద్ర స్వాముల వారు కీర్తించియున్నారు

**4.** పాదసేవనము : భగవంతుని పాదపద్మములను సేవించుట నాల్గవ భక్తి క్రమము గుహుని తరింపజేసినది, భరతునికి ముక్తి నొసంగునది, భగవానుని పాదపద్మములే కదా! అవియే అహల్యకు బ్రతుకు నిచ్చిన చరణములు. పాదసేవచే లక్ష్మీదేవి విశుద్ధత నొందెను.

ఈ విశ్వము పరమాత్మయొక్క పాదముగా పురుషసూక్తములో వర్ణించబడినది కనుక జగత్తును జగదీశ్వర స్వరూపముగా నెంచి సేవచేయువారు కూడా ఈ పాదసేవన భక్తి క్రిందికి వస్తారు

**5.** అర్చనము : అర్చనమనగా పూజించుటయని భావము ఆరాధనవల్ల పృథుమహారాజు పరిశుద్ధతనొందెను భగవానుని అనంత స్వరూపమును ధ్యానించలేనివారు భగవానుని ప్రతిమలుగాను, విగ్రహములుగాను భావించి పూజించుచుందురు. ఇదియే అర్చనము. ప్రతి యింటిని దేవాలయముగా మార్చుకొనే పద్ధతి ఈ అర్చనమందు గోచరించును

"పూజాది ష్వనురాగ ఇతి పారాశర్యః"

పూజయందు అనురాగమును కలిగియుండుటయే భక్తియని వ్యాసభగవానుని అభిప్రాయము. నారదమహర్షి భక్తి సూత్రాలలో తెలుపుతాడు. "సకృదపియేన మురారి సమర్చా క్రియతే తస్య యమేన న చర్చా" శ్రీహరినర్చించువారికి యమునితో వాదముండదని. ఆదిశంకరులు భజగోవిందంలో తెలుపుతారు. అర్చన సాధన సోపానములలో మొదటిది పూజలో దేహేంద్రియ మనో బుద్ధులు శీఘ్రముగా నిగ్రహింబడును పూజచేయు సాధకుడు ఒకే మూర్తిని అర్చించవలెను సర్వమూర్తులలో ఆ మూర్తినే దర్శింపవలెను

**6.** వందనము : అర్చనము తర్వాత వందనము చెప్పబడినది భగవద్గీతయందు

కూడా శ్రీకృష్ణపరమాత్మ ఈ క్రమమునే తెలియపరచినాడు "మద్యాజీ మాం నమస్కురు" - "నన్ను అర్చించు నాకు నమస్కరించు" అని భగవానుడు రాజవిద్యారాజగుహ్యా యోగమునందు మరియు మోక్ష సన్యాసయోగము నందు కూడా తెలిపియున్నాడు. "నమ ఇతి ద్వే అక్షరే"

**నమ**' యనునవి రెండక్షరములు '**మ**' యనునది అహంకారము. '**న**' యనగా లేదు యని భావము. **నమః** అనగా అహంకారము లేదు యని అర్థము. అహంకారి భగవద్భక్తుడు కాలేడు ఆలయానికి వెళ్లినా అహంకారి సాష్టాంగ నమస్కారము చేయడు. తలనొక్కదానినే ఊపుతాడు అట్టివాని విషయంలో భగవంతుడు చాలా జాగ్రత్తగా ఆలోచిస్తాడు ఇతడికి పొరపాటున చేతులిచ్చాను ఇతనికి తలనూపేల క్షణమున్నది. కనుక వచ్చే జన్మలో అలాంటి రూపమునే ఇచ్చెద ననుకొనును

నమస్కారము వలన అక్రూరుడు తరించెను విభీషణుడు రామునికి శరణాగతుడై నమస్కరించెను. వందనమెరిగిన వారు ఎప్పుడూ వందనీయులే.

**7.** దాస్యము : దాస్యమనగా పరమాత్మని సేవలయందు మనస్సును లగ్నమొనర్చుట. దాసుడు ధన్యుడు. దాసునికి బాధ్యతలు లేవు బరువులు లేవు దాసుని బరువుల న్నియు దేవుడే భరించును "దంసయతే స్వామి కార్యాణి సావధానే నేతి దాసః" స్వామి సేవలను అవధానముతో చేయువాడు దాసుడు. అందుచేతనే "నేను రాముని దాసుడను" అని ఆంజనేయుడు చెప్పుకొనెను. ప్రతిభక్తుడు భగవంతుని ఎదుట "దాసోహం తవదాసోహం" యని పలుకును దాసత్వము అహంకారమును నిర్మూలించును. కర్తృత్వమును హరించును భోక్తృత్వమును ప్రసాదరూపముగా మార్చును.అశాంతిని కలిగించదు ప్రశాంతతను అందించును. నిత్యతృప్తి, నిరాశ్రయ జీవనము లభించును. భీతిని హరించును కీర్తిని పెంపొందించును - దాసుడు పరమాత్మ చేతిలో పరికరమై, చివరగ ముక్తినొంది తరించును.

**8** సఖ్యము: సఖ్యమనగా స్నేహము సఖ్య భక్తిలో భగవంతునితో భక్తునకు సఖ్యమేర్పడు చున్నది. స్నేహములో స్నేహితుని గుణములు మన కబ్బినట్లు, సఖ్య భక్తిలో పరమాత్మ లక్షణములను భక్తుడు పొందగలుగుచున్నాడు రాధ శ్రీకృష్ణుని గూర్చి చింతించుచూ తానే శ్రీకృష్ణుడని ఒక దశలో భావించింది. ఇది సఖ్య భక్తి యొక్క పూర్ణఫలము

అర్జునుడు, సుగ్రీవుడు, గుహుడు ఇత్యాది మహాత్ములందరు సఖ్య భక్తి ద్వారానే తరించిరి. పరమాత్మ మనతో స్నేహము చేయునా? యనెడి సందేహము కలుగవచ్చును అదియే భగవంతునిలోని సౌశీల్యము ఇచ్చట మన స్నేహమును వృద్ధి నొందించునది మన అర్హత కాదు పరమాత్మ కృప. విశ్వసించి జీవించుటయే వ్యక్తి అర్హతయై యున్నది అసలు సౌశీల్యమనెడి పదమునకు అర్థమును గ్రహించినచో మనము సఖ్యమును అర్థము చేసికొనగలము

'మహతః మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్'
జాతి చేతను, ఐశ్వర్యము చేతను, జ్ఞానము చేతను శ్రేష్ఠుడైనవాడు తక్కువైన వానితో భేదము లేకుండా కలసియుండుటయే సౌశీల్యము

హరిరసమ విహారి సతు సరసోయం మమ శ్రమ సంహారీ॥

"భగవానుడు రసమయుడు. సరసుడు నా శ్రమలను పోగొట్టెడివాడు" అని అన్నమయ్య సంస్కృత కీర్తనలో గానం చేసాడు

**9.** ఆత్మ నివేదనము : సంపూర్ణ శరణాగతియే ఆత్మ నివేదనము ఇట్టి శరణాగతి భక్తిని పుష్టివంతము చేయును ఆత్మ నివేదనాసక్తి గల భక్తుడు భగవంతుని భావములకు అనుకూలముగా జీవించును ప్రతికూలమైన వానిని త్యజించును భగవంతుడు తప్పక రక్షించుననెడి విశ్వాసమును కలిగియుండును. రక్షించేటందులకు అన్యులు లేరని భావించును. ఈ విధముగా తననే సంపూర్ణముగా ఉంచుకొనియుండును ఇదియే పూర్ణశరణాగతి ఇదియే ఆత్మ నివేదనము

'భయంకరమైనది భవసాగరము నీవే నావవై మమ్ము తీరమును జేర్పుము ఓ జగద్గురు శ్రీకృష్ణా! నిరాధారులకు నీవే ఆధారము. నీవే శరణ్యము' అని మీరాబాయి గానంచేసింది

ఈ తొమ్మిది విధములైన భక్తి విషయములను ఎవ్వడు పూర్ణముగా నెరిగి ఆచరించునో వాడే విద్యావంతుడని ప్రహ్లాదుడు తండ్రితో చెప్పెను.

తండ్రీ! విష్ణుభక్తి లేనివాని వ్యర్థ సంసారము గ్రుడ్డివానికి వెన్నెల వంటిది. చెవిటి వానికి శంఖధ్వని వంటిది. మూగవానికి శాస్త్రార్థముల నెరింగించుట లాంటిది బూడిదలో హోమము వంటిది లోభివాని సంపద వంటిది పందికి పన్నీరు వంటిది నాన్నా! నారాయణుని సేవకుపయోగించని దేహైనను వ్యర్థమేనని నా అభిప్రాయము

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
గీ॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరిజేరు మనియెడి తండ్రి తండ్రి

తండ్రీ! విష్ణుదేవుని పూజించునవియే చేతులు శ్రీనాధుని వర్ణించునదియే నాలుక. హరిని దర్శించునవియే కన్నులు. భగవంతునకు మ్రొక్కునదియే మస్తకము భగవత్కథలను శ్రవణము చేయునవియే చెవులు హరియందు నిలిచినదియే మనస్సు భగవంతుని చుట్టు తిరుగునవియే పాదములు పరమాత్మతో ఐక్యమగునదియే బుద్ధి ఆయన ధ్యానము సాగినదియే సుదినము భగవంతుని తెలుపునదియే చదువు. విష్ణువును గూర్చి బోధించువాడే గురువు. శ్రీనాధుని జేరుమని చెప్పువాడే తండ్రి.

పరమాత్మను పొందేందుకే మానవ జన్మ లభించినది దేహేంద్రియ మనో బుద్ధులు పరమాత్మ సేవనము నందే వినియోగపడాలి. భక్తిలేని జీవితము నిరర్థకము. శూన్యము మన జీవితమంతా పరమాత్మతోనే ముడిపడియున్నది. ఆయనకు దూరమైన క్షణాన జీవితమే సమాప్తమగును. ఈ విషయమును గూర్చి మానవుని బుద్ధి ఆలోచించుట లేదు.. మనం భుజిస్తాము. పరమాత్మ దానిని జీర్ణింపచేస్తాడు. భుజించిన తరువాత మనము నిద్రిస్తాము పరమాత్మ మనలను నిద్రలేపుతాడు, ఇవన్నీ మనిషి ఆలోచించడు. కుక్షింభరిత్వమునకే ప్రయత్నించుచుండును. విషయవాసనా లోలుడై చరించుచుండును అట్టి అదృష్టహీనుని మానవుడని పిలువనవసరం లేదనియు, పశు సమానుడేననియు ప్రహ్లాదుడు తండ్రితో చెప్పుచున్నాడు

సీ॥ కంజాక్షునకు గాని కాయంబుకాయమే
 పవన గుంభిత చర్మ భస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
 ఢమ ఢమ ధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
 తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
 తనుకుడ్యజాల రంధ్రములు గాక

ఆ.వె॥ చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగము తోడి పశువు గాక।

పరమాత్మ సేవకు ఉపయోగపడినపుడే చేతులను చేతులుగా, చెవులను చెవులుగా భావించాలని చెప్పిన ప్రహ్లాదకుమారుడు అలా ఉపయోగపడని దేహేంద్రియాల నేమనుచున్నాడో చూచెదము.

తండ్రీ! కమలలోచనుడైన విష్ణుమూర్తికి ఉపకరించని దేహము దేహము కాదు అది గాలినింపిన తోలుతిత్తి శ్రీహరిని కీర్తించని నోరు నోరు కాదు అది శబ్దము

చేయు తోలు వాద్యము శ్రీనాధు నర్చించని చేయి చేయి కాదు అది ఒక కొయ్యతెడ్డు నారాయణుని దర్శింపని నేత్రములు నేత్రములు కావు అవి దేహమనే గోడలో కిటికీల వంటివి పరమాత్మను ధ్యానింపని బ్రతుకు బ్రతుకు కాదు అదొక నీటి బుడగ విష్ణుభక్తి లేని పండితుడు పండితుడు కాడు రెండు పాదములతో చరించు పశువుయే శ్రీమద్భాగవతము సప్తమ స్కంధము - 16 నుండి 21 స్వామి సుందర చైతన్యానంద

# 50. నవరత్నములు

1 మౌక్తికము (ముత్యము), 2. పద్మరాగము, 3 వజ్రము, 4. ప్రవాళము (పగడము), 5. మరకతము, 6. నీలము, 7. గోమేధికము, 8 పుష్యరాగము, 9 వైఢూర్యము (వైదూర్యము) శబ్దరత్నాకరము - 922

# 51. శ్రీరామానుజాచార్యుల వారి ధర్మ సందేశములు

1. వివేకము : తినరాని పదార్థములను తినకుండుట,
2. విమోకము : సమస్తమును వీడి భగవంతునికై తీవ్రముగా ఆరాటపడుట
3. అభ్యాసము : భగవంతునే ఎల్లప్పుడును చింతించుచుండుట.
4. క్రియ : శాస్త్రపఠన, భగవదుపాస, పితృపూజ, భూతసేవయు,
5. కళ్యాణము : అందరి మేలును కోరుట,
6. సత్యము : మనో వాక్కాయములతో ఎల్లప్పుడూ చెడు వర్తనలకు తావీయ కుండుట,
7. ఆర్జవము : ఋజుమార్గగామియై యుండుట (కపటము లేని వర్తనము)
8. అనవసాదనము : సంతత సంతోషము, భగవంతుడు ఉద్ధరించునను ఆశయు,
9. భక్తి : భగవంతుని యందలి అనురక్తియగును శ్రీ భగవత్పూజామాల - 142

# 52. నవరత్నములు ధరించవలసిన రోజులు

స్కాంద పురాణమున హలాస్య మహాత్మ్యమున రత్నధారణ మహిమ చెప్పబడినది 1. ఆదివారమున మాణిక్యమును, 2 సోమవారమున ముత్యమును, 3 మంగళవారమున పగడమును, 4. బుధవారమున మరకతమును, 5. గురువారమున పుష్యరాగమును, 6 శుక్రవారమున వజ్రమును, 7. శనివారమున నీలమును, 8 ఆదివారమున గోమేధికమును, 9 శనివారమున వైఢూర్యమును ధరించవలయునని నిర్ణయము.

అందువలన వజ్రమును రత్నములలో శ్రేష్ఠమైనదానిగా విద్వాంసులు చెప్పుచున్నారు కావున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వారి వారి జాతితో కూడుకున్న వజ్రమును క్రమముగా ధరించవలయును బ్రాహ్మణుడు ఏ జాతి వజ్రమునైననూ ధరించవచ్చును కులస్త్రీలకు మాంగల్యమునందు వజ్రమును వుంచకూడదు. నీలరత్న పరీక్షయందు చింతామణి గ్రంథము యిట్లు చెప్పుచున్నది క్షీరములో నీలరత్నమును

పడవేసిన, ఆ క్షీరము నల్లబడిన యెడల అది ఇంద్రనీలమని రత్నకోవిదులచే చెప్పబడినది.

సువర్ణమును రుద్రాక్షలను ధరించు విధానము ముని భావ బోధిని అను గ్రంథమున యిట్లు చెప్పబడినది అందముగా సువర్ణముతో కూడిన రుద్రాక్షమాలను ఎల్లప్పుడూ ధరించిన అది ముక్తి ప్రదమగును భూతగ్రహము యొక్క ఆపత్తును నివారించును. వాయురోగమును పైత్యరోగమును పోగొట్టును శ్రీమహాభారత సారోద్ధారము ప్రథమభాగం 12

## 53. నవగ్రహములు

1 సూర్యుడు, 2. చంద్రుడు, 3. అంగారకుడు, 4. బుధుడు, 5. గురుడు, 6. శుక్రుడు, 7 శని, 8. రాహువు, 9 కేతువు సూర్యుడు ప్రధాన గోళముగా యీ గోళములన్నియు సూర్యుని చుట్టు తిరుగుచున్నవి భూమి తన చుట్టు తాను తిరుగుచున్నది మరియు సూర్యుని చుట్టు కూడా తిరుగుచున్నది చంద్రుడు భూమి చుట్టు తిరుగుచున్నాడు. పెద్దబాలశిక్ష - 110

## 54. నవగ్రహాల దృష్టి

నవగ్రహాలు కూడా మానవ శరీరంపై విశేష ప్రభావం చూపుతాయి.

| గ్రహం | శరీర భాగం |
|---|---|
| 1. సూర్యగ్రహం | హృదయం, రక్తం, మస్తిష్కం, స్త్రీల ఎడమకన్ను, పురుషుల కుడికన్ను, |
| 2 చంద్రగ్రహం | పురుషుల ఎడమకన్ను, స్త్రీల కుడి కన్ను, స్తనాలు, |
| 3. కుజగ్రహం | ముక్కు, నుదురు, జీర్ణాశయం, |
| 4. బుధగ్రహం | నాడులు, కండరాలు, నాలుక, భుజాలు, ముఖం, కేశాలు, |
| 5 గురుగ్రహం | కుడిచెవి, లివర్, |
| 6 శుక్రగ్రహం | రంగు, ఎడమచెవి, |
| 7 శనిగ్రహం | ఎముకలు, దంతాలు, మోకాళ్ళు, |
| 8. రాహుగ్రహం | మానసిక బలహీనత, నిరాశ, |
| 9. కేతుగ్రహం | చర్మరోగాలు, రాహువు సృష్టించే బాధల్ని బలపరుస్తుంది |

1-8-1997 స్వాతి సపరివారపత్రిక నుంచి 13వ పేజి

## 55. నవబ్రహ్మలు

1. మరీచి, 2. భరద్వాజుడు, 3. అంగీరసుడు, 4. పులస్త్యుడు, 5 పులహుడు, 6. క్రతువు, 7 దక్షుడు, 8. వసిష్ఠుడు, 9. వామదేవుడు. శ్రీశైలప్రభ 9/84=42

## 56. మనస్సు చేయు పాపములు - 9

1 కామము, 2. క్రోధము, 3 లోభము, 4. మోహము, 5 ఓర్వలేమి, 6 ఆశ, 7 ద్వేషము, 8 గర్వము, 9 హేయ విషయములను చింతించుట జ్ఞానామృతము - 39

(మోహము భయంకరమగు అగ్నిజ్వాల వంటిది కామము దీని మహాశక్తియై మానవుని ద్విపాద పశువుగా జేయుచున్నది)

## 57. నవద్వీపములు

1 అంతర్ద్వీపము, 2 సీమంత ద్వీపము, 3 గోద్రుమ ద్వీపము, 4 మధ్యద్వీపము, 5. కోలద్వీపము, 6. జహ్నుద్వీపము, 7 ఋతుద్వీపము, 8 రుద్రద్వీపము, 9 మోదద్రుమ ద్వీపము - పారమార్థిక ప్రదర్శనము - 222

శ్రీమద్భాగవతములో వివరించిన శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనమను నవవిధ భక్తికి యీ నవద్వీపములు ప్రతీకలుగా నున్నవి

## 58. అష్టదిక్పాలకుల స్థల నిర్ణయము

సీ॥ భ్రూమధ్య జంభారి పురముండు మఱియును
నగ్నిహోత్రుని పురం బక్షియందు
దక్షిణ కర్ణమందంతకు పురముండు
దత్పార్శ్వమున యాతుధానపురము
పరగ బృష్ఠమునందు వరుణుని నగరంబు
పవన పురంబు నా పార్శ్వమందు
వామకర్ణమునందు వరకుబేరపురము
హరుని పురము దక్షిణాక్షియందు

తే॥ శిరము నడుమను నుండు సుస్థిరముగాను
కుంఠితముగాన నీదు వైకుంఠ పురము
రమ్యగుణధామ భద్రాద్రిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ

| | | |
|---|---|---|
| భావము : 1 భ్రూమధ్యమున | జంభారిపురము | స్వర్గము |
| 2. ఎడమ కన్నున | అగ్నిహోత్రుని పురము | తేజోవతి |
| 3 కుడిచెవియందు | యముని పురము | నరకలోకము |
| 4. దానిప్రక్కన | యాతుధానపురము | కృష్ణాంగన |

5. పృష్ఠభాగమున (కుడిపిర్ర) — వరుణుని నగరము — శ్రద్ధావతి
6 ఎడమపిర్రయందు — పవనపురము — గంధవతి
7. ఎడమచెవియందు — కుబేరపురము — అలకాపురి
8. కుడికన్నున — హరుని పురము — కైలాసము
9. శిరస్సు మధ్య — వైకుంఠపురము — శ్రీ భద్రాద్రి రామశతకము - 32వ పద్యము

## 59. యోగవిఘ్నములు 9

1 వ్యాధి, 2 స్త్యానము, 3. సంశయము, 4. ప్రమాదము, 5. ఆలస్యము, 6 అవిరతి, 7. భ్రాన్తి దర్శనము, 8 అలబ్ధ భూమికత్వము, 9 అనవస్థిత్వము యను 9 విధములైన యోగవిఘ్నములు ఈశ్వరప్రణిధానము వలన అరికట్టవచ్చును.

శ్రీరామకృష్ణ ప్రభ స్వర్ణోత్సవ సంచిక 7/94=99

## 60. ప్రపంచోత్పత్తి లక్షణము

సీ॥ ఆత్మయందు ననేక మాకాశ ముదయించె
నాకాశమున వాయు వపుడు పుట్టె
ననిలంబువలనను నగ్నిహోత్రము పుట్టె
నగ్నిహోత్రమువల్ల నప్పు పుట్టె
నప్పుల వలన మహావనీస్థలి పుట్టె
నవనియందోషధు లమర బుట్టె
నోషధులందున నొనర నన్నము పుట్టె
నన్నమందును నరులాది సకల

తే॥ జంతుజాలంబు లాయె నీ జగతి యుగము
లాయె నీరీతి బరమాత్మమాయ వలన
రమ్య గుణధామ భద్రాద్రిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ

భావము : 1. ఆత్మయందు అనేకాకాశము పుట్టె, 2 ఆకాశము నుండి వాయువు పుట్టె, 3. వాయువు నుండి అగ్ని పుట్టె, 4. అగ్ని నుండి ఆప్యామము (నీరు) పుట్టె, 5. నీరు నుండి భూమి పుట్టె, 6. భూమి నుండి ఓషధులు పుట్టె, 7. ఓషధుల నుండి అన్నము పుట్టె, 8 అన్నము నుండి నరులు సకల జంతుజాలములు పుట్టె, 9 నీ జగతియుగము లయ్యె పరమాత్మ మాయ వలన

శ్రీ భద్రాద్రి రామశతకము - 7వ పద్యము

# 61. నవరాత్రులు

ఈ నవరాత్రులను దేవీనవరాత్రులని, దసరా అని వ్యవహరింతురు. ఇది తొమ్మిది రోజులు జరుగు పండుగ ఆదిశక్తియైన పార్వతీదేవి తొమ్మిది అవతారములు దాల్చి ఒక్కొక్క యవతారమునందును దుష్ట రాక్షసులను సంహరించి దేవమానవులను రక్షించెనని చెప్పబడియున్నది ఈ పండుగ ప్రతి ఆశ్వయుజ శుక్లపక్ష పాడ్యమి నుండి నవమి వరకును జరుగును దశమినాడు "విజయదశమి" యని పండుగ చేసికొందురు. సృష్టి స్థితి లయాదులను కలిగింప గలిగేది శక్తి ఈ శక్తి ఆదిశక్తి పరాశక్తి పరమేశ్వరి, రాజరాజేశ్వరి, యోగమాయ, విష్ణుమాయ, మహాకాళి, చాముండి, చండిక మొ॥ పేర్లతో నుడువబడుచున్నది జీవ మానవ దేవతాదులు ఈ శక్తి వలననే సుఖ దుఃఖానుభవములను పొందుచున్నారు

దేవీ నవరాత్రులలో పాడ్యమి నుండి ప్రారంభించి కలశ స్థాపనతో దేవీ ఆవాహన గావించి, అలంకార వస్తువులు, మధుపర్కములు సమర్పించి షోడశోపచార పూజలు గావించి జయలక్ష్మిని పూజించెదరు రోజుకొక్క అవతారము వంతున దేవి యొక్క తొమ్మిది అవతారములను పూజ చేయుదురు

సప్తమినాడు సరస్వతిని, అష్టమినాడు దుర్గను పూజింతురు నవమినాడు దేవిని మంగళవాయిద్యాలతో ఊరేగించి జలములో వదలివచ్చెదరు

దేవీ నవరాత్రులలో పిల్లలు అలంకరించుకొని సరస్వతిని పూజించి, పాఠ్యపుస్తకము లకు పూజ చేయుదురు విద్వద్గోష్ఠులు, సంగీత సభలు జరుపబడుచుండును ప్రజలు తాము ఉపయోగించుకొను ఆయుధములను, వాహనములను, వ్రాతపరికరములను పూజ చేయుదురు దశమినాడు జమ్మిచెట్టు (శమీ వృక్షము) వద్ద నీరు పోసి, రంగ వల్లులు వేయించి దానిపై అపరాజితను ఆహ్వానించి జమ్మిచెట్టుతో సహా పూజలు గావింతురు

దేవీ నవరాత్రులలో ప్రజలు జరుపుకొను ఆదిశక్తియొక్క తొమ్మిది అవతారములను గుఱించి దేవీమహత్యమును వివరించు కథలు భాగవత, దేవీభాగవత, శివపురాణ, భారత, మార్కండేయ పురాణములందు కొద్ది కొద్ది మార్పులతో చెప్పబడియున్నవి ఆ తొమ్మిది అవతారములను గుఱించిన కథలను క్రింది వివరముగా తెలిసికొందాము

**1.** మహాకాళి : ఒకప్పుడు కల్పాంతమై చరాచర ప్రపంచమంతయు జలరాశిలో లీనమైపోగా ఆ జలరాశిలో వటపత్రముపై శయనించియున్న విష్ణువుయొక్క నేత్రములను యోగమాయ నిద్రాస్వరూపిణిగా ఆశ్రయించుటవలన విష్ణువు యోగనిద్రలో నుం డెను అప్పుడు విష్ణువు నాభికమలము నుండి బ్రహ్మ జన్మించెను అదే సమయమున విష్ణువుయొక్క కర్ణమలము నుంచి మధుకైటభులను ఇరువురు రాక్షసులు జన్మించిరి. వారు విష్ణునాభికమలము నందున్న బ్రహ్మను పీడించదొడంగిరి. బ్రహ్మ యోగమాయను

ప్రార్థించెను ఆమె విష్ణువు నేత్రముల నుండి తొలగిపోయెను బ్రహ్మ విష్ణువును ప్రార్థించెను విష్ణువు మేల్కొని రాక్షసులతో యుద్ధము చేయదొడగెను. వారు ఎన్నటికిని ఓడిపోక విష్ణువును నొప్పించుచుండిరి అప్పుడు విష్ణువు పరాశక్తిని వేడుకొనెను ఆమె విష్ణువునకు వరము ప్రసాదించి రాక్షసులపై తన మాయను ప్రయోగించెను ఆ రాక్షసులు శక్తి మాయామోహితులై విష్ణువుతో నీ సామర్థ్యమునకు మేము మెచ్చితిమి నీకు కావలసిన వరము కోరుకొమ్మని చెప్పిరి విష్ణువు వారిని మీరు నాచేత హతులగునట్లు వరమిండని కోరెను. వారు జలము లేనిచోట మమ్ము జంపుమనిరి విష్ణువు తన తొడలను పెంచి వారి శిరములను తన తొడలపై నిడుకొని ఖండించి సంహరించెను ఈ మాయాదేవి నల్లనిది పదితలలు పదికాళ్ళు గలది గావున మహాకాళియని పిలువబడెనందురు ఇది ఈమె మొదటి యవతారము

**2.** ఆదిశక్తి : కశ్యపుని భార్యయైన దితి యొక్క పుత్రులందరిని ఇంద్రుడు చంపగా నామె బ్రహ్మను గురించి తపస్సు చేసెను బ్రహ్మ వర ప్రభావముచే ఆమెకు మహిషాసురుడు జన్మించెను వాడు తపస్సుచే శివుని మెప్పించి స్త్రీ చేత తప్ప మరి ఎవ్వరిచేతను మరణము కలుగకుండునట్లు వరమును బొంది రాక్షసరాజై దేవతల నోడించెను దేవతలు బ్రహ్మతో వెళ్ళి శివకేశవులను వేడుకొనిరి వారి తేజస్సు జనించి అది దివ్యసుందరిగా మారెను. ఆదిశక్తియగు ఆదివ్యసుందరికి శివకేశవులు, దేవతలు, తమతమ ఆయుధములను, సింహ వాహనమును నొసంగిరి మహిషుడు చేసిన బాధలను విన్నవించుకొనిరి ఆమె త్రిపుర సుందరి యను పేరుతో హిమాలయ ప్రాంతము నందుండగా నారదుని వలన ఆమె రూపమును విని మహిషుడు అచటకు వెళ్ళి ఆమెను మోహించెను ఆమె యుద్ధములో నన్ను ఓడించినచో నిన్ను వివాహమాడుదునని చెప్పెను మహిషుడు ఆమెతో యుద్ధము చేసెను ఆమె సింహ వాహనయై వచ్చి వానిని శూలముతో పొడిచి చంపెను. ఇది మహాలక్ష్మి స్వరూపమైన ఆది శక్తి యొక్క రెండవ అవతారము

**3.** సరస్వతి : పూర్వము శుంభనిశుంభులను రాక్షస సోదరులు తపస్సుచే బ్రహ్మను మెప్పించి తమకు అయోనిజయైన కన్యచేత తప్ప మరి ఎవ్వరిచేతను మరణము కలుగకూడదని, ఇదే విధమైన మరికొన్ని వరములను పొందినవారై ఇంద్రుని, దేవతలను ఓడించి వారిని అడవులకు పారద్రోలిరి దేవతలు ఆదిశక్తిని ప్రార్థించి సంగతులు తెలుపుకొనిరి ఆమె దేహము నుండి కౌశికియను స్త్రీ వ్యక్తి జనించి దేవతలకు అభయమిచ్చెను తరువాత ఆమె సుందరరూపముగల బాలికయై హిమవత్పర్వత ప్రాంతమున సంచరించుచుండగా శుంభనిశుంభుల సేవకులగు చండముండులనువారు ఆమెను చూచి తమ ప్రభువులైన శుంభనిశుంభులను వివాహమాడుమనిరి. ఆమె నిరాకరింపగా వారామెతో యుద్ధమొనర్చిరి ఆమె వారిని సంహరించి వారి తలలను దేవి వద్దకు గొనిపోయెను దేవి సంతోషించి ఆమెను చాముండి అని బిరుదు నిచ్చెను తరువాత శుంభనిశుంభులు సుగ్రీవుడను దూతను బంపి తమలో నొకనిని వివాహ

మాడునట్లు చెప్పిపంపిరి వానివలన సంగతి విన్న ఆమె యుద్ధములో నన్ను జయింపగలవానిని నేను వివాహమాడుదునని చెప్పి పంపెను వారు కోపము జెందినవారై తమ మేనల్లుడైన రక్తబీజాసురుని ఆమె పైకి యుద్ధము చేయబంపిరి వరప్రభావముగల ఆ రక్తబీజుని శరీరము నుండి యెన్ని రక్తబిందువులు భూమిపై బడునో అంత మంది రాక్షసులు జన్మించుచుండిరి. అది చూచి త్రిపురసుందరియగు ఆదిశక్తి చాముండితో నీవు నాలుకను పెంచి వాని రక్తమును భూమిపై బడనివ్వక త్రాగు చుండుమని చెప్పెను చాముండి తన నాలుకను పెంచెను రక్తబీజుడామె నాలుకపై నిలిచియుద్ధము చేయుచుండెను చాముండి తన నాలుకపై బడిన రక్తమునంతయు త్రాగుచుండెను ఆదిశక్తి వానిని సంహరించెను తరువాత తనపై యుద్ధము చేయవచ్చిన శుంభనిశుంభులను ఆమె శూలముతో పొడిచి చంపెను ఇది సరస్వతీ స్వరూపమైన దేవి యొక్క మూడవ అవతారము

**4.** యోగమాయా : రాక్షసరాజైన కంసుడు తన చెల్లెలైన దేవకికి జన్మించిన బిడ్డలనుండియే తనకు మరణము కలుగునని అశరీరవాణి వలన విన్నవాడై ఆమెను చెఱలోనుంచి బిడ్డ పుట్టిన వెంటనే చంపుచుండెను దేవి యోగమాయరూపమున నందునింట పుత్రికగా అవతరించెను. వసుదేవుడు దేవకికి కృష్ణుడు జన్మించగనే నతనిని నందునింట వదలి శిశురూపధారియైన యోగమాయను తెచ్చి కంసునికి చూపెను కంసుడామెను చంపబోగా ఆమె పైకెగసిపోయి నిన్ను చంపువాడు నందగోకు లమున పెరుగుచున్నాడని నుడివి మాయమయ్యెను. ఇది యోగమాయా స్వరూపమైన దేవియొక్క నాల్గవ అవతారము

**5.** రక్తదంతి : ఆదిశక్తియగు నీమె యొకప్పుడు రక్తదంతాసురుడను రాక్షసుడు తనపై యుద్ధమునకు రాగా అతనిని తన దంతములతో చీల్చి చంపెను అప్పుడామె దంతములు రక్తవర్ణమయ్యెను అందువలన నీమెకు రక్తదంతియను పేరువచ్చెను ఇది దేవియొక్క 5వ అవతారం

**6.** శాకంభరి : ఒకప్పుడు ప్రపంచమున క్షామము సంభవించి ప్రజలు మలమల మాడుచుండిరి వారి ప్రార్థనలపై దేవి క్షామమును కడతేర్చి ప్రజలకు శాకఫలాదుల నొసంగి వారిని రక్షించెను. అందువలన నీమెకు శాకంభరీ యను పేరువచ్చెను ఇది దేవి యొక్క ఆరవ అవతారము

**7.** దుర్గ : దుర్గుడను అసురుడు రురుడను రాక్షసుని కుమారుడు అతడు బ్రహ్మను తపస్సుతో మెప్పించి తనకు పురుషులచే మరణము లేకుండునట్లు వరము పొంది, దేవతలను, మునులను హింసించుచుండెను దేవతల ప్రార్థనపై ఆదిశక్తి కాళరాత్రి మూలమున దుర్గుని తన వద్దకు రప్పించుకొని అతనిని సంహరించి దేవతలను మునులను కాపాడెను అందువలన ఈమెకు దుర్గయని పేరు వచ్చెను ఇది ఆదిశక్తియగు దేవి యొక్క ఏడవ అవతారము

**8.** మాతంగి : మతంగ మహర్షి కుమారుడైన మాతంగమునియు హిమవంతుడును ప్రాణస్నేహితులుగా నుండిరి. ఒకరోజు వారిద్దరు మాటలాడుకొను సందర్భమున హిమవంతుడు తాను పార్వతికి తండ్రినని గర్వముగా చెప్పుకొనెను మాతంగముని హిమవంతుడు పలికిన గర్వపుమాటలకు నొచ్చుకున్న వాడై ఆదిశక్తి స్వరూపమైన శ్యామలాదేవిని తపస్సుచే మెప్పించి ప్రత్యక్షము చేసుకొని ఆమెను తనకు పుత్రికగా జనియింపుమని వేడుకొనెను దేవి అతని యింట పుత్రికగా జన్మించెను అతని ఆనందమునకు అవధులు లేక అల్లారుముద్దుగా పెంచుటచే నామెకు మాతంగి యను పేరు పెట్టెను ఇది దేవి యొక్క 8వ అవతారము

**9.** భ్రమరాంబ : ఒకప్పుడు దారుణాఖ్యుడను రాక్షసుడు మూడు లోకములయందును సంచరించుచు భ్రమరరూపముతో ప్రతివారిని కొరికి హింసించి వారిని చంపుచుండెను అతని బాధల కోర్వలేని త్రిలోకవాసుల ప్రార్థనపై ఆదిశక్తియైన దేవి భ్రమర సహాయముతో ఆ రాక్షసుని సంహరించెను భ్రమర రూపముగల రాక్షసుని భ్రమర సహాయమున చంపినందున నీమెకు భ్రమరాంబయని పేరు వచ్చెను ఇది దేవి యొక్క తొమ్మిదవ యవతారము

ఈ విధముగా నవవిధ అవతారములతో నవకాంతులను వెలిగించి దేవమానవులను రక్షించి, తన లీలావిలాసములను కనపఱచి అన్ని లోకములలోను కీర్తిని బొందిన ఆదిశక్తిని నవరాత్రులలో నవవిధ భక్తులతో పూజలు గావించి ఆమె కృపకు పాత్రులగుచున్నారు శ్రీశైలప్రభ సెప్టెంబర్ 84 = 51 నుండి 57 (1979 నవంబరు సంచిక నుండి)

# 62. ఈ తొమ్మిది దాచుకొనదగినవి

శ్లో|| ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రం మైదునభేషజే|
తపో దానావమానే చ నవ గోప్యాని యత్నతః||

1 ఆయువు, 2 దనము, 3. గృహములోని కలత, 4. మంత్రము, 5 భేషజము, 6 సంబోగము, 7 తపస్సు, 8 దానము, 9 అవమానము ఈ తొమ్మిది ప్రయత్నమున దాచుకొనదగినవి శ్రీశైలప్రభ డిసెంబర్ 85, పేజి 23

# 63. ఈ తొమ్మిది తావులు తప్పిన శోభించరు

శ్లో|| రాజా కుల వధూర్విప్రా మంత్రిణశ్చ పయోధరాః|
స్థానభ్రష్టా న శోభన్తే దంతాః కేశా నఖానరాః||

1. రాజులు, 2 కులస్త్రీలు, 3 బ్రాహ్మణులు, 4 మంత్రులు, 5 స్తనములు, 6 దంతములు, 7 కేశములు, 8. గోళ్లు, 9 మనుష్యులు తమ తమ తావులు తప్పిన శోబింపరు శ్రీశైలప్రభ 1985 డిసెంబర్ 23

## 64. నవధాన్యములు

1. వడ్లు, 2. ఉలవలు, 3. పెసలు, 4 మినుములు, 5 నువ్వులు, 6 గోధుమలు, 7. అనుములు, 8. కందులు, 9 శనగలు

శ్రీశైలప్రభ 1984 అక్టోబరు 53

## 65. సత్పురుషుల స్వరూపము

శ్లో॥ వాంఛాసజ్జన సంగతౌ పరగుణేప్రీతిః గురౌ నమ్రతా,
విద్యాయాం వ్యసనం స్వయోషితరతి ర్లోకాపవాదాద్భయం,
భక్తి శ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలైః,
ఏతే యేషు వసంతి నిర్మల గుణాః తేభ్యో నమస్కుర్మహే

1. సత్పురుషులతోటి సాంగత్యమును కోరుట, 2. ఇతరుల యొక్క ఉత్తమగుణ సంపదకు సంతోషపడుట, 3. గురువుల యెడ వినమ్రభావము, 4 చదువునందు వ్యసనము, 5. ఏకపత్నీ వ్రతము, 6. లోకాపవాదమునకు భయమునొందుట, 7. భగవంతుని యందలి భక్తి, 8. మనస్సును తన వశమునందుంచుకొనుట, 9 దుర్జనులతోటి సహవాసము లేకుండుట. ఇవి సత్పురుషుల యందుండెడి గుణము లని నుడివి ఆ మహనీయుడు, ఇట్టి గుణములు కలవారికి నమస్కరించినాడు.

మహాభారతోపన్యాసములు, 2వ భాగము, 371 పుట

## 66. స్నానములు

1. ఆపోహిష్ఠాది మంత్రములచే ప్రోక్షించుకొనుట మంత్రస్నానమనబడును. 2. కేశవాది నామముల మంత్రములు ధ్యానించుచు నూర్ధ్వపుండ్రములు ధరించుట పార్థివస్నామనబడును 3. సంస్కరింపబడిన విబూది దేహమున కంతయు బూసికొనుట యాగ్నేయ స్నానమగును ఇది జడలు ధరించి శిరస్స్నానము చేయలేని కాపాలికాదులు చేయుదురు 4. సాయంకాలమున నుదయమున నావులిండ్లకు వచ్చునపుడు పోవునపుడు వాని గిట్టల ధూళి గాలికి వచ్చి మీద బడిన వాయవ్యస్నానమగును 5. ఎండకాయునపుడు కురియు వర్షములో దడిసినది దివ్యస్నానము 6.నీళ్ళలో మునుగుట వారుణ స్నానమనబడును. 7. "ఖస్థితం పుండరీకాక్షం" మను మంత్రములతో శ్రీమన్నారాయణుని ధ్యానించుట మానసిక స్నానము. 8. పాదములు మొదలు బొడ్డు వరకు నీళ్ళతో కడిగి తడి వస్త్రముతో తుడుచుకొనుట కాపిల స్నానము శిరస్స్నానము చేయలేనివారు ఆ కంఠస్నానము చేయవచ్చును దానికి శక్తి లేనివారు కాపిల స్నానము చేయవచ్చును తరువాత వారి వారి శక్తికొలది యేదైన చేయవచ్చును ఏది చేసినను జేయకున్నను వారుణ స్నానము చేసినను మానస స్నానము తప్పక చేయవలయును మీద చెప్పబడినవి కాక. 9. పంచాంగ స్నానము అనగా రెండు కాళ్ళు, రెండు చేతులు, ముఖము కడుగుకొనుట బ్రాహ్మస్నానము చేయదగును

శ్రీ వాల్మీకి రామాయణము - అయోధ్యాకాండము 112పుట

## 67. స్త్రీలు బంధములే

1. *నవ్వుచే, 2. ననురాగముచే, 3. భయముచే, 4 పెడమొగము పెట్టుటచే, 5 ప్రాగంటి మాపులచే, 6 చిలిపి చేష్టలచే, 7· నీర్ష్యచే, 8. గలహముచే, 9. విలాసముచే, నే విధముగనైనను స్త్రీలు బంధములే*

శ్రీ వాల్మీకి రామాయణము - అయోధ్యకాండము 175

## 68. నవగ్రహస్తోత్రం

ఆదిత్యం చంద్రభౌమా బుధ గురు భృగు జా న్భానుజం,
రాహు కేతూ నత్వానిత్యం త్రిసంధ్యం, జగదు,
దయలయస్సైర్య సంపత్తి హేతూన్,
ఏతేష్వాసక్తమూర్తిన్ ఖచర సురవరాన్ భక్తితః ప్రార్థయామః.

## 69. చమకము

*" అగ్నిశ్చ మ ఇన్ద్రశ్చ మే సోమశ్చ మ ఇన్ద్రశ్చ మే*
*సవితా చమ ఇన్ద్రశ్చ మే సరస్వతీ చమ ఇన్ద్రశ్చ మే పూషా*
*చమ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చ మ ఇన్ద్రశ్చ మే మిత్రశ్చ*
*మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే త్వష్టా చ మే*
*ఇన్ద్రశ్చ మే ధాతా చమ ఇన్ద్రశ్చమే విష్ణుశ్చ మ ఇన్ద్రశ్చమేఽ*
*శ్వినౌ చమ ఇన్ద్రశ్చమే మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే విశ్వే చ*
*మే దేవా ఇన్ద్రశ్చ మే పృథివీ చమ ఇన్ద్రశ్చ మేఽన్తరిక్షం చ*
*ఇన్ద్రశ్చ మే ద్యౌశ్చమ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చమే*
*మూర్ధా చమ ఇన్ద్రశ్చ మే ప్రజాపతిశ్చమ ఇన్ద్రశ్చ మే "*

*ఇందు అగ్ని మొదలగు వారలు ప్రసిద్ధ దేవతలు. ఇంద్రుడు వీరలయందఱితోను సమానభాగము కలవాడగుట వలన, వీరి యొక్కొక్కరితో గూడ బఠింపబడుచున్నాడు అగ్నిః = అగ్నిదేవుడు, ఇంద్రః = ఇంద్రుడు, సోమః = చంద్రుడు, సవితా = సూర్యుడు, సరస్వతీ = సరస్వతీదేవి, పూషా = పూషయనుదేవత, బృహస్పతి = బృహస్పతియను దేవత, మిత్ర = మిత్రుడు, వరుణః = వరుణుడు, త్వష్టా = విశ్వకర్మ, ధాతా = దేవతా విశేషము, విష్ణుః = విష్ణువు, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, (వీరి పేర్లు 1. నాసత్య, 2. దస్ర) మరుతః = వాయువులు, విశ్వేదేవాః = విశ్వదేవులు అను దేవతలు, పృథివీ = భూమి, అన్తరిక్షమ్ = ఆకాశము, ద్యౌః = స్వర్గము, దిశః = దిక్కులు, మూర్ధా = ఊర్ధ్వదిక్కు, ప్రజాపతియను దేవత, వీరందరు, నాకు అభిముఖులగుదురు గాక*

శ్రీశైలప్రభ 1984 అక్టోబరు సంచిక 10 పుట

తొమ్మిదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 10వ సంఖ్య

**70.** దిశోద శోక్తాః పురుషస్య లోకే,
సహస్ర మాహుర్దశ పూర్ణం శతాని,
దశైవ మాసాన్బి భ్రతి గర్భవత్యో,
దశైరకాదశ దశా దశార్హా

1. ఆగ్నేయము, 2. నైఋతి, 3. వాయవ్యము, 4. ఈశాన్యము, 5. ఉత్తరము, 6. పశ్చిమము, 7. దక్షిణము, 8. తూర్పు, 9 పై దిక్కు, 10. క్రింది దిక్కు అని మొత్తము దిశలు ఈ లోకములో పది గలవు. వక వెయ్యి యందు, నూర్లు పది గలవు. స్త్రీలు గర్భమును పదిమాసములు ధరింతురు

1. రోగి, 2. దరిద్రుడు, 3. శోకార్తుడు, 4. రాజదండితుడు, 5. శరుడు, 6. ఖలుడు, 7. వృత్తిని కోల్పోయినవాడు, 8. ఉన్మత్తుడు, 9. ఈర్ష్యపరాయణుడు, 10. కాముకుడు ఈ పదిమంది నిందాలాపములు చేయు స్వభావము కలవారు

1. గర్భవాస, 2. జన్మ, 3. బాల్య, 4. కౌమార, 5. పౌగండ, 6. కౌశోర, 7. యౌవన, 8. ప్రౌఢ, 9. వార్ధక్య, 10. మృత్యువు. ఇవి మనుష్యుని యొక్క పది అవస్థలు

1. ఉపాధ్యాయుడు, 2. తండ్రి, 3. అన్న, 4. రాజు, 5. మేనమామ, 6. మామ, 7. మాతామహుడు, 8. పితామహుడు, 9. తండ్రియొక్క సోదరుడు, 10. వయస్సులో పెద్దయైన బంధువు యీ పదిమంది పూజనీయ పురుషులు. శ్రీరామకృష్ణ ప్రభ 2/78

## 71. దశావతారములు

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః,
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిదేవచ

1. మత్స్యావతారము, 2. కూర్మావతారము, 3. వరహావతారము, 4. నారసింహావతారము, 5 వామనావతారము, 6. రామావతారము (పరశురామ), 7. రామావతారము (కోదండరామ) , 8. రామావతారము (బలరామ కృష్ణులలో అభేదం), 9. బుద్ధావతారము, 10. కల్క్యావతారము.

ఈ పై చెప్పబడిన మూడు రామావతారములలో 1. పరశురామావతారము జమదగ్ని వంశంలోనూ, 2. శ్రీరామావతారము సూర్యవంశంలోనూ, 3. బలరామకృష్ణావతారము చంద్రవంశంలోనూ ఆవిర్భవించాయి కనుక ఈ రకంగా కూడా రామావతారము సూర్యచంద్రాగ్నులకు కారణమైంది ఇక రామనామము త్రిమూర్తి స్వరూపము "మూడు మూర్తుల జన్మభూమికి మూలదైవము రామ నామము" ర = రుద్ర, అ = బ్రహ్మ, మ = విష్ణు

రుద్ర ఉవాచ

రేఫోగ్ని రహమేవోక్తో విష్ణుః సోమో మ ఉచ్యతే,

ఆవయోర్మధ్యగో బ్రహ్మారవిరాకార ఉచ్యతే. (స్కందయమలం)

స్వయంగా రుద్రుడిలా అన్నాడు. రేఫరూప అగ్నిని నేను, విష్ణు రూపం సోమంగా (చంద్ర) చెప్పుకోబడుతుంది. మా యిద్దరి మధ్య బ్రహ్మ సూర్యాకారుడుగా చెప్పబడుతున్నాడు మూడు మూర్తుల జన్మభూమికి మూలదైవము రామనామము

'ర'కారం అగ్ని బీజాక్షరం

'ఆ' కారం సూర్య బీజాక్షరం

'మ'కారం చంద్ర బీజాక్షరం

ర - ఆ - మ = రామ, అందుకే సోమ సూర్యాగ్నులను మించిన స్వప్రకాశము రా మ నా మ ము

ఛాందోగ్య ఉపనిషత్తు అగ్నిలోని ఎరుపును తేజోరూపంగాను, జలంలోని తెలుపును శుక్లరూపంగాను, పృథ్విలోని నలుపును కృష్ణరూపంగాను వర్ణిస్తుంది ఇవే మూడు గుణాల రంగులు ర = రజస్సు, ఆ = సత్వము, మ = తమస్సు రామ గా మారుతుంది. కనుక మూడు గుణాలకు మూలమైనది రామనామము రాముడే మూడు గుణాల రూపంలో చరాచర సృష్టిని నాట్యమాడిస్తున్నాడు

"పండు వెన్నెల కాంతిగల్గిన బ్రహ్మనాళము రామనామము"

'ర' అగ్నిబీజం సుషుమ్నానాడి - ఇది అప్రకటంగా వుంటుంది అగ్నితత్వ అధిష్టాత పరశురామావతారము కూడా తక్కిన అవతారాలలాగ ప్రకటం కాలేదు 'ఆ' సూర్యబీజం పింగళనాడి దీని అధిష్టాత శ్రీరాముడు. 'మ' చంద్రబీజం ఇడనాడి దీని అధిష్టాత కృష్ణుడు వీరిద్దరూ ప్రకటావతారాలు ఈ రకంగా యోగతత్త్వం కూడా రామనామంలో నిధించింది.

ఆకారేణోచ్యతే విష్ణుః సర్వలోకైక నాయకః,

ఉకారేణో చ్యతే లక్ష్మీః మకారో జీవవాచకః

సర్వలోకైక నాయకుడైన విష్ణువు 'అ'కారంతో చెప్పబడుతున్నాడు. 'ఉ'కారంతో లక్ష్మీ చెప్పబడుతున్నది 'మ'కారం జీవవాచకము అ-ఉ-మ= ఓమ్

శ్రీరామకృష్ణప్రభ అక్టోబరు / 93 పుట 27

అక్రూరుడు దశావతారముల శ్రీకృష్ణపరమాత్మను స్తుతించుట

నమః కారణమత్స్యాయ ప్రలయాబ్ధిచరాయ చ।

హయశీర్షే నమస్తుభ్యం మధుకైటభమృత్యవే॥

ప్రభూ! మీరు వేదములు, ఋషులు, ఓషధులు, సత్యవ్రతులు మున్నగువారిని రక్షించుటకై మత్స్యరూపమును ధరించితిరి. ప్రళయ సముద్రమున స్వచ్ఛందముగ విహరించితిరి అట్టి మీ మత్స్యరూపమునకు నేను నమస్కరించుచున్నాను. మఱియు

మధు, కైటభులను అసురులను సంహరించుటకై మీరు హయగ్రీవ అవతారమును గ్రహించితిరి అట్టి మీరూపమునకు నేను నమస్కరించుచున్నాను.

అకూపారాయ బృహతే నమో మన్దరధారిణే।
క్షిత్యుద్ధారవిహారాయ నమః సూకరమూర్తయే॥

మీరే విశాలమగు కూర్మరూపమును ధరించి మందర పర్వతమును మోసితిరి అట్టి మీకు నమస్కారము మీరే భూమియొక్క ఉద్ధారమను లీలనొనర్చుటకై వరాహ రూపమును స్వీకరించితిరి. అట్టి మీకు నమస్కరించుచున్నాను.

నమస్తే ఉద్భుతసింహాయ సాధులోకభయాపహ।
వామనాయ నమస్తుభ్యం క్రాన్తత్రిభువనాయ చ॥

ప్రహ్లాదుని వంటి సాధుజనుల భయమును తొలగించు ప్రభూ! మీయొక్క ఆ అలౌకికమగు నృసింహరూపమునకు నమస్కరించుచున్నాను మీరు వామనరూపమును గ్రహించి మీపాదములచే ముల్లోకములను కొలిచితిరి అట్టి మీకు నేను నమస్కరించుచున్నాను.

నమోభృగూణాం పతయే దృప్తక్షత్రవనచ్ఛిదే।
నమస్తే రఘువర్యాయ రావణాన్తకరాయ చ॥

ధర్మమును ఉల్లంఘించునట్టి గర్వించిన క్షత్రియులను వనమును ఛేదించుటకై మీరు భృగుపతియగు పరశురామ రూపమును గ్రహించితిరి అట్టి మీ రూపమునకు నమస్కరించుచున్నాను. రావణుని వధించుటకై మీరు రఘువంశమందు రాముని రూపమున అవతారమెత్తితిరి అట్టి మీకు నేను నమస్కరించుచున్నాను

నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయ చ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాం పతయే నమః॥

భక్తులను పాలించుటకొరకై మీరు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధుల రూపమున ప్రత్యక్షమైతిరి అట్టి మీకు మరల మరల నమస్కరించుచున్నాను

నమో బుద్ధాయ శుద్ధాయ దైత్యదానవమోహినే।
మ్లేచ్ఛప్రాయక్షత్రహన్త్రే నమస్తే కల్కిరూపిణే॥

దైత్యులను, దానవులను, మోహింపజేయుటకై మీరు శుద్ధ అహింసామార్గ ప్రవర్తకుడగు బుద్ధుని రూపమును గ్రహించుదురు అట్టి మీకు నమస్కరించుచున్నాను మరియు భూమిపైగల క్షత్రియులు ఎప్పుడు మ్లేచ్ఛప్రాయులగుదురో అపుడు వారిని నశింప జేయుటకై మీరే కల్కి రూపమున అవతరించెదరు. అట్టి మీకు నేను నమస్కరించుచున్నాను

భగవన్ జీవలోకోఽయం మోహితస్తవ మాయయా।
అహం మమేత్య సద్గ్రాహో భ్రామ్యతే కర్మవర్త్మసు ॥

*మహాత్మా! ఈ జీవులందరును మీమాయచే మోహితులై, ఆ మోహమువలన ఇది -నేను, ఇది నాది అను అసత్య దురాగ్రహమందు తగుల్కొని కర్మయొక్క మార్గములందు తిరుగాడుచున్నారు.* భాగవతరత్నాకరము, దశమస్కందము - పుట 652

# 72. అర్జునుని పది నామములు

*పేడి రూపమున నున్న అర్జునుడు ఉత్తరునకు చెప్పుచున్నాడు*

అర్జునః ఫాల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః
భీభత్సు ర్విజయః కృష్ణయః సవ్యసాచీ ధసంజయః

**1.** *అర్జునుడు :* *చతుస్సముద్రములందలి మధ్య భాగము గల భూఖండమునందెక్కడును నా శరీరవర్ణము దుర్లభమగుటచే నాకు అర్జునుడని పేరు వచ్చినది అంతేకాక నేను పుణ్యాకర్మనే చేయుదును గాని పాప కర్మను చేయను. అందువల్ల కూడా అర్జునుడని పేరు*

**2.** *ఫల్గుణుడు :* *పూర్వోత్తర ఫల్గునీ నక్షత్ర మధ్యగతుడై చంద్రుడుండగా నాజననమైనది కావున ఫల్గుణుడను*

**3.** *జిష్ణుడు :* *దేవదానవ సంఘాతము నంతను నేను శాసింపగలను. కావున నా పేరు జిష్ణుడు*

**4.** *కిరీటి :* *నేను కాలకేయాది రాక్షసుల సంహరించునప్పుడు నా తండ్రియగు దేవేంద్రుడు నాకు దివ్యతేజోవిరాజితమగు కిరీటము నిచ్చినాడు. కావున నేను కిరీటినైతిని*

**5.** *శ్వేతవాహనుడు :* *నా గుఱ్ఱములు శ్వేత వర్ణమున విరాజిల్లుటచే నాకు శ్వేతవాహనుడని పేరు వచ్చినది*

**6.** *భీభత్సుడు :* *నేను యుద్ధరంగమునందెప్పుడును దైన్యము నొందక తప్పు తోవల చరింపక సుఖస్వరూపముననే యుద్ధమొనర్తునుగాన భీభత్సుడనని నాకు పేరు*

**7.** *విజయుడు :* *నేను యుద్ధరంగమునకేగుచో ఎట్టి శత్రువులనైన జయింతునే కాని ఎట్టి పోరాటమున నాకు అపజయమనునది లేదు కావున నన్ను విజయుడందురు*

**8.** *కృష్ణుడు :* *నా వర్ణము చూడముచ్చటైై యుండుటచే నా తండ్రి కృష్ణుడని పిలిచినాడు కావున కృష్ణుడను*

**9.** *సవ్యసాచి :* *నేను కుడి ఎడమల తారతమ్యము లేక రెండు చేతులతో యుద్ధ మొనర్తును గాన సవ్యసాచినయితిని*

**10.** *ధనుంజయుడు :* *నేను రాష్ట్రములనన్నిటిని జయించి ధనము నార్జించి ధనుం జయుడనైతిని. అని తనపది నామములకును గల నిర్వచనములను ఉత్తర కుమారునికి*

*అర్జునుడు వివరించాడు జమ్మిచెట్టు వద్ద - ఉత్తరగోగ్రహణమున*
మహాభారతోపన్యాసములు, 2వ భాగము, పుట 334

## 73. గాయత్రీదేవి పది హస్తముల ధరించు ఆయుధములు

*గాయత్రీమాత పది చేతులలోను ఎడమ భాగము అయిదు చేతులలో పై చేతి నుండి క్రిందకు, కుడి భాగము అయిదు చేతులలో క్రింది నుండి పైకి క్రమముగా* 1. *తామరపువ్వు,* 2. *శంఖము,* 3. *తెల్లని కపాలము,* 4. *అంకుశము,* 5 *వరదముద్ర,* 6. *అభయముద్ర,* 7. *కశా = కశీకర్ర,* (*అశ్వాదులను త్రోలుటకు త్రాడుకట్టిన కఱ్ఱ*), 8 *గద,* 9 *చక్రము,* 10 *తామరపువ్వు ఉండును* శ్రీశైలప్రభ జూన్ 84=47

## 74. లక్ష్మీగణపతి పదికరముల ధరించు ఆయుధములు

1 *మాజీఫలము,* 2. *గద,* 3. *చెఱకు విల్లు,* 4. *శంఖము,* 5. *చక్రము,* 6 *ఖడ్గము,* 7 *పాశము,* 8 *ముల్లుతో కూడిన వరిగింజయు,* 9. *తన కుడివైపు దంతాగ్రము,* 10. *సర్వాభీష్టము నొసగు చింతామణియు* శ్రీ. మ భా. సారోద్ధారము, 5వ భా పుట 383

## 75. హనుమంతుడు పది చేతులు ధరించు ఆయుధములు

1. *కత్తి,* 2. *డాలు,* 3. *పుస్తకము,* 4 *అమృత కుంభము,* 5 *దర్భ,* 6 *కొండ,* 7. *నాగలి,* 8. *మంచపు కోడు,* 9 *పాము,* 10. *చెట్టు.*
సుందరకాండ పారాయణ ప్రార్థన శ్లోకములు - 281 పుట

## 76. దశనాడులు - స్థాన నిర్ణయము

సీ ॥ గాంధారి హస్తిని ఘన నాళములు రెండు
నేత్ర ద్వయంబుల నిలిచి యుండు
నమరిన యూర్మిళలను నాళములు రెండు
కర్ణ ద్వయంబుల గలసియుండు
పరజిహ్వ నాడియు వక్త్రంబునందుండు
నాభిని శంఖినీ నాళముండు
కులహాసినీ వాలికూడి రత్నాహ్వాయ
గుదగుహ్యముల యందు గుదిరియుండు

తే॥ కంఠమందున యశ్విని గలిగి యుండు
క్షుధయు దృష్టియునెఱిగించు చుండు నెపుడు
రమ్య గుణధామ భద్రాద్రిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ

1 గాంధారి నాడి, 2 హస్తిని నాడి = నేత్ర ద్వయమునందుండును.
3 ఊర్మిళ నాడి, 4. ఊర్మిళ నాడి = కర్ణద్వయము నందుండును
5 జిహ్వా నాడి = వక్త్రము (నోరు) నందుండును.
6 శంఖినీ నాడి = నాభియందుండును
7. కులహానినీ నాడి = గుదము - (పాయువు, ముడ్డి) } యందుండును
8. వాలికూడి నాడి = గుహ్యము (స్త్రీ పురుషుల గుఱి) } యందుండును
9. రత్నాహ్వాయ నాడి,
10. అశ్విని నాడి = కంఠమునందుండును — శ్రీ భద్రాద్రి రామశతకము -29వ పద్యము

# 77. శుద్ధములు అశుద్ధములు

1 వస్త్రాదులు మూత్ర స్పర్శముచే నశుద్ధములగును
2. పుష్పాదులు జల ప్రోక్షణమున శుద్ధములగును గాని చలిది-యన్నము కానేరదు
3. మూచూచిన పుష్పములశుద్ధములు
4. చండాలాదులు స్పృశించినను నదుల మహాత్మ్యము వలన నా నీరు శుద్ధమే
5 అల్పమగుటచే వీధీజలమశుద్ధము
6 చర్మములకు తైలము వలన శుద్ధియగును
7 అన్నంబున వెండ్రుకలు వచ్చిన తీసివైచి నేయి వైచిన శుద్ధమగును
8 స్నానదాన తపో వయో వీర్య సంస్కార కర్మముల చేతను మదీయ (అనగా శ్రీకృష్ణుని) స్మరణంబునను నాత్మ శుద్ధియగును.
9. ప్రయోగజ్ఞాన మాచార్యుని వలన తెలిసికొనుటయే మంత్రమునకు శుద్ధియగును
10. స్నానము చేయక భుజించుట దోషమైనను రోగిపట్ల గుణమేయగును

శ్రీకృష్ణలీలామృతము - 199

# 78. ఉపవాయువుల లక్షణము

1. నాగుండను ఉపవాయువు - ఉద్గారించు - వెలికిగ్రక్కుట,
2. కూర్ముడు ఉపవాయువు - ఉన్మీలనము - కన్నుతెరచుట,
3. కుకరుండు ఉపవాయువు - తుమ్మించును - తుమ్ములు,
4 దేవదత్తుడు ఉపవాయువు - జృంభణము చేయుట - ఆవులింత,
5 ధనంజయుడు ఉపవాయువు - } మరణ దేహములందు శోభను కలుగు } కాంతి
6. అతిశోభము ఉపవాయువు - } జేయు మరియు అణగజేయును, } కాంతి
7. అంతర్యామి ఉపవాయువు - } వాహనముగ - మోసుకెళ్ళుట,
8. ప్రపంచకుడు ఉపవాయువు - } వాహనముగ - మోసుకెళ్ళుట,
9. వజ్రుండు ఉపవాయువు- కీలు, కీలునందుండును.
10. ముఖ్యుండు ఉపవాయువు - జీలపగిది — శ్రీ భద్రాద్రి రామ శతకము, 17వ పద్యము

# 79. భక్తిలో ఆసక్తులు

**1.** *గుణమహాత్మ్యాసక్తి : నారద మహర్షి, వేదవ్యాసమహర్షి, శుకమహర్షి, యాజ్ఞవల్క్యుడు, కాకభుశుండి, ఆదిశేషుడు, సూతపౌరాణికుడు, శౌనకుడు, శాండిల్యుడు, భీష్ముడు, అర్జునుడు, పృథువు, జనమేజయుడు, ఆధునికులలో తులసీదాసు, పోతన, త్యాగరాజు.*

**2.** *రూపాసక్తి : మిథిలాపురి పౌరులు, గోపికలు, దండకంలోని మునిజనులు, రాధిక, ఆధునికులలో మీరాబాయి, తులసీదాసు, రామదాసు, త్యాగరాజు మొ॥*

**3.** *పూజాసక్తి : శ్రీలక్ష్మీదేవి, పృథుచక్రవర్తి, అంబరీషుడు, భరతుడు, వ్యాసమహర్షి.*

**4.** *స్మరణాసక్తి : ప్రహ్లాదుడు, నారదుడు, ధ్రువుడు, సనకాదులు, శబరి, చైతన్య ప్రభువు, పురందరదాసు మొ॥*

**5.** *దాస్యాసక్తి : హనుమంతుడు, లక్ష్మణస్వామి, అక్రూరుడు, గరుడుడు, శేషుడు, శబరి మొ॥*

**6.** *సఖ్యాసక్తి : అర్జునుడు, ఉద్ధవుడు, సంజయుడు, సుదాముడు (కుచేలుడు) సూరదాసు మొ॥*

**7.** *వాత్సల్యాసక్తి : అదితి కశ్యపసుతపాపృశ్నులు, శతరూపామనువులు, కౌసల్యాదశరథులు, యశోదానందులు, దేవకీ వసుదేవులు,*

**8.** *ఆత్మనివేదనం: బలిచక్రవర్తి, అంబరీషుడు, ఆంజనేయుడు, విభీషణుడు, శిబి చక్రవర్తి*

**9.** *తన్మయాసక్తి : యాజ్ఞవల్క్యుడు, శుకుడు, సనకాది మునిగణం, కౌండిన్యుడు, సుతీక్ష్ణుడు*

**10.** *పరమ విరహావస్థాసక్తి : ఉద్ధవుడు, గోపికలు, అర్జునుడు, రామకృష్ణ పరమహంస*

నారదభక్తి సూత్రము 82, పుట 300

కం హరియను రెండక్షరములు
హరియించును పాతకంబు, అంబుజనాభా
హరి నీనామ మహత్యము
హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా

సప్తగిరి 8/97=35

# 80. మన్మథావస్థలు పది

కం॥ చూచుట తలచుట కోరుట
కాచుట కృశమౌట రుచుల గానమి సిగ్గున్
ద్రోచుట వెఱ్ఱియు మూర్ఛా
ప్రాచుర్యము మరణ మనగ బదియు నవస్థల్

**1.** *చూచుట : చూచుటయనగా ఒంటరిగా స్త్రీ పురుషులు పరస్పర మోహముచే యొకరి చక్కదనమొకరు చూడవలయునను కాంక్ష మొదటి యవస్థ*

**2.** *తలంచుట: తలంచుట యనగా చూచిన తరువాత యా చూచిన విషయమును మాటిమాటికి తలంచి రాత్రింబవళ్ళును దుఃఖమును పొందుట రెండవ యవస్థ*

**3.** *కోరుట : కోరుట యనగా స్త్రీ పురుషులు పరస్పరమును సాంగత్యము చేయవలయునని, అది అనుకూలము కానప్పుడు నిట్టూర్పులుకలుగుట మూడవ యవస్థ*

**4.** *కాచుట : కాచుట యనగా ఒండొరులు స్వరూప స్వభావములను దలంచుకొని రాత్రులయందు నిద్రజెందక యుండుట నాల్గవ యవస్థ*

**5.** *చిక్కుట : చిక్కిపోవుటయనగా ఒకరిపై నొకరు విరహతాపానలజ్వాలచేడస్సి జ్వరము కలిగియుండుట ఐదవ అవస్థ*

**6.** *అరుచి : అరుచి పుట్టుట యనగా విరహతాపజ్వరము వలన భోజన పదార్థములు నోటికింపుగా నుండక దేనిమీదయు నాశలేక యుండుట ఆరవ యవస్థ*

**7.** *సిగ్గువిడుట : సిగ్గువిడుట యనగా తమ్ము నిందించు వారిని గుర్తెఱుంగక సిగ్గును వీడుట యేడవ యవస్థ*

**8.** *చిత్త విభ్రమము : చిత్త విభ్రమము అనగా మనస్సు చలించి మాటలు తొట్రుపాటు నొందుట 8వ అవస్థ.*

**9.** *మూర్ఛ : మూర్ఛయన ప్రేమ యొక్కువయై మనస్సును పట్టి యుండు వాంఛ నెరవేరక పోవుటచే, మనస్సు తమ వశముగాక పరవశత్వము నొంది డీలపడియుండుట 9వ అవస్థ.*

**10.** *ప్రాణము పోవుట : అనగా సంభోగము కలుగక పోవుట వలన స్త్రీ పురుష లిరువురును పదవయవస్థ యందు మరణించుట సంభవించును కావున స్త్రీ పురుషుల యొక్క బ్రతుకు మన్మథాధీనమయి వుండును* కళాశాస్త్రము - త్రయోదశాధ్యాయము

# 81. యమములో పది

అహింసా సత్యమస్తేయం। బ్రహ్మచర్యం దయార్జవం ।
క్షమా ధృతి ర్మితాహారః। శౌచం చేతి యమాదశ॥

1. *అహింస,* 2. *సత్యము,* 3. *అస్తేయము,* 4. *బ్రహ్మచర్యము,* 5. *దయ,* 6. *ఆర్జవము,* 7. *క్షమ,* 8. *ధృతి,* 9 *మితాహారము,* 10. *శౌచము*

శ్రీ శుష్కవేదాంతతమోభాస్కరము - 50

# 82. నియమములో పది

తపస్సంతోషమాస్తిక్యం దాన మీశ్వరపూజనం।
వేదాంతశ్రవణం చైవ। హ్రీర్మతిశ్చ జపోవ్రతం॥

1. *తపస్సు,* 2. *సంతోషము,* 3. *ఆస్తిక్యము,* 4. *దానము,* 5. *ఈశ్వర పూజనము,*

6. *వేదాంతశ్రవణము, 7. లజ్జ, 8. మతి, 9. జపము, 10. వ్రతము అను నీ పదియును నియమమనబడును*
శ్రీ శుష్కవేదాంత తమో భాస్కరము - 50

## 83. దశదానములు

1. *గోదానము, 2. భూదానము, 3 తిలదానము, 4 హిరణ్యదానము, 5. మృతదానము (యాచిత వృత్తి), 6 వస్త్ర దానము, 7 ధాన్య దానము, 8. గుడ దానము, 9. రౌప్యదానము, 10. లవణదానము.*
పెద్ద బాలశిక్ష - 138

పదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 11వ సంఖ్య

**84.** ఏకాదశైకాదశినః పశూనా,
మేకాదశైవాత్ర భవంతి యూపాః,
ఏకాదశప్రాణ భృతాం వికారా,
ఏకాదశోక్తా దివి దేవేషు రుద్రాః.

1. *మాట్లాడుట, 2. గ్రహించుట, 3. విసర్జించుట, 4. మైధునజనిత సుఖమును పొందుట, 5. శబ్ద, 6. స్పర్శ, 7 రూప, 8 రస, 9 గంధములను తెలిసికొనుట, 10 మననము చేయుట, 11. నిధి ధ్యానము - అను పదునొకండు విషయములు జీవునకు గలవు ఈ పదునొకండు విషయములను ప్రకాశింపజేయుటకు 11 ఇంద్రియ ములును (పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు) జీవునకు గలవు*

*యజ్ఞయాగాదులకు యూపములు పదునొకండు*

1. *కామ, 2. క్రోధ, 3. లోభ, 4. మోహ, 5 మద, 6 మత్సర, 7. హర్ష, 8. శోక, 9. రాగ, 10. ద్వేష, 11. అహంకారములనునవి ప్రాణులకు గల 11 వికారములు*
1. *మృగవ్యాధ, 2 సర్ప, 3. నిరృతి, 4. అజైకపాద, 5. అహిర్బుధ్న్య, 6. పినాకి, 7. దహన, 8. ఈశ్వరి, 9. కపాల, 10. స్థాణు, 11. భవ అనువారు ఏకాదశ రుద్రులు.*
శ్రీరామకృష్ణ ప్రభ 2/78

## 85. శాస్త్ర ప్రకారము మనఇంద్రియాలు 11

*కర్మేంద్రియాలు* - 5, *జ్ఞానేంద్రియాలు* 5, *మనసు* 1 = 11

1. వాక్కు (నోరు), 2 పాణి (చేతులు), 3. పాద (పాదములు), 4 పాయు (మలవిసర్జన అంగం), 5 ఉపస్థ (మూత్రవిసర్జన అంగం)

1 శ్రోత్ర (చెవులు ) శబ్ద, 2 త్వక్ (చర్మం ) స్పర్శ, 3 చక్షు (కళ్ళు) రూప, 4 జిహ్వ (నాలుక) రస, 5 ఘ్రాణ (ముక్కు) గంధము

ఈ పంచ జ్ఞానేంద్రియములకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే లక్షణాలున్నాయి

చెవుల చేత శబ్దం వింటాం, చర్మం చేత స్పర్శజ్ఞానం కలుగుతుంది కనుల చేత రూపం తెలుస్తుంది, నాలుక చేత రసము అంటే రుచిని కనుక్కుంటాం. ముక్కు చేత వాసన తెలుసుకుంటాం యీ అయిదు జ్ఞానేంద్రియముల ద్వారా లోకాన్ని అనుభవిస్తున్నాం 11 - మనస్సు

## 86. ఆదిత్య హృదయము

ఆదిత్య స్సవితా ఖగశ్చ తపన స్త్వష్టా రవిర్భాస్కరో
మార్తాండ శ్చ మరీచి మాంస్తిమిర హృద్భాను గ్గ్రహాణాం ప్రభుః
విష్ణుశ్శంభురయం ప్రజాపతి రయం కాలో మరుత్వా నయం
ధ్యాత్వైవం మనుజో్ధ్రువంతు లభేత్ ఉభీష్ట స్య సిద్ధింధ్రుతమ్

బావము : 1. ఆదిత్యుడు, 2 సవిత, 3.ఖగుడు, 4 తపనుడు, 5. త్వష్ట, 6 రవి, 7. భాస్కరుడు, 8 మార్తాండుడు, 9 తిమిరహృత్తు, 10 భానుడు, 11. గ్రహరాట్ అని యీ నామములచే నాదిత్యుని స్తుతించి, యితడే విష్ణువు, యితడే శివుడు ఈయాదిత్యుడే బ్రహ్మ ఈ యాదిత్యుడే ఇంద్రుడు, ఈతడే కాలుడు అని యితనిని సర్వాత్మకునిగా ధ్యానించుచున్న మనుజుడభీష్టసిద్ధిని తప్పకపొందగలడు

అగస్త్యునిచే ఉపదేశింపబడిన యీ ఆదిత్య హృదయమును మూడు మారులు జపించి శ్రీరాముడు రావణ సంహారము చేసెను ఆశ్చర్య రామాయణము - యుద్ధకాండ 383

## 87. మంత్రసిద్ధి

1. మనో నిర్మలత, 2 సంతసము, 3 దుందుభిధ్వని శ్రవణము, 4. గానతాళధ్వనుల శ్రవణము, 5. గంధర్వ దర్శనము, 6. తనతేజము సూర్యతేజముతో సమానమగుట, 7 నిద్రాహారములు క్షణకాలమగుట, 8 జపము మనోహరిత్వము, 9 ఆరోగ్యము, 10. గాంభీర్యము, 11 క్రోధలోభములు లేకుండుట మొదలగు చిహ్నములు గుర్తించి దేవత ప్రసన్నమైనట్లు తనకు మంత్రము సిద్ధించునట్లు తెలిసి జ్ఞానసిద్ధికై జపమందధిక యత్నము చేయవలయును 1983/162

## 88. నరప్రమాణ సూత్రము

సీ॥ నరుడు తొంబదియాఱు నంగుళాలెనిమిది
జేనల పొడవు నాల్గేనా లెళుపు
నిట్లు ముప్పదిమూడుకోట్ల రోమంబులు
వెలయు డెబ్బదిరెండువేల నాళ్ళు
నెముకలఱువదియాఱు నమరు తొంబదిరెండు
కీళ్ళు ముప్పదిమూడుమూళ్ళ ప్రేగు
సేరుగుండెలు నర్ధసేరునుధిరంబు
మణువు నాలుగుశేర్లు మాంసముండు
తే॥ సోల పైత్యంబు శ్లేష్మ మరసోలెడుండు
నీ ప్రకారంబు దేహంబు లెంచిచూడ
రమ్యగుణధామ భద్రాద్రిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ    భద్రాద్రిరామ శతకము 8వ పద్యము

(1.) *నరుడు* 96 *అంగుళముల* 8 *జానల పొడవుండవలెను* (2 ) 33 *కోట్ల రోమంబులు* (*వరుస సం* 259/97 *చూడుడు*) (3 ) 72 *వేల నాళ్ళు*, (4.) 66 *ఎముకలు*, (5 ) 92 *కీళ్ళు*, (6 ) 99 *ప్రేగులు*, (7.) *శేరుగుండెకాయ*, (8.) *అర్ధశేరురుధిరము* (*రక్తము*), (9 ) *మణుగు నాలుగు శేర్లు మాంసము*, (10.) *సోల పైత్యము*, (11 ) *అరసోల శ్లేష్మము యిన్ని కలిగిన మానవుని ఛాతి* 4 *జానల వెడల్పు*    శ్రీ భద్రాది రామశతకము 8వ పద్యము

## 89. నిత్యసాధారణ విధులు

*వేదము ఈ విధులను నియమించినది ఈ సత్కర్మలను తప్పక ఆచరించవలయును*

**1.** *సత్యాన్నప్రమదితవ్యం : పొరపాటుననైన అబద్ధము ఆడవద్దు*

**2.** *ధర్మాన్నప్రమదితవ్యం : అవశ్యముగా ఆచరింపవలసిన దానిని వదలవలదు*

**3.** *కుశలాన్నప్రమదితవ్యం: నీకు క్షేమము కల్గించు ఆత్మరక్షణ కార్యములను వదలవలదు*

**4.** *భూత్యైనప్రమదితవ్యం : నీకు సర్వసంపదలు కల్గించు మంగళ కార్యములను వదలవలదు*

**5.** *స్వాధ్యాయప్రవచనాభ్యాం : స్వాధ్యాయమనగా నిన్ను నీవు తెలుసుకొనుట*

**6.** *నప్రమదితవ్యం : నిత్యము చదువుట, ఇతరులకు బోధించుట మానవలదు*

**7.** *దేవ పితృకార్యాభ్యాంనప్రమదితవ్యం : యాగములు పితృకర్మలు తప్పక ఆచరింపవలెను*

**8.** *మాతృదేవోభవ : తల్లిని దేవునిగా పూజింపుము*
**9.** *పితృదేవోభవ : తండ్రిని దేవునిగా పూజింపుము*
**10.** *ఆచార్యదేవోభవ : విద్యనిచ్చిన గురువుని దేవునిగా పూజింపుము*
**11.** *అతిధి దేవోభవ : నీయింటికి వచ్చిన వానిని దేవునిగా పూజింపుము*

నిత్యపూజా విదానము - 11,12

## 90. బీజాక్షరములు

*భగవంతుని వాచకము వచించునది ప్రణవము ఓంకారము*

1. *ఈం = లక్ష్మీబీజము,* 2 *ఐం = వాగ్బీజము,* 3. *క్లీం = మన్మధ బీజము,* 4 *హ్రీం = శక్తి బీజము,* 5. *రాం = రామమంత్ర బీజము,* 6 *గం = గణపతి బీజము,* 7. *లం = పృథ్వీ బీజము,* 8 *రం = అగ్నిబీజము,* 9. *వం = అమృతబీజము,* 10. *హం = ఆకాశబీజము,* 11. *యం =వాయుబీజము*

*నామోచ్చారణ లేనిది మంత్రము బీజరహితము యంత్రము దేవీమంత్రమునందు దేవనామము లేదు దేవీయంత్రమునందు బీజాక్షరము లేదు* శ్రీ సుందరకాండ శ్రీద్య - 16

పదకొండవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 12వ సంఖ్య

**91.** సంవత్సరం ద్వాదశమాస మాహు,
జగత్యాః పాదో ద్వాదశైవాక్షరాణి,
ద్వాదశాహః ప్రాకృతో యజ్ఞ ఉక్తో,
ద్వాదశాదిత్యా న్కథయంతీహ విప్రాః

*సంవత్సరమునకు మాసములు పండ్రెండు జగతీ ఛందస్సు పాదమునకు అక్షరములు 12, ప్రాకృతయజ్ఞమునకు కాలపరిమితి 12 దినములు*

## ద్వాదశాదిత్యులు

1. *ధాత,* 2. *మిత్ర,* 3. *అర్యమా,* 4. *ఇంద్ర,* 5 *వరుణ,* 6 *అంశ,* 7. *భగ,* 8. *వివస్వాన్,* 9. *పూషా,* 10 *సవితా,* 11. *త్వష్టా,* 12 *విష్ణు అని పన్నెండు ఆదిత్యులని జ్ఞానులు వర్ణింతురు* శ్రీరామకృష్ణప్రభ - ఫిబ్రవరి 78

*భవిష్య పురాణంలో ఆదిత్య హృదయంలో ద్వాదశాదిత్యులు యీ క్రింది క్రమంలో వున్నట్లు ఆదిత్య హృదయ రహస్యంలో యిలా వుంది.*

ఆదిత్యః ప్రథమనామ। ద్వితీయంతు దివాకరః।
తృతీయం భాస్కరః ప్రోక్తః । చతుర్థంతు ప్రభాకరః
పంచమంతు సహస్రాంశుః। షష్టం త్రైలోక్యలోచనః
సప్తమం హరిదశ్వం చ। అష్టమంతు విభావసుః
నవమం దినకరః ప్రోక్తః। దశమం ద్వాదశాత్మకః
ఏకాదశం త్రయీమూర్తిః। ద్వాదశం సూర్యఏవచ॥

*మంత్రం :* ఆదిత్యానా మాదిత్యానాగ్
స్థానేశ్వ తేజసా భాని (అరుణం)

1. *ధాత, ప్రజాపతి,* 2. *మిత్రుడు, లోకమునకెల్ల మైత్రి గరపును.* 3. *అర్యముడు, వాయురూపంలో దేవతలందుండును,* 4. *ఇంద్రుడు; దేవతలకు ప్రభువు,* 5 *పర్జన్యుడు, వర్షించును,* 6 *అంశుమంతుడు ; వాయురూపంలో వుండి మనలను రక్షించును.* 7.*భగుడు; మానవులందుండును,* 8. *వివస్వంతుడు ; అగ్నిరూపంతో జీవులు భుజించే ఆహారమును పచనము చేయును* 9 *పూషుడు; అన్నరూపంలో ప్రజాపోషణ గావించును* 10. *సవితా,* 11. *త్వష్ట ; ఓషధి వనస్పతులలో నుండును,* 12.*విష్ణువు; ధర్మస్థాపనకై అవతరించును. (యీ విష్ణువు వేరు త్రిమూర్తులలో విష్ణువు వేరు)* ఆదిత్యహృదయ రహస్యము

1.*ఓం మిత్రాయ నమః,* 2. *ఓం రవయే నమః,* 3 *ఓం సూర్యాయ నమః,* 4. *ఓం భానవే నమః,* 5. *ఓం ఖగాయ నమః,* 6. *ఓం పూష్ణే నమః,* 7 *ఓం హిరణ్యా గర్భాయ నమః,* 8. *ఓం మరీచియే నమః,* 9. *ఓం ఆదిత్యాయ నమః,* 10 *ఓం సవిత్రే నమః,* 11. *ఓం అర్కాయ నమః,* 12. *ఓం భాస్కరాయ నమః*

పుట 14, శ్రీరామకృష్ణప్రభ, జనవరి /93

ద్వాదశాత్మన్ = పంద్రెండు మూర్తులు గలవాడా!
"ధాతా భగః పూషా మిత్రో ధవరుణోర్యమా,
అర్చిర్వివస్వాన్ త్వష్టా చ సవితా విష్ణురేవ చ"

1. *ఇంద్రుడు,* 2. *ధాత,* 3. *భగుడు,* 4. *పూషుడు,* 5. *మిత్రుడు,* 6 *వరుణుడు,* 7.*అర్యముడు,* 8 *అర్చిసు,* 9. *వివస్వంతుడు,* 10. *త్వష్ట,* 11. *సవిత,* 12. *విష్ణువు అని ద్వాదశాదిత్యులు.* పుట 54 ఆదిత్యహృదయము, ముద్రణ 1962

## చైత్రము మున్నగు మాసములందు సంచరించు ద్వాదశాదిత్యుల క్రమము

*శ్రీమన్నారాయణ స్వరూపుడగు సూర్యుడేక స్వరూపుడేయైనను, కాలదేశ క్రియాదుల భేదము వలన ఋషులనేక క్రమముల నభివర్ణించియున్నారు సూర్యుడు*

1. *చైత్రములో ధాత అనునామమున కృతస్థలి, హేతి, వాసుకి, రధకృత్తు, పులస్త్యుడు తుంబురుడు అను పరిజనులతో కలిసి సంచరించును*

2. వైశాఖమున అర్యముడను పేరు వహించి పులహుడు, ఓజుడు, ప్రహేతి, పుంజకస్థలి, నారదుడు, కంజనీయుడు అను అనుచరులతో కూడి కాలము గడుపుచుండును
3 జ్యేష్ఠమాసమున మిత్రుడను నామమున అత్రి, పౌరుషేయుడు, తక్షకుడు, మేనక, హాహా, రథస్వనుడు అను పరిజనులతో చేరి వర్తించుచుండును
4 ఆషాడమాసమున అరుణుడను పేరుతో వసిష్ఠుడు, రంభ, సహజన్యుడు, హుహువు, శుక్రుడు, చిత్రస్వనుడు అను సహచరులతో కాలము గడుపును
5. శ్రావణమాసమున ఇంద్రుడను నామమున విశ్వావసువు, శ్రోత, ఏలాపుత్రుడు, అంగిరసుడు, ప్రమ్లోద, చర్యుడు అను వారితో కూడ సంచరించును
6. భాద్రపదమున వివస్వంతుడను పేరు కలిగి ఇంద్రసేనుడు, వ్యాఘ్రుడు, ఆసారణుడు, భృగువు, అనుమ్లోచ, శంఖపాలుడు లోనుగాగల పరిజనులతో కూడి కాలము గడుపును
7. ఆశ్వయుజమాసమున త్వష్ట అను నామమున భూమిని రంజింపజేయుచు, ఋచీకతనయుడు, కంబళాశ్వుడు, తిలోత్తమ, బ్రహ్మోపేతుడు, శరజిత్తు, ధృతరాష్ట్రుడు, ఇషంభరుడు అను సభ్యులతో కూడి చరించుచుండును
8. కార్తీక మాసమున విష్ణువని వ్యవహరింపబడి అశ్వతరుడు, సూర్యవర్చసుడు, సత్యజిత్తు, విశ్వామిత్రుడు, మఘాపేతుడు అను పరిజనవర్గముతో కూడి కాలము గడుపును
9 మార్గశిరమున అర్యముడను పేరుతో కాశ్యపుడు, తార్క్ష్యుడు, ఋతుసేనుడు, ఊర్వశి, విద్యుచ్ఛత్రువు, మహాశంఖుడు అను పరిజనులతో కూడి చరించుచుండును
10. పుష్యమాసమున భగుడనుపేరు వహించి స్ఫూర్జుడు, అరిష్టనేమి, ఊర్ణుడు, ఆయువు, కర్కోటకుడు, పూర్వచిత్తి అను సభ్యులతో కూడి చరించుచుండును
11. మాఘమాసమున పూషుడను పేరుతో ధనంజయుడు, వాతుడు, సుషేణుడు, సురుచి, ఘృతాచి, గౌతముడు అను పరిజనముతో కూడి చరించును.
12 ఫాల్గుణమాసమున క్రతువను పేరుతో అర్చసుడు, బరద్వాజుడు, పర్జన్యుడు, సేనజిత్తు, చిశ్వుడు, ఐరావతుడు అను వారితో కలిసి కాలయాపన చేయును

ఇట్లు పంద్రెండు నెలలును అపరిమేయ విభూతితో తేజరిల్లుచు, ఉభయ సంధ్యలయందును తన్నుపాసించు జనుల పాపముల నశింపజేయును శ్రీమహాబాగవతము 310

## 92. ద్వాదశ జ్యోతిర్లింగాలు

1. గుజరాతులోని సోమనాధ దేవాలయము,
2 శ్రీశైల మల్లిఖార్జున లింగము,
3 ఉజ్జయిని (గ్వాలియర్) లోని మహాకాళేశ్వరుడు,
4 నర్మదా తీరమందలి ఓంకారేశ్వరుడు,
5. పారల్యములోని విద్యానాథుడు,

6 ఢాకినిలోని భీమశంకరుడు,
7 రామేశ్వరములోని రామేశ్వరుడు,
8. ద్వారకలోని నాగేశ్వరుడు,
9 కాశీక్షేత్రమందలి విశ్వేశ్వరుడు,
10 గోదావరి తీరమందు (రాజమండ్రి) త్ర్యంబకేశ్వరుడు,
11. హిమాలయములోని కేదారేశ్వరుడు,
12. హరిద్వారము నందు కైటభేశ్వరుడు,
యివియే మన భారతావనిలోని జ్యోతిర్లింగాలు

శ్రీమదుత్తర మహాభారత సారోద్ధారము 5వ భాగం 619

## 93. పండ్రెండవ సంఖ్య యొక్క ప్రాముఖ్యత

1 - 12వ నెలయందు శ్రీరామజననము,
2 - 12వ ఏట విశ్వామిత్రాను గమనము,
3 - 12సంవత్సరములు అయోధ్యావాసము,
4 - 12 ఏళ్ళు వనసంచారము, (యించుమించు 2సం॥లు పంచవటి వాసం)
5 - 12 ఏళ్ళు సీతావాల్మీకాశ్రమ మందుండుట,
యీ చిత్రమేమో తత్వవేత్తలకే ఎరుక పామర ప్రత్యుత్తరము యాదృచ్ఛికము,

వాల్మీకి రామాయణము బాలకాండ - 617పుట

6 వాసుదేవుని మంత్రము. ఓం నమో భగవతే వాసుదేవాయ 12 అక్షరములు గలది
7. పాండవులు 12 ఏళ్ళు అరణ్యావాసం చేసారు,
8 శ్రీమద్భాగవతము 12 స్కంధములు గలది
9. ఆళ్వార్లు 12 మంది
10. భగవద్గీతలోని భక్తియోగం 12వ అధ్యాయము.
11 రాసులు 12
12. సంతానములు 12 విధములు

## 94. సంతానములు 12 విధములు

**1.** స్వయంజాతుడు : ఇతనినే ఔరసడందురు అనగా తనవీర్యమునకై అగ్నిసాక్షికముగా పెండ్లియైన భార్యయందుత్పన్నమైన పుత్రుడు

**2.** ప్రణీతుడు : అనగా ఒక మహనీయుని వరము చేతగాని లేక అతని వీర్యమున గాని తనపత్నియందుత్పన్నమైనవాడు

**3.** పరశ్రీతుడు : తనకు సంతానము నివ్వదగిన వ్యక్తికి ధనము నివ్వగా అతని వలన కలిగినవాడు

**4.** పౌనర్భవుడు : పూర్వమొకడు వివాహము చేసుకొనిన స్త్రీని వేరొకరు గ్రహించినప్పు డామెకు కలిగిన సంతానము.

**5.** కానీనుడు : అనగా నీకిచ్చుకన్యయందు కలుగు సంతానము నాకు పుత్రుడు కాగలడన్న నిర్ణయముతోడనే కన్యక నొకరికి ప్రదానము చేయగా ఆ స్త్రీయందు జనించినవాడు, కన్యాదాతకు కానీనుడు కాగలడు ఈతనినే దౌహిత్రుడందురు ఈతనికి ద్వాముష్యాయణుడని కూడా పేరు.

**6.** కుండకుడు : భార్య వ్యభిచారిణికాగా నీచుని వలన కలుగు సంతానము

**7.** దత్తుడు : మాతాపితరులిద్దరుగాని ఒక్కరుగాని ఉదక పూర్వకముగా నిచ్చుచో అతడు దత్తుడు.

**8.** క్రీతుడు : ద్రవ్యమును గ్రహించి యిచ్చుచోనతడు క్రీతుడు

**9.** కృత్రిముడు : తనమాతా పితరులను వదలివచ్చి నేను నీకు పుత్రుడనుగా నుండునని వచ్చువాడు కృత్రిముడు

**10.** సహోఢుడు : గర్భవతియైయున్న స్త్రీని తెలిసియో తెలియకయో గ్రహించగా పుట్టినవాడు సహోఢుడు.

**11.** జ్ఞాతిరేతుడు : ఏకోదరుడగు సోదరుని పుత్రుడు జ్ఞాతిరేతుడు

**12.** హీనయోనిజాతుడు : నీచజాతియందు కలిగినవాడు హీనయోని జాతుడు.

మహాభారతోపన్యాసములు 1వ భాగం 60

# 95. ద్వాదశరాసులు

యిక్కడ ద్వాదశరాసులు శరీర అవయవాలపై చూపే ప్రభావం గురించి తెలుసుకుందాము

1. మేషరాశి : తల, ముఖము, మస్తిష్కం,
2. వృషభరాశి : మెడ, కంఠం,
3. మిధునరాశి : భుజాలు, చేతులు, కండరాలు, రక్తమాంసాలు,
4. కర్కాటకరాశి : ఛాతీ, ఉదర అంతర భాగములు,
5. సింహరాశి : వెన్నెముక, వీపు, నడుము, హృదయము,
6. కన్యారాశి : లివర్,
7. తులరాశి : చర్మం,
8. వృశ్చికరాశి : జననేంద్రియాలు, జఘనభాగం,
9. ధనూరాశి : నాడులు,
10. మకర రాశి : మోకాళ్ళు, ముంజేతులు,
11. కుంభరాశి : పాదాలు, జీర్ణకోశం,
12. మీనరాశి : అరిపాదాలు

స్వాతి సచిత్ర వారపత్రిక 1-8-1997 పుట 13

## 96. సాధువులు పరమాత్మను పొందవలయునన్న

1. సత్యము, 2 తపస్సు, 3 ఇంద్రియ నిగ్రహము, 4. శాంతి, 5. దానము, 6.ధర్మము, 7 సంతానము, 8. అగ్నులు, 9 నిత్యాగ్నిహోత్రము, 10 యజ్ఞము, 11.యోగానుష్ఠానము, 12 సన్యాసము వీటి సహకారములతో సాధువులు పరమాత్మను తెలిసికొనవలయును అమృతతరంగిణి - 180

## 97. అవధూత 24 మంది గురువుల నుండి నేర్చుకొన్నది

1. భూమి నుండి క్షమాగుణాన్ని, 2 గాలి నుండి సంగరాహిత్యాన్ని (తాను గొనిపోవుచున్న వాసనచే గాలి కళంకితము కాదు) 3 నీటి నుండి పరిశుద్ధతను, 4 అగ్ని నుండి చెడును నాశనం చేయుశక్తిని, 5. సూర్యుని నుండి పరహితానికై జీవించుటను, 6.కొండశిలువ నుండి లోకంపై వైముఖ్యతను, 7. రెక్కల పురుగు నుండి ఆకర్షణకు లోనగు ప్రమాదాన్ని, 8. తేనెటీగ నుండి వీలైన చోట్లన్నింటి నుండి సద్బోధలను ప్రోగుచేయుటంలో గల హితత్వాన్ని, 9. ఏనుగు నుండి కామోద్రేకాన్ని, 10 చేప నుండి జిహ్వా చాపల్యాన్ని జయించవలసిన అవసరాన్ని, 11 వేశ్య నుండి కోర్కెలను జయించవలసిన అగత్యాన్ని, 12. అంతరంగిక జీవితంలో అభివృద్ధి సాధించటానికి, ఏకాంత జీవితంయొక్క ఆవశ్యకతను, ఇత్యాదుల నుండి తాను పాఠాల్ని నేర్చుకొన్నానని అవధూత బదులు చెప్పాడు.

శ్రీమద్భాగవతము -11వ స్కందము, శ్రీరామకృష్ణ ప్రభ 7/95

## 98. శుకుడు పరీక్షిత్తునకు భక్తి మార్గమును తెలుపుట

పూర్వము బ్రహ్మదేవుడు వేదములను ముమ్మారు పరిశీలించి మోక్షమును పొందుటకు భక్తిమార్గము తప్ప వేరొక మార్గము తగినది కాదని నిశ్చయించి నిర్వికారుడై స్థిరమైన మనస్సుతో శ్రీహరిని ఆరాధింపసాగెను సర్వభూతములందును ఆవరించియున్న ఆ భగవంతునే కీర్తింపసాగెను వారి కథలనే ఎల్లప్పుడును వినుచు, తాపత్రయమును విడిచి సర్వము విష్ణుమయమని తలచియున్నవాడే ముక్తిని పొందును. ఓ రాజా 1.విష్ణు కీర్తనములు విననివాని చెవులు కొండల బిలములే కాని చెవులు కావు 2. చక్రాయుధునిపై పద్యములను చదువని వాని జిహ్వా కప్పనాలుక, 3. లక్ష్మీ వల్లభుని చూడని కన్నులు నెమిలి పింఛములోని కన్నులు, 4 కమలాక్షుని పూజింపని చేతులు శవహస్తములు, 5 విష్ణుదేవుని పాదములపై నుండు తులసిని వాసన చూడని ముక్కు పంది ముక్కు, 6 గరుడగమనుని భవనమునకు పోకుండెడి పాదములు చెట్లపాదములు, 7. నారాయణుని నామాక్షరములకు కరగని మనస్సులు కఠినములైన శిలలు, 8 అతని కథలనువిని గగుర్పాటు చెందని శరీరము మొద్దు, 9 విష్ణువునకు మ్రొక్కని వాని తలపైనున్న కిరీటము కట్టెలమోపు, 10 మాధవునకు

*ఉపయోగింపని సంపద అడవిగా చిన వెన్నెల, 11. కైటభారిని సేవింపని వాడు కదలుచున్న శవము, 12. కమల నాభుని పాదములను చూడని వాని బ్రతుకు పొత్తి కాయలోని పురుగు బ్రతుకు.* శ్రీమద్భాగవతము, ద్వితీయస్కంధము 45

# 99. సాధ్యులు

పితరో వసవస్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః

*భావము : సూర్యుని సర్వదేవాత్మకత్వము అంతటితో ఆగలేదు వంశవృద్ధికరులైన పితరులు, ఎల్లప్పుడుండే వసువు లెనిమిది మంది, బ్రహ్మ ముఖము నుండి సృజింపబడి మంత్రమూర్తులైన సాధ్యులు పన్నెండు మంది, ఆధివ్యాధులు పోగొట్టు అశ్వినీ కుమారులు (వీరి పేర్లు నాసత్య, దస్ర)ప్రజలకు ప్రాణము పోయు ప్రజాపతి, ఆ ప్రాణములను హరించేయముడు, భూమిని సస్యశ్యామలము చేసే చంద్రుడు, ఆలోచన లను ఇచ్చు మనువు, గాలి, నిప్పు, ఊపిరి, ఋతువులు, పగలు, రాత్రి, వీటన్నిటికి మూలాధారము సూర్యుడే సూర్యుని సహాయముతోనే యీ పనులన్ని యథావిధిగా సాగుచున్నవి ఇట్లింతవరకు సూర్యభగవానుడు సర్వదేవతా స్వరూపుడైనందున సూర్యమండలాంతర్యామియగు పరబ్రహ్మోపాసనచేతనే సర్వదేవతో పాసనాఫలము సిద్ధించగలదని ఈ స్తోత్రమహత్యము నిరూపింపబడినది*

*సాధ్యుల 12 పేర్లు*

1. *మనువు,* 2. *మంత్రుడు,* 3. *ప్రాణదుడు,* 4 *చేతయానుడు,* 5 *వీర్యవంతుడు,* 6. *విత్తి,* 7. *జయుడు,* 8. *నయుడు,* 9. *హంసుడు,* 10 *నారాయణుడు,* 11. *ప్రభువు,* 12. *విదువు అని వాయుపురాణము తెలిపింది*

ఆదిత్యహృదయరహస్యం - 14

# 100. భక్తుని లక్షణంబుల గూర్చి యొక్కొక్క రొక్కొక్క విధముగా జెప్పిరి

1. *మనస్సును ఏకాగ్రము చేసి స్వస్వదేవాధిష్ఠితములైన జ్ఞానేంద్రియములను శాస్త్ర సిద్ధవ్యాపారానుష్ఠాన పదకర్మేంద్రియములను శుద్ధ సత్త్వమయ భగవన్మూర్తికి నప్ప గించి మనో వృత్తినట్లు స్వభావసిద్ధము చేయవలయును అట్లు చేయుట ఫలాభి సంధిరహితముగా నుండవలయును ఇది భక్తియగును తత్ఫలముగా నిరతిశయానంద రూప భగవదనుభూతి గలుగును ఈ భక్తి అనాది పుణ్యాపుణ్యరూపకర్మ వాసనాకోశమును నశింపజేయును భుజించినయన్నపానాదులను జఠరాగ్నియెట్లు జీర్ణించునో యట్లే యీ భక్తియు పుణ్యపాపంబులను జీర్ణింపజేయును*

2. మద్గుణ శ్రుతిమాత్రేణ మయి సర్వగుణాశ్రయే।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ॥
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతం।
అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే॥ (బాగవతము 3-29-11, 12)

ఎల్లప్రాణుల హృదయమందంతర్యామియైయున్న యా భగవంతుని గుణంబులను విన్నంతనే ఫలాభిసంధిశూన్యముగా భేదదర్శన రహితంబుగ, గంగాజలము సముద్రము వంక బ్రవహించునట్లు భక్తుడు తన భావంబును అవిచ్ఛిన్నంబుగా భగవంతుని వంక బ్రవహింపజేయుట భక్తియగునని కపిల మహర్షి వర్ణించెను

3. మూఢులకు నింద్రియార్థంబులం దెట్టిప్రీతి గలదో యా ప్రీతిని భగవంతునెడ నెఱపుట భక్తియగునని ప్రహ్లాదుడు చెప్పెను (విష్ణుపురాణము)

4. ఒక పాత్ర నుండి మఱియొక పాత్రకు తైలంబును బోయునప్పుడది యెట్లు తెంపులేక ధారారూపంబునబడునో, యట్టి ధారారూపంబుగా మనోవృత్తిని భగవంతుని వంక బ్రవహింపజేయుట పరాభక్తి యని దేవీ భాగవతము

5 ఫలాభిసంధిరహితంబుగా భగవత్ప్రీతి నాలంబనము చేసి యందు భావంబు నేకాగ్రముగా నుంచుట భక్తియగునని నారద పాంచరాత్రము

6 శ్రీశంకరులవారు స్వస్వరూపాను సంధానము' భక్తియని వివేకచూడామణిలోను, 'పశుపతేః పాదారవింద ద్వయంచేతోవృత్తి ముపేత్య తిష్ఠతి సదా సా భక్తిః అని శివానందలహరిలోను వర్ణించిరి

7. 'తత్ర భక్తిర్నామ నిరవధికానంతానవద్య కల్యాణ గుణత్వ జ్ఞానపూర్వకః స్వస్వాత్మాత్మీయ సమస్తవస్తుభ్యోఽనేక గుణాధికోఽంతరాయ సహస్రేణాప్య ప్రతిబద్ధో నిరంతర ప్రేమ ప్రవాహః' అని శ్రీరామానుజాచార్యుల వారు తమ శ్రీభాష్యమందు నుడివిరి (భగవంతుడు నిరవధికానంతానవద్య కల్యాణగుణ సంపన్నుడను జ్ఞానముతో దనయందుగాని తన వారియందుగాని తుదకు సమస్త వస్తుజాతమందుగాని తనకుగల ప్రీతికంటె పెక్కుమడుంగులధికమైన ప్రీతితో నంతరాయంబులు లక్షలకొలది వచ్చినను బట్టువదలక ప్రేమ ప్రవాహంబును నిరంతరంబుగా భగవంతునియెడ బఱపుట భక్తియగును)

8. భగవంతునెడ బరమ ప్రేమయుండుట భక్తియగునని శాండిల్యుడు తన భక్తి మీమాంసయందు వచించెను.

9. భగన్మహిమాను భూతి వలన గలుగు ప్రీతి భక్తియగునని స్వప్నేశ్వరుడు వచించెను.

10. ఆర్ద్రీభూతమైన హృద[illegible]సమందు బింబితమై చలింపకుండునట్టి భగవద్రూపము వంక నిరంత[illegible]హ రూపంబున భావము పఱచుట భక్తియని భక్తి రసాయన గ్రం[illegible]డనెను

11. జ్ఞానకర్మ రూపావరణంబులను దుల్చివైచి యనన్యకాంక్షా రూపంబుగా భగవదనుభూతి నొందుట భక్తియగునని రూపగోస్వామిగారును వచించిరి.

12. భగవత్సాక్షాత్కారము పరాభక్తియనియు, భగవదైక్యము పరజ్ఞానమనియు, భగవద్వియోగభయము పరమభక్తియనియు యామునాచార్యులు పలికిరి. ఈ భక్తిని గూర్చిన యన్యుల భావంబులు మఱికొన్ని రెండవ సూత్రంబున వివరింప బడెను కావున భక్తి లక్షణంబుల గూర్చి నానామతంబులు గలవని గ్రహింపనగును మతభేదంబులెన్నియున్నను సారాంశం ఒక్కటియేయగును.

నారదభక్తి సూత్రములు 15వ సూత్రము, పుట 112

## 101. యజ్ఞములు 12

1 ఇంద్రియములను నిగ్రహమనెడి యగ్నులందు హోమము చేయుచున్నారు. 2. మఱికొందరు యోగులు ఫలాసక్తిచే బ్రహ్మమనెడి యజ్ఞవిధానమైన యగ్నియందు హోమము చేయుచున్నారు. 3. మఱికొందఱెల్ల జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యొక్క శబ్దాది విషయములను ప్రాణాది దశవాయువుల బహిర్గమనాదికములను జ్ఞానముచే ప్రజ్వలింపబడ్డ ఇంద్రియనిగ్రహమనెడి నిప్పునందు హోమము చేసి నశింపచేయు చున్నారు. 4. మఱికొందరు పుణ్య తీర్థములయందు ద్రవ్యదానమనెడి యజ్ఞకర్మ జేయుచున్నారు. 5. కొందఱు శరీరములను గృశింపజేయుట యనుయజ్ఞకర్మ చేయు చున్నారు. 6. ఇంక కొందఱు ప్రాణాయామాదియోగములను యజ్ఞ కర్మ చేయుచున్నారు. 7. కొందఱు వేదపారాయణ వేదార్థ పరిజ్ఞానములను యజ్ఞకర్మ చేయుచున్నారు. 8. మరికొందఱు కఠినమైన నియమములను యజ్ఞకర్మ చేయుచున్నారు. 9. అపానమునందు ప్రాణవ్యాపారమును, 10. ప్రాణమునందు నపాన వ్యాపారమును, 11. మఱికొందరు పూరక, రేచక, కుంభక ప్రాణాయామముల యందు ప్రాణాపాన వాయువుల గతులను లయింపజేయుచున్నారు. 12.మఱికొందఱు మితాహారము గలవారగుచు బ్రాణ వాయువులను వశీకృత వాయువుల యందు లయింపజేయుచున్నారు

ఈ పై జెప్పిన యెల్లయోగ పురుషులు, యజ్ఞకర్మ లెఱిగిన వారు గనుక, తమ పాపములను యజ్ఞకర్మలచే నశింపజేయుచున్నారు భగవద్గీత 4అ. 25 నుండి 30 శ్లోకములు

పంద్రెండవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 13వ సంఖ్య

**102.** త్రయోదశీ తిథిరుక్తా ప్రశస్తా,
త్రయోదశ ద్వీపవతీ మహీ చ,
త్రయోదశా హాని ససార కేశీ,
త్రయోదశాదీ న్యతి చ్ఛందాంసి చాహుః.

తిథులలో ఉత్తమమని పదమూడవతిథి ప్రశస్తికెక్కినది పృధివి పదమూడు ద్వీపములు కలిగియున్నది. కేశియను దానవుడు విష్ణువుతో పదమూడు దినములు యుద్ధము చేసెను. (ఈ విషయము నృశింహ పురాణములో ఇట్లు చెప్పబడి యున్నది.
'యుయుధే విష్ణు నా సార్ధం త్రయోదశ దినాన్య సౌ'
వేదములలోని అతిచ్ఛందస్సు పాదమునకు అక్షరములు పదమూడు)

శ్రీరామకృష్ణ ప్రభ 2/78 సంస్కృత భారతము - అరణ్యపర్వము

## 103. దేవుడు - దేవాలయము

దేవాలయాలంటే దేవతామూర్తిని భద్రపరచుకొనే ఇల్లని సామాన్యుల అర్థం ఆగమశాస్త్రంలో ఈ భావానికి అవకాశం కల్పించబడింది "దేవానామాలయం, యస్మాత్తస్మాద్దేవాలయం విదుః" అని నిర్వచింపబడింది సాకర దేవతకు నిలయం కాబట్టి ఇది దేవాలయం అని పిలువబడింది. శాస్త్రం దేవాలయం పరమపురుష శరీరమని చెప్పింది

1. దేవాలయ పునాదిరాళ్ళు పరమపురుషుని పాదాలు, 2 పై భాగ కట్టడము కాళ్ళు, 3. ఆ పైని కట్టడం అతని గర్భం, 4 గంట అతని జిహ్వ, 5 బాహువులు స్తంభాలు, 6. వాస్తు పురుష మండలంలోని బ్రహ్మస్థానం అతని నాభి, 7. పిండిక (బండికంటి నడిమితూము) అతని హృదయపద్మం, 8 అక్కడ నిలుపబడిన మూర్తి ఆత్మ, 9. అఖండ దీపాలు అతని నేత్రాలు, 10. విగ్రహం అతని ఆత్మ, 11 శుకవాసం అతని నాసిక, 12. అమృత విద్యయే అతని మేధస్సు, 13. ధ్వజమే అతని కేశాలు,

"దేహో దేవాలయః ప్రోక్తో జీవోదేవః సనాతనః"

అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. భగవంతుడు స్థూల, సూక్ష్మ కారణాలనే త్రివిధ రూపాలతో ప్రకాశిస్తున్నాడు

పంచభూతాలతో కూడిన బ్రహ్మాండం అతని స్థూల రూపం మనోమయాదులు సూక్ష్మరూపాలు చిద్రూపం కారణ రూపం శ్రీరామకృష్ణప్రభ డిసెంబరు / 84=480పుట

## 104. కశ్యప ప్రజాపతి భార్యలు 13 మంది

ఓ జనమేజయ మహారాజా! సకల జగత్తు పుట్టుటకు, ఆ బ్రహ్మదేవుడు నిమిత్తకారణు డగును ఆ బ్రహ్మదేవునకు మొట్టమొదట ఆరురు మానసపుత్రులు పుట్టిరి వారి పేర్లు 1. మరీచి, 2 అంగీరసుడు, 3. అత్రియు, 4. పులస్త్యుడును, 5 పులహుడును, 6. క్రతువు అనెడి 6గురును బ్రహ్మదేవునకు మానసపుత్రులగుదురు ఆ యార్గురిలో మరీచికి కశ్యప ప్రజాపతి పుట్టె ఆ కశ్యప ప్రజాపతివలన సకల చరాచర భూతములును పుట్టె అటు పిమ్మట ధరణి దక్షులనెడి స్త్రీ పురుషుల కిద్దరికిని యేబది మంది కూతుండ్రు పుట్టిరి యేబదిమంది కూతుండ్రలో 13 మందిని దక్షుడు కశ్యప ప్రజాపతికిచ్చి వివాహము చేసెను ఆ పదముగ్గురి

పేర్లు 1. అదితి, 2. దితి, 3. దనువు, 4. కాల, 5. అనాయుష, 6. సింహిక, 7 ముని, 8. సురభి, 9. వినత, 10 క్రోధవశ, 11. అనంగ, 12. క్రూర, 13. కద్రువు
శ్రీ మహాభారతము ఆదిపర్వము వచనము

## 105. శ్రీ అంటే 13 అర్థములున్నవి

1. లక్ష్మి, 2 సంపద, 3. ఐశ్వర్యము, 4 త్రివర్గము, 5 వృద్ధి, 6 శోభ, 7. అలంకరణము, 8. కీర్తి, 9. బుద్ధి, 10 సరస్వతి, 11. విషము, 12. ఉపకరణము, 13 మారేడు - పుం- ఒకరాగము
శబ్దరత్నాకరము 1058

పదమూడవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 14వ సంఖ్య

## 106. చతుర్దశేంద్రియములు వాని అధిష్ఠాన దేవతలు

| | | |
|---|---|---|
| 1. శబ్దము | చెవులు | వాయువు |
| 2 స్పర్శ | చర్మము | వాయువు |
| 3. రూపు | కనులు | వరుణుడు |
| 4. రసము | నాలుక | అశ్వినీ కుమారులు |
| 5. గంధము | ముక్కు | వీరి పేర్లు నాసత్యా దస్ర |
| 6 వాక్కు | వచనము | అగ్ని |
| 7. పాణి | కరము (దానము) | ఇంద్రుడు |
| 8. పాద | చరణము (గమనం) | ఉపేంద్రుడు |
| 9. పాయు | గుదము (విసర్జన) | మృత్యువు |
| 10. ఉపస్థ | గుహ్యము (ఆనందం) | చతురాననుడు |
| 11. మనసు | చలించును | చంద్రుడు |
| 12. బుద్ధి | నిశ్చయము | పరమేష్ఠి |
| 13 చిత్తము | చింతించును | జీవుడు |
| 14. అహంకారము | అభిమానము | శివుడు |

శ్రీ భద్రాద్రి రామశతకము, 20, 21వ పద్యములు

## 107. చతుర్దశ మనువులు

1. స్వాయంభువమనువు, 2. స్వారోచిషమనువు, 3. ఉత్తమమనువు, 4. తామస మనువు, 5. రైవత మనువు, 6 చాక్షుష మనువు, 7 వైవస్వత మనువు, 8 సూర్య సావర్ణిక మనువు, 9 దక్ష సావర్ణిక మనువు, 10 బ్రహ్మ సావర్ణిక మనువు,

11 రుద్ర సావర్ణిక మనువు, 12 ధర్మ సావర్ణిక మనువు. 13 దేవ సావర్ణిక
14. భౌచ్య మనువు పెద్దబాలశిక్ష 139

# 108. చతుర్దశ విద్యలు

1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3 సామవేదము, 4 అధర్వణవేదము, 5 శిక్ష, 6 వ్యాకరణము, 7. ఛందస్సు, 8. నిరుక్తము, 9 జ్యోతిషము, 10. కల్పము, 11. మీమాంస శాస్త్రము, 12. న్యాయశాస్త్రము, 13 పురాణము, 14 ధర్మశాస్త్రము
పెద్దబాలశిక్ష 139

# 109. చతుర్దశ లోకములు వాని స్థానములు

## అధోలోకములు

1. అతలలోకము : దేహమునందు గల పాదముయొక్క అధోదేశము నందున్నది
2 వితలలోకము . పాదములయొక్క సంధి అనగా గుల్ఫలు (చీలమండలు) ఆ స్థానమందున్నది
3 సుతలలోకము : చీలమండకు పైభాగమగు జంఘ (కాలిపిక్క) ప్రదేశ మందున్నది.
4 మహాతలలోకము: జంఘ ప్రదేశమునకు, పై భాగమగు జాను (మోకాలు) నందున్నది
5. రసాతలలోకము . ఊరువు (తొడ) ప్రదేశమందున్నది.
6. తలాతలలోకము : కటి (మొల) ప్రదేశమందున్నది
7 పాతాళలోకము : నాభియొక్క అధోభాగ ప్రదేశమందున్నది

## ఊర్ధ్వలోకములు

8. భూలోకము · నాభి ప్రదేశమందున్నది
9. భువర్లోకము . కుక్షి (ఉదరము)ప్రదేశమందున్నది
10. సువర్లోకము · హృదయమందున్నది
11. మహర్లోకము హృదయమునకు పై భాగమునందున్నది
12. జనర్లోకము · కంఠస్థానమందున్నది.
13. తపోలోకము : భ్రూమధ్య (కనుబొమల మధ్య, భ్రుకుటీ)స్థానమందున్నది
14. సత్యలోకము : మూర్ధ్ని (శిరస్సు) యొక్క ఊర్ధ్వ భాగమగు సహస్రార కమలము నందున్నది

ఈ పదునాలు లోకములు దేహమునందే నిమిడి యున్నవి మానవదేహము కంటె మహత్తరమైన వస్తువేదియు లేదు శ్రీ భద్రాద్రి రామ శతకము 31వ పద్యము

14వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 15వ సంఖ్య

## 110. పంచదశీయంత్రము

*నామోచ్చారణ లేనిది మంత్రము బీజరహితము యంత్రము దేవీ మంత్రమునందు దేవీ నామము లేదు దేవీ యంత్రమునందు బీజాక్షరము లేదు. జగన్మాత అఖిల బ్రహ్మాండ జనని, పంచదశ షోడశి మంత్రముల ద్వారా నిఖిల జనసేవ్యయై ధర్మార్థకామమోక్షముల నొసగుచున్నది పంచదశీ యంత్రము 15 బీజములు గలది ఆదిలక్ష్మీ బీజముతో చేరి షోడశి యగుచున్నది. ఈ మంత్రము సోమ సూర్యా నలాత్మకమై మూడు ఖండములుగ నున్నది. పంచదశ బీజములు, పంచదశ నిత్యలు, ప్రతి పదాదులు, 15 తిథులు, అవి 15 చంద్రకళలు 15 బీజాక్షరములు గలది. శ్రీవిద్య 16వది సాదాఖ్యాకల ఇదిషోడశీకల ఇది శాశ్వతకల. సుందరీ దేవతమంత్రమును శ్రీవిద్యయందురు శ్రీవిద్యయనగా తరింపజేయు ఉత్తమ జ్ఞానము*
"శ్రీవిద్యాజ్ఞానమాత్రేణ సర్వసిద్ధిః ప్రజాయతే"

*శ్రీవిద్యా మహత్త్వము*
*"ఐం క్లీం సౌః" ఈ మంత్రముచే బాలను ధ్యానింపవలయును*
*ఐం = 5 అక్షరములు, క్లీం = 6 అక్షరములు,*
*సౌః = 4 అక్షరములు, మొత్తము 15 అక్షరములు*
*పంచదశీ*

శ్రీసుందరకాండ శ్రీ విద్య

## 111. పదునైదు నేత్రములు

శ్రీమద్భూసుత శోక నాశనకరం శ్రీ ఆంజనేయం సదా
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా।
అక్షఘ్నం ఘనశత్రు చాప దమనం శ్రీ రుద్రరూపం విభుం
శత్రుఘ్నం తరుణార్క కాన్తి వదనం శ్రీరామదూతం భజే॥

*భావము : సీతాదేవియొక్క శోకమును నశింపజేసినవారును, నానాలంకారయుక్తులును పంచముఖములు కలవారు కాబట్టి ఒక్కొక్క ముఖమునకు జ్ఞాననేత్రముతో సహా మూడు నేత్రములు కావున మొత్తము ( 5 x 3) పదునైదు నేత్రములు కలవారు పదునైదు నేత్రములు కలవారును, దేదీప్యమానమగు కాంతితో గూడినవారును, రావణుని కుమారుడగు అక్షుని సంహరించినవారును, శత్రువులను అణచినవారును, భయంకర రూపము గలవారును, ప్రభువును, శత్రువులను సంహరించువారును, బాలసూర్యునివలె ప్రకాశమానమగు ముఖము కలవారును, శ్రీరామ దూతయునగు ఆంజనేయునకు సదా నమస్కరించుచున్నాను*

రామాయణ రత్నాకరము - 22

పదునైదవ సంఖ్య వివరణ సంపూర్ణము
ఓం

# 16వ సంఖ్య

## 112. వినాయకుని పదహారు నామములు

సుముఖశ్చైక దన్తశ్చ కపిలో గజకర్ణకః,
లమ్బోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః,
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచన్ద్రో గజాననః,
వక్రతుణ్డ శ్శూర్పకర్ణో హేరమ్బ స్స్కన్ద పూర్వజః,
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణు యాదపి
విద్యారమ్భే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా,
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే.

1. *చూడముచ్చటైన ముఖం,* 2. *ఒకే దంతం,* 3. *కపిల రంగు,* 4. *ఏనుగు చెవులవంటి పెద్ద చెవులున్న,* 5. *పెద్ద బొజ్జ,* 6. *వికటుడు,* 7 *విఘ్నాలకు రాజు,* 8. *సేనాధిపతి,* 9. *అగ్నిలాంటివాడు,* 10. *గణాధ్యక్షుడు,* 11 *ఫాలభాగాన చంద్రుడు కలవాడు,* 12. *గజవదనుడు,* 13. *వంగిన తొండం,* 14 *చాటల వంటి చెవులున్న వాడు,* 15 *హేరంభుడు,* 16. *కుమారస్వామి కంటె ముందు పుట్టినవాడు*

*విద్యారంభం, వివాహం, గృహం ప్రవేశించేటప్పుడు, బయటికి వెళ్ళేటప్పుడు, సంగ్రామంలోను అన్ని కార్యాలలోను ఈ పదహారు వినాయక నామాల్ని పఠించిన వారికి, విన్న వారికి ఏ విధమైన విఘ్నాలు కలుగవు* శ్రీరామకృష్ణ ప్రభ 8/98=3

## 113. షోడశ మహారాజులు

1 *గయుడు,* 2 *అంబరీషుడు,* 3. *శశిబిందువు,* 4. *అనంగుడు,* 5 *పృధువు,* 6. *మరుత్తు,* 7. *భరతుడు,* 8. *సుహోత్రుడు,* 9. *శ్రీరాముడు,* 10. *పరశురాముడు,* 11. *దిలీపుడు,* 12. *నృగుడు,* 13 *రంతిదేవుడు,* 14. *యయాతి,* 15 *మాంధాత,* 16. *భగీరథుడు.* పెద్దబాలశిక్ష 105

## 114. కలియుగమున 16 నామములు

హరే రామ హరే రామ రామ రామ హరే హరే,
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.

*అనెడు 16 నామములును కలిపి సంకీర్తన చేసిన కలిదోషమును నశింపజేయును. కలిదోషమును బోగొట్టు నుపాయము వేరొండు సర్వవేదములయందును కనబడుట లేదు.*

"నామ సంకీర్తనం యస్య సర్వ పాప ప్రణాశనమ్"
*నామ సంకీర్తనము అన్ని పాపములను హరించును*
'యజ్ఞానాం జప యజ్ఞోస్మి'
*నామస్మరణమనబడు జపమును ఉత్తమమైనదని సూచించాడు శ్రీకృష్ణపరమాత్మ*

## 115. శ్రీకృష్ణుడు 16 వేల మందిని వివాహమాడెనా?

*ఇది యొక విమర్శ ఏ ప్రమాణంలో తీసుకున్నా యీ సంఖ్య ఆశ్చర్యం గొల్పుతుంది 'అష్టమహిష'లలో రుక్మిణి, సత్యభామలు ముఖ్యమైనవారు నరకాసురుని చెరనుండి విడిపింపబడిన కన్యలు* 16 *వేల మంది తమ బంధువుల వలన నిరాకరింపబడుట వలన వీరికి కృష్ణుడు ఆశ్రయమిచ్చాడు అలా చేయటానికి విధి హితమైన వివాహం అవసరం ఆ కాలంలో రాజుల రాజకుమారుల మధ్య బహు భార్యాత్వం సామాన్యమైయుంది ఇక్కడ గమనించవలసిన ముఖ్యవిషయముంది దేవ ఋషియైన నారదుడు ఒకసారి విషయాన్ని తెలుసుకోవాలని ఆతురతతో, కృష్ణుని పత్నులందరి గృహాలకి వెళ్ళి, అయిళ్ళన్నింటిలోనూ కృష్ణుడు వున్నట్లు కనుగొన్నాడు* (*భాగవతము* 10-69)

*కొన్నిచోట్ల దీనిలోని నిగూఢ రహస్యం చెప్పబడింది నిజంగా* 16000 *అనగా పదునాఱు మాత్రమే సున్నలు కవుల కల్పనలు* - 16 *అనునది మానవ వ్యక్తిత్వంలోని భాగాలుగా (కళలు) వీనిలో జీవాత్మ కూడా చేరివుంది ఆ పదునాఱు కళలు జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలైదు, పంచప్రాణాలు, మనస్సు ఈ పదునాఱుకళలకు జీవాత్మ ప్రభువు. ఉపమాలంకారంలో యీ కళలు భార్యలుగా సూచించ బడ్డాయి చివరి విభజనలో (అద్వైత వేదాంతం ప్రకారం) జీవాత్మ, పరమాత్మలు పరమాత్మయైన కృష్ణుడు* 16(000) *భార్యలు కలవాడుగా వర్ణింపబడ్డాడు*

శ్రీరామకృష్ణ ప్రభ 4/95-31

*శ్రీకృష్ణుడు పదహారు వేల మంది స్త్రీలను వివాహమాడెనా?*

*ఇదే విషయాన్ని గురించి గౌడీయ మఠం వారి భాగవతం అవతరణికలో* 11*వ పేజీలో యిలా వుంది*

*శ్రీకృష్ణుడు మొత్తము పదునాఱువేల స్త్రీలను వివాహమాడుట అను ఘట్టముల వలన భగవంతుని వలన భూమికి పుట్టిన భౌముడు (నరకాసురుడు) తెచ్చిన పదునాఱువేలమంది స్త్రీలు చైతన్యవంతమైన శరీరములోని దశేంద్రియములు, మనస్సు, పంచతన్మాత్రలు అను నీ పదునాఱుశక్తులు పదునాఱు స్త్రీలనియు, ఇవి వేలకొలది సంఖ్యలో గలవనియు, రుక్మిణీ సత్యభామ 'మున్నగు మహిషులు మహాభావ స్వరూపిణియగు శ్రీరాధా దేవి [illegible] భావములనియు మరియు భూమిక* 21*వ పేజీలో యిలా వుంది*

ఒక అధ్యాయములో శ్రీకృష్ణుడు పదునారువేలమందియువతులను పరిణయమాడె ననువిషయము చెప్పబడినది భౌమాసురుడు పదునారువేలమందికన్యకలను బంధించి యుంచెను ఈ పదునారువేలమంది కన్యకలు వేదములలోని ఋక్కులు వేదములో మూడుకాండలు, లక్షమంత్రములు గలవు

1. కర్మకాండ : దీనిలో ఎనుబదివేలమంత్రము లున్నవి. ఇవి బ్రహ్మచారికొరకు నిర్దేశించబడినవి

2. ఉపాసనాకాండ : దీనిలో పదునారువేల మంత్రములున్నవి ఇవి గృహస్థునకు సంబంధించినవి

3. జ్ఞానకాండ : దీనిలో నాలుగువేలమంత్రములు కలవు ఇవి వానప్రస్థులకు సంబంధించినవి

వేదాంతము విరక్తులకుగాని విలాసులకుగాదు విలాసులు ఉపనిషత్తులలోని తత్త్వజ్ఞానము నెఱుంగజాలరు భాగవతము సర్వులకు సంబంధించిన గ్రంథము.

వేదములు ఈశ్వరునిస్వరూపమును ఎక్కువగనే వర్ణించినవిగాని ఆయనను పొందలేకపోయినవి అందువలన వేదమంత్రములు (ఋక్కులు) కన్యారూపమును ధరించి శ్రీకృష్ణుని పరిణయమాడవచ్చినవి వేదమంత్రములు కేవలము స్తుతిరూపములు కావు ప్రతిమంత్రమునకు ఋషి, దేవత ఛందస్సు వేరువేరు దేవతలు తపస్సు చేసి [illegible] భగవత్సంబంధమును పొందలేకపోయినవి అందువలన ఆ [illegible] కన్యకారూపములను ధరించి [illegible] గృహస్థాశ్రమ ధర్మమైన [illegible] వేదమంత్రములు పదునారువేలు కలవు అవియే శ్రీకృష్ణుని పదునారువేలమంది భార్యలుగా చెప్పబడెను

ఈమంత్రములను భౌమాసురుడు కారాగృహమున బంధించినాడు భౌమశబ్దమునకు [illegible] కారాగారము [illegible] భౌమాసురుడు [illegible] జీవుడే భౌమాసురుడు వాడు ఈ రాజకన్యలను బంధించినాడు అనగా తాను విలాసియు, కాముకుడు నగువ్యక్తి మంత్రములకు అనర్థమును కలిగించినాడు కాముకుడగు వ్యక్తి మంత్రములకు తనవిలాసవంతమైన దృష్టికి పుష్టిని కలుగజేయుటకు విపరీతార్థములను జెప్పును అట్టివాడు మంత్రములను దురుపయోగముచేయును వేదతాత్పర్యము భోగములయందుకాక త్యాగమునందే యున్నది అది నివృత్తికరమైనది

అదో ముహూర్త ఏకస్మిన్ నానాగారేషు తాః స్త్రియః।
యథోపయేమే భగవాన్ తావద్రూపధరోఽవ్యయః ॥

అనంతరము అవ్యయుడగు భగవానుడు పదునారువేల మూర్తులుగ వెల్లడియై యొకేసమయమున విభిన్నగృహములయందు అరమణమణులను వివాహమాడెను

చ॥ అమితవిహారు డీశ్వరుడనంతుడు దా నొకనాడు మంచి ల
గ్నమున బదాఱువేలభవనంబులలోన ఒదాఱువేలరూ
పముల బదారు వేలన్రుపబాలల బ్రీతి బదాఱువేలచం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా,
(10 ఉ భా 219)
గృహేషు తాసామనపాయ్యతర్క్య కృత్
నిర స్తసామ్యాతిశయేష్వస్థితః।
రేమే రమాభిర్నిజకామసంప్లుతో
యథేతరో గార్హకమేధికాంశ్చరన్॥

*అచింత్యచరితుడగు శ్రీకృష్ణు డారమణీమణుల యొక్క యెక్కువ తక్కువలు లేని మందిరములయందు సుస్థిరముగ నుండి స్వానందపరిపూర్ణుడై లక్ష్మీదేవి యంశలగు ఆ వనితలతో ప్రాకృతజనులవలె గృహస్థ ధర్మముల నాచరించుచు విహరింపసాగెను.*

మరియు వరుస నంబరు 259/96 చూడుడు బాగవతము 10-59-42, 43

# 116. షోడశోపచార పూజ

ఆవాహనాసనం పాద్య మర్ఘ్య మాచమ నీయకం।
స్నానం వస్త్రం యజ్ఞ సూత్రం గంధమాభరణాని చ ।
పుష్పం ధూపం, చ దీపం చ నైవేద్యం చర్వణార్తిక
మంత్రపుష్పం నమస్కార ముపచారాణి షోడశ॥

*ఇష్టదేవతా విగ్రహమునకు*

1. *ఆవాహనము*, 2. *ఆసనము*, 3. *పాద్యము*, 4. *అర్ఘ్యము*, 5. *ఆచమనీయము*, 6. *స్నానము (అభిషేకము)*, 7. *వస్త్రము*, 8. *యజ్ఞోపవీతము*, 9. *గంధము*, 10. *పుష్పము*, 11. *ధూపము*, 12 *దీపము*, 13. *నైవేద్యము*, 14. *తాంబూలము*, 15. *మంత్రపుష్పము*, 16. *నమస్కారము*,
*మొదలగు షోడశోపచారములచే పూజించవలయును*

శ్రీమదుత్తర మహాబారత సారోద్ధారము, 4వ బాగము, 573

# 117. దక్ష ప్రజాపతి సంతతి

*దక్షప్రజాపతికిని ప్రసూతికిని పదునాఱుగురు పుత్రికలు కలిగిరి వారిలో* 1 *శ్రద్ధ*, 2. *మైత్రి*, 3 *దయ*, 4 *శాంతి*, 5. *తుష్టి*, 6. *పుష్టి*, 7 *ప్రియ*, 8. *సన్నుతి*, 9. *బుద్ధి*, 10 *మేధ*, 11. *తితిక్ష*, 12. *హ్రీ*, 13 *మూర్తి అను పేరులు గల పదముగ్గురను ధర్మరాజు వివాహమాడెను* 14. *ఒక కన్యను అగ్నియు*, 15. *యింకొక కన్యను పితృదేవతలు*, 16 *మిగిలిన కన్యను జనన మరణాది నివర్తకుడగు శివుడును వివాహమాడిరి*

ధర్ముని భార్యలలో శ్రద్ధ వలన శుభము, మైత్రివలన ప్రసాదము, దయవలన అభయము, శాంతివలన సుఖము, తుష్టి వలన ముదము, పుష్టి వలన స్మయము, ప్రియ వలన యోగము, సన్నుతి వలన దర్పము, బుద్ధి వలన అర్థము, మేధవలన స్మృతి, తితిక్ష వలన క్షేమము, హ్రీ వలన ప్రశ్రయము, మూర్తి వలన సకల కల్యాణ గుణోత్పత్తికి స్థానభూతులయిన నరనారాయణులను ఇద్దరు ఋషులు సంభవించిరి ఆ మునులు పుట్టిన సమయమున వాయువు మందగతిని అనుకూలముగా వీచెను నలుదిక్కులు విశదములయ్యెను అన్ని లోకములకును ఆనందము కలిగెను దేవదుందుభులు మ్రోగినవి సముద్రములు కలకబారుట అణగెను నదులు వడిగా ప్రవహించెను గంధర్వ కిన్నరులు గానము చేసిరి అప్సరసలు నాట్యమాడిరి దేవతలు పూలవాన కురిపించిరి మునులు సంతోషముతో స్తుతించిరి ఆ సమయమున ప్రపంచమంతయు మంగళప్రదమై యొప్పెను. బ్రహ్మాదులా మునుల వద్దకు వచ్చి పెక్కురీతుల కొనియాడిరి ఆ నర నారాయణులే భూ భారమును తగ్గించుటకై అవతరించిరి నరుడు కురువంశమున అర్జునుడుగా అవతరించెను నారాయణుడు యదువంశమున శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించెను శ్రీ మహాభాగవతము చతుర్థ స్కందము-130

## 118. కరణమునకు అర్థములు

1 చేత, 2 వర్తకము, 3 ఇంద్రియము, 4. దేహము, 5 సాధనము, 6. పరమాత్మ, 7 కారణము, 8 తాళభేదము, 9. నృత్యభేదము, 10. పూత, 11 పొలము, 12. రతిబంధము, 13 యోగాసనము, 14 జ్యోతిశాస్త్రము, 15 ఒకానొక దేశము, 16 గణకుడు (లెక్క పెట్టువాడు) నిఘంటువు.

## 119. సంవత్సరంలో నిత్యమూ వచ్చు తిథులతో పండుగలు

| | | |
|---|---|---|
| 1. పాడ్యమి | సంవత్సరాది పాడ్యమి | చైత్రశుద్ధము |
| 2. విదియ | భాను విదియ | భాను వారముతో కూడినది |
| 3. తదియ | అక్షతదియ | వైశాఖ శుద్ధము |
| 4. చవితి | వినాయకచవితి | భాద్రపద శుద్ధము |
| 5. పంచమి | గరుడ పంచమి | శ్రావణ శుద్ధము |
| 6 షష్టి | సుబ్బరాయషష్టి | మార్గశిర శుద్ధము |
| 7. సప్తమి | రథసప్తమి | మాఘ శుద్ధము |
| 8. అష్టమి | గోకులాష్టమి | శ్రావణ బహుళము |
| 9 నవమి | శ్రీరామనవమి | చైత్రశుద్ధము |
| 10 దశమి | విజయదశమి | ఆశ్వయుజ శుద్ధము |
| 11. ఏకాదశి | తొలి ఏకాదశి | ఆషాఢ శుద్ధము |

| | | | |
|---|---|---|---|
| 12 | ద్వాదశి | పలుక ద్వాదశి క్షీరాబ్ధి ద్వాదశి | కార్తీక శుద్ధము |
| 13 | త్రయోదశి | శనిత్రయోదశి | శనివారమునకు కూడినను |
| 14. | చతుర్దశి | అనంతపద్మనాభ చతుర్దశి | భాద్రపద శుద్ధము |
| | | నరక చతుర్దశి | ఆశ్వయుజ బహుళము |
| 15. | పున్నమ | వ్యాసపున్నమ | ఆషాఢ శుద్ధము |
| 16. | అమావాస్య | దీపావళి అమావాస్య | ఆశ్వయుజ బహుళము |

## 124. గృహద్వార సంఖ్యాఫలము

1. గృహమునకు ఒకటే ద్వారముండరాదు,
2. గృహమునకు రెండు ద్వారములుండిన మంచిది,
3. గృహమునకు మూడు ద్వారములుండిన శత్రువృద్ధి,
4. గృహమునకు నాలుగు ద్వారములుండిన దీర్ఘాయుష్యము,
5. ఇంటికి ఐదు ద్వారములుండిన రోగభయము, మృత్యుభయము,
6. యింటికి ఆరు ద్వారములుండిన పుత్రలాభము,
7. యింటికి ఏడు ద్వారములుండిన మరణము,
8. యింటికి ఎనిమిది ద్వారములుండిన ఎల్లప్పుడు భయము
9. యింటికి తొమ్మిది ద్వారములుండిన దోషములుండు
10. యింటికి పది ద్వారములుండిన స్త్రీ నాశనము, చోరభయము
11. యింటికి పదకొండు ద్వారములుండిన ధననష్టము,
12. యింటికి పండ్రెండు ద్వారములుండిన వ్యాపార వృద్ధి
13. యింటికి పదమూడు ద్వారములుండిన శీఘ్ర మరణము
14. యింటికి పదునాలుగు ద్వారములుండిన సుఖము
15. యింటికి పదిహేను ద్వారములుండిన పలుకీడము
16. యింటికి పదహారు ద్వారములుండిన మిక్కిలి ధనము,

ఇంటి కలుగును 16 పదహారుంటికి సాధికముగా నుండినను సరి సంఖ్యగా యుండవలయును కాని బేసి సంఖ్యగా నుండరాదు చెప్పిన లెక్కలు లెక్కకు రావు ద్వారములు, కిటికీలు, అలమారల సంఖ్య కలపగా చివర సున్న రాకూడదు

మరియు ద్వారమునకు ఎదురుగా వీధియుండిన గృహ యజమానికి కీడును, వృక్షముండిన బాలురకు పీడయును కలుగును ఆ ద్వారము యొక్క రెండింతలు ఎత్తుకంటె దూరముగా నున్నయెడల ఏ దోషము లేదు ద్వారమున కెదుట బురదయున్నయెడల దుఃఖమును, నీలువారియుండిన ధన వ్యయమును, దేవతా విగ్రహముండిన నాశనమును, బ్రాహ్మణుని గృహముండిన కులనాశనమును కలుగును. గృహమునకు ఈశాన్యమున బావి త్రవ్విన మేలు కలుగును మరుగుదొడ్డి ఆగ్నేయమున లేని పక్షమున వాయువ్య దిశలో కట్టించుట మంచిది దిశ బాగుంటేనే మన దశ బాగుంటుంది

వాస్తు శాస్త్రము

# 121. ఋతుకాల సంభోగ నిర్ణయము

ఋతు స్స్వాభావిక స్త్రీణాం, రాత్రేయ షోడశః స్మృతాః,
చతుర్భి రితరై స్సార్ధ మహోభి స్సద్విగర్హితైః,
తాసామాద్యా శ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా,
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశ రాత్రయః

*స్త్రీకి రజోదర్శనమైనది మొదలు పదునాఱు దినములు ఋతుకాలమనబడును. వానిలో మొదటి నాలుగు రాత్రులు నిషిద్ధములు. పదునొకండవ రాత్రి పదమూడవ రాత్రియు బనికిరావు తక్కిన పది దినములందు ఏకాదశీ అమావాస్య పున్నమ పితృదినములు వదలవలయును. తక్కిన దినములు ప్రశస్తములు. ఋతుకాలమందు భార్యాభర్తలా రోగ్యవంతులై యుండి దానిని వ్యర్థము చేసిరేని భ్రూణహత్యాదోషము వచ్చును. ఇది ముగ్గురు కొడుకులు గలుగువరకో కాని యావల నీనియమము లేదు. ఆవల భార్యను జెల్లెలివలె జూడవలయును పరస్త్రీలను దల్లులవలె జూడవలయును*

యుగ్మాసు పుత్రా జాయంతే, స్త్రియో యుగ్మాసు రాత్రిషు।
పుమాన్ పుంసోధికే శుక్లే స్త్రీ భవత్సధికే స్త్రియాః।
సమే పుమాన్ పుంస్త్రి యౌవా క్షీణేల్పే చ విపర్యయః।
యది సంయోగ కాలేతు పురుషోరాగమోహితః।
ద్విధా సముత్స్సృజే చ్ఛుక్లం యమకం తత్ర జాయతే॥

*సరిదినములయందు గూడిన పుత్రులును, బేసి దినముల యందు బుత్రికలును గలుగుదురు పురుషుని వీర్యము అధికమైన పుత్రుడును, స్త్రీ యార్తవ మధికమైన స్త్రీయును రెండును సమత్వమును జెందిన నపుంసకుడు గాని స్త్రీ పురుషులు గాని గలుగుదురు సంభోగ కాలమున బురుషుడు రాగమోహితుడై శుక్రమును రెండు విధములుగవిడిచిన గవలు పుట్టుదురు.*

రాత్రౌ చతుర్థ్యాం పుత్త్రస్యా దల్పాయు ర్ధనవర్జితః
పంచమ్యాం పుత్రిణీ నారీ షష్ఠ్యాం పుత్రస్తు మధ్యమః
సప్తమ్యా మప్రజాయోషి దష్టమ్యా మీశ్వర స్సుతః
నవమ్యాం సుభగా సాధ్వీ దశమ్యాం చ వరః పుమాన్
ఏకాదస్యా మధర్మ్యాస్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః
త్రయోదశ్యాం సుతా లోకవర్ణ సంకర కారిణీ
ధర్మవిచ్చ కృతజ్ఞ స్స్యా దాత్మవేదీ దృఢవ్రతః
ప్రజాయతే చతుర్థశ్యాం గుణౌ షైర్జగతీపతిః
రాజపత్నీ మహీభోగా రాజవంశగతాధవా

జాయతే పంచదశ్యాంతు బహుపుత్రా పతివ్రతా
విద్యాలక్షణ సంపన్న స్సత్యవాదీ జితేంద్రియః
ఆశ్రయస్సర్వ భూతానాం జాయతే షోడశే పుమాన్॥

*నాల్గవ దినము రాత్రి పురుషుని జేరిన యెడల అల్పాయువు ధనహీనుడునగు పుత్రుడును, 5వ దినము రాత్రి పుత్రవతియగు కూతురును, 6వ దినము రాత్రియందు మధ్యముడగు పుత్రుడును, 7 దినము రాత్రి సంతానహీనురాలగు పుత్రికయు, 8వ దినమున ప్రభువగు పుత్రుడును, 9వ దినమున పతివ్రతయగు పుత్రికయు, 10వ దినమున శ్రేష్ఠుడగు పుత్రుడును, 11వ దినమున అధర్మురాలగు పుత్రికయు, 12వ దినమున పురుషోత్తముడగు పుత్రుడును, 13వ దినమున వర్ణసంకరురాలగు పుత్రికయు, 14వ దినమున ధర్మవేత్తయు, కృతజ్ఞుడును, ఆత్మవేదియు, దృఢవ్రతుడును, సుగుణములు గలవాడును, భూభర్తయునగు కొమరుడును గలుగుదురు. 15వ దినమున రాజపత్నియు పతివ్రతయు రాజవంశమును పొందునదియు శ్రేష్ఠురాలును పుత్రులు గలదియు నగు పుత్రికయు, 16వ దినమున విద్యాలక్షణ సంపన్నుండును సత్యవాదియు, జితేంద్రియుడును, సర్వభూతాశ్రయుడుననగు పుత్రుడు గలుగును.*

*ఇట్లు ఋతుకాలమందు మాత్రము స్వభార్యతో సంగమించుట యొకవిధమైన బ్రహ్మచర్యము రెండవది స్త్రీ సంభోగమునే మానుట*

*ప్రేమ-అభిలాష-రాగము-స్నేహము-ప్రేమము-రతి-శృంగారము అని సంభోగము ఏడు విధములు.*

*అందగత్తెలను చూడవలయునను కోరిక ప్రేమయనబడును ఆ విషయమైన చింత అభిలాష - అట్టి వారితో సంగమింపవలయునను బుద్ధి రాగము. దానియందే మనస్సుంచుట స్నేహము అట్టి వారిని విడిచి యుండలేకుండుట ప్రేమము వారితోడ గలసి మెలసి తిరుగుట రతి వారితోడ గ్రీడించుట శృంగారము. ఈ యేడును సంభోగమనబడును స్త్రీలతో నొంటిపాటున మాటలాడుటగాని, వారిచే దల దువ్వించుకొనుటగాని, తలంటించు కొనుటగాని, వారిని స్పృశించుటగాని; వారు తలదువ్వుకొనునపుడు పరుండినపుడు, స్నానము చేయునపుడు చూచుటగాని యిట్టివి నిషిద్ధములు. వయస్సు స్త్రీలను పీనుగుల వలె నైన జూడవలె, లేదా వారియొద్ద 5 లేక 6 ఏండ్ల బాలుని వలె నుండవలె ఇట్టిది రెండవ బ్రహ్మచర్య విధము. ఇట్టి బ్రహ్మచర్య వ్రతము రామచంద్రమూర్తి యందు విశేషించి గలదు.*

35-13 శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము - సుందరకాండము 393

*యింతవరకు ఋతుకాల సంభోగ నిర్ణయమును, ఏరోజున గర్భము నిలిచిన ఎటువంటి పుత్రుడు, పుత్రికయు జనించునో తెలుసుకున్నాము. యిప్పుడు పిండోత్పత్తి క్రమమును గూర్చి, శిశువుగా మారుట తెలుసుకుందాము ఒకనాటి రాత్రి శుక్లము పడును ఇది శోణితముతో గలసి 5 దినంబులు నీటిపై బుగ్గవలె నుండును పది దినంబులకు కోడిగ్రుడ్డువలె నుండును నెలకు గట్టి పిండమై శిరస్సు ఏర్పడును*

రెండు నెలలకు కాళ్లు చేతులును, మూడు నెలలకు కడుపును, నాలుగు నెలలకు నిరుపార్శ్వంబులును, ఐదు నెలలకు పాదములును, వ్రేళ్ళును ఏర్పడును. ఆరవ నెలయందు ముక్కు, చెవులు, కన్నులు మొదలయిన రంధ్రములు గల అవయవములు ఏర్పడును ఈ విధముగా నేర్పడిన దేహమందు ఏడవనెలయందు జీవుడు ప్రవేశించును. అప్పుడు ఊర్ధ్వముఖమై యుండును నాభి మొదలుకొని బ్రహ్మరంధ్రము వరకు వెనుకభాగమందు చిన్న రంధ్రములు గల యొకనాడియుండును అప్పుడు తల్లియొక్క జఠరాగ్ని బాధలేకుండునట్లు 'సూతి'యను పేరుగల యొక తొడుగు పిండమును జుట్టియుండును. ఎనిమిదవ తొమ్మిదవ నెలలయందు పూర్వ జ్ఞానము గలిగి భూమి మీద పుట్టే వరకు మలమూత్ర స్థానమైన గర్భమందు నిలిచి తనలో నానిట్లు దుః ఖించును.

అయ్యో! నేను జన్మాంతరములయందు కొంచెమైన పుణ్యము చేయకపోతిని ఒకానొకప్పుడు పరులను వంచించుటకై కామ్యకర్మలు చేసితిని. నిష్కామ కర్మలను జెవిని బెట్టక, మనసునందు విచారింపక, పెద్దలు జెప్పినప్పుడు ' నా యిష్టము వచ్చినట్లు నేను జేయుదును' అని వారలను నిందించుచు సద్గతిని విచారింపకపో తిని అజ్ఞానముచేత స్వస్త్రీ (అనగా భార్య)యందు నిషిద్ధ దినంబుల నాలోచింపక పగలు అనియైన విచారింపక (పగలు పిండోత్పత్తియైన యెడల దరిద్రుడు, అర్థాయువు గలవాడు, పెద్దలను దూషించువాడు పుట్టును) రతి సుఖంబులు బొందితిని పరస్త్రీలను మోహించి అన్యాయముగా వారిని జెఱచితిని. చిన్న తనపు బుద్ధిచేత అనేక ఘోర పాపములు చేసితిని గురువులను, పెద్దలను, తల్లిదండ్రులను దూషించి, నీవు అను ఏకవచన ప్రయోగంబు చేసితిని శరీరము పడిపోయినది యని తెలిసినప్పటికిని, కూట సాక్ష్యములచేత ధనము నార్జించితిని ఆ ధనము భార్యా బిడ్డల కొసంగి మరల వారు నా అవసరములకు ఇవ్వనందున మిగుల దుఃఖించితిని ఇట్లు పూర్వ జ్ఞానంబుచే గర్భంబుననున్న శిశువు దుఃఖించుచు, దిక్కు ఎవరని విచారించుచు, గర్భము నుండి పుట్టిన తరువాత నింక జ్ఞానము తెచ్చుకొని సద్గురువు యొక్క పాదపద్మములాశ్రయించి, సాంఖ్యయోగ భక్తి మార్గములచేత పరమాత్మ ధ్యానము చేయగలను. ఈ మలమూత్ర దుర్గంధయుతమైన నరక కూపము నుండి విడచిన పిమ్మట బాహ్యమందు, అంతరమందు సగుణ నిర్గుణ పూజలు చేయుదును ఇకను శ్రీకృష్ణ పరమాత్మను మరువననియు, ఈ మూత్రద్వారము నుండి ఎప్పుడు విడువబడుదునాయని విచారించుచుండగా, అంతట విష్ణుమాయ గప్పి పిండము అధోముఖమై తల్లికి బాధ కలిగించుచూ భూమిమీద తల్లియొక్క అపానవాయు ప్రసారముచేతను, పిండమందుండు ప్రాణాది వాయు ప్రసారము చేతను పడును. అప్పుడు అక్కడ నుండువారు మగ శిశువా? ఆడశిశువా? యని విచారింతురు. మగశిశువేనా మంచిది అని కొందరును, ఆడ శిశువా అదే మంచిదే యని మరికొందరు, నిట్లను కొనుచు కలినీళ్లు చల్లుదురు అప్పుడు పూర్వ వృత్తాంతంబును మరచి 'కావురు' మని ఏడ్చును

వ్యాఖ్యానము : తల్లి గర్భమున నున్న శిశువునకు 9వ నెలలో జ్ఞానము కలుగుతుంది జ్ఞానోదమయిన శిశువు మలమూత్ర జీమూతములచే ఆవరింపబడి గర్భమునుండి వెలువడి బాహ్య ప్రపంచమును ఎప్పుడు చూతునాయని తహతహలాడుచూ, గత జన్మలో తాను గావించిన పాపములను తలచుకొనుచూ, దుఃఖించుచూ, యీ జన్మలో అట్టి దుష్కృత్యము లాచరించననియూ, సత్సంకల్పముతో సజ్జన సాంగత్యముతో సద్గురువు నాశ్రయింతుననియూ, పరితాపముతో, పరివర్తన చెందిన మనస్కుడై, నెలలు నిండగానే అంతవరకు ఊర్ధ్వముఖముగానున్న శిశువు అధోముఖమై రెండు చేతులతో శిరస్సును పట్టుకొని వినమ్రభావముతో తల్లి గర్భము నుండి భూమిపై బోర్లాపడునని పెద్దలు చెప్పుదురు బోర్లపడుతూనే విష్ణుమాయనావరించగా, అంతవరకు ఉన్న జ్ఞానము నశించిపోగా ఏమీ తెలియని అయోమయావస్థలో అచేతనముగా నుండును. అప్పుడు తల్లి కదలికలు లేని శిశువును చూస్తూ, వీడు జీవించునా, మరణించునాయను సందిగ్ధావస్థలో నుండగా, అక్కడున్న అమ్మలక్కలు బిడ్డ ఏడ్వలేదని కలినీళ్ళు చల్లుదురు. యిక్కడ బిడ్డ ఏడ్వని పక్షమున చనిపోయెనని, ఏడ్చిన బ్రతికెనని భావింతురు. కలినీళ్ళు చల్లిన వెనువెంటనే జ్ఞానము నశించిన శిశువు ఏడ్వగా తల్లి వీడు జీవించెనని సంతోషముతో కనుల నీరు నింపుకొనును. ఏడ్వక చలనము లేని శిశువును చూచి తల్లి దుఃఖించును మరియు బంధువర్గమును దుఃఖించును కలినీళ్ళు పడగానే శిశువు క్యా - క్యా అంటే నేనెవరిని నేనెవరిని అని ఆక్రోశిస్తూ, తల్లి గర్భముననున్న జ్ఞానము సంపూర్ణముగా నశిస్తుంది. అంతే - యిక శైశవ వృత్తి ప్రారంభమవుతుంది యిక్కడ మా బాల్యమిత్రుడు రచించిన భారతీ శతకములోని పద్యమొకటి స్ఫురణకు వస్తుంది అది

పుట్టినయప్పుడేడ్చు శిశువున్నని మిక్కిలి సంతసింతురా
పుట్టిన బిడ్డ జచ్చిన లబోదిబొయేడ్చెదరెంత భ్రాంతియో!
యిట్టె నశించు దేహముపయిన్ ప్రతి జీవికి చావుపుట్టువుల్
కట్టెకెగాని జీవునకు గాదను యోచనలేక భారతీ!

అప్పుడు అక్కడనుండువారు మగశిశువా? ఆడశిశువా? యని విచారింతురు. మగశిశు వేనా మంచిది అని కొందరును, ఆడశిశువా? అదీ మంచిదేయని మరికొందరు నిట్లనుకొనుచు కలినీళ్ళు చల్లుదురు అప్పుడు పూర్వ వృత్తాంతంబును మరచి 'కావురు'మని ఏడ్చును.

ఆ శిశువున కెంతమాత్రంబును జ్ఞానములేక మంచము మీదబడి మలమూత్రములలో నుండి కదలలేక ఈగలను దోమలను తోలుకొనలేక విశేషముగా దుఃఖించును అప్పుడు గర్భమునందుండు దోషములన్నింటిని దాటి యింతవరకు వచ్చినప్పటికి, కిసరులు పోరులు సంధులు మొదలైన, రోగంబులును, ముట్టుదోషంబులును అనుభవించుచు, వాటికి తల్లిదండ్రులు ప్రతిక్రియలు నేయునప్పుడు, ఔషధపానము

*చేయలేక దుఃఖించుచు ప్రతినెలయందు బాలగ్రహములచేత బాధనొందుచు పరమాత్మానుగ్రహముచేత నాలుగైదు వత్సరములు గడచి అక్షరాభ్యాసము చేయ బడి ఉపాధ్యాయులు చెప్పినట్లు చదువలేక దెబ్బలు పడుచూ యీ విధంబున 18 సంవత్సరముల వరకు వృద్ధి బొందుచుండగా తల్లిదండ్రులు ఒక చిన్నదానిని తెచ్చి వివాహము చేయుదురు ఆ భార్యయందు యుక్తాయుక్త సమయములు తెలియక రతిచేసి సంతానంబుగని వారిని సంరక్షణ చేయలేక, రాజులు మొదలగు వారి సేవలు చేయుచు, నేను సంపాదించి యిందర పిల్లలను సంరక్షణ చేసి, పెండ్లి మొదలగు శుభకార్యంబులు చేయుచున్నానని గర్వించి, తనకన్న బలహీనుల బాధింపుచు, ద్రవ్య సంపాదనమే ముఖ్యమని మిక్కిలి యాశతోద్రవ్యమును దెచ్చి ఎప్పుడును పరమాత్మను దలంపక, కాలమును గడుపుచుండగా కొన్ని దినంబులకు వృద్ధత్వంబు వచ్చి, చెవులు, కన్నులు, పాదములు, చేతులు మొదలగు నవయవములు వాని వాని వ్యాపారములు చేయజాలక యున్నప్పుడు, కొడుకును భార్యను బిలిచి తనను లేవనెత్తుమని అడుగగా వారు వినక అక్కడనుండుము, అక్కడనేయుండుము అని యనగా, నేను వీరినవేక విధంబుల సంరక్షణము చేసితిని. ఇంక నన్ను సుఖముగా సంరక్షణ చేయు వారెవ్వరు? అని ప్రయోజనములేని వాక్యములను పలుకుచుండగా, యమదూతలు వచ్చి, గట్టిగా ప్రాణములను బంధించి, ముండ్లు రాళ్ళు మొదలకు గలినంపు త్రోవలందు నడిపించుచూ పోవు సమయంబున భయపడి 'నేను ఎంత మోసపోయితిని' అని దుఃఖమును బొందుచు, యమలోకంబున కేగిన పిమ్మట యమదండనమని నరకంబున బడవైచి యిట్టిదియని చెప్పుటకు నలవికాని బాధ లనుభవింపుచుండగా, విశేషముగా జీవుండు దుఃఖపడును*

*కనుక పాఠకులారా! మన శరీర అవయవములు స్వస్థతలోనున్నప్పుడే పరమాత్మను ధ్యానించండి తరించండి, ముక్తిని గాంచండి, స్వర్గమును పొందండి దుర్లభమైన మానవ జన్మను పొందినందుకు సఫలీకృతమనోరథులు కండు.*

శ్రీ మహాభాగవతము, తృతీయస్కంధము

## జన్మపావనము

*భోగేచ్ఛ గలిగిన రోగభయమున్ను, జాతికి హీనమువల్లను, ధనమునకు రాజు వల్లను, శత్రువు చోరుని వల్లను, మానమునకు దరిద్రము వల్లను, శాస్త్రమునకు వాదివల్లను, మానమునకు దుర్గుణము వల్లను, శరీరమునకు మృత్యువు వల్లను, అందమైన భార్యవల్ల భర్తకును నెటుజూచినను నొకదానివలన నొకదానికి భయము గల్గుచున్నది ఈ వైరాగ్యము వలన నీ ప్రపంచము నస్థిరంబనిదెలిసి నిరాశజెందు టయె 'జన్మపావనము' గాన ఓ మానవుడా! మహామోహ వ్యూహ గాడాంధకార నిబద్ధంబగు నీ ప్రపంచంబను మహారణ్యాంబులో* **మన్మథుండనియెడి కిరాతకుడు** *కర్మప్రకృతు లను స్నేహితులను గూడుకొని సంసారంబను మెట్టనుండెడి అవివేకియైన జీవుండను హరిణంబును బట్టదలంచి యీ షణ్ణత్రయంబులను నుచ్చులనొడ్డి సత్త్వరజస్తమం*

ఒంటను వలలను బొందుపరచి తాపత్రయంబులనెడి గుంటలు త్రవ్వి పంచేంద్రియం బులనెడి కోరులబాతి అరిషడ్వర్గంబులను శునకంబుల నుసిగొల్పి కాంతా సంగమం బనియెడి వేటమృగంబును దాల్చి మమకారంబను ధనుస్సున అహంకారంబను బాణంబును సంధించి యెదుట నిల్చిన మోహపాశంబులగట్టి యముండనురాజునకు కానుకగా బెట్టదలంచినాడు గాన అవివేకులీ మర్మంబెరుంగజాలక ఎండమావులవలె గన్పట్టెడు దారాపుత్రులయందు కూరిమిగలిగి మానవులతి దుఃఖమగ్నులగుచుండుట లోక విదితముగా నున్నయది స్వప్నతుల్యులగు పుత్ర, మిత్ర, కళత్రాది బంధువర్గంబులు నీరాగారంబునం గలనెడు పాంథులవలె కొద్ది దినంబులు మాత్రము కూడి మానవులకు భ్రాంతిని కలుగజేయుచుండును వీరి మాయావ్యూహంబులలో జిక్కి భ్రాంతిపడిన మూఢులు కడతేరుట కడు దుర్లభంబు నిజంబెరిగిన జ్ఞాని సంసారనివర్తియై యుండియు నిమిత్తమాత్రముగా వర్తింపుచు తన లక్ష్యంబును శాశ్వతంబైన బ్రహ్మమందుంచి సుఖదుఃఖంబులు ఖేదమోదంబులు శరీర సంబంధమనిన్నీ, కర్మవశాత్తు సంప్రాప్తమైన నీ శరీరము నైరక్ష్యమనిన్నీ ఎరింగి అందులేశమైన నభిమాన ముంచక జ్ఞానియైనవాడు వర్తించుచుండును.

పదునాఱవ సంఖ్యా వివరణ సంపూర్ణము

ఓం

# 17వ సంఖ్య

## 122. పదునేడు తత్త్వములు

యావల్లి ఙ్గాన్వితో హ్యాత్మా తావత్ కర్మ నిబన్ధనమ్
తతో విపర్యయః క్లేశో మాయా యోగోఽనువర్తతే

(హిరణ్యాక్షుని మరణానంతరము దుఃఖితయైన తల్లి దితికి తత్త్వోపదేశం చేయుచున్న హిరణ్యకశిపుడు)

ఆత్మ పంచప్రాణములు, పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, బుద్ధి, మనస్సు అను పదునేడు తత్త్వములచే ఏర్పడిన లింగశరీరముతో కూడి యుండునంత వఱకు కర్మములచే బంధింపబడుచున్నది ఇట్టి బంధనము వలననే మాయాజనితములగు మోహము, దుఃఖము, దానిని వెంటాడుచున్నవి

బాగవతరత్నాకరము, సప్తమస్కంధము - 424

పంచప్రాణములు : 1. ప్రాణము, 2. అపానము, 3. వ్యానము 4. ఉదానము, 5. సమానము

పంచకర్మేంద్రియములు : 1. వాక్ (మాట్లాడుట), 2. పాణి (గ్రహించుట), 3 పాద (నడచుట), 4. ఉపస్థ (మదనమందిరము), 5. పాయువు (మలవిసర్జనము)

పంచజ్ఞానేంద్రియములు : 1 త్వక్ (చర్మము), 2 శ్రోత్ర (చెవి) 3 నేత్ర (కన్ను) 4. రసన (నాలుక), 5 నాసిక (ముక్కు)
5+5+5=15, 16. బుద్ధి, 17. మనస్సు. 17 తత్త్వములు

## 123. శ్రీకృష్ణావతారము

అవ్యక్త మక్షరం బ్రహ్మప్రధానం త్రిగుణాత్మకం।
అత్మా న మవ్యయం చైవ ప్రకృతిం ప్రభవం ప్రభుం।
అనంత మచలం దేవం హంసం నారాయణం ప్రభుం।
కైవల్యం నిర్గుణం విశ్వమనాది మజ మవ్యయం।
పురుషస్స విభుః కర్తా సర్వభూత పితామహః॥

1. అవ్యక్తుడును, 2. అక్షర స్వరూపుడును, 3. త్రిగుణాత్మకమైన ప్రధానుడును, 4 పరబ్రహ్మయే ఆ శ్రీకృష్ణుడు. 5. నాశరహితమైన ఆత్మ స్వరూపుడు, 6. జగత్సృష్టికి మూలభూతమైనవాడు, 7. అనంతుడు, 8 అచలుడు, 9 దేవదేవుడు, 10. విశ్వస్వరూపుడు, 11. నిర్గుణుడు, 12. కేవలుడు, 13 అజుడు, 14. అవ్యయుడు 15 విభువు, 16 కర్త, 17. సర్వభూతములకు పితామహుడు నగు శ్రీమహావిష్ణువే ధర్మ సంస్థాపనార్థము వృష్ణికులమునందు శ్రీకృష్ణునిగా నవతరించెను
శ్రీమహాభారత సారోద్ధారము, ప్రథమభాగము- 81

## 124. కుమారస్వామి పేర్లు

1. కార్తికేయుడు, 2. మహాసేనుడు, 3 శరజన్ముడు, 4. షడాననుడు, 5. పార్వతీ తనయుడు, 6. స్కందుడు, 7. సేనాని, 8 అగ్నిభువుడు, 9 గుహుడు, 10. బాహులేయుడు, 11. తారకాసురుని చంపినవాడు, 12 విశాఖుడు, 13 శిఖివాహనుడు, 14. షాణ్మాతురుడు, 15. శక్తిధరుడు, 16. కుమారుడు (కుమారః), 17. క్రౌంచదారణుడు ఈ 17 కుమారస్వామి పేర్లు అమరకోశము - 19

## 125. భారతదేశము నందలి పుణ్యక్షేత్రములు

1. కాశీక్షేత్రము (వారణాసి), 2 గయ, 3. ప్రయాగ, 4. జగన్నాథము (పూరి), 5. కేదారనాథ, బదరీనాథములు, 6 తిరువనంతపురం, 7. కన్యాకుమారి (ఇది భరతఖండమునకు దక్షిణమున, పడమటి సముద్రమును తూర్పు సముద్రమును కలియుచోట గలదు) 8,9 ఉడిపియు, పళనియు - శ్రీకృష్ణ సుబ్రహ్మణ్యస్వామి క్షేత్రములు, 1. కుర్తాలము, 11. శ్రీరంగము, 12. మధుర, 13. పక్షితీర్థము 14 జంబుకేశ్వరము, 15 కంచి, 16. చిదంబరం, 17. రామేశ్వరము పెద్దబాలశిక్ష - 137

17వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 18వ సంఖ్య

## 126. శ్రీ వేదవ్యాసాష్ట దశనామావళి

1. ఓం వ్యాసాయ నమః,
2 ఓం వసిష్టనప్త్రే నమః,
3. ఓం వాసిష్ఠాయ నమః,
4. ఓం శక్తేః పౌత్రాయ నమః,
5 ఓం సత్యవతీసుతాయ నమః,
6. ఓం పరాశరాత్మజాయ నమః,
7. ఓం శుకతాతాయ నమః,
8. ఓం తపోనిధయే నమః,
9. ఓం బ్రహ్మనిధయే నమః,
10. ఓం విష్ణురూపాయ నమః,
11. ఓం విష్ణవే నమః,
12. ఓం బదరికానిలయాయ నమః,
13. ఓం కృష్ణాయ నమః,
14. ఓం ద్వైపాయనాయ నమః,
15. ఓం అకల్మషాయ నమః,
16. ఓం బ్రహ్మసూత్రకృతే నమః,
17. ఓం సర్వపురాణప్రణేత్రే నమః,
18. ఓం మహాభారత సంహితా రచనబంధురాయ నమః శ్రీశైలప్రభ జూలై 84 = 3

## 127. అష్టాదశ శక్తి పీఠములు

1. లంకాయాం శాంకరీ దేవి। 2. కామాక్షీ కంచికా పురే।
3. ప్రద్యుమ్నే శృంఖలాదేవి। 4. చాముండీ క్రౌంచపట్టణే।
5 అలంపుర్యాం జోగులాంబా। 6. శ్రీశైలే భ్రమరాంబికా।
7 కొల్హాపుర్యాం మహాలక్ష్మీ
8. మాయూరే ఏకవీర్యకా॥ పూర్వమిచ్చటనే భృగుమహర్షి కారణమున విష్ణుదేవుని విడచి లక్ష్మీదేవి నివసించియున్న ప్రదేశము. వేంకటేశ్వరునికి పద్మావతీ వివాహ సమయమున నీమెను రప్పించెనని వేంకటేశ్వర మహాత్మ్యమున గలదు
9. ఉజ్జయిన్యాం మహాకాళీ। 10. పీఠాయాం పురుహూతికా।
11. ఓడ్యాణే గిరిజాదేవీ। 12. మాణిక్యా దక్ష వాటకే॥
13 హరిద్వారే కామరూపీ। 14. ప్రయాగే మాధవేశ్వరీ।

15. *జ్వాలాయాం వైష్ణవీదేవీ।* 16 *గయాయాం మంగళా తథా॥*
17. *వారణాస్యాం విశాలాక్షీ।* 18. *కాశ్మీరేతు సరస్వతీ*

ఇత్యష్టాదశ దేవ్యాశ్చ పీఠాస్సంతి మహీతలే।
తాసాం స్మరణ మాత్రేణ మృత్యుదారిద్ర్య నాశనః॥

శ్రీ మదుత్తర మహాభారత సారోద్ధారము - 5వ బాగము - 620

# 128. శ్రీ మల్లిఖార్జునుని క్షేత్రములు

1. *శ్రీశైలము,* 2. *మహానంది, ఓంకారము,* 3. *తూర్పు ద్వారమగు త్రిపురాంతకము (దక్షిణము సిద్ధవటము, పశ్చిమము ఉమామహేశ్వరపురము, ఉత్తరము హేమలాపురము),* 4. *దొనకొండ,* 5 *గజ్జెలకొండ,* 6 *సిరికొండ,* 7. *చేజెర్ల (కపోతేశ్వరము),* 8 *కోటప్పకొండ,* 9 *అమరావతి,* 10. *తాడికొండ,* 11 *గుంటూరు,* 12 *వేజెండ్ల,* 13 *కాకాని,* 14. *మంగళగిరి,* 15. *కొప్పర్రి (బాపట్ల తాలూకా),* 16. *విజయవాడ,* 17 *వేదాద్రి,* 18. *శ్రీకాకుళము - అని 18 క్షేత్రములున్నవి. ఇవన్నియు శ్రీగిరిక్షేత్ర తుల్యములేయగును*

శ్రీ మదుత్తర మహాభారత సారోద్ధారము, 5వ బాగం - 717

# 129. నమస్కార నిషేధ సమయములు

1. *దూరముగా నున్నను,* 2. *పురుగిడుచున్నను,* 3. *స్నానము చేయుచున్నను,* 4. *దంతధావనమొనర్చుచున్నను,* 5. *పుణ్యతీర్థాది జలమధ్యమమున స్నానము చేయుచున్నను,* 6. *రోగగ్రస్థుడైయున్నను,* 7. *యజ్ఞశాలయందున్నను,* 8. *దేవాలయము లందున్నను,* 9. *గురు సమీపవర్తునకు,* 10. *మలమూత్ర విసర్జన సమయము లందునను నమస్కారము చేయరాదు* 11 *ఇంకను మదాంధునకు,* 12. *ధనగర్వితునకు,* 13. *గ్రామ పురోహితునకు,* 14 *నాస్తికునకు,* 15. *కులమర్యాదల నతిక్రమించిన వానికి,* 16 *జూదరికి,* 17. *త్రాగుబోతునకు,* 18. *దుర్వ్యసనపరునకు నమస్కరించరాదు అట్లు నమస్కరించినచో పురాకృత పుణ్యమును బోగొట్టుకొను వారగుదురని స్మృతి వొచ్చరించుచున్నది*

*(నేటి కాల, మాన, దేశ పరిస్థితులను బట్టియు, స్థితిగతులను బట్టియు, అధికార, అనధికార తారతమ్యములను బట్టియు తప్పనిదగుచున్నందున ఇయ్యది యథావకాశమని గ్రహింపుడు)*

సాంధ్యదీపకి - 176

# 130. పదునెనిమిది జాతులు

1. *బ్రహ్మ,* 2 *క్షత్రియ,* 3 *వైశ్య,* 4. *శూద్ర,* 5 *వ్యావహారిక,* 6. *గోరక్షక,* 7. *శిల్పక,* 8 *పంచాణ,* 9. *కుంభకార,* 10. *తంతువాయ,* 11 *క్షౌరక,* 12 *రజక,* 13 *వస్త్రచ్ఛేదక,* 14. *చర్మకార,* 15 *తిలఘాత,* 16 *లుబ్ధక,* 17. *చండాల,* 18. *మాతంగజాతులు*

శబ్ద రత్నాకరము - 418

## 131. గీతకు గల 18 పేర్లు

1. గీతాగంగా చ గాయత్రీ
సీతా సత్యా సరస్వతీ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ
త్రిసంధ్యా ముక్తిగేహినీ॥

2. అర్ధమాత్రా చిదానందా
భవఘ్నీ భ్రాన్తి నాశినీ।
వేదత్రయీ పరాఽఽనన్తా
తత్త్వార్థ జ్ఞానమంజరీ॥

3 ఇత్యేతాని జపేనిత్యం
నరో నిశ్చల మానసః।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం
తథాన్తే పరమం పదమ్

1 *గీత*, 2. *గంగ*, 3 *గాయత్రి*, 4. *సీత*, 5. *సత్య*, 6. *సరస్వతి*, 7 *బ్రహ్మవిద్య*, 8 *బ్రహ్మవల్లి*, 9 *త్రిసంధ్య*, 10. *ముక్తిగేహిని*, 11 *అర్ధమాత్ర*, 12. *చిదానంద*, 13. *భవఘ్ని*, 14 *భ్రాన్తినాశిని*, 15. *వేదత్రయి*, 16 *పర*, 17. *అనంత*, 18. *తత్త్వార్థ జ్ఞానమంజరి.*

## 132. వృషభాసుర సంహారము

*ఒకనాడు అరిష్టుడను రాక్షసుడు వృషభాకారమున వచ్చి ఆవుల మందలో ప్రవేశించెను గోపాల వృషభుడైన శ్రీకృష్ణుడు కాంచెను దానికెదురుబోయి ఆ వృషభము రెండు కొమ్ములను పట్టుకొని ఒకయేనుగు మరియొక యేనుగును త్రోసిన రీతిని పదునెనిమిది అడుగుల దూరము వెనుకకు త్రోసెను పిదప దాని కొమ్ము నూడబెరికి దానితోనే దానిని కొట్టిచంపెను* వచన భాగవతము, దశమస్కంధము - 117

## 133. అష్టాదశ పురాణములు

వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమకల్మషం।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥

*అని మనం తరచు వ్యాసమహర్షులవారికి నమస్కరిస్తుంటాం అంటే వసిష్ఠమహర్షికి మునిమనుమడు, శక్తి మహర్షికి మనుమడు, పరాశరుని కుమారుడు, శుకమహర్షికి తండ్రి, తపోనిధి అయిన శ్రీ వ్యాసమహర్షుల వారికి నమస్కరిస్తున్నాను అని పై శ్లోకంలో వ్యాసులవారి వంశం కొంతవరకు చెప్పబడింది ఆయన అసలు పేరు*

బాదరాయణుడు వేదాలను విభజించాడు గనుక ఆయనను వేదవ్యాసుడు అన్నాం వేదవ్యాస శబ్దానికి 'వివ్యాస వేదాన్ యస్మాత్ స తస్మాత్ వ్యాస ఇతి స్మృతః' అని గదా వ్యుత్పత్తి చెబుతాం.

మనవాఙ్మయములో చెప్పబడిన ఏడుగురు చిరంజీవులలో ఒకరైన వేదవ్యాసమహర్షి వేదాలను విభజించటమే కాకుండా బ్రహ్మసూత్రాలను, 18పురాణములను, మహాభారతాన్ని యింకా మరెన్నో గ్రంథాలను రచించారు బ్రహ్మసూత్రాలు దేశ విదేశాలలో పెక్కు మన్ననల నందుకొంది అలాగే వ్యాసులవారు రచించిన పురాణాలు కూడా ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్నాయి శ్రీశైలప్రభ జూలై 1984

అష్టాదశ (18) పురాణములలో పది పురాణములు శివుని మహాత్మ్యమును, నాలుగు విష్ణు మహాత్మ్యమును, రెండు బ్రహ్మ మహాత్మ్యమును, ఒకటి దేవీ మహాత్మ్యమును, ఒకటి సూర్యమహాత్మ్యమును చెప్పుచున్నవి.

1. ఈ 18 పురాణాలలో మొదటిది బ్రహ్మ పురాణమని 15 పురాణాలు అంగీకరించాయి ఇందులోని శ్లోకాల సంఖ్య 10,000 కాని 13 వేలు వున్నట్లు మత్స్యపురాణం చెబుతోంది 15 వేలని అగ్నిపురాణంలో చెప్పబడింది

2 ఇక రెండవది పద్మ పురాణమని 14 పురాణాలు అంగీకరించాయి ఇందులో 55 వేల శ్లోకాలున్నట్లు పురాణాలన్నీ అంగీకరించాయి సృష్టిఖండము, భూమిఖండము, స్వర్గఖండము, పాతాళఖండము, ఉత్తరఖండము అని అయిదు ఖండాలుగా విభజింపబడిన ఈ పురాణంలోని పాతాళఖండంలో రామేశ్వమేధ పర్వంలో వాల్మీకి రామాయణమంతా సంగ్రహంగా చెప్పబడింది ఈ విషయమే రామాయణ భారతములలో ఏది ముందు వ్రాయబడింది? అను అనుమానాన్ని రేకెత్తించింది.

3. పురాణాలన్నింటిలో విష్ణుపురాణం అతిప్రాచీనమైన పురాణమని పాశ్చాత్య విద్వాంసులు ముఖ్యంగా ఆంగ్లేయులు అభిప్రాయపడుతున్నారు ఇందులో 23 వేల శ్లోకాలున్నాయని అన్ని పురాణాలు చెబుతున్నాయి

4 24 వేల శ్లోకాలు కలిగిన వాయుపురాణం శివపురాణమని కూడా పిలువబడుచున్నది. వాయువుచే చెప్పబడటం వల్ల వాయుపురాణమనీ, శివమహిమను గురించి ప్రత్యేకంగా చెప్పబడింది గనుక శివపురాణమని అంటారన్నట్లు యిదే పురాణంలోని రేవా మహాత్మ్యవర్ణన సమయంలో చెప్పబడింది

5. శ్రీమద్భాగవత పురాణమును గురించి తెలియని వారు లేరు భాగవతము - శ్రీమద్భాగవతము (విష్ణుభాగవతము), దేవీ భాగవతము అని రెండుగా లోకంలో వ్యాప్తి చెందింది ఈ రెండింటిలో దేవీ భాగవతమే అష్టాదశ పురాణాలలో లెక్కించబడుతుందని కొందరూ, కాదు విష్ణు భాగవతమని కొందరూ చాలా కాలంగా వాదులాడుకొంటున్నారు కాని రెండూ అశ్రేయాలేనని పండితులంతా ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు

12 స్కంధాలు గలిగిన విష్ణుభాగవతం 332 అధ్యాయాలు కలిగియున్నది.

యిందులో మొత్తం 18 వేల శ్లోకాలున్నాయి

పురాణాలన్నింటిలో చదువరుల మనస్సులలోను, శ్రోతల మనస్సులలోను భక్తి బావాన్ని రేకెత్తించే తన్మయులయేలా చేసేది యీ భాగవతం ఒక్కటేనని చెప్పుకోవచ్చు అందుకే భక్తులకు దీనిపై గల ప్రీతి మరొక పురాణంపై కానరాదు లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణ భగవానుని చరిత్రను వివరిస్తూ శ్రీ వేదవ్యాసమహర్షి ఆధ్యాత్మతత్త్వాన్ని ప్రజల హృదయాలలో చక్కగా నెలకొల్పగలిగాడు. వందకు పైగా వ్యాఖ్యానాలు ఈ భాగవతానికి ఉన్నాయి

దేవీ భాగవతంలో కూడా 12 స్కంధాలే వున్నాయి శ్లోకాల సంఖ్య కూడా 18 వేలే. కాని అధ్యాయాలు 318 మాత్రమే వున్నాయి. దేవీ భాగవతాన్ని గురించి ప్రస్తావన విష్ణుభాగవతంలో లేదు కాని, విష్ణుభాగవతం ఉపపురాణమని దేవీ భాగవతం చెబుతోంది

6. 24 వేల శ్లోకాలు గల నారద పురాణం, పురాణాలను గురించి తెలుసుకొనేవారికి చాలా ఉపయోగపడుతుంది మిగిలిన పురాణాలలోని విషయాలు, శ్లోక సంఖ్య, అధ్యాయాలు, పర్వాలు, ఖండాలు అన్నీ యిందులో వివరంగా చెప్పబడ్డాయి

7 వేదాలతో సమానంగా గౌరవాన్ని పొందే "దేవీ సప్తశతి" మార్కండేయ పురాణంలోనిది యీ దేవీసప్తశతి హిందూ దేశంలోచాలా ప్రాముఖ్యాన్ని, గౌరవాన్ని సంతరించుకుంది మార్కండేయ పురాణంలో మొత్తం 9 వేల శ్లోకాలున్నట్లు నారద పురాణం చెబుతోంది కాని ప్రస్తుతం లభించే మార్కండేయ పురాణంలో 6900 శ్లోకాలు మాత్రమే కనబడుతున్నాయి

8 అగ్నిపురాణం మిగిలిన పురాణాలన్నింటికన్నా భిన్నంగా కనిపిస్తుంది దాదాపు ప్రపంచంలోని విషయాలన్నీ యిందులో వివరింపబడ్డాయి తర్క, వ్యాకరణ, మీమాంసాది శాస్త్ర విషయాలు, నిఘంటువులు మొదలైన సాహిత్య విషయాలు, వాస్తు, మంత్ర, పాకశాస్త్ర విషయాలు, యింకామరెన్నో విషయాలు యిందులో చెప్ప బడ్డాయి యిందులో 15 వేల శ్లోకాలున్నట్లు నారదపురాణం చెబుతోంది. కాని 12 వేలు మాత్రమే లభిస్తున్నాయి

9. బవిష్యపురాణం విషయంలో చాలా గందరగోళం వుంది దీనిలో బ్రహ్మ, విష్ణు, శైవ, సౌర, ప్రతిసర్గ పర్వాలు అనే 5 పర్వాలున్నాయని, 14 వేల శ్లోకాలు ఉన్నాయని నారద పురాణం చెబుతోంది కాని యిప్పుడు లభించే భవిష్య పురాణంలో 27 వేల శ్లోకాలు కనిపిస్తున్నాయి విష్ణు, శైవ, సౌర పర్వాలు లేవు పైగా మధ్యమ పర్వమని క్రొత్తది కనిపిస్తూంది ప్రథమభాగమైన బ్రహ్మపర్వంలో సూర్యుడు పరబ్రహ్మగా వర్ణింపబడ్డాడు 216 అధ్యాయాలున్న యీ పర్వంలో సూర్యుని మహిమ ఎంతగానో వర్ణింపబడింది యిందులో ఉపనయన సంస్కారం, గృహస్థ ధర్మం, స్త్రీ ధర్మం, స్త్రీ కర్తవ్యం మొదలైనవి చెప్పబడినాయి

10. బ్రహ్మ, ప్రకృతి, గణేశ, కృష్ణఖండములనే నాలుగు ఖండాలున్న బ్రహ్మవైవర్త పురాణంలో 18 వేల శ్లోకాలున్నట్లు నారదపురాణంలో వుంది - కాని ప్రస్తుతం మనకు అది అసంపూర్ణంగా లభిస్తున్నది. యిందులోని కృష్ణఖండంలో కృష్ణావతార సంబంధమైన విషయమంతా వివరింపబడింది.

11. 11 వేల శ్లోకాలున్న లింగపురాణంలో శివలింగ మహాత్మ్యమేగాక గాయత్రీ మహిమ, శ్రాద్ధప్రకరణం, వివిధ దానాల వివరాలు ఉన్నాయి

12. 24,000 వేల శ్లోకాలున్న వరాహ పురాణంలో ప్రస్తుతం 9471 శ్లోకాలు మాత్రమే లభిస్తున్నాయి. ఇది బహుశ పూర్వ భాగము మాత్రమే అయి వుంటుందని పలువురి అభిప్రాయము. ఉత్తరభాగం లభించుటలేదు.

13. పురాణాలన్నింటిలోనూ మిక్కిలి పెద్దది స్కాందపురాణం యిందులో 6 సంహితలు 50 ఖండాలుగా ఉన్నాయని, మొత్తం ఒక లక్ష శ్లోకాలున్నాయని శ్రీనాథుడు మొదలైన కవులు అభిప్రాయపడ్డారు. కాని నారద పురాణంలో మాత్రం 7 ఖండాలుగాను 81 వేల శ్లోకాలుగాను చెప్పబడింది శివమహిమ ప్రతిపాదకమైన యీ పురాణం సంపూర్ణంగా ఎక్కడా లభించడం లేదు అనేక సంహితలు ఖండములు వంచబకొలది మహాత్మ్యములు కలని స్కాందపురాణంగా చెప్పుకోవలసియుంది.

14. వామనపురాణం పూర్వ ఉత్తరభాగాలు రెండూ లభిస్తున్నప్పటికి నారద పురాణంలో చెప్పబడిన పదివేల శ్లోకాలు కనబడుటలేదు.

15. బ్రాహ్మీ, భగవతీ, సౌరీ, వైష్ణవీ అను నాలుగు సంహితలతో కూడిన కూర్మ పురాణంలో 17 వేల శ్లోకాలున్నాయి కాని యిప్పుడు 6 వేల శ్లోకాలుగా లభించే భాగం కేవలం బ్రాహ్మీ సంహిత మాత్రమే

16. 14 వేల శ్లోకాలున్న మత్స్యపురాణములో ప్రళయకాలంలో శ్రీమహావిష్ణువు మత్స్య రూపంలో రాబోవు సృష్టికి కావలసిన వానిని బీజరూపంగా గ్రహించి సంరక్షించాడన్న విషయం, ధర్మశాస్త్రాల విషయాలు విపులంగా చర్చించబడినాయి

17. గరుడపురాణంలో 19 వేల శ్లోకాలున్నాయి. దేవతా ప్రతిష్ఠలు, పూజాది విధానాలు, వర్ణాశ్రమ ధర్మాలు, ఆయుర్వేదాది సకల శాస్త్ర సంగ్రహము, ఆహ్నిక విధులు, సాంఖ్యవేదాంతాది తత్త్వ నిర్ణయాలు, పూర్వభాగంగానూ, పూర్వజన్మ యందలి కర్మననుసరించి జీవుల సుఖదుఃఖములు, యమలోకము, అందలి వివరాలతో కూడినవి ఉత్తరభాగంగాను కలది గరుడ పురాణము.

18. 12 వేల శ్లోకములు గల బ్రహ్మాండ పురాణం, ప్రక్రియా పాదము, అనుషంగపాదము, ఉపోద్ఘాతపాదము, ఉపసంహారపాదము అని నాలుగు పాదాలుగా విడగొట్టబడింది బ్రహ్మాండంలోని భూగోళంయొక్క వివిధ స్థానాలను గూర్చిన వర్ణన యీ గ్రంథంలో విపులంగా కనిపిస్తుంది

ఈ పద్దెనిమిది పురాణాలూ భారతదేశ వాఙ్మయంలో చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి

శ్రీశైలప్రభ జూలై 1984/4

# 134. మహాభారతము

శ్రీ వేదవ్యాస విరచితమైన మహాభారతం పవిత్ర భారతావనిలో అపురూప కళాఖండం జాతీయ సంపదగా లెక్కింపబడదగిన ఆణిముత్యం కలియుగంలో ఉద్భవించిన మొట్టమొదటి యుద్గ్రంథం ఈ మహాభారతమే

క్రీ.పూ. 3101 లో కలియుగము ప్రారంభమైనదని అంతా ఒప్పుకుంటారు మహాభారత యుద్ధం యాదవ నాశనం జరిగిన తరువాత వ్యాసభగవానులు సింహావలోకనంచేసి, వారి చరిత్రను ముందుతరాలవారికి అందించాలనే సత్సంకల్పంతో మూడు సంవత్సరాలలో మహాభారతాన్ని నిర్మించాడు ఈ మహాభారత నిర్మాణం క్రీ.పూ. 3101 నుండి 3090లోపు జరిగియుండవచ్చునని పలువురి అభిప్రాయము.

వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు మొదలైనవాని సారభూతమైన ఈ మహాభారతంలో దొరకని సత్పదార్థం లేదు. అందుకే

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ।
యదిహా స్తి తదన్యత్ర యన్నేహా స్తినతత్ క్వచిత్॥

అన్నాడు సౌతి.

ఇంతటి మహత్తర సంపత్తిగల మహాభారత గ్రంథాన్ని వ్రాయడానికి సంకల్పించిన వ్యాసమహర్షి తనకవితాధారను గ్రహించగలవాడు లభించనందున బ్రహ్మనుగూర్చి తపస్సు చేసాడట బ్రహ్మ ప్రత్యక్షమై వ్యాసుల సంకల్పాన్ని అభినందించి గణపతిని ప్రార్థించమన్నాడట. వ్యాసులవారు ధ్యానించగా గణపతి ప్రత్యక్షమైనాడట అప్పుడు వ్యాసమహర్షి "గజాననా, నేను భారతాన్ని రచించి లోకానికి అందించాలని సంకల్పించాను. దానికి నీ సహాయం కావాలి" అంటే విఘ్నేశ్వరుడు" అలాగే వ్రాస్తాను. కాని నీవు ఆలస్యం లేకుండా వెంటవెంటనే శ్లోకాలు చెప్పాలి" అని ఒక నియమం పెట్టాడట. అందుకు వ్యాసమహర్షి కూడా ఒక నియమం విధించాడట "నేను చెప్పిన ప్రతి శ్లోకం నువ్వు అర్థం చేసుకొని వ్రాయాలి" అని ధారకుంటుపడ్డప్పుడు వ్యాసుడు 8800 శ్లోకాలను అందించాడట. దీనిని గణపతి అర్థం చేసుకొని వ్రాసేలోపు వ్యాసులవారు ధ్యానముద్రలో మరల శ్లోకరచన చేసాడట. వీటినే భారతంలో వ్యాసఘట్ట శ్లోకాలు అంటారు. వీటిని గూర్చి ప్రస్తావిస్తూ వ్యాసులవారు "అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోక శతాని చ అహంవేద్మి శుకోవేత్తి సంజయో వేత్తివా న వా" అని స్వయంగా చెప్పుకున్నారు

వ్యాసులవారి హృదయాన్ని గ్రహించగలిగిన శక్తి సామర్థ్యాలు ఏ కొద్దిమందికో మాత్రం వుంటాయి మహాభారతాన్ని గురించి ప్రస్తావిస్తూ నన్నయభట్టారకుడు యీ విధంగా అన్నాడు

సాత్యవతేయ విష్ణుపద సంభవమై, విబుధేశ్వరాబ్ధి సం
గత్యుప శోభితంబయి, జగద్విదతంబగు భారతీయ భా
రత్యమరాప గౌఘము, నిరంతర సంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు విననం గొనియాడిన నెల్లవారికిన్

*"భారతం విన్నవారికి, కొనియాడినవారికి ఎడతెగకుండా సంపద అభివృద్ధి చెందుతుంది. ఈ మహాభారతం గంగానదియే వ్యాసుడు యీ గంగానదికి పుట్టిన చోటైన ఆకాశము. శ్రీమన్నారాయణుడే యీ నది కలిసిపోవు సముద్రము" ఇక్కడ గంగతో పోల్చి చెప్పుటచే భారతేతి హాసము యొక్క పావనత్వము, ఆకాశంతో పోల్చబడటం వల్ల వ్యాసుని అనంతమహిమ వెల్లడవుతుంది.*

అమితాఖ్యానక శాఖలం బొలిచి, వేదార్థామలచ్ఛాయమై,
సుమహావర్గ చతుష్కపుష్ప వితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయ నోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై

*"వ్యాసుడొక పూలతోట, ఆ తోటలో పుట్టిన పారిజాతము (కల్పవృక్షము) భారతము. అందలి ఆఖ్యానములే శాఖలు. అందుండి వెలువడే వేదార్థమే నీడ అందు చెప్ప బడిన ధర్మార్థ కామమోక్షాలే పూలగుత్తులు. కృష్ణార్జునాదుల గుణముల సంకీర్తనమే దాని ఫలములు. కల్పవృక్షము దేవతలచే సేవింపబడునట్లు ఈ కల్పవృక్షము భూమియందలి ప్రజలచే సేవింపబడుగాక" హిందువుడైన ప్రతి వ్యక్తి పురాణాలు, మహాభారతము, భాగవతము, బ్రహ్మసూత్రాలను గురించి తెలుసుకొని తీరాలి.*

శ్రీశైలప్రభ 7/1984

*చివరిగా వ్యాసుని గూర్చిన వర్ణన నొకదానిని ఆకర్ణించండి.*

అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః

*నాలుగు ముఖములు లేని బ్రహ్మయట, రెండే బాహువులు గల శ్రీమహావిష్ణువట, మూడవ నేత్రములేని ఈశ్వరుడట, అనగా త్రిమూర్త్యాత్మకుడని యర్థము. చూచితిరా! భారత కర్త ఎట్టివాడో! అట్టి కర్తచే నిర్మింపబడిన ఇతిహాసమునందెట్టి విజ్ఞానముండునో యూహించండి.*

*పై శ్లోకమునకు ఓ చిన్న పద్యమును వ్రాసి దానిని నా మిత్రశతము"లో యిష్టదేవతాస్తుతిలో జొప్పించినాను. అది*

నాల్గు ముఖములు లేకయే నలువయగును
బాహువులు రెండె యైనను శ్రీహరియగు
ఫాలనేత్రము లేకున్న భర్గుడగును

ముగురు మూర్తుల రూపమ్ము ముప్పిరి గొను
వ్యాస భగవాను భజయింతు భక్తిమీర

భారతములోని పర్వములు - 18
భగవద్గీతలోని అధ్యాయములు - 18
భారతయుద్ధము జరిగిన రోజులు - 18
భారతయుద్ధములో భీష్ముడు 10 రోజులు యుద్ధము చేసెను
భారతయుద్ధములో ద్రోణాచార్యుడు 5 రోజులు యుద్ధము చేసెను
భారతయుద్ధములో కర్ణుడు 2 రోజులు యుద్ధము చేసెను
బారతయుద్ధములో శల్యుడు 1/2 రోజు యుద్ధము చేసెను
భారతయుద్ధములో దుర్యోధనుడు 1/2 రోజు యుద్ధము చేసెను
మొత్తము యుద్ధము 18 రోజులు

భారత కురుక్షేత్ర సంగ్రామము 18 అక్షౌహిణుల సైన్యము
యిందు పాండవుల బలము 7 అక్షౌహిణులు.
యిందు కౌరవుల బలము 11 అక్షౌహిణులు.
ఒక అక్షౌహిణి యనగా

| | | |
|---|---|---|
| రథములు | - | 21,870 |
| ఏనుగులు | - | 21,870 |
| గుఱ్ఱములు | - | 65,610 |
| కాల్బలము. | - | 1,09,350 |
| | | 2,18,700 |

ఈ సంఖ్య ఏ విధముగా వచ్చినదన్న

| రథములు | ఏనుగులు | గుఱ్ఱములు | కాల్బలము | |
|---|---|---|---|---|
| 1 | 1 | 3 | 5 | పత్తి |

పత్తిని త్రిగుణము చేసిన సేనా ముఖమగును అటులనే

| | | | | |
|---|---|---|---|---|
| 3 | 3 | 9 | 15 | సేనాముఖము |
| 9 | 9 | 27 | 45 | గుల్మము |
| 27 | 27 | 81 | 135 | గణము |
| 81 | 81 | 243 | 405 | వాహిని |
| 243 | 243 | 729 | 1215 | పృతన |
| 729 | 729 | 2187 | 3645 | చము |
| 2187 | 2187 | 6561 | 10935 | అనీకిని |

దీనిని దశగుణము (అనగా 10చే హెచ్చించుట) చేసిన అక్షౌహిణియగును. (త్రిగుణ మనగా 3చే హెచ్చించుట)

పత్తిని 3 చే హెచ్చించిన సేనాముఖము వచ్చును సేనాముఖమును 3చే హెచ్చించిన గుల్మము వచ్చును

అనీకిని 10చే హెచ్చించిన అక్షౌహిణియగును

| | | | | |
|---|---|---|---|---|
| రథములు | - | 2187x10 | = | 21,870 |
| ఏనుగులు | - | 2187x10 | = | 21,870 |
| గుఱ్ఱములు | - | 6561x10 | = | 65,610 |
| కాల్బలము | - | 10,935x10 | = | 1,09,350 |
| | | | | 2,18,700 |

ఒక అక్షౌహిణియనగా

| | | |
|---|---|---|
| రథములు - | 21,870 | యిరువది యొక్క వేలు నెనమన్నూట డెబ్బది |
| ఏనుగులు - | 21,870 | యిరువది యొక్క వేలు నెనమన్నూట డెబ్బది |
| గుఱ్ఱములు - | 65, 610 | అఱువదయిదువేలు నార్నూట పది |
| కాల్బలము - | 1,09,350 | లక్షయు తొమ్మిది వేలు మున్నూట ఏబండు |
| | 2,18,700 | రెండు లక్షల, పదునెనిమిది వేల ఏడువందలు |

పైనుదహరించిన అక్షౌహిణి వివరములను భాషాప్రవీణ విద్యా ప్రవీణ శ్రీమాన్ నందిభొట్ల సత్యనారాయణ గారు సంస్కృత భారతము నుండి సేకరించి యిచ్చినారు వారికి నా కృతజ్ఞతలు.

భారతయుద్ధము - జీవిత యుద్ధము

కురుక్షేత్రయుద్ధము - కురుపాండవులకు కాదు న్యాయాన్యాయాల భీకర సంఘర్షణ ధర్మాధర్మాలకు జరుగుతున్న ఘోర సంగ్రామం

| | | | | |
|---|---|---|---|---|
| పాపవృతులు | - | కౌరవులు | - | తామస, రాజస ప్రవృత్తులు |
| పుణ్యావృత్తులు | - | పాండవులు | - | సాత్వికవృత్తి |
| శ్రీకృష్ణుడు | - | పరమాత్మ | - | రథసారథి |
| అర్జునుడు | - | జీవాత్మ | - | రథికుడు |
| రథము | - | మానవశరీరము | | |
| పగ్గాలు | - | మనస్సు | | |

రథమునకు పూన్చిన నాలుగు తెల్లని గుఱ్ఱములు నాలుగు వేదములు తెలుపు జ్ఞానమును సూచించును ఆ నాలుగు తెల్లని గుఱ్ఱముల పేర్లు. 1. శైబ్య, 2 సుగ్రీవ, 3. మేఘపుష్ప, 4. వలాహకము

## 135. శబరిమలైలోని 18 మెట్ల విశిష్టత

1 నుండి 5 మెట్లు = పంచజ్ఞానేంద్రియములు, లేదా పంచతన్మాత్రలు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు

6 నుండి 13 మెట్లు = అష్టబంధములు అనగా, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, డంబము, అసూయ.

14 నుండి 16 మెట్లు = త్రిగుణములుగా చెప్పబడినవి.

సత్వగుణము, రజోగుణము, తమోగుణము

17వ మెట్టు = విద్య (జ్ఞానము, చదువు)

18వ మెట్టు = అవిద్య - (అజ్ఞానము, అహమ్మతి) యివే శబరిమలైలోని 18 మెట్ల విశిష్టత అని టి వి ప్రసారంలో విన్నాను. మరియు అయ్యప్ప నిత్య బ్రహ్మచారి, తన 18వ ఏటనే జ్యోతిస్వరూపుడైనాడు. 41 రోజులు భక్తితో దీక్షతో నియమాలు పాటించి తనదగ్గరకు వచ్చిన భక్తులకు జ్యోతిస్వరూపుడైన అయ్యప్ప మకర సంక్రాంతినాడు జ్యోతి స్వరూపములో కన్నులపండువుగా నయనానందకరముగా దర్శనమిస్తాడు

విద్య, అవిద్యల గూర్చి వచన భాగవతము, ఏకాదశ స్కంధము 290వ పేజీలో యీ క్రింది విధంగా వుంది

విద్య = మూఢజనులకు జ్ఞానోపదేశము, కామ్యత్యాగము, సమదర్శనము, వైష్ణవ భక్తి, ప్రాణాయామము, చిత్తశుద్ధియనునవి యుండుట విద్యయనబడును

అవిద్య = శమదమాదిగుణరహితుడును, మద్భక్తి విరహితుడు నగుట అవిద్యయనబడును.

# 136. వసుదేవునికి 18 మంది భార్యలు

వసుదేవుడు తాపసులకు నమస్కరించి "ధర్మతత్త్వజ్ఞులైన మీరు నా విన్నపమును వినుడు. ఏ సత్కర్మలాచరించినయెడల నా సంచిత కర్మములు నశించునో ఆయుపాయమును తెల్పుడు" అనియడుగగా ఆ మహామునులచ్చటి రాజులు వినుచుండగా "నిఖిల యజ్ఞములకును ప్రభువైన శ్రీహరిని గూర్చి యాగమొనర్పుము ఆయాగకర్మమున ఎట్టి దుష్కర్మములైనను నశించును దేవ ఋణము యాగము చేతను, ఋషి ఋణము వేదపాఠమువల్లను పితృఋణము పుత్రప్రాప్తి వలనను తీరును. ఈ మూడు ఋణములను తీర్చనివాడధో లోకమునకు పోవును నీ వుత్తమ పుత్రులను బడసి పితృఋణము తీర్చితివి. అధ్యయనము వలన ఋషిఋణమును తీర్చితివి ఇక దేవఋణము తీర్చవలసి యున్నది కావున యాగమొనరింపుము" అని చెప్పిరి. వసుదేవుడును "మహామునులారా! మీరు చెప్పినట్లు యాగము చేసెదను. ఆ యాగక్రియను మీరే నడపవలెను" అని ప్రార్థించి, వారి సమ్మతితో వారినే యాజకులుగా వరించి, ఆ పుణ్యతీర్థప్రాంతముననే మహేంద్ర వైభవమున తన పదునెనమండ్రు భార్యలతో కూడ దీక్షగైకొని వేదోపదిష్ట విధిని ఆయాగమును పరిసమాప్తి నొందించెను

వచన భాగవతము, దశమ స్కంధము - 249

# 137. ప్రహ్లాద అజగర సంవాదములో

1 బ్రహ్మచారికి నియమములు మానుట తగదు, 2. గృహస్థునకు తన విహిత క్రియలను విడుచుట తగదు, 3. తపస్సు చేయువానికి ఊరిలో నుండుట తగదు, 4. సన్యాసికి తరుణితోడి పొత్తెంత మాత్రము తగదు, 5. మానవుని శరీరము రథము, 6 బుద్ధి సారథి, 7. ఇంద్రియములు గుఱ్ఱములు, 8. మనస్సు పగ్గము, 9 ప్రాణ -అపాన - వ్యాన - ఉదాన - సమాన - నాగ - కూర్మ - కృకర - దేవదత్త - ధనంజయములనెడి పదివాయువులును ఇరుసు, 10, ధర్మాధర్మములు రథచక్రములు - 11 చిత్తము బహువిధముల కట్టబడిన కట్లు, 12. శబ్దము మున్నగునవి సంచరించు ప్రదేశములు, 13. అభిమానముతో కూడిన ఆత్మ రథమున కూర్చుండు యజమానుడు, 14. ప్రణవము విల్లు, 15. శుద్ధమైన జీవుడు బాణము, 16 శుభములనొసగు బ్రహ్మము లక్ష్యము, 17 రాగ - భయ - మద - ద్వేష - శోక - లోభ - మోహ - మాన - మత్సరాదులు విరోధులు, 18 ఇట్లు మనుష్యరూపముననున్న రథమును తనవశము చేసికొని, మహాభాగవత చరణ కమల సేవా నిశితమైన విజ్ఞానమనెడి ఖడ్గమును ధరించి, శ్రీమన్నారాయణుని కరుణావలోకన బలమున రాగాది శత్రువులను నిర్మూలించి ప్రణవధనుస్సున శుద్ధ జీవశరమును సంధించి బ్రహ్మమనియెడు గురియందు పడవేసి, అహంకార రథికుడు రథికత్వమును మాని నిజానందమున నుండవలయును

వచన భాగవతము సప్తమ స్కంధము, 451 ప్రహ్లాద అజగర సంవాదము నుండి

# 138. కల్పసూత్రములు పదునెనిమిది

ఆగమము : ఆగతం శంభు వక్త్రాచ్ఛ - గతం చ గిరిజాముఖమ్,
సమ్మతం వాసుదేవస్య తస్మాదాగమ ముచ్యతే॥

ఆగమమనగా శంభుని ముఖము ద్వారా వచ్చియుండి - పార్వతి ముఖము ద్వారా వెల్లడి కాబడి - వాసుదేవుని అనుమతి ద్వారా సరియైనదని నిరూపించుకొని చెప్పబడినదే ఆగమమని చెప్పబడియున్నది

మొత్తం కల్పసూత్రములు పదునెనిమిది (అష్టాదశ సంఖ్యలుగా నున్నవి) 1. బోధాయనం, 2 ఆపస్తంబం, 3 సత్యాషాడం, 4. ద్రాహ్యాయణం, 5 అగస్త్యం, 6. శాకల్యం, 7. అశ్వలాయనం, 8. శాంభవీయం, 9 కాత్యాయనం, 10. వైఖానసం, 11. శౌనకీయం, 12. భారద్వాజం, 13. అగ్నివేశం, 14. జైమినీయం, 15. వాధూలం, 16. మాధ్యన్దినం, 17. హిరణ్యకేశీయం, 18. కౌషీతకం

వీటిలో మొదటి తొమ్మిందింటిని పూర్వసూత్రములనియు, చివరి తొమ్మిదింటిని అపరసూత్రములనియు, వ్యవహరించెదరు అపరసూత్రములంటే పరిపూర్ణసూత్రముల నియు, దైవిక సంబంధమైన పూజాదులు గూడా చెప్పబడిన సూత్రములనియు

విజ్ఞులంటారు అందులో ప్రధమగణ్యామైనది వైఖానస సూత్రం. ఎందువలననగా, విఖనోముని సాక్షాత్ నారాయణ తేజో సంభవునిగాను, ఆయన నారాయణార్చనను, స్వామి ఆదేశానుసారం ప్రచారం చేసినట్లుగా ఆగమశాస్త్ర గ్రంథాలలో ప్రమాణములుగా గనపడుచున్నవి ఈ వైఖానస సూత్రం ప్రధమతః గమ్యామైనదనియు, ఈ సూత్రం అన్ని విధముల శ్రేష్ఠమైనదని చెప్పబడినది అర్చావతారము శ్రీ వైఖానసులు - 8

## 139. రాగాదులు - 18

1. మాయ, 2. అజ్ఞానము, 3. అవివేకము, 4. అభిమానము, 5 కామ, 6. క్రోధ, 7. లోభ, 8. మోహ, 9. మద, 10. మత్సరము, 11 ప్రారబ్ధము, 12. ఆగామి, 13. సంచితము, 14. సుఖము, 15. దుఃఖము, 16. స్థూల శరీరము, 17. సూక్ష్మ శరీరము, 18 కారణ శరీరము (లేదా యాతనా శరీరము)

1 నుండి 10 = రాగాదులు, 11 నుండి 13 = కర్మలు, 14, 15 సుఖదుఃఖాలు, 16 నుండి 18 = శరీరములు శ్రీ భద్రాద్రి రామశతకము 42వ పద్యము

పద్దెనిమిదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 19వ సంఖ్య

## 140. నేలపై నుంచరానివి

1. శివలింగము, 2 దీపము, 3. అమ్మవారి విగ్రహము, 4. శంఖము, 5. సాలగ్రామము, 6. పుష్పము, 7. తులసీదళములు, 8. జపమాల, 9. కర్పూరము, 10 మంచి గంధపు చెక్క, 11. రుద్రాక్షలు, 12 తులసిపూసలు, 13. యజ్ఞోపవీతములు, 14 అద్దము, 15. బంగారము, 16. దేవుని పటము, 17 గంట, 18. దర్భలు, 19. అక్షతలు మొదలగు మంగళ ప్రదమైన వస్తువులయందు లక్ష్మీదేవి యుండును, గాన నేలపై నుంచినయెడల ధనహీనులగుదురు విశ్వదేవార్చన దైవ ప్రార్ధన - 12

## 141. శ్రీ భగవద్గీత - 10/4,5

బుద్ధి ర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః।
సుఖం దుఃఖం భవో ఒభావో భయం చా ఒభయమేవచ।
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో ఒయశః।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥

1. బుద్ధి, 2. జ్ఞానము, 3. మోహము లేకపోవుట, 4. ఓర్పు, 5. సత్యము,

6. బాహ్యేంద్రియ నిగ్రహము, 7. అంతరింద్రియనిగ్రహము, 8 శాంతి, 9. సుఖదుఃఖములు, 10 ఉత్పత్తి నాశములు, 11. భయము, 12. భయము లేకపోవుట, 13. హింస చేయకపోవుట, 14. సమచిత్తత్వము, 15. సంతుష్టి, 16. తపస్సు, 17.దానము, 18. కీర్తి, 19. అపకీర్తి.

ఈ పలు విధములైన గుణములు ప్రాణి సమూహములకు నా చేతనే (శ్రీకృష్ణుడు) కలుగుచున్నవి — శ్రీభగవద్గీత -10అ. 4,5 శ్లోకాలు

# 20వ సంఖ్య

## 142. శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని సంబోధించుచు వాడిన పేర్లు

1. అనఘః, 2 కపిధ్వజః, 3. కురుశ్రేష్ఠః, 4 కురునందనః, 5. కురుప్రవీరః, 6. కౌంతేయః, 7 గుడాకేశః, 8. ధనంజయః, 9 ధనుర్ధరః, 10. పరంతపః, 11 పార్థః, 12. పురుషవ్యాఘ్రః, 13. పురుషర్షభః, 14. పాండవః, 15. భరతశ్రేష్ఠః 16 భరతసత్తమః, 17 భరతర్షభః, 18 భారతః, 19. మహాబాహుః, 20. సవ్యసాచిః

శ్రీమద్భగవద్గీత

ఇరవైవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 21వ సంఖ్య

## 143. భగవంతుని ఇరువదియొక్క అవతారములు

1. నారాయణుని దివ్యస్వరూపమే సకలావతారములకు మొదటిది అతని నాభి కమలమున సృష్టికర్తలలో ఉత్తముడైన బ్రహ్మ పుట్టెను. అతని అవయవముల నుండియే లోకములు కల్పింపబడినవి మొదట నతడు కౌమారావస్థలో బ్రహ్మణ్యుడై ఘోరమైన బ్రహ్మచర్యవ్రతమును ఆచరించెను.
2. నారాయణుడు రెండవ అవతారమున రసాతలమునకు కృంగిపోవుచున్న భూమిని ఉద్ధరించుటకు వరాహరూపమును ధరించెను
3. మూడవ యవతారమున నారదుడను మహర్షియై కర్మములనుండి విడుదలను కల్గించు వైష్ణవ తంత్రమును ఉపదేశించెను.
4. నాల్గవ యవతారమున నరనారాయణ రూపములను ధరించి ఘోరమైన తపస్సు చేసెను
5. అయిదవ యవతారమున కపిల మహర్షియై పుట్టి ఆసురియను బ్రాహ్మణునకు తత్త్వమును నిర్ణయించు సాంఖ్యమును ఉపదేశించెను

6 ఆరవ యవతారమున అత్రిమహామునికి అనసూయాదేవియందు దత్తాత్రేయుడై పుట్టి అలర్కునికిని, ప్రహ్లాదుడు మున్నగువారికిని తత్త్వమును ఉపదేశించెను.

7. యేడవ యవతారమున రుచికి ఆకూతియందు యజ్ఞుడను కుమారుడుగా పుట్టి యమాది దేవతలతో కూడ స్వాయంభువ మన్వంతరమును రక్షించెను.

8 అష్టమావతారమున మేరుదేవియందు నాభికి పుత్రుడైపుట్టి ఉరుక్రముడని ప్రసిద్ధిపొంది విద్వాంసులకు పరమహంసమార్గమును బోధించెను

9. ఋషులందరు ప్రార్థింపగా తొమ్మిదవ జన్మమున పృథుచక్రవర్తియై పుట్టి భూమిని గోవుగాచేసి సమస్త వస్తువులను పిదికెను

10. చాక్షుసమన్వంతరము నందు పదవయవతారమున మత్స్యరూపమును ధరించి భూ రూపమైన నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించెను.

11. దేవతలు, దానవులు కలిసి అమృతమునకై పాలసముద్రమును మథించునప్పుడు పదునొకండవ యవతారమున కూర్మ రూపమును ధరించి మందరపర్వతమును తనవీపుపయి నిలిపెను

12. పండ్రెండవ యవతారమున దేవదానవులు మథించుచున్న పాలసముద్రము మధ్య నుండి ధన్వంతరియై పుట్టి, అమృత కలశమును తెచ్చెను

13. పదమూడవ యవతారమున మోహినీరూపమును ధరించి దానవులను మోస గించి దేవతలకమృతమును పంచిపెట్టెను

14. పదునాల్గవ యవతారమున నరసింహ రూపమును ధరించి హిరణ్యాకశిపుని సంహరించి, ప్రహ్లాదుని కాపాడెను.

15. పదునైదవ యవతారమున వామన మూర్తియై బలిచక్రవర్తిని యాచించి, తన మూడడుగులతో మూడు లోకములను ఆక్రమించెను.

16. పదునారవ యవతారమున జమదగ్నికి భార్గవరాముడై జన్మించి క్రోధమూర్తియై బ్రాహ్మణులకు ద్రోహము తలపెట్టిన క్షత్రియులను (21 మార్లు) పూర్తిగా నశింప జేసెను

17. పదునేడవ యవతారమున బాదరాయణుడై జన్మించి కలిసిపోయియున్న వేదములను విభజించెను

18. పదునెనిమిదవ యవతారమున దశరథ పుత్రుడగు శ్రీరాముడుగా జన్మించి సముద్రమును దాటి రాక్షసరాజును సంహరించుట మున్నగు ఘనకార్యములొన రించెను

19. పందొమ్మిదవ జన్మమున శ్రీకృష్ణుడుగాను, బలరాముడుగాను పుట్టి దుష్టులైన రాక్షసులను, రాజులను సంహరించి భూభారమును తగ్గించెను.

20. తర్వాతి యవతారమున కలియుగమున మధ్యగయా ప్రదేశమున బుద్ధుడను పేరుతో జనసుతుడై జన్మించును

21. యుగసంధి సమయమున రాజులు చోరప్రాయులై సంచరింపగా విష్ణుయశుడను

బ్రాహ్మణునకు చివరి యవతారమగు కల్కి రూపుడై జన్మించి జనుల నుద్ధ రించును ఇట్టి భగవంతుని తెలుపు గ్రంధమే భాగవతము

వచన బాగవతము ప్రదమస్కందము = 5

## 144. ఇక్ష్వాకు వంశము

మనువొకనాడు గట్టిగా తుమ్మగా వికలుడేమియును గాక, అతని ముక్కు రంధ్రములనుండి, ఇక్ష్వాకుడను నతడు పుట్టెను అతడు గొప్ప కీర్తి గడించి, సూర్యవంశపు రాజులలో ముఖ్యుడయ్యెను ఇక్ష్వాకు వంశమున బృహదశ్వుని తనూ జుడు కువలయాశ్వునకు ఇరువది యొక్క వేల మంది పుత్రులుగలరు

వ బాగవతము నవమ స్కందము - 573

## 145. సృష్టి వివరణ

బ్రహ్మదేవుని బొటనవ్రేలి నుండి 1. దక్షుడు, 2. తొడలవలన నారదుడు, 3. నాభి నుండి పులహుడు, 4. చెవి నుండి పులస్త్యుడు, 5. దేహము నుండి భృగువు, 6 చేతి నుండి క్రతువు, 7. ముఖము నుండి అంగిరసుడు, 8. ప్రాణము నుండి వసిష్ఠుడు, 9. మనస్సు నుండి మరీచి, 10. కన్నుల నుండి అత్రి పుట్టిరి 11 యీ పదిమందియే కాక అతని దక్షిణ స్తనము నుండి ధర్మము, 12. వెన్ను వలన అధర్మ, 13 మృత్యువులు, 14 ఆత్మ నుండి మన్మధుడును కలిగిరి, 15.కనుబొమల నుండి క్రోధము, 16 అధరము నుండి లోభము, 17. ముఖము నుండి సరస్వతి, 18 మేఢ్రము నుండి సముద్రములు, 19. అపానము నుండి నిర్భతి, 20. ఛాయ వలన దేవహూతి, 21 కర్దములును పుట్టిరి వచన భాగవతము తృతీయస్కందము - 83

## 146. నరకలోక వర్ణన

ముల్లోకములకును చివర దక్షిణ దిక్కున అంతరాళము నందు ఘోరములైన నరకములుండును అందు దక్షిణభాగమున అగ్నిష్వాత్తు మున్నగు పితృదేవతల గణములు తమ గోత్రములందు జన్మించిన వారికి మేలు కలుగుటకు సత్యములైన ఆశీర్వాదముల నిచ్చుచుందురు పితృపతియగు యముడు తన లోకమునకు వచ్చిన జంతువుల కర్మకు తగిన ఫలములనిచ్చి శిక్షించుచుండును ఆ నరకము లిరువదియొకటి అవి 1 తామిస్రము, 2 అంధతామిస్రము, 3. రౌరవము, 4. మహారౌరవము, 5. కుంభీపాకము, 6. కాల సూత్రము, 7 అసిపత్రవనము, 8. సూకరముఖము, 9. అంధకూపము, 10. క్రిమిభోజనము, 11. సందంశము, 12. తప్తోర్మి, 13. వజ్రకంటక, 14. శాల్మలి, 15 వైతరణి, 16 పూయోదనము, 17. ప్రాణరోధము, 18 విశసనము, 19. లాలాభక్షము, 20 సారమేయాదనము, 21 అవీచిరయము రేతః పానము అనునవి 21 నరకములు

మరియు నరకములు క్షార కర్దమము, రక్షో గణభోజనము, శూలపోత్రము,

*దందశూకము, అవటనిరోధనము, అపర్యావర్తనము, సూచీముఖము నవి సప్త విధములనియు, అవియు కూడ చేరినచో ఇరువదియెనిమిది నరకములగుననియు కొందరందురు.*

వచన భాగవతము - పంచమస్కంధము = 301

## 147. అశ్వమేధ యాగము

*అశ్వమేధ యాగమునకు 21 యూపస్తంభములు కావలసియుండును - అవి యూప అనగా యజ్ఞపశువును గట్టివేయు స్తంభము*

| | |
|---|---|
| *మారేడు స్తంభములు* | 6 |
| *చంద్ర స్తంభములు* | 6 |
| *మోదుగు స్తంభములు* | 6 |
| *విరిగి స్తంభము* | 1 |
| *దేవదారు యూపములొకటొకటి* | 1+1 |
| *విరిగి స్తంభమునకు ఎడమ. కుడి* | 21 |

*ప్రక్కలందు దేవదారు స్తంభములుంచవలయును*

శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము - బాలకాండ - 499

## 148. ఇరువది యొక్క అక్షరములు గల గాయత్రీ మంత్రములు

శ్రీ గణేశ గాయత్రీ

ఓమ్ వక్రతుండాయ విద్మహే ఏకదంతాయ
ధీమహి తన్నోదన్తిః ప్రచోదయాత్

శ్రీ నారాయణ గాయత్రీ

ఓమ్ నారాయణాయ విద్మహే వాసుదేవాయ
ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్

శ్రీలక్ష్మీ గాయత్రీ

ఓమ్ మహా దేవ్యై చ విద్మహే విష్ణు పత్న్యైచ
ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్

దేవీ గాయత్రీ

ఓమ్ దేవీ బ్రహ్మాణి విద్మహే మహాశక్త్యై చ
ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్

గౌరీ గాయత్రీ

ఓమ్ సుభగాయ చ విద్మహే కామ మాలాయ
ధీమహి తన్నో గౌరీ ప్రచోదయాత్

**గురుగాయత్రీ**

ఓమ్ గురుదేవాయ విద్మహే పరబ్రహ్మణే
ధీమహి తన్నోగురుః ప్రచోదయాత్

*ఈ గాయత్రీ మంత్రములు పరిశుద్ధ హృదయముతో ఆయా దేవతా పూజా ప్రారంభమున జపింపదగినవి* శ్రీభగవత్పూజామాలా - 30

# 149. పవనముక్తాసనములు

1 *రెండుకాళ్ళు ముందుకు చాపి రెండు చేతులను నేలపై ఆన్చియుంచి కూర్చొనవలయును.*
2. *కాలివ్రేళ్ళను ముందునకు వెనుకకు వంచుట,*
3 *కాలి మణికట్టును ముందుకు వెనుకకు వంచుట,*
4 *కాలి మణికట్టును గుండ్రముగా తిప్పుట,*
5. *నేలపై కూర్చొని పాదము మణికట్టును చేతితో త్రిప్పుట,*
6. *మోకాలును వంచుచుండుట, (నేలపై కూర్చొని),*
7. *త్రికోణాసనము అనగా నేలపై కూర్చొని కుడి చేతితో చాచిన ఎడమకాలి బొటనవ్రేలును పట్టుకొనవలయును. మరియు ఎడమచేతిని వెనుకకు చాపుచు అదే దిక్కుకు చూడవలయును ఈ విధముగ త్రికోణాసనము చేయుటచే వెన్నెముకకు శక్తిని కలించును,*
8. *అర్ధసీతాకోక చిలుక - కుడి కాలును చాచి ఎడమ కాలును మడతబెట్టి కుడి కాలు తొడపై నుంచుట,*
9. *సీతాకోక చిలుక - రెండు అరికాళ్ళను దగ్గరకు చేర్చి వాటిని రెండు చేతులతో పట్టుకొనుట యిదొక పద్ధతి, రెండు అరికాళ్ళను దగ్గరగా చేర్చి కుడి మోకాలుపై కుడి చేతిని ఎడమ మోకాలుపై ఎడమచేతి నుంచుట యిది రెండవ పద్ధతి*
10. *కాకినడక - కుడికాలి శీలమండపై కుడి పిఱ్ఱ ఆనించి ఎడమ మోకాలిపై ఎడమ చేతినుంచుట,*
11. *చేతివ్రేళ్ళను ముడుచుట, విప్పుట,*
12 *చేతి మణికట్టును పైకి క్రిందకు వంచుట,*
13 *చేతి మణికట్టును గుండ్రముగా తిప్పుట,*
14 *చేతిని ముందుకు చాపుట, మడచి వ్రేళ్ళతో భుజమును తాకుట,*
15 *రెండు భుజముల సదులను గుండ్రముగా తిప్పుట,*
16. *ముందుకు, వెనక్కి మెడను వంచుట, మరియు శిరస్సును ప్రక్కలకు వంచుట,*
17. *కాలును పైకెత్తి గుండ్రముగా తిప్పుట,*
18. *సైకిలు త్రొక్కుట,*
19 *పవనముక్తాసనము,*

ఎడమ మోకాలిని రెండు చేతులతో పట్టుకుని గడ్డమును తాకించుట, కుడిమోకాలును రెండు చేతులతో పట్టుకుని గడ్డమును తాకించుట, మరియు రెండు మోకాళ్ళను గడ్డమునకు తాకించుట,

20 వెన్ను పై రాకింగ్,

21 నౌకాసకం - వెల్లకిలపరుండి, పిర్రలను మాత్రమే భూమి పై నుంచి కాళ్ళను కొద్దిగా లేపి రెండు చేతులను మోకాళ్ళను తాకించుట - మరియు పిర్రలను మాత్రమే భూమిపై నుంచి రెండు పాదములను ఆకాశము వైపు చూపిస్తూ రెండు చేతులతో కాళ్ళ పిక్కలను తాకించుట,

ఈ పవన ముక్తాసనములు గురువు ద్వారా నేర్చుకొన్న సులభతరమౌను. ఆసనములు వేయుటవలన రక్తప్రసరణ బాగుండి ఆరోగ్యము స్వస్థత చెందును.

## 150. శ్రీకృష్ణ గాయత్రీ మంత్రము

ఓమ్ దామోదరాయ విద్మహే । వాసుదేవాయ
ధీమహి తన్నో కృష్ణః ప్రచోదయాత్ ॥

ఇరవై ఒకటవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 22వ సంఖ్య

## 151. శ్రీరామగాయత్రీ మంత్రము

ఓమ్ దాశరథాయ విద్మహే, సీతావల్లభాయధీమహి
తన్నో రామః ప్రచోదయాత్ శ్రీభగవత్ పూజామాల - 130

## 152. శ్రీ సుబ్రహ్మణ్య గాయత్రీ మంత్రము

ఓమ్ తత్పురుషాయ విద్మహే। మహాసేనాయ
ధీమహి తన్నషణ్ముఖః ప్రచోదయాత్॥ శ్రీ గాయత్రీ పూజావిదానము - 8

## 153. ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ద క్షేత్రములు

1. అన్నవరము : ఇచ్చట శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి వారి దేవాలయము చిన్నకొండపైన గలదు కొండపైకి రోడ్డు కూడా వేసినారు. ఆంధ్రదేశమున ప్రసిద్ధి పొందిన దేవాలయములలో అన్నవరం ఒకటి ఇచ్చట రైల్వేస్టేషను కూడా కలదు ఈ క్షేత్రము తూర్పుగోదావరి జిల్లాలో మదరాసు నుండి కలకత్తా వెళ్ళు రైలు మార్గమున నున్నది.

**2.** అమరావతి : ఇది గుంటూరు జిల్లాలో గుంటూరుకు 32 కిలోమీటర్ల దూరములో కృష్ణాతీరమున నున్నది ఇది పూర్వము ఆంధ్రరాజ్యము వెలసియుండిన కాలములో గొప్ప పట్టణముగా నుండెను ఇక్కడ అమరలింగేశ్వరస్వామి ఆలయమున్నది ఆ శివలింగమును చూచితీరవలయును. ఇది హిందూక్షేత్రము పూర్వము బౌద్ధుల విహారముగా కూడ నుండినది ప్రసిద్ధ పంచారామములలో ఇదియొక ఆరామము బౌద్ధులైన ఆంధ్రుల శిల్పకళా ప్రావీణ్యమును జూపు కట్టడములు, శిల్పములు పెక్కులిక్కడ గలవు

**3.** అరసవిల్లి : శ్రీకాకుళం జిల్లాలో శ్రీకాకుళం పట్టణమునకు సమీపమందున్నది ఇక్కడ సూర్యనారాయణమూర్తి దేవాలయము సుప్రసిద్ధమైనది ప్రతి దినము సూర్యోదయ వేళకు సూర్యకిరణములు సరాసరి యీ దేవళములోని మూలవిరాట్టు పాదములప్రోల పడుచుండుట ఇందలి ముఖ్యవిశేషము

**4.** అలంపురము : మహబూబ్‌నగర్ జిల్లాలో తుంగభద్రానదీ తీరమందున్న ప్రసిద్ధ క్షేత్రము దీనిని దక్షిణ కాశి అని కూడా అందురు ఇక్కడ దేవాలయముల అందము, శిల్పముల సౌందర్యము చూచితీరవలసినదే

**5.** ఒంటిమిట్ట : కడపజిల్లా సిద్ధవటం తాలూకాలోని ప్రసిద్ధ క్షేత్రము ఇక్కడ కొండమీద వేంచేసియున్న కోదండరామ స్వామి ఆలయము మిక్కిలి ప్రసిద్ధమైనది తెలుగు భాగవతము రచించిన పోతన మహాకవి ఆరాధించిన స్వామి ఈ కోదండ రాముడు ఏటేట యిక్కడ వైభవముగా ఉత్సవములు జరుగును

**6.** శ్రీకాళహస్తి : ఇది చిత్తూరు జిల్లాలో సువర్ణముఖీ తీరమందున్న సుప్రసిద్ధ శివ క్షేత్రము, మహాప్రసిద్ధిగాంచిన పంచలింగ క్షేత్రములలో ఇది ఒకటి ఇక్కడి లింగము వాయులింగము. ఇక్కడి ఆలయము బ్రహ్మాండమైనది. కాళహస్తీశ్వరుడు పురాణ ప్రసిద్ధుడు ఒకసాలెపురుగు (శ్రీ) ఒక సర్పము (కాళ) ఒక ఏనుగు (హస్తి) మహాభక్తితో ఈ పరమేశ్వరుని సేవించి ముక్తిపొందినందున ఈ క్షేత్రమునకు ఈ పేరు వచ్చినది ఇక్కడ ఒక కొండ వున్నది దీనిని కన్నప్పకొండ అందురు బోయకన్నప్ప తన కంటిని గూడ ఊడబెరికి పరమేశ్వరునకు ఇచ్చి తన అవ్యాజభక్తిని ప్రదర్శించినది ఈ క్షేత్రమందే!

**7.** కీరపండరి : ఇది కృష్ణాజిల్లాలో మచిలీపట్టణమునకు సమీపమున నున్నది దీని అసలు పేరు చిలకలపూడి ఇటీవల పండరీనాధుని క్షేత్రముగా వెలసి, కీరపండరి అయినది ఇక్కడి విగ్రహము పండరీపురములోని దానివలె చాలా ముచ్చటగా నుండును ప్రతి సంవత్సరము ఇక్కడ బ్రహ్మోత్సవములు వైభవముగా జరుగును

**8.** శ్రీకూర్మము : ఇది శ్రీకాకుళము జిల్లాలో శ్రీకాకుళమునకు దగ్గరగా నున్నది ఇది కూర్మనాధ క్షేత్రము ఇక్కడ కూర్మావతారమెత్తిన మహావిష్ణు దేవాలయమున్నది

భారతదేశములో మరెక్కడా కూర్మావతారమునకు దేవళము లేదు.

**9.** కోటప్పకొండ : గుంటూరు జిల్లాలో నరసారావుపేటకు సమీపములో నున్నది. ఇందలి ఆలయము కోటీశ్వరాలయము అది కొండమీదనున్నది శివరాత్రికి ఏటేటా గొప్ప యుత్సవము జరుగును దానికి లక్షల కొలది భక్తులు వత్తురు పలువురు బండ్లమీద ప్రభలు కట్టుకొనివచ్చి మ్రొక్కుబళ్ళు చెల్లింతురు

**10.** తిరుచానూరు : ఇది తిరుపతికి దగ్గరగా నున్నది దీనినే అలివేలు మంగాపురము అని కూడా అందురు అలివేలు మంగమ్మ వేంకటేశ్వరస్వామి భార్య ఆమెకే పద్మావతీదేవి అని మరొకపేరు గలదు ఇచ్చట ప్రసిద్ధి గాంచిన ఆమె దేవాలయము గలదు.

**11 (అ).** తిరుమల తిరుపతి : ఇది ఆంధ్రదేశమునకే కాదు, యావద్దేశమునకు గొప్పక్షేత్రము ఇక్కడ ఏడుకొండల దేవుడు ప్రత్యక్ష దైవము భక్తులు అనుకున్నంతనే ఆదరించి ఆదుకొనువాడు ఆయన శ్రీ వేంకటేశ్వరస్వామి అని, శ్రీనివాసుడని, బాలాజీ అని పలువురు పలు పేర్లతో పిలుతురు ప్రతిరోజు, లక్షల యాత్రికులతో ఈ క్షేత్రము కిటకిటలాడుచుండును ఇంత ఆదాయము గల క్షేత్రము భారతదేశములో మరొకటి లేదు. కొండమీదికి పంపులు, వంపుల తారురోడ్డు వేసినారు దాని మీద బారులు బారులుగా బస్సులు ఎడతెగకుండవచ్చుచు పోవుచునుండును కొండపైన యాత్రికులకు చక్కని వసతులున్నవి ఈ దినము ఆ దినము అని లేక అక్కడ ప్రతిదినము ఏదో ఒక ఉత్సవము జరుగుచునేయుండును ఈ క్షేత్రము చిత్తూరు జిల్లాలో నున్నది

**(ఆ)** ద్వారకాతిరుమల : ఇదియును శ్రీ వేంకటేశ్వరస్వామి క్షేత్రమే యిచ్చట కూడ వేలాది భక్తులు వస్తుంటారు తల నీలాలు యిస్తుంటారు కొండమీద నున్న యీ స్వామిని దర్శించుటకు వచ్చే భక్తులకు వసతి సదుపాయములున్నవి యిక్కడకు వచ్చే భక్తులకు నిత్యమూ వెయ్యిమందికి అన్నదానము చేస్తారు. అన్నదాన సత్రములో శిలాఫలకములో యీ క్రింది శ్లోకము వుంది.

ద్వారకాద్రి నివాసాయ దివ్య సూర్యర్చి తాంఘ్రయే
అలర్మేల్మంగ నాథాయ వేంకటేశాయతే నమః

ఈ క్షేత్రము పశ్చిమగోదావరి జిల్లాలో ఏలూరుకు షుమారు 40 కిలోమీటర్ల దూరములో నున్నది

**12.** ద్రాక్షారామము : ఇది భీమేశ్వర స్వామి దివ్యక్షేత్రము ఇక్కడి దేవాలయము కడుదొడ్డది పంచారామములు అని ప్రఖ్యాతిపొందిన ఆరామములలో ఈ ద్రాక్షారామము అతిముఖ్యమైనది

**13.** పుష్పగిరి : ఇది కడప జిల్లాలో పినాకినీ నదీ తీరమందున్నది శృంగేరి శంకరాచార్యుల వారి పీఠమొకటి యిందున్నది దానిని యీ పేరుతో పుష్పగిరి పీఠము

అందురు ఇక్కడ చెన్నకేశవస్వామికి ప్రతి వైశాఖ శుద్ధములో గొప్పయుత్సవము జరుగును ఈ దేవాలయములో చక్కని శిల్పములున్నవి

**14.** భద్రాచలము : తెలుగువారి యిష్టదైవమైన శ్రీరామచంద్రుని దివ్యక్షేత్రము ఇక్కడి దేవస్థానము మిక్కిలి ప్రాచీనమైనది భక్తరామదాసు తనతనువును, ధనమును, సమస్తమును అర్పించి, రాజదండనము కూడ లెక్కచేయక మనసారా కొలచినది ఇక్కడి శ్రీరామచంద్రమూర్తినే

భద్రాద్రి అనగానే రామదాసు కీర్తనలు స్ఫురణకొస్తాయి శ్రీరామచంద్రుని దర్శనార్థం ఆ భక్తాగ్రేసరుని ఆవేదన, భక్తుణ్ణి వదిలేసి రాజు తానీషాకు దర్శనమిచ్చి మోక్ష ప్రాప్తి కలిగించిన శ్రీరాముని దయార్ద్రహృదయం గుర్తుకొస్తుంది దేశంలో వున్న పాతిక ప్రసిద్ధ రామావతార క్షేత్రాల్లో యీ భద్రాచలం పదహారవది. మొదట్లో తూర్పుగోదావరి జిల్లాలో ఉండే భద్రాద్రి తరువాత జిల్లాల పునర్విభజన ఫలితంగా నేటి ఖమ్మం జిల్లాలో కలిసింది

అసలీ భద్రాద్రి ఏర్పడటం చాలా విచిత్ర కథ! వనవాస కాలంలో సీతారాములొక శిలాఫలకం మీద విశ్రమించడం, వారి పాదస్పర్శచేత పునీతుడైన ఆ పర్వతుడు వరంకోరడం, అవతార సమాప్తి తరువాత మళ్ళీ తానొచ్చి అతణ్ణే తన నివాస స్థానంగా చేసుకొని ఉంటానని దాశరథి అనుగ్రహించడం అంతేకాదు ఆ పర్వతం ఎలా పుడుతుందో కూడా సెలవిచ్చాడు ఆ భద్రాద్రివాసుడు. మేరువుకు, మేరుదేవికి చిరకాలం సంతానం లేకపోగా బ్రహ్మదేవుని గురించి తపస్సు చేసారు అప్పుడు భద్రనామంతో పుడతాడీ పర్వతుడు .తనకు వరమిచ్చిన దేవుడు, ఎంత కాలానికి భూలోకానికి రాకపోతే, భద్రుడు తీవ్ర తపస్సు చేస్తాడు అప్పుడు శ్రీ మహావిష్ణువు దాశరథి అవతారంతో అపసవ్యశంఖ చక్రాలతో వైజయంతీమాలతో, ధనుర్బాణా లతో అతనికి దర్శనమిస్తాడు ఆ తరువాత భద్రుని కోరికపై అలాగే అక్కడ నెలకొంటాడు రఘురాముడు. వైకుంఠం నుంచి రామావతారాన్ని భక్తుని కోరికపై వచ్చాడు గనుక, వైకుంఠ రాముడనీ, చతుర్భుజాలతో వచ్చాడు గనుక చతుర్భుజ రాముడనీ,భద్రగిరి నారాయణుడనీ, రామనారాయణుడనీ, ఈ స్వామి వారికి పేర్లు అంకస్థిత అయిన అమ్మవారు కూడ నిజరూపంతో మళ్ళీ వెలసింది 'చతుర్భుజ కనకవల్లీ లక్ష్మీ తాయారు' పేరుతో నేటికీ దేవతలు మహర్షులు పర్వదినాల్లో నిత్యం రాత్రివేళ అదృశ్య రూపంలో వచ్చి భద్రాచలంలో స్వామి వారిని సేవించుకుంటారని పెద్దలంటారు

భద్రాచలం సమీపంలోని ఓ కుగ్రామంలో ఉన్న శ్రీరామభక్తురాలు, శబరజాతి స్త్రీ - పోకల దమ్మక్క ఆమెకు కలలో సాక్షాత్కరించి తన ఆలనాపాలనా చూడమని వరమనుగ్రహించాడు రఘురాముడు ఆమె వచ్చి నిత్యపూజలు జరిపిస్తుండగా, కంచెర్ల గోపన్నను ఆలయ నిర్మాణానికి నియోగించాడు ఆ తదుపరి కథ అందరకు తెలిసిందే

గౌతమీనది ప్రభావం వల్లా, సీతారామవ్రత విధానం వల్లా, స్వామికి భోగాలు, కల్యాణాలు చేయడంవల్లా, పంచ మహాపాతకులు కూడా తమ పాపాలనుంచి విముక్తులై శ్రీరామ సాయుజ్యాన్ని పొందుతారని ప్రతీతి

భక్తరామదాసు నెలకొల్పిన సత్రాలు నేటికీ నిత్యాన్నదానంతో వర్ధిల్లుతున్నాయి తరువాత నిర్మించిన రామదాసు ధ్యానమందిరంలో రామదాసు కీర్తనలు, దాశరధి శతకపద్యాలు శిలాఫలకాల్లో భక్తులు చదువుకోవటానికి అనుకూలంగా రచింప జేసారు ఖమ్మం జిల్లాలోని భద్రాచల క్షేత్ర దర్శనానికి ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని పట్టణాల నుంచి ఎక్స్‌ప్రెస్ డీలక్సు బస్సు సౌకర్యాలున్నాయి

ప్రతి నిత్యమూ ఉదయము ఐదు గంటల నుంచి రాత్రి పది గంటల వరకు భద్రాచలంలో పది ఉత్సవాలు నిర్వహిస్తారు. చైత్రమాసంలో మొదటి తొమ్మిది రోజులూ కల్యాణోత్సవం జరుగుతుంది నవమినాడు (పునర్వసునక్షత్రంతో కూడిన నవమి) జరిగే శ్రీ సీతారాముల కల్యాణం చూడటానికి లక్షల మంది భక్తులు యేటా వస్తుంటారు. వైకుంఠ ఏకాదశినాడు ప్రసన్నోత్సవం పేరిట దశావతారాల (రోజుకొక అలంకారము) అలంకారాలు జరుగుతాయి ఉత్తరద్వార దర్శనం జరుగు తుంది 'శ్రీ వాగ్గేయ కారోత్సవాలు' జరుపుతారు ఈ తొమ్మిది రోజులూ, పవిత్రోత్సవం, దీపోత్సవం, డోలికా ఉత్సవం, శరన్నవరాత్రులు దసరా, నిత్య, పక్షమాసోత్సవాలు దివ్యంగా జరుగుతాయి ఇక్కడి విశేషం ఏమంటే, ఉత్సవ మూర్తుల్లో సీతాలక్ష్మ ణులు స్వామి వారికి రెండు వైపులా వుంటారు. కాని మూలమూర్తుల్లో కుడిప్రక్కన వుంటారు మరో విశేషం శ్రీరామచంద్రస్వామి సీతమ్మవారిని ఒళ్ళో కూర్చోబెట్టుకుని పద్మాసనంలో వుండటం.

రామచంద్రాయ జనకరాజజా మనోహరాయ
మామకాభీష్టదాయ మహితమంగళమ్॥

శ్రీరామకృష్ణప్రభ - 3/99=5 ఆంధ్రప్రభ వారపత్రిక సౌజన్యంతో

**15.** మహానంది **:** ఇది కూడా ఒక ప్రసిద్ధ క్షేత్రము శ్రీశైల పర్వత ప్రాంతములోని దట్టమైన అడవుల మధ్య, దివ్యమైన ప్రకృతి దృశ్యములతో ఇది చూడ చక్కగనుండును ఇందులోని అధిష్ఠానదేవత మహానందీశ్వరుడు. ఇక్కడ పెద్ద నంది నోటి నుండి జలధార జాలుజాలుగా జలజల జారుచుండును దానిముందే ఒక చిన్న కోనేరున్నది అందులోని నీరు స్వచ్ఛము, ఆరోగ్యప్రదము, స్నానము చేయుటకు ఆరోగ్యకరముగా నుండును

**16.** యాదగిరి **:** ఇది తెలంగాణాలో ముఖ్యమైన యాత్రా స్థలము ఇక్కడి శ్రీలక్ష్మీ నరసింహస్వామి దేవళము సుప్రసిద్ధమైనది ఇది హైదరాబాదుకు దాదాపు 65 కిలోమీటర్ల దూరములో నున్నది ఈ దేవళము ఒక కొండపై నున్నది దానికే యాదగిరి అని పేరు కొండపైకి చక్కని బాటవేసియున్నారు. మోటారుకార్లలో దేవాలయము వరకు చక్కగా ప్రయాణము చేయవచ్చును కొండమీదనే అనేక

సత్రములున్నవి తిరుపతి వలెనే ఇక్కడికి కూడా సంవత్సరము పొడవున యాత్రికులు వెళ్ళుచుందురు

**17.** లేపాక్షి : ఇది అనంతపురము జిల్లాలో హిందూపురమునకు సమీపమందున్నది ఇక్కడ విరుపణ్ణ, వీరణ్ణ నాయకులు కట్టించిన వీరభద్రస్వామి ఆలయము సుప్రసిద్ధమైనది ఇది కాక పాపనాశేశ్వరాలయము, రఘునాధాలయములు కూడా నున్నవి వీరభద్రస్వామి విగ్రహము ఏకాండశిలలో చెక్కబడిన బ్రహ్మాండ విగ్రహము ఇక్కడి నంది విగ్రహము కూడా అంతే ఆ దేవాలయములో గోడలమీదను, లో కప్పుల మీదను ఇప్పటికిని రంగు చెదరని రంగు రంగుల ప్రాచీన చిత్రములు అనేకములున్నవి రామాయణ గాథలను వివరించు శిల్పములు కూడ నున్నవి. లేపాక్షి రామాయణమను సుప్రసిద్ధ యక్షగానము ఇక్కడి కవులు రచించినదే

**18.** విజయవాడ : ఆంధ్ర నగరములలో నడుమ నాయక మణియైన ఈ నగరము కృష్ణానదీతీరమున నున్నది అది సుప్రసిద్ధ క్షేత్రము కూడ ఇక్కడ కొండమీద వేంచేసియున్న కనకదుర్గ ఆలయము ప్రసిద్ధమైనది కొండపైకి చక్కని రహదారి వుంది కార్లు దేవాలయము వరకు నిరభ్యంతరముగా ప్రయాణము చేయవచ్చును నిత్యము భక్తులతో రద్దీగా వుండే పుణ్యక్షేత్రము

**19.** శ్రీశైలము : ఇది కర్నూలు జిల్లాలో నున్నది దీని చుట్టు ఎక్కడచూచినను అడవులే కనిపించును. ఇక్కడ బహుప్రఖ్యాతి చెందిన మల్లిఖార్జునస్వామి దేవాలయమున్నది భారతదేశములోని 12 జ్యోతిర్లింగములలో ఒక ప్రధాన లింగము ఇందులో వెలసియున్నది కొండమీది ఈ దేవళమునకు ఇప్పుడు మంచి రోడ్డు వేసినారు కారులు, బస్సులు కొండపై నున్న దేవాలయము వరకు సునాయాసముగా పోవుచున్నవి కొండపై శ్రీ మల్లిఖార్జునస్వామి, భ్రమరాంబ దేవళములున్నవి ప్రతి సంవత్సరము శివరాత్రినాడు ఇక్కడ వైభవముగా ఉత్సవము జరుగును ఇక్కడికి వేలకొలది యాత్రికులు వెళ్ళుచుందురు కొండపైన కూడా యాత్రికులకు మంచి వసతి యేర్పాట్లున్నవి భ్రమరాంబాదేవి అష్టాదశ శక్తి పీఠాధి దేవతలలో నొకదేవత.

**20.** సంగమేశ్వరము : ఇది కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో కృష్ణా తుంగభద్రా, భవనాశి కలియు చోట నున్న పుణ్యక్షేత్రము

**21.** సింహాచలము : ఇది విశాఖ పట్టణము జిల్లాలో నున్నది ఇది నరసింహస్వామి క్షేత్రము ఆయన కొండపైన వేంచేసియున్నాడు కనుకనే దీనికి యీ పేరు వచ్చినది. కొండపై నున్న నీటిధారలు, పూలతోటలు, పండ్లతోటలు చూసి తీరవలెను ఈ దేవాలయమునకు ప్రతి దినము వందలకొలది యాత్రికులు వెళ్ళుచుందురు

**22.** హనుమకొండ : ఇక్కడ క్రీ శ 1162-1163లో కట్టిన వేయి స్తంభములు కట్టిన దేవాలయము కలదు ఇక్కడ శివ, విష్ణు, సూర్యులకు వేరువేరుగా ఒక్కొక్క గుడి కలదు శివాలయమునకెదుటనున్న నంది విగ్రహమంతయు ఏకశిలా విగ్రహము

ఇరవైరెండవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 23వ సంఖ్య

## 154. ఆంజనేయ మంత్రము

"ఓమ్ నమో భగవతే ఆంజనేయాయ
మహా బలాయ హనుమతే స్వాహా" శ్రీ హనుమన్మంత్రానుష్ఠాన ప్రకాశిక - 73

## 155. శ్రీకృష్ణ గాయత్రీ

"ఓమ్ దేవకీ నందనాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి తన్నోః కృష్ణః ప్రచోదయాత్"

*ఈ గాయత్రీ మంత్రములు పరిశుద్ధ హృదయముతో ఆయా దేవతా పూజా ప్రారంభమున జపింపదగినవి* శ్రీ జగదత్పూజామాల - 130

## 156. జరాసంధుడు కృష్ణునిపైకి యుద్ధము చేయవచ్చుట

*జరాసంధుడు కృష్ణునిపైకి ఇరువది మూడక్షౌహిణుల సైన్యమును తీసికొని మధురపైకి దండెత్తి తాకెను* 146 - వచన భాగవతము - దశమస్కందము, పూర్వభాగము

ఇరవైమూడవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 24వ సంఖ్య

## 157. గాయత్రీ మంత్రము

1. ఓమ్ శ్రీ గాయత్రీ దేవ్యై నమః

గాయత్రీ మహామన్త్రము

| | |
|---|---|
| *ఓమ్ భూర్భువ స్సువః* | 5 |
| *తత్స వితుర్వ రేణ్యమ్* | 7 |
| *భర్గో దేవస్య ధీమహి* | 8 |
| *ధియో యోనః ప్రచోదయాత్* | 4 |
| | 24 |

*భావము : ఓమ్ = ప్రణవము ( ఏ మంత్రానికైనా ప్రణవాన్ని ముందర జోడించి పలకాలి ఇదే వేదవాక్కు)*

భూః = భూలోకము, భువః = అంతరిక్షలోకము, సువః = స్వర్గలోకము (ఈ మూడింటికి ప్రత్యక్షంగా మంత్రంతో ఎట్టి సంబంధమూ లేనప్పటికీ, వీటిని మంగళవాచకములుగా పరిగణిస్తారు) తత్ = ఆ, సవితుః దేవస్య = సూర్య భగవానుని యొక్క, వరేణ్యం = గొప్పదయిన, భర్గః = తేజస్సు, ధీమహి = (మేము) ధ్యానింతుము, యః = అట్టి (తేజస్సు)నః = మా యొక్క, ధియో = బుద్ధిని, ప్రచోదయాత్ = ప్రకాశింపజేయుగాక, ఓమ్ = ప్రణవము

తాత్పర్యము : ఆ సూర్యభగవానుని (ఇచట మనకు ప్రతిదినమూ వెలుగును ప్రసాదించే సూర్యుడు కాదు సకల సృష్టికీ మూలకారకుడు, మన బుద్ధిని పరమాత్మవైపు మళ్లించువాడునూ) యొక్క మహత్తరమయిన తేజస్సును మేము ధ్యానింతుము. ఆ తేజస్సు మా బుద్ధిని ప్రకాశింపజేయుగాక   శ్రీరామకృష్ణప్రభ డిసెంబరు /1989 పేజి 18

2. వైదిక ఛందస్సులలో 24 అక్షరములు కలిగిన ఒక ఛందస్సు పేరు గాయత్రి ఎన్నో గాయత్రీ మంత్రాలు వున్నా ఈ గాయత్రీ మంత్రం మాత్రమే ప్రసిద్ధి చెందినది దీనికి అర్థాలు కూడా భిన్నభిన్నాలుగా చెపుతూ వివరిస్తుంటారు. ఇక్కడ శ్రీ గాయత్రీ బాబా గారు సంకలనము చేసిన " శ్రీ గాయత్రీ నిత్యపూజా విధానము"లో శ్రీ గాయత్రీ నామ ప్రభావమును గురించి ఈ విధముగా తెలియపరిచారు.

1. ఎవరు నిత్యము గానము సేతురో వారిని సదా రక్షించునది
2 ఏ మంత్ర పఠనముతో లోకభయములు నివారణమగునో యదియే గాయత్రి
3 ఏ శబ్ద ముచ్చరించి మంత్ర జపము గావించుచో ఇంద్రియాదుల కల్లో లములణగునో ఆ శక్తి గాయత్రి యనబడునది

## పరబ్రహ్మ స్వరూపిణీ

ఏ మంత్రము సదాధ్యాన సమాధులలో జపము చేయువారలకు దివ్యమౌ విచిత్ర వర్ణాంకిత తేజస్స్వరూపముగా దర్శనమిచ్చి హృదయగ్రంధులను వదలించి యనంతశక్తివంతమగు ప్రభావము గల్గించి ప్రశస్త స్థానములో నిల్పునో యది "పరబ్రహ్మ స్వరూపిణి" గాయత్రి.

## బ్రహ్మాస్త్ర రూపిణీ

ఏ మహామంత్రమును పారాయణము గావించి సాధనలో నుంచి మంత్రపల్లవ విధానములో వశ్యాకర్షణ ప్రయోగాదులలో శత్రుసంహార క్రీడకు సిద్ధిబొంది యనులోమ విలోమముగా నుచ్చరించి ప్రయోగించు శక్తి గాయత్రి "బ్రహ్మాస్త్ర రూపిణి"

## వేదమాత

సమస్తముల కాదిమూలము ప్రణవము, ప్రణవప్రాధాన్యముగా భూర్భువ, సర్వులు త్రివేద మూలములతోను చర్చించు మంత్రరాజము గాయత్రి "వేదమాత"

## సూర్యమండలవాసినీ

*ఏ దివ్య తేజో మండలము సృష్టి హేతువగుచున్నదో సమస్త లోకములకు తేజస్సు గల్పించి యీశ్వర కళను ప్రకాశింపజేయుచున్నదో యట్టి దివ్యమండల తేజో రూపిణియై యెవరు నిలబడి యుండిరో ఆ గాయత్రి "సూర్యమండలవాసిని"*

## ముని బృంద నిషేవితా

*ఏ మహాశక్తి దివ్యకటాక్షమును వాంఛించి ఇంద్రియ నిగ్రహులై, సర్వము త్యజించి సమాధి స్థితులై చంద్రకళారస బిందువుల స్వీకరించి మహానిష్ఠా గరిష్ఠత్వమ్మున ప్రకాశించుచు సదా యేదివ్య తేజంబు రక్త, పీత, కృష్ణ, శుక్ల వర్ణాత్మకంబుగా ప్రకాశించునో యట్టి తేజంబు దర్శించుచునుండు "మునిబృంద నిషేవితా" గాయత్రి*

## హంసరూపా

*"సోహం" బ్రహ్మ యను వాక్యముగా ఏజీవి తానే బ్రహ్మమయి ప్రకాశించు స్థితికి వచ్చి సృష్టి సంబంధానుబంధముల త్యజించి దివ్య మండల సంచార శక్తి స్వరూపముగా "హంసవలె స్వచ్ఛరూపముతో తిరుగాడగలదో యట్టి పరమహంసరూపా" యను బడునది గాయత్రి*

## సూర్యకోటి సమప్రభా

*చర్మ చక్షుర్గోచరమగు మార్తాండమండలము చూచినచో దానితేజః పుంజమును సాధారణముగా మనము చూడజాలము అట్టి కోటి సూర్యకాంతులతో మునీంద్ర దృష్టి గోచరమగు మహాతేజమెవ్వరై భాసించుచున్నదో యట్టి "సూర్యకోటి సమప్రభా" యనబడు దివ్యానంత తేజోరూపిణి గాయత్రి*

## సర్వయంత్రాత్మికా

*సమస్త మంత్రోపాసనా మూలరూపమగు యంత్రములందు నేమంత్రములను జగదధిష్ఠాత్రికి మారుగా మంత్ర రాజము నిల్పి నిత్యారాధనలు చేయబడుచున్నవో యట్టి యంత్రస్థితే మంత్రరూపిణి గాయత్రి "సర్వయంత్రాత్మికా" యనబడునది వేదమాత గాయత్రి*

## విశ్వామిత్ర వరప్రదా

*ఏ మహామంత్రము నుపాసించుటకు తాను ఋషియై శాశ్వతత్వము నంది మహామంత్రాధిష్ఠాన దేవతయైన గాయత్రి నారాధించి దివ్య సిద్ధులందినవాడాయెనో యట్టి విశ్వామిత్రునకు వాంఛితార్థము తీర్చిన బిరుదు నామము "విశ్వామిత్ర వరప్రదా" యనబడుచున్నది*

## త్రిరూపధారిణి

ఉదయకాలములందు బాలారూపిణియై మధ్యాహ్నకాలములందు తరుణీ రూపము దాల్చి సాయంత్రములందు వృద్ధ రూపిణిగా గోచరించు "త్రిరూపధారిణీ" గాయత్రి

## ఆదిశక్తి

లోకోద్భవ కారణమునకు బీజస్వరూపమై స్థితికి మూలాధారమై, సంహారాది కార్యంబులకు ప్రాధాన్యమైన యేశక్తి పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాప్తమై భూర్భువస్వర్లోక శ్రేణీ విధానమున, నిండి నిబిడీకృతమై జీవులందతర్నిహితమై వర్తించుచున్నదోయట్టి "యాదిశక్తి" గాయత్రి

## బ్రహ్మలోక నివాసినీ

ఏ లోకము చేరుటకు సమాధి స్థితులై యోగులు అర్చిరాది మార్గాములై జ్యోతిః ప్రకాశమూర్తులై వెలుగుచు తిరిగిరాని శాశ్వత జరామరణ వర్జిత దివ్యమూర్తిత్వము గొనియుందురో యట్టి పరబ్రహ్మలోకాధివాసముగావించుచూ నిత్యానిత్య మహదానందము వర్ధిల్లజేయుచు యే శక్తియందుండునో యట్టి శక్తి "బ్రహ్మలోక నివాసినీ" గాయత్రి

## జలప్రియా

నారాయణ స్వరూపమగు జలములో రసస్వరూపిణియై దివ్యమంత్రోచ్చారణతో జలగ్రహణము గావించి సదాజపించువారలకు కామ్యము లీడేర్చు రసస్వరూపిణీ "జలప్రియా" గాయత్రి.

శ్రీగాయత్రీ నిత్యపూజా విధానము 32

# 3. గాయత్రీ మంత్రార్ధము

గాయత్రీ మంత్రార్థమును గూర్చి శ్రీశ్రీశ్రీ పూర్ణయ్య సిద్ధాంతి యడవల్లివారు ఏమంటున్నారో తెలుసుకుందాము

ఓమ్ : ఇది పరబ్రహ్మవాచకము. నాద బ్రహ్మరూపమై విరాజిల్లుచున్నది ఆకుయొక్క మధ్యభాగమందలి నాళముచే ఆకులన్నియు నతుకబడియున్నట్లు, వెనుబాము (వెన్నెముక) నాశ్రయించుకొని శరీరమందలి ఎముకలమరియున్నట్లు, స్థూల సూక్ష్మ ప్రపంచమంతయు నీయోంకారముచే నిండియున్నది. **ఓం**కారము **అ**కార **ఉ**కార **మ**కారములను త్రిపుటియొక్క సంయోగముచే నేర్పడినది. ఈ త్రిపుటి, సృష్టి స్థితి లయములు, సత్త్వరజస్తమములు, కాలత్రయము, మూర్తిత్రయము, శక్తిత్రయము, వేదత్రయములనేగాక అనేక త్రిపుటములను సూచించుచున్నది మహావృక్షము యొక్క వివిధ దశలు బీజమున లీనమైయున్నట్లు చతుర్విధ పురుషార్థ మహావృక్షబీజమై ప్రకాశించుచున్నది ఇది వేదసారమైనది ఓంకారమను ప్రణవము నుండియే "భూర్భువస్సువః" అను వ్యాహృతి త్రయముద్భవించినది

భూః "భూరితివై ప్రాణః" సమస్త జగత్తునకు జీవనాధారుడు, ప్రాణాధికుడు, భూలోకాధిపతి, ఎవని వలన భూతములు పుట్టుచున్నవో అతడే భూశబ్దవాచ్యుడు.
భువః "భువ ఇత్యపానః" నిజభక్తుల సమస్త దుఃఖములను తొలగించి వారల సుఖము నందుంచువాడు

సువః "సువరితివ్యానః" చరాచర ప్రపంచమునంతయు వ్యాపించినవాడు. సుఖస్వరూపుడు "భూర్భువస్సువః" అను యీ వ్యాహృతి త్రయమే గాయత్రి యొక్క త్రిచరణములు

సవితుః ప్రాణులను సృష్టించువాడును, ధ్యానించువారికి శ్రేయముల నిచ్చువాడును, సర్వభావములను కలిగించువాడును, వరమునిచ్చువాడును,

దేవస్య: సృష్టి స్థితిలయములే క్రీడగా గలవాడును, అందరి ఆత్మలను ప్రకాశింప జేయువాడును, ఉదయాస్తమయములచే దేశాంతరమును పొందువాడును, అయిన పరబ్రహ్మ యొక్క,

తత్: జగదుత్పత్తి స్థితి లయ కారణభూతమైనది, ఉపనిషత్తులచే ప్రతిపాదింప బడినది, అవాఙ్మానసగోచరమైనదియు,

వరేణ్యమ్: ఆశ్రయింపదగినదియు, కోరదగినదియు,

భర్గః సేవించువారి పాపములను నశింపజేయునదియు, అజ్ఞానాంధకారమును నశింప జేయునదియు నగు సూర్యమండలాంతర్గత గాయత్రీరూప పరబ్రహ్మ తేజమును,

ధీమహి: ఉపాసన చేయుచున్నాము.

యః పూర్వోక్తమైన ఏ సవితృదేవతారూప పరబ్రహ్మ తేజము

నః మాయొక్క "ధియః" బుద్ధులను

ప్రచోదయాత్ : ఉత్తమగుణ కర్మలయందు ప్రేరణచేయుచున్నదో (అట్టి దానిని ధ్యానింతుమని యర్థము).

## సారాంశము

బంధమునకు గాని, మోక్షమునకు గాని మనస్సే కారణముగుచున్నది. లేనిది ఉన్నట్లు భ్రాంతిని కలిగించునది కూడా మనస్సే మనస్సు నుండియే సంసార విషవృక్షము పెరిగినది దానికి తల్లివేరు తృష్ణ. శాఖలు కామక్రోధాదులు. ఆకులే సంకల్పములు ఆకు రాల్చుట వికల్పము చిగుళ్ళు రాగాదులు. స్వార్థమే పుష్పము మిథ్యా భోక్తృత్వమే ఫలము ఇట్టి మనస్సు నడుమలో నుంచి మనో బుద్ధులను ప్రకాశింపజేయగల శక్తి గాయత్రీ మంత్రమునకే గలదు. అదియే ద్విజులకు శరణ్యము

ఏ దివ్య తేజముచే సూర్య చంద్రాగ్నులు ప్రకాశించుచున్నారో, ఏ దివ్య తేజము స్థూల సూక్ష్మ ప్రపంచమంతయు నిండియున్నదో, ఏ దివ్యతేజము సమస్త జగత్తునకు జీవనాధారమో, ఏ తేజము ధ్యానించువారికి శ్రేయములను కూర్చి సర్వ సద్భావములను

*కలిగించునో, ఏ తేజము సృష్టి స్థితి లయములకు కారణభూతమో, ఏ తేజమును ఉపనిషత్తులు కొనియాడలేక అవాఙ్మానస గోచరమైనదని చెప్పి విరమించినవో ఏ తేజము త్రిపుటిగా రూపుదాల్చి వ్యాపించినదో, ఏ తేజము ధ్యానించువారి పాపములను పోగొట్టి సుఖమును కలిగించునో, ఏ తేజము మాబుద్ధి నవృత్తులను సత్కర్మల విషయమై ప్రేరణ చేయుచున్నదో, అట్టి సూర్యమండలాంతర్గత గాయత్రీరూప పరబ్రహ్మ తేజమును ధ్యానించుచున్నాము.*

## 4. గాయత్రీ ధ్యానము దాని లాభము

"ఆదిత్య హృదయ రహస్యము" - 98వ పేజీ నుండి గ్రహీతము

*మనము నిత్యము త్రికాలములందు చేయదగిన సంధ్యావందనములో సూర్యున కర్ఘ్యమిచ్చిన తరువాత, ఆదిత్య మండలమందు పరబ్రహ్మస్వరూపిణి సనాతని వేదమయి యైన గాయత్రీ దేవియుండి తనను జపించే భక్తులను రక్షించును కావున ఆ గాయత్రీ జపము చేయవలయునని శాస్త్రవిధియున్నది*

"ఆదిత్యమండల స్థానా। పరబ్రహ్మ స్వరూపిణీ।
ఛందోమయీ చ గాయత్రీ। మాం రక్షతు సనాతనీ॥"

*అని* దేవీ బాగవతము 12వ స్కంధము, 3వ అధ్యాయము

*ఈ జపారంభమున ఆమె పంచముఖములను ముత్యము (తెలుపు), పవడము (గులాబీ రంగు), హేమ (పసుపుపచ్చ), నీలము (నీలము) తెలుపు అను అయిదు రంగులు గలిగియున్నటుల ధ్యానింపవలయును ఆ అయిదురంగులు సూర్యకిరణములందుండెడివే. ఈవర్ణపంచకముతో గూడిన గాయత్రిని ధ్యానించుట, జపించుట వలన మన బుద్ధి వృత్తులు ధర్మమున కభిముఖములగుచున్నవి*

గాయత్రీ హృదయ రహస్యము = 98

## 5. ఓమ్ శ్రీ గాయత్రీ దేవ్యై నమః

*ఋషులు, యోగులు, మునులు, సామాన్యులు పాపభూయిష్టమైన యీ ప్రపంచము నుండి ముక్తులయి, శాశ్వతమైన బ్రహ్మపదమును పొందుటకు అనేక విధముల ప్రయత్నములు చేయుచున్నారు ఆ బ్రహ్మ పదమును అనుగ్రహించు విద్య "గాయత్రీ మహా విద్య" ఈ గాయత్రీ ఉపాసన చేయక ఏ మంత్రానుష్ఠానము చేసినను మానవుడు బ్రహ్మపదమును పొందలేడు*

"న గాయత్రాః పరం మంత్రం నమాతుః పరదైవతం"

*అనగా గాయత్రీ కంటే గొప్ప మంత్రము, తల్లికంటే గొప్ప దేవత సృష్టిలో లేదు అట్టి మహత్తర శక్తి కలిగిన యీ గాయత్రీ మంత్రమును "సంధ్యావందనము" నందు చెప్పబడినది "సంధ్యావందనము" "గాయత్రీ జపవిధానము" వేద మంత్రములతో కూడుకొనియున్నది*

ఓమ్ భూర్భువ స్సువః తత్సవితుః వరేణియం
బర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్

ఈ గాయత్రీ మంత్రమున ఇరవై నాలుగు అక్షరములతో పాటు ఇరవై నాలుగు దేవతామూర్తుల శక్తి అంతర్గతమై వుంటుందని గాయత్రీ మంత్రోపాసకులు యీ మంత్రాన్ని త్రికరణ శుద్ధిగా జపించటము వలన ఆ ఇరవై నాలుగు దేవతల ఆశీస్సులు, శక్తి, లాభము చేకూరుతుందని తాంత్రిక గ్రంధాలు అభివర్ణిస్తున్నాయి

"పాలల్లో అనేక పోషకతత్వాలు అంతర్గతమై వున్నట్లు" ఈ పాలను సేవించటం వల్ల అందులోని పోషక విలువలు శరీరానికి శక్తినిచ్చినట్లే, ఇరవైనాలుగుదేవతా మూర్తుల అక్షరములను జపంరూపంలో స్మరించటంవల్ల ఆ ఇరవైనాలుగు దేవతా మూర్తుల శక్తి ఈ జపం వల్ల సిద్ధిస్తుంది సంధ్యావందనమున యీ ఇరవై నాలుగు దేవతామూర్తులను స్మరించుకొని శ్రద్ధ, భక్తి ప్రపత్తులతో చేయటం ఎంతైనా అవసరం ఈ ఇరవై నాలుగు గాయత్రీమూర్తులను "చతుర్వింశతి గాయత్రీ" అని పేరు.

గాయత్రీ మంత్రంలోని 24 దేవతలు వాటి చైతన్య శక్తులు.

| | |
|---|---|
| 1 తత్ = గణేశ్వరుడు | 2 స = నృసింహభగవానుడు |
| 3 వి = విష్ణుదేవుడు | 4 తుః = శివదేవుడు |
| 5 వ = కృష్ణభగవానుడు | 6. రే = రాధాదేవి |
| 7 ణ్యం = లక్ష్మీదేవి | 8. భ = అగ్నిదేవుడు |
| 9 ర్గః = ఇంద్రదేవుడు | 10 దే = సరస్వతి |
| 11. వ = దుర్గాదేవి | 12. స్య = హనుమంతుడు |
| 13 ధీ = పృధ్వీదేవి | 14 మ = సూర్యదేవుడు |
| 15 హి = శ్రీరాముడు | 16. ధి = సీతామాత |
| 17 యో = చంద్రదేవుడు | 18 యో = యమదేవుడు |
| 19 నః = బ్రహ్మదేవుడు | 20 ప్ర = వరుణదేవుడు |
| 21. చో = నారయణుడు | 22 ద = హయగ్రీవ భగవానుడు |
| 23 యా = హంసదేవత | 24. త్ = తులసీదేవి |

ఇలా ఇరవైనాలుగు దేవతామూర్తులకు మూలమైన గాయత్రీ మంత్రాన్ని జపించటం వలన దారిద్ర్య నిర్మూలన, సర్వ సౌభాగ్యములు, ధన కనక వస్తు వాహనములు, కీర్తి, తేజస్సు, ఐశ్వర్యము, బ్రహ్మరాక్షసాది గ్రహముల నుండి విముక్తి, సర్వసిద్ధులు పొందుదురు

ఇంతటి మహిమాన్వితం, దివ్యశక్తిగల ఈ మంత్రాన్ని ఉచ్చరించడంలో స్వర, వర్ణ లోపములుండిన హాని కలుగుజేస్తుంది

"మంత్రోహాని స్స్వరతో వర్ణతోవా
సవాగ్వజ్రో యజమానం హన్తి"

కనుక మంత్రానుష్ఠానమున గురువు చాల అవసరము భగవంతుడు ఆగ్రహించిన గురువు రక్షించును మొదట గురుధ్యానము చేయుటం మన సంప్రదాయం అలాగే "అష్టాంగయోగములలో" నియమం ప్రధానము నియమములో 1. శౌచము, 2. సంతోషము, 3. తపస్సు, 4. స్వాధ్యాయము (అంటే తనను తాను అధ్యయనము చేసుకోవడము స్వ = తనను, అధ్యయనము = చదవడము), 5 ఈశ్వరప్రణిధానము అనగా బ్రహ్మతత్వమే కాల స్వరూపము

బ్రహ్మపదమును పొందతలచిన వారు కాలనియమము, విధిగా పాటించవలయును బ్రహ్మతత్వము, త్రిమూర్త్యాత్మకము, త్రికాలాత్మకము, త్రిశక్త్యాత్మకము, వీటినే ప్రస్తుత కాలంలో ప్రాతః (సూర్యోదయమునకు ముందు) మధ్యాహ్నకము, సాయంసంధ్య (సూర్యుడు అస్తమించకముందు) ఈవేళల యందు అశ్రద్ధవహించక గురువు చెప్పిన ప్రకారము 'త్రిసంధ్యా, యందు' సంధ్యావందనము, గాయత్రీ జపము చేసిన మనుజుడు బ్రహ్మ పదమును సులభముగ పొందగలడు

హూణ విద్యాభ్యాసము చేతను, వృత్తి వ్యాపార బాధ్యతల చేతను, గురువు సమీపమున బహుకాలము గడపియు, నియమనిష్ఠలను కాలరాస్తున్నారు మరికొందరిలో నియమము వున్నా నిష్ఠ లేదు, నిష్ఠ వున్నా నియమము లేదు మానవుడు బ్రహ్మ పదమును పొందాలంటే నియమ నిష్ఠలు చాలా అవసరము నియమ నిష్ఠలు గల మనుజులు సౌకర్యార్థము "సంధ్యా వందనము" నందు మూడు కాలములలో చేయదగిన గాయత్రీ ముద్రలు 24 ఇవి ఈ గాయత్రీ ముద్రలు చేయకుండా 'సంధ్యావందనం' చేయటం నిష్ఫలము అని గాయత్రీ ఉపాసకుల అభిప్రాయం, మంత్రార్థం

## గాయత్రీ ముద్రలు ఇరవైనాలుగు

1 సుముఖమ్, 2. సంపుటమ్, 3. వితతమ్, 4 విస్తృతమ్, 5 ద్విముఖమ్, 6. త్రిముఖమ్, 7. చతుర్ముఖమ్, 8 పంచముఖమ్, 9. షణ్ముఖమ్, 10 అధోముఖమ్, 11. వ్యాప్యకాంజలికమ్, 12 శకటమ్, 13 యమపాశమ్, 14 గ్రథితమ్, 15 ఉన్ముఖోన్ముఖమ్, 16 ప్రలంబమ్, 17 ముష్టికమ్, 18. మత్స్యః, 19 కూర్మః, 20, వరాహకమ్, 21. సింహాక్రాంతమ్, 22. మహాక్రాంతమ్, 23 ముద్గరమ్, 24. పల్లవమ్

కావున మనుజులు గాయత్రీ ఉపాసకులు నియమ నిష్ఠలతో 24 గాయత్రీ ముద్రలు విధిగా చేయటం శ్రేయస్కరం.

# గాయత్రీ 24 ముద్రలు


1
సుముఖమ్


2
సంపుటమ్


3
వితతమ్


4
విస్తృతమ్


5
ద్విముఖమ్


6
త్రిముఖమ్


7
చతుర్ముఖమ్


8
పంచముఖమ్


9
షణ్ముఖమ్


10
అధోముఖమ్


11
వ్యాపకాంజలికమ్


12
శకటమ్

# గాయత్రీ 24 ముద్రలు



13
యమపాశమ్



14
గ్రథితమ్



15
ఉన్ముఖోన్ముఖః



16
ప్రలంబమ్



17
ముష్టికమ్



18
మత్స్యః



19
కూర్మః



20
వరాహకమ్



21
సింహాక్రాంతమ్



22
మహాక్రాంతమ్



23
ముద్గరం



24
పల్లవమ్

*నియమ నిష్ఠలతో, శ్రద్ధాభక్తులతో "సంధ్యావందనాన్ని" ఆచరిస్తూ 'ఆ గాయత్రీ మాతా' అనుగ్రహానికి పాత్రులై తద్వారా లోకకల్యాణమునకు సహాయపడుదురుగాక*

సప్తగిరి ఆగస్టు 1997 = 21

## 6. గాయత్రీ మంత్రంలోని 24 దేవతలు వాటి చైతన్య శక్తులు

**1. గణేశ్వరుడు :** *ఇతడు సఫలత్వ శక్తికి అధిష్ఠాత అందులకే ప్రత్యేక శుభకార్యారంభం గణపతి పూజతో ప్రారంభం చేయబడుతుంది. తద్వారా తత్కార్యము సఫలమవుతుంది ఇతడు విఘ్ననాయకుడు సఫలత్వ ప్రదాయకుడు బుద్ధిని, శ్రేష్ఠ జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు*

**2. నృసింహ భగవానుడు :** *పరాక్రమ శక్తికి యితడు అధికారి పురుషార్థ పరాక్రమ వీరత్వ, ధీరత్వ విజయాలను యీ దేవుడు ప్రసాదిస్తాడు పిరికితనమూ ఆటంకాలూ దూరంచేసి అపజయ దురాక్రమణల నుండి యీ దేవుడు సాధకులను సంరక్షించి శత్రువులను సంహరిస్తూంటాడు*

**3. విష్ణుదేవుడు :** *పాలనాశక్తికి అధిష్ఠాత సమస్త ప్రాణులనూ పోషించునట్టి జీవరక్షకుడు సర్వజీవులనూ సంరక్షించి ఆ జీవికను ప్రసాదిస్తాడు*

**4. శివదేవుడు :** *కళ్యాణ శక్త్యాధికారి. జీవులకు ఆత్మ పరాయణత్వాన్ని సర్వవిధ కళ్యాణ శక్తులనూ ప్రసాదించి అనిష్ఠ పతనాల నుండి రక్షిస్తూంటాడు*

**5. కృష్ణభగవానుడు :** *యోగశక్తికి అధిష్ఠాతమై ప్రాణులకు కర్మయోగ ఆత్మనిష్ఠలను, అనాసక్తి వైరాగ్య సత్ జ్ఞాన సౌందర్య, సరసత్వాదులను ప్రసాదిస్తాడు*

**6. రాధాదేవి :** *ప్రేమశక్తికి అధిష్ఠాత్రి. భక్తులకు యథార్థమైన ప్రేమభావాన్ని కలుగజేసి అసూయాద్వేష భావాదులను దూరం చేస్తుంది*

**7. లక్ష్మీదేవి :** *ధనవైభవ శక్తులకు యీ అధిష్ఠాత్రి ఉపాసకులకు ఈమె ధన వైభవ, ఐశ్వర్య, సంపద, పద యశాది సమస్త ప్రకారాలైన భౌతిక సుఖసాధనలనూ ప్రసాదిస్తుంది.*

**8. అగ్నిదేవుడు :** *తేజః శక్తికి అధిష్ఠాత ఉష్ణత్వం, తేజస్సు, ప్రకాశము, శక్తి సామర్థ్యాదులను ప్రసాదిస్తుంటాడు*

**9. ఇంద్రదేవుడు :** *రక్షా శక్తికి అధిష్ఠాత - రోగ అనిష్ఠ, ఆక్రమణ, హింస చోర శత్రు, భూత ప్రేతాదుల నుండి రక్షిస్తాడు*

**10. సరస్వతి :** *జ్ఞానశక్తికి అధిష్ఠాత్రి - జ్ఞాన, వివేక, దూర దర్శిత్వ బుద్ధి మత్తత విచార శీలత్వాదులను ప్రసాదిస్తుంది*

**11. దుర్గాదేవి :** *దమనశక్తికి అధిష్ఠాత్రీదేవి సమస్త విఘ్న బాధలపై విజయాన్ని ప్రసాదిస్తూ, దుష్టులను, శత్రువులనూ నాశనం చేస్తూ భక్తులకుసమస్త ప్రకారాలైన శక్తి సామర్థ్యాదులను ప్రసాదిస్తుంది*

**12. హనుమంతుడు :** *నిష్ఠాశక్తికి అధికారి తన ఉపాసకులకు భక్తి నిష్ఠ కర్తవ్య పరాయణత్వము, విశ్వాసము, నిర్భయత్వ బ్రహ్మచర్యపాలనాశక్తినీ ప్రసాదిస్తాడు*

**13.** *పృథ్వీదేవి :* (భూమాత) ధారణాశక్తి దేవత - ప్రాణులను గంభీరత్వాన్ని, క్షమా శీలత్వాన్ని, ధైర్యాన్ని, దృఢత్వాన్నీ, సహిష్ణుతను భారవాహకతను, నిరంతరత్వాన్నీ ప్రసాదిస్తుంది

**14.** *సూర్యదేవుడు :* ప్రాణశక్తికి అధిష్ఠాత తన ఉపాసకులకు యితడు ఆరోగ్యాన్నీ, దీర్ఘ జీవనాన్నీ, ప్రాణశక్తినీ, వికాసాన్నీ, తేజస్సునూ ఉష్ణత్వాన్నీ ప్రసాదిస్తాడు

**15.** *శ్రీరాముడు :* మర్యాదాశక్తికి అధిష్ఠాత, ధర్మము, మర్యాదశీలము సౌమ్య, సంయమ, మైత్రి, ప్రేమ, భావధీరత్వ తితిక్షాది గుణాలనూ శక్తులనూ ప్రసాదిస్తాడు

**16.** *సీతామాత :* తపశ్శక్తికి అధిష్ఠాత్రీదేవి నిర్వికారంగా పవిత్ర భావంతో సాత్వికవృత్తితో అనన్య భావాలతో తపోనిష్ఠులనుగా తన భక్తులను యీమె తయారుచేసి ఆధ్యాత్మికోన్నతి మార్గం మీదకు ప్రేరితులను చేస్తుంది

**17.** *చంద్రదేవుడు :* శాంతి శక్తికి అధిష్ఠాత చింత, శోక, క్రోధ ప్రతిహింస, ఉద్విగ్నత నిరాశ, క్షోభ, మోహ, లోభ తృష్ణాది మానసిక వికారాలను శాంతింపజేసి ఆశాశాంతులను ప్రదానం చేస్తాడు

**18.** *యమదేవుడు :* కాలశక్త్యాధిష్ఠాత సమయాన్ని సదుపయోగం చేసి మృత్యువుకు భయపడకుండ వుండునట్లు చేస్తాడు స్ఫూర్తి, జాగరూకత్వాది శక్తులను ప్రసాదిస్తాడు

**19.** *బ్రహ్మదేవుడు :* సృష్టి శక్తికి అధిష్ఠాత సృష్టి రచన, ప్రత్యేక జడచేతన పదార్థాలను సృష్టించి వర్ధిల్లజేయునట్టి శక్తని ప్రసాదించువాడు

**20.** *వరుణదేవుడు :* రసశక్త్యాధికారి, భావుకత్వ, కోమలత్వ, సరసత్వ దయాళుత్వ, ప్రసన్నత, మధురత్వ, కళాప్రియత్వాది భావాలను, హృదయంలో ప్రాదుర్భవింప జేసి, ప్రవహింపజేసి ఆనందానుభూతులను ప్రసాదిస్తాడు

**21.** *నారాయణుడు :* ఆదర్శ శక్తికి అధిష్ఠాత శ్రేష్ఠత్వ, మహత్వాకాంక్ష ఉత్కృష్టత దివ్యగుణ, ధర్మ స్వభావ నిర్మల సచ్చరిత్రత్వ శుభకర్మ శీలత్వాదులను ప్రసాదిస్తాడు

**22.** *హయగ్రీవ భగవానుడు :* సాహస శక్తి కధిష్ఠాత ఉత్సాహాన్నీ, నిర్భయత్వాన్నీ, సాహసాన్నీ, వీరత్వ, శౌర్య, ధైర్య, పురుషార్థ, సంఘర్ష శక్తులనూ ప్రసాదిస్తాడు

**23.** *హంసదేవత :* వివేక శక్తికి అధిష్ఠాత హంసయొక్క క్షీర నీర వివేకం జగత్ ప్రసిద్ధమైనది సదసద్వివేకాన్ని దూరదర్శిత్వాన్నీ, సత్సంగతినీ, ఉత్కృష్టాహారాన్నీ, ఉజ్జ్వల యశస్సంతోషాది గుణాలను యీ దేవత ప్రసాదిస్తుంది

**24.** *తులసీదేవి :* సేవాశక్తికి అధిష్ఠాత్రి సత్కార్యాలలో ప్రేరణ ప్రాణిమాత్రులను సేవించాలన్న ప్రవృత్తి, ఆత్మశాంతి, పరదుఃఖనివారణ, పవిత్ర నిష్ఠాది ఫలాలను ప్రసాదిస్తుంది

శ్రీ గాయత్రీ దివ్యశక్తి = 146 పుట

## 7. 24 గాయత్రీ మంత్రాలు

**1.** *గణేశగాయత్రి* **:** ఓం ఏక దంష్ట్రాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి తన్నో బుద్ధిః ప్రచోదయాత్

**2.** *నృసింహగాయత్రి* **:** ఓం ఉగ్ర నృసింహాయ విద్మహే, వజ్ర నఖాయ ధీమహి తన్నో నృసింహ ప్రచోదయాత్

**3.** *విష్ణు గాయత్రి* **:** ఓం నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్

**4.** *శివగాయత్రి* **:** ఓం పంచవక్త్రాయ విద్మహే, మహాదేవాయ, ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్

**5.** *కృష్ణగాయత్రి* **:** ఓం దేవకీనందనాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి, తన్నో కృష్ణః ప్రచోదయాత్

**6.** *రాధాగాయత్రి* **:** ఓం వృషబానుజాయ విద్మహే, కృష్ణప్రియాయై ధీమహి తన్నో రాధః ప్రచోదయాత్

**7.** *లక్ష్మీగాయత్రి* **:** ఓం మహాలక్ష్మ్యై చ విద్మహే, విష్ణుప్రియాయై ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్

**8.** *అగ్నిగాయత్రి* **:** ఓం మహాజ్వాలాయ విద్మహే, అగ్నిజ్వాలాయ ధీమహి తన్నో అగ్నిః ప్రచోదయాత్

**9.** *ఇంద్రగాయత్రి* **:** ఓం సహస్ర నేత్రాయ విద్మహే, వజ్రహస్తాయ ధీమహి తన్నో ఇంద్రః ప్రచోదయాత్

**10.** *సరస్వతీగాయత్రి* **:** ఓం సరస్వత్యై విద్మహే, బ్రహ్మ పుత్రై ధీమహి తన్నో దేవీ ప్రచోదయాత్

**11.** *దుర్గాగాయత్రి* **:** ఓం గిరిజాయై విద్మహే, శివప్రియాయై ధీమహి తన్నో దుర్గా ప్రచోదయాత్

**12.** *హనుమాన్‌గాయత్రి* **:** ఓం అంజనా సుతాయ విద్మహే, వాయుపుత్రాయ ధీమహి తన్నో మారుతిః ప్రచోదయాత్

**13.** *పృథ్వీగాయత్రి* **:** ఓం పృథ్వీ దేవ్యై విద్మహే, సహస్ర మూర్త్యై ధీమహి తన్నో పృధ్వీ ప్రచోదయాత్

**14.** *సూర్యగాయత్రి* **:** ఓం భాస్కరాయ విద్మహే, దివాకరాయ ధీమహి తన్నో సూర్యః ప్రచోదయాత్

**15.** *రామగాయత్రి* **:** ఓం దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి తన్నో రామః ప్రచోదయాత్

**16.** *సీతాగాయత్రి* **:** ఓం జనకనందిన్యై విద్మహే, భూమిజాయై ధీమహి తన్నో సీతా

ప్రచోదయాత్

**17.** చంద్రగాయత్రి : ఓం క్షీరపుత్రాయ విద్మహే, అమృత తత్త్వాయ ధీమహి తన్నో చంద్రః ప్రచోదయాత్

**18.** యమగాయత్రి : ఓం సూర్యపుత్రాయ విద్మహే, మహాకాలాయ ధీమహి తన్నో యమః ప్రచోదయాత్

**19.** బ్రహ్మగాయత్రి : ఓం చతుర్ముఖాయ విద్మహే, హంసా రూఢాయ ధీమహి తన్నో బ్రహ్మ ప్రచోదయాత్.

**20.** వరుణగాయత్రి : ఓం జలబింబాయ విద్మహే, నీల పురుషాయ ధీమహి తన్నో వరుణః ప్రచోదయాత్

**21.** నారాయణగాయత్రి : ఓం నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి తన్నో నారాయణః ప్రచోదయాత్

**22.** హయగ్రీవగాయత్రి : ఓం వాణీశ్వరాయ విద్మహే, హయగ్రీవాయ ధీమహి తన్నో హయగ్రీవః ప్రచోదయాత్

**23.** హంసగాయత్రి : ఓం పరమహంసాయ విద్మహే, మహాహంసాయ ధీమహి తన్నో హంసః ప్రచోదయాత్

**24.** తులసీగాయత్రి : ఓం తులస్యై విద్మహే, విష్ణు ప్రియాయై ధీమహి తన్నో బృందా ప్రచోదయాత్ శ్రీ గాయత్రీ దివ్యశక్తి పుట 150

# 158. కౌరవుల బలాబలములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | దుర్యోధనుడు | అతిరధుడు | 2 | |
| 2. | దుశ్శాసనాదులు | సమరథులు | 3 | |
| 3 | భీష్ముడు | మహారథుడు | 1 | |
| 4. | కృతవర్మ | అతిరథుడు | 2 | |
| 5 | శల్యుడు | అతిరధుడు | 2 | |
| 6 | భూరిశ్రవుడు | అతిరధుడు | 2 | |
| 7 | సైంధవుడు | మహారథుడు | 1 | త్రిగర్తాధిపతులు |
| 8. | సుదక్షిణుడు | సమరథుడు | 3 | |
| 9 | నీలుడు | అర్ధరథుడు | 4 | |
| 10. | యిందుడు | అర్ధరధుడు | 4 | |
| 11. | అరవిందుడు | అర్ధరథుడు | 4 | |
| 12. | సుశర్మ | మహారథుడు | 1 | |
| 13. | బృహద్బలుడు | సమరథుడు | 3 | |
| 14 | లక్ష్మణకుమారుడు | సమరథుడు | 3 | |

| | | | | |
|---|---|---|---|---|
| 15 | కృపాచార్యులు | అతిరథుడు | 2 | |
| 16 | శకుని | సమరథుడు | 3 | |
| 17. | అశ్వత్థామ | గాండీవితో సమానము | 1 | మహారథుడు |
| 18. | ద్రోణాచార్యుడు | అతిరథుడు | 2 | |
| 19. | బాహ్లీకుడు | అతిరదుడు | 2 | |
| 20 | హలాయుధుడు | సమరథుడు | 3 | |
| 21 | భగదత్తుడు | సమరథుడు | 3 | |
| 22. | వృషకుడు | సమరథుడు | 3 | |
| 23. | అచలుడు | సమరథుడు | 3 | |
| 24. | కర్ణుడు | అర్ధరథుడు | 4 | |

మహాబారతము, ఉద్యోగపర్వము, నాల్గవ అశ్వాసము, 309వ పుట నుండి సేకరింపబడినది పద్యకావ్యము

యుద్ధవీరులను నాలుగు విధములుగ విభజించినారు

1. మహారథుడు, 2. అతిరథుడు, 3. సమరథుడు, 4 అర్ధరథుడు

1. పదునొకండువేల విలుకాండ్రతో యుద్ధము చేయు సామర్థ్యము గల శస్త్రశాస్త్ర ప్రవీణుడయినవాడు మహారథికుడనంబడును
2. అపరిమిత రథికులతో యుద్ధము చేయువాడు అతిరథుడనంబడును
3 ఒక రథికునితో యుద్ధము చేయువాడు సమరథుడనంబడును
4 ఆ సమరథుని కంటె దక్కువయైనవాడు అర్ధరథుడనంబడును

# 159. ఇరువది నాలుగువేల శ్లోకములు

శ్రీ వాల్మీకి మహాముని రచించిన రామాయణములో ఇరువది నాలుగు వేల శ్లోకములు గలవు 500 సర్గలును, 7 కాండలును గలవు

# 160. ఇరువది నాలుగు తత్త్వములు ప్రకృతి లక్షణము

సీ॥ జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియము లైదు
 * ప్రాణాదులైదు శబ్దాదులైదు * పంచభూతములని గీత 13/6 చెబుతుంది
ఘనమనో బుద్ధ్యహంకార చిత్తంబులు
 నాల్గును నిరువది నాల్గు తత్త్వ
ముల గూడి ధవళ శ్యామల రక్త పీత వ
 ర్ణములు నాలుగు గల్గి నదియె ప్రకృతి
యది క్షరం బది క్షేత్ర మది జడం బది దృశ్య
 మది యవిద్యా జ్ఞాన మదియ నాత్మ

తేగీ॥ నదియె జీవంబు నది దేహ మది జగంబు
నదియు సంసార మది బంధ నరక మదియు
రమ్యగుణధామ భద్రాద్రి రామ సత్య
కామ కరుణా లలామ లోకాభిరామ.

శ్రీ భద్రాద్రి రామశతకము 63వ పద్యము

## 161. జ్ఞాని లక్షణములు

*1 తన్ను తాను పొగడుకొనక యుండుట, 2. తన ధర్మము తాను ప్రకాశము చేసికొనక యుండుట, 3 హింస చేయక యుండుట, 4 క్షమ, 5 కృత్రిమము, లేకపోవుట, 6 గురుసేవ, 7 బాహ్యాభ్యంతరశుద్ధి, 8. అచాంచల్యము, 9 మనోనిగ్రహము పుట్టుట, 10. ఇంద్రియ విషయములయం దాశలేకయుండుట, 11 అహంకారము లేకయుండుట, 12.జన్మము, 13 మరణము, 14. ముసలితనము, 15. రోగము, 16 దుఃఖము వీనిలోని దోషములను యోచించి తెలిసికొనుట, 17. విషయములందాసక్తి లేకయుండుట, 18. పుత్రదార గృహాదులకు గలుగు సుఖదుఃఖములు మొదలగునవి తనవి గావని భావించుట, 19. ఇష్టానిష్ట ప్రాప్తులయం దెల్లప్పుడు సమచిత్తత్వము గలిగి యుండుట, 20. ఇతర దేవతారాధన యందు మనస్సు చలింపక, నేనే (శ్రీకృష్ణపరమాత్మ)గతియని నమ్మి నాయందు దృఢమైన భక్తి చేయుట, 21. విజన స్థలవాసియగుట, 22 జన సమూహమునందు ప్రీతిలేకయుండుట, 23. ఆత్మజ్ఞానమందు నిత్యభావము గలుగుట, 24 మోక్షప్రాప్తియందే ప్రయోజన దృష్టియుంచుట యివి యన్నియు జ్ఞానమని పెద్దలు చెప్పుదురు*

శ్రీ భగవద్గీత 13వ అధ్యాయము, శ్లో॥ 8 నుండి 12 వరకు

ఇరవైనాల్గవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 25వ సంఖ్య

## 162. శ్రీరామచంద్రమూర్తి

*శ్రీరాముడు 25 సంవత్సరముల వయస్సుండగా పితృదేవుని యానతి ప్రకారము వనవాసమునకు వెళ్ళెను అప్పుడు సీతాదేవికి 18 సంవత్సరముల వయస్సు.*

శ్రీ వాల్మీకి రామాయణము, బాలకాండ - 616

# 163. తత్త్వములు ఇరువది ఐదు

| | | | |
|---|---|---|---|
| 1. భూమి<br>2 నీరు<br>3 తేజస్సు<br>4 వాయువు<br>5 ఆకాశము | పంచభూతములు | 5 | గీత 13/6,7 |
| 1. శబ్దము<br>2 స్పర్శ<br>3 రూపము<br>4. రసము<br>5 గంధము | పంచతన్మాత్రలు | 5 | |

1. మనస్సు — మనస్సు యొక్క విషయము సంకల్ప వికల్పములు.
2. బుద్ధి — బుద్ధియొక్క విషయము నిశ్చయము
3. అహంకారము — అహంకారము యొక్క విషయము నేను అనెడి అభిమానము.
4. అవ్యక్తము — చిత్తము యొక్క విషయము చంచలము

| | | |
|---|---|---|
| 1. వాక్కు<br>2. చేతులు<br>3. పాదములు<br>4. గుదము<br>5. ఉపస్థయు | పంచకర్మేంద్రియములు | 5 |
| 1. చర్మము<br>2 కన్నులు<br>3 చెవులు<br>4. ముక్కు<br>5. నాలుక | పంచ జ్ఞానేంద్రియములు | 5 |

**ఇరువది నాలుగు తత్త్వములు**

**ఇరువది ఐదవ తత్త్వము ఆత్మ**

ఇరవైఐదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 26వ సంఖ్య

## 164. దైవీలక్షణములు

1. నిర్భయము, 2. అంతఃకరణ శుద్ధి, 3 జ్ఞానయోగ నిష్ఠ, 4 దానము, 5. ఇంద్రియ నిగ్రహము, 6 యజ్ఞము, 7 వేదాధ్యయనము, 8 తపస్సు, 9 ఋజువర్తనము, 10. అహింస, 11 సత్యము, 12 కోపము లేకుండుట, 13 త్యాగబుద్ధి, 14 శాంతచిత్తము, 15 కొండెములు చెప్పకుండుట, 16 భూతదయ, 17. విషయలోలత్వము లేకుండుట, 18. మృదుస్వభావము, 19. బిడియము, 20. చపలము లేకుండుట, 21 తేజస్సు (ముఖ తేజస్సు కళ), 22 ఓరిమి తనము (ఓర్పు), 23. దిట్టతనము, 24. పవిత్రత (శుచిగాయుండుట, బాహ్యశుద్ధి, అంతర్శుద్ధి), 25 ద్రోహరాహిత్యము (ఎవరికీ ద్రోహము తలపెట్టగూడదు), 26 గర్వశూన్యత (నిగర్వము) అను నివి దైవీసంపదలో పుట్టిన వానికి ఉండెడి లక్షణములు

గీత 16/ 1 to 3

## 165. ఛందస్సులు ఇరువదియాఱు

1 ఉక్త, 2. అత్యుక్త, 3. మధ్య, 4. ప్రతిష్ఠ, 5 సుప్రతిష్ఠ, 6. గాయత్రి, 7 ఉష్ణిక్కు, 8. అనుష్టుప్పు, 9. బృహతి, 10 పఙ్క్తి, 11. త్రిష్టుప్పు, 12 జగతి, 13 అతిజగతి, 14 శక్వరి, 15 అతి శక్వరి, 16. అష్టి, 17. అత్యష్టి, 18. ధృతి, 19. అతిధృతి, 20 కృతి, 21. ప్రకృతి, 22. ఆకృతి, 23 వికృతి, 24. సంకృతి, 25 అభికృతి, 26 ఉత్కృతి

శ్రీ శర 414

## 166. అవధూత యదు సంవాదము - ఉద్ధవగీత

ఈ విషయమున పెద్దలు ఒక పురాతన ఇతిహాసమును చెప్పుదురు. అది అవధూతయగు దత్తాత్రేయుని యొక్కయు, రాజగు యదువుయొక్కయు సంవాదరూపముననున్నది అది అవధూతయొక్క ఇరువది యాఱుగురు గురువులు

1. భూమినుండి ధైర్యము, ఓర్పు అను గుణములను నేర్చుకొంటిని, 2. వాయువు వలన అధికమగు పరోపకారమును, 3. ఆకాశము వలన కాలము వలన కలుగు గుణసాంగత్యము లేకుండుటను, 4. జలము వలన నిత్య శుచిత్వమును, 5 అగ్ని వలన నిర్మలత్వమును, 6, 7 చంద్ర సూర్యుల వలన అధికాల్ప సమత్వ జీవగ్రహణ మోక్షణములను, 8 పావురమువలన భార్యా పుత్రులయెడ ప్రేమను, 9 కొండ చిలువ వలన స్వేచ్ఛా విహార సమాలబ్ధాహారమును, 10 సముద్రము వలన ఉత్సాహ రోషములను, 11. మిడుతవలన శక్త్యనుకూల కర్మాచరణమును, 12 భృంగము (తుమ్మెద) వలన సారమాత్ర స్వీకరణమును, 13. ఏనుగు వలన కాంతావైముఖ్యమును,

14 తేనెటీగ వలన సంగ్రహ గుణమును, 15 తేనె తీయువాని వలన లోభులు కూడబెట్టిన సొమ్ము ఎవడో మోసగించి తీసుకొని పోవు విధమును, 16. లేడి వలన చింతాపరత్వమును, 17. చేప వలన జిహ్వా చాపల్యమును, 18 పింగళయను వేశ్య వలన ఆశయే పరమదుఃఖము, 19 కురరపక్షి (లకుముకిపిట్ట) వలన మోహప రిత్యాగమును, 20. బాలుని వలన విచారపరిత్యాగమును, 21. కుమారిక వలన సంగత్యాగమును, 22 శరకారుని వలన తదేకనిష్ఠ, 23 సర్పము వలన పరగృహ వాసమును, 24. సాలె పురుగు వలన సంసార పరిత్యాగమును, 25.కందిరీగవలన లక్ష్యగత జ్ఞానమును విడువకుండుటయు, 26 ఈ శరీరము నాకు గురువయి యున్నది ఏలయనిని వివేకమును, వైరాగ్యమును నేర్పుచున్నది. పుట్టుక చావు దీనితో కూడియే యుండుచున్నది ఈ శరీరమును గ్రహించుట వలన ఫలము ఒక దుఃఖము తరువాత ఇంకొక దుఃఖమును అనుభవించుటయే ఈ శరీరము ద్వారా తత్త్వ విచారణ చేయుట యందు సహాయము లభించినను, నేను దీనిని నా దానినిగ ఎన్నడును తలంచను ఒకానొకదినమున దీనిని కుక్కలు నక్కలు తినివేయున నియే నేను సదా నిశ్చయించుకొనియుందును కనుకనే నేను ఈ శరీరముతో తగుల్కొనక అసంగముగ సంచరించుచున్నాను భాగవత రత్నాకరము ఏకాదశ స్కంధము 816 నుండి 834

## 167. శతకోటి ఆపై సంఖ్యలు

1. శతకోటి
2 అర్బుదం
3 న్యర్బుదం
4 ఖర్వం
5 మహాఖర్వం
6 పద్మం
7. మహాపద్మం
8. క్షోణి
9 మహాక్షోణి
10 శంఖం
11. మహాశంఖం
12. క్షితి
13. మహాక్షితి
14 క్షోభం
15. మహాకోభం
16. నిధి
17. మహానిధి

1000000000 (వంద కోట్లు)

అదే విధముగా మిగతా సంఖ్యలకు కూడా క్రమపద్ధతిలో ఒక్కొక్క దానికి అదనముగా ఒక్కొక్క పూర్ణానుస్వారము (సున్న) చేర్చుకొనవలయును

ఉదాహరణ

శతకోటికి ఒకటికి - కుడిప్రక్కన తొమ్మి సున్నలు చేర్చుకొనవలయును

అర్బుదంకు - ఒకటికి కుడి ప్రక్కన పది సున్నలు చేర్చుకొనవలయును

మహాభూరి వరకు క్రమముగా ఒక్కొక్కదానికి ఒక సున్న చేర్చుకొనవలయును మహాభూరి వరకు

18. పర్వతం
19. పరార్థం
20. అదయం
21. సాగరం
22 అవ్యయం
23. అచింత్యం
24. అమేయం
25. భూరి
26 మహాభూరి - ఒకటికి కుడిప్రక్కన 34 సున్నాలు చేర్చుకొనవలయును

ఇరవైఆరవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 27వ సంఖ్య

## 168. శ్రీ భగవద్గీతలో శ్రీకృష్ణునకు పెట్టి పిలిచిన పేర్లు

1 అనంతరూపః, 2. అచ్యుతః, 3.అరిసూదనః, 4.కృష్ణః, 5. కేశవః, 6. కేశినిషూదనః, 7. కమలపత్రాక్షః, 8. గోవిందః, 9 జగత్పతిః, 10. జగన్నివాసః, 11. జనార్దనః, 12. దేవదేవః, 13 దేవవరః, 14. పురుషోత్తమః, 15. భగవాన్, 16. భూతభావనః, 17. భూతేశః, 18. మధుసూదనః, 19. మహాబాహుః, 20. మాధవః, 21 యాదవః, 22 యోగవిత్తమః, 23 వాసుదేవః,24 వార్ష్ణేయః, 25. విష్ణుః, 26. హృషీకేశః, 27. హరిః

శ్రీమద్భగవద్గీత

## 169. నక్షత్రమాల

***27 పదములతో గాయత్రిమాతను స్తుతి చేయబడినది.***

**1.** భాస్వత్కిరీటాం: మణికాంతులచే ప్రకాశించుచున్న కిరీటము గలది
**2.** మహాకుండలైర్మండితాం : గొప్పవైన మణికుండలములచే అలంకరింపబడినది.
**3.** శంఖచక్రాంక హస్తాం : శంఖము, చక్రము, అలంకారముగా చేతియందు ధరించునది
**4.** స్ఫురత్కాంతిరూపాం : తేజో రూపముగ ప్రకాశించుచున్నది.
**5.**ఉద్యూధ ద్యుతిం : యౌవనాదులతో కూడిన దేహకాంతిని వహించినది
**6.** శ్యామలాం : యౌవన మధ్యస్థురాలు.
**7.** కోమలాం : చక్కదనము కలది
**8.** సుందరీం : రూపలావణ్యము కలది
**9.** చంద్రతారాత్మికాం : చంద్రుడు, నక్షత్రములు స్వరూపముగ కలది.

**10.** నిత్యసత్యాత్మికాం : త్రికాలా బాధితమైన సత్యమే రూపముగా కలది
**11.** మోహినీం : మైమరపును కలిగించునది
**12.** సర్వమంత్రాశ్రితాం : సర్వమంత్రములచే ఆశ్రయింపబడినది అనగా సర్వమంత్రము లామె నాశ్రయించినవి
**13.** శుద్ధవిద్యాం : కేవల విద్యా స్వరూపమైనది
**14.** జయాం : జయశీలురాలు
**15.** జ్ఞానరూపాం : జ్ఞానస్వరూపురాలు
**16.** తమోహారిణీం : అజ్ఞానమును పోగొట్టునది
**17.** వేదధాత్రీం : వేదమాతయైనది
**18.** ఉషఃకాలగమ్యాం : తెల్లవారుటకు ముందు 4 ఘడియల కాలమును ఉషః కాలమందురు ఆకాలమున సేవింపదగినది. (ఒక ఘడియ = 24 నిముషములు) తెల్లవారుటకు ముందు నాలుగు ఘడియలనగా షుమారు గం. 4.24నిముషాలు ఎటులనిన = 4 x 24 = 96 నిముషములు అనగా గం. 1 36నిముషములు 6.00 - 1.36 =4 24
**19.** ఉదాత్తస్వరూపాం : స్వరభేదమే రూపముగ గలది లేక దాన స్వరూపురాలు
**20.** సదాహంసయానాం : ఎల్లప్పుడు హంసమంత్రమునధిష్టించియుండునది లేదా ఎల్లప్పుడు రాజహంసపై సంచరించునది
**21.** అజేశాదివంద్యాం : బ్రహ్మ, ఈశ్వరుడు మొదలగు వారికి నమస్కరింపదగినది.
**22.** సుమేధాందదానాం : మంచి బుద్ధిని ప్రసాదించునది.
**23.** సుశాంతాం : మిక్కిలి శాంత స్వరూపురాలు
**24.** సుకాంతాం : మిక్కిలి మనోజ్ఞురాలు
**25.** శుభాం : మంగళస్వరూపురాలు
**26.** నిత్యమైశ్వర్యసౌఖ్యప్రదాం : ఎల్లప్పుడు ఐశ్వర్యమును సౌఖ్యమును ప్రసాదించునది.
**27.** శాకినీ ఢాకినీ ఘోర భూతాళి విద్రావిణీం : శాకినిఢాకిని మొదలయిన ఘోర భూతములను పారద్రోలునది

## 170. భరతుడు

విశ్వామిత్రుడను రాజర్షికిని మేనకయను అప్సరసకును కలిగిన కుమార్తె పేరు శకుంతల కనిన పిదప తల్లి మేనక శకుంతలను విడిచి పోగా కణ్వామహర్షి పెంచెను. యుక్త వయస్సులో నున్న శకుంతలను గాంచిన దుష్యంతుడు గాంధర్వ విధిని పరిణయంబాడి, ఆమెను ఆశ్రమమునందే విడిచి తాను రాజ్యమునకేగెను కొంతకాలమునకు శకుంతల గర్భవతియై ఆశ్రమమున ఒక పుత్రుని కనియెను ఆ బాలుడు చిన్నవయసులోనే కణ్వాశ్రమ వనమున సంచరించు సింహములను పట్టి యీడ్చుకొనివచ్చి ఆశ్రమమున కట్టుచు, విడుచుచు వినోదించుచుండెను ఆ బాలుడే

భరతుడు కొంతకాలమైన పిదప శకుంతలను, పుత్రుని తన శిష్యుని ద్వారా దుష్యంతుని చెంతకు కణ్వమహర్షి పంపించగా, దుష్యంతుడు ఆమెను భార్యగా అంగీకరించ లేదు. అంత అశీరవాణిపల్కులువిని దుష్యంతుడు శకుంతలను భార్యగా, భరతుని పుత్రునిగా అంగీకరించెను. దుష్యంతుని అనంతరము భరతుడు రాజ్యము పరిపాలించెను.

భరతుడు సత్యమును వచించుటయందును, పట్టుదలయందును, బలమునందును, భాగ్యమునందును, లోకపాలురకంటె మిక్కిలి అధికుడై ఇరువదియేడువేల సంవత్సరములు రాజ్యమును పాలించెను కుబేరుని కంటెను ఎక్కువ సంపదగల భరతుడు సాటిలేని శౌర్యము గలవాడై యుండినను, అర్థ ప్రాణములు రెండును వ్యర్థములని తలచి మిక్కిలి శాంతుడై యుండెను. శ్రీ మహాభాగవతము. నవమస్కందము

# 171. నక్షత్రములు ఇరువదియేడు

రాత్రియందు ఆకాశమున నక్షత్రములను దెలిసికొనుట

1. అశ్విని . మూడు నక్షత్రములు గుఱ్ఱపు మొగమువలెనుండును
2 భరణి : మూడు నక్షత్రములు యోనివలె నుండును
3. కృత్తిక ఆరు నక్షత్రములు మంగలి కత్తివలె నుండును
4. రోహిణి ' ఐదు నక్షత్రములు రధమువలె నుండును
5 మృగశిర : మూడు నక్షత్రములు లేడితలవలె నుండును
6. ఆర్ద్ర : ఒక నక్షత్రము పగడమువలె నుండును.
7. పునర్వసు : ఐదు నక్షత్రములు విల్లువలె నుండును
8 పుష్యమి . మూడు నక్షత్రములు పుష్పమువలె నుండును
9. ఆశ్లేష : ఆరు నక్షత్రములు సర్పము వలె నుండును
10. మఘ : ఐదు నక్షత్రములు. పల్లకివలె నుండును
11. పుబ్బ : నాలుగు నక్షత్రములు మంచపుకోళ్ళవలె నుండును.
12 ఉత్తర : పుబ్బ - ఉత్తర నేత్రద్వయం
13. హస్త . ఐదు నక్షత్రములు అరచేయివలె నుండును.
14. చిత్త ఒక నక్షత్రము ముత్యము వలెనుండును.
15. స్వాతి : ఒక నక్షత్రము మాణిక్యము వలె నుండును
16. విశాఖ : ఐదు నక్షత్రములు కుమ్మరవాని చక్రమువలెనుండును
17 అనూరాధ
18. జ్యేష్ఠ — ఆరు నక్షత్రములలో మూడు నక్షత్రములు కామవలెను, మూడు నక్షత్రములు గొడుగువలెనుండును కామ = మగగుఱి, చూచుకము (స్తనాగ్రము)
19. మూల : ఆరు నక్షత్రములంకుశమువలె నుండును

20. పూర్వాషాడ . ]నాలుగు నక్షత్రములు
21. ఉత్తరాషాడ ]చౌకముగ నుండును (చవుకము యొక్క రూపాంతరము చౌకము)
22. శ్రవణము మూడు నక్షత్రములు చేపవలె నుండును.
23. ధనిష్ఠ . మూడు నక్షత్రములు మద్దెలవలె నుండును
24. శతభిషము ' నూరు నక్షత్రములు పట్టణపు ప్రాకారమువలెనుండును
25. పూర్వాభాద్ర : ]
26. ఉత్తరాభాద్ర ]నాలుగు నక్షత్రములు విరివియైన మంచపుకోళ్లవలె నుండును
27 రేవతి . ముప్పది రెండు నక్షత్రములు చేపవలె నుండును.

జ్యోతిషప్రబావము - 13

# 172. నక్షత్రములకు దేవతా నిర్దేశము

1 కృత్తికకు అగ్ని, 2. రోహిణికి ప్రజాపతి, 3. మృగశీర్షకు సోముడు, 4. ఆర్ద్రకు రుద్రుడు, 5. పునర్వసుకు అదితి, 6 పుష్యమికి బృహస్పతి, 7 ఆశ్లేషకు సర్పములు, 8 మఖకు పితరులు, 9. పుబ్బకు అర్యముడు, 10 ఉత్తరకు భగుడు, 11 హస్తకు సవిత, 12 చిత్తకు ఇంద్రుడు, 13. స్వాతికి వాయువు, 14. విశాఖకు ఇంద్రాగ్నులు, 15 అనూరాధకు మిత్రుడు, 16 జ్యేష్ఠకు ఇంద్రుడు, 17. మూలకు పితరులు, 18 పూర్వాషాడకు అపః, 19. ఉత్తరాషాడకు విశ్వేదేవతలు, 20. శ్రవణమునకు విష్ణువు, 21. ధనిష్ఠకు వసువులు, 22 శతభిషమునకు ఇంద్రుడు, 23 పూర్వాభాద్రకు అజెకపాత్, 24. ఉత్తరాభాద్రకు అహిర్బుధ్న్యము, 25 రేవతికి పూషా, 26. అశ్వినికి అశ్వినీదేవతలు, 27 భరణికి యముడు దేవతలుగను వర్ణింపబడియున్నది ఇట్లు 27 నక్షత్రములకు దేవతానిర్దేశమున్నది

# 173. ముహూర్త భాగము

(జ్యోతిష ప్రబావము నుండి 107 to 115)

**1. తారాబలము :** జన్మనక్షత్రము మొదలు నిత్య నక్షత్రము వరకు లెక్కింపగా వచ్చిన సంఖ్యను 9 చే భాగించగా శేషము.

1 జన్మతార, 2. సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5. పత్యక్తార, 6. సాధనతార, 7. నైధనతార, 8. మిత్రతార, 9. పరమమైత్రతార యనబడును జన్మ (1) విపత్తు (3) ప్రత్యక్ (5) నైధనతారలు (7) శుభకార్యములందు విడువదగినవి తక్కిన (1) సంపత్తు (2), క్షేమము (4) సాధనము (6) మిత్ర (8) పరమమైత్ర తారలు (9) శుభకరములు.

**2. తారాదోష నివృత్తులు :** జన్మతారయందు కూరగాయలు, విపత్తారయందు బెల్లము, ప్రత్యక్తారయందు ఉప్పు, నైధనతారయందు బంగారము సద్విజులకు దానము చేసిన దోషము శాంతించును

**3. చంద్రబలము :** జన్మరాశికి 1-3-6-7-10-11 రాసులందు చంద్రుడున్న శుభము శుక్లపక్షమందు 2-5-9 రాసులందును, కృష్ణపక్షమందు 4-8-12 రాసు

లందును ఉన్న చంద్రుడు తల్లిబిడ్డలను రక్షించునట్లు రక్షించును
**4. అభిజిల్లగ్నము :** మధ్యాహ్నమునందు సూర్యుడుండునపుడు అభిజిల్లగ్నమని చెప్పబడును అనగా సూర్యునకు నాల్గవ లగ్నము అభిజిల్లగ్నము ఈ అభిజిల్లగ్నము విష్టి మహాపాతాది అనేక దోషములను పోగొట్టును అబిజిల్లగ్నమనగా షుమారు ఉదయము గం 11-35 నిముషములని పెద్దలు చెప్పుతారు శ్రీరామచంద్రుడు యీ అభిజిల్లగ్నమునందే యుద్ధమునకు బయలుదేరెనని రామాయణము చెప్పుచున్నది
**5. దగ్ధ యోగములు :** తృతీయా బుధవారము, పంచమీ మంగళవారము, షష్ఠీ గురు వారము, అష్టమీ శుక్రవారము, నవమీ శనివారము, ఏకాదశీ సోమవారము, ద్వాదశి ఆదివారము, దగ్ధయోగములు, వీనియందు శుభకార్యములుచేయరాదు
**6. వివాహ నిషిద్ధములు :** కృష్ణ ఏకాదశి మొదలు అమావాస్య వరకును, భద్రకరణము నందును, పగలు మూడవ జామునందును పగలు మూడవ జాము అనగా 7 1/2 గడియలు ఒక జాము. 180 నిమిషములు అంటే మూడు గంటలు. ఉదయము నుండి మూడు జాములు 3x3 = 9 గంటలు అంటే ఉదయము 6 గంలు 6+9=15 గంటలు 15-12=3 గంటలు అనగా మధ్యాహ్నము 3 గంటల సమయమున వివాహములు చేయరాదు అని అర్ధము సాయంకాలమునందు * (అనగా 25 ఘడియలు మొదలు ఐదు ఘడియలును) ప్రభాత సమయమందును అనగా సూర్యోదయకాలమందును, అవమయందును (అనగా మూడు తిధులు కలిసిన దినమందును) అర్ధరాత్రి యందును, త్రయోదశీ ప్రదోషములయందును, 14 మన్వాదు లయందును, 4 యుగాదులయందును, దినరాత్రి త్యాజ్య కాలములందును వివాహము చేయకూడదు.

* వివరణ సాయంకాలమునందును (అనగా 25 ఘడియలు మొదలు 5 గడియులును) ఒక ఘడియ లేదా ఒక గడియకు 24 ఇరువది నాలుగు నిముషములు విగడియ = గడియలో అరువదవ భాగము అనగా 24 సెకనులు
సాయంకాలమునందు 25 ఇరువదియైదు ఘడియనలగా 25 x 24 = 600 నిముషములు, అనగా 10 పది గంటలు ఉదయము 6 ఆఱు గంటలు + ఈ పదిగంటలు = 16 గంటలు ఈ 16 గంటలలో మధ్యాహ్నము 12గంటలు తీసివేయగా 4 గంటలు అనగా సాయంత్రము 4 గంటలన్నమాట. యిది మొదలు

5 గడియలు అనగా 5 x 24 = 120 నిముషములు అనగా 2 గంటలు అంటే సాయంత్రము 4 గంటల నుండి 2 గంటల వరకు అని అర్ధము అనగా 4 + 2 = 6 గంటల వరకు 25 ఘడియలు మొదలు 5 గడియలు అనగా సాయంత్రము 4 గంటల నుండి 6 గంటల మధ్యకాలము ఈ మధ్యకాలములో వివాహములు నిషిద్ధములు
**7. సింహస్థ గురుదోషాపవాదము :** బృహస్పతి సింహరాశి యందుండగా మఘాది పంచపాదములయందు సకలదేశముల యందును శుభకర్మ లాచరింపగూడదు

తదితరపాదములందు గురు వున్నపుడు గంగాగోదావరీ మధ్య దేశమును విడిచి తక్కిన దేశములందు శుభకర్మ లాచరింపవచ్చును. సింహమందు గురువుండగా మేషమందు సూర్యుడుండినయెడల గంగా గోదావరి మధ్య దేశమునందు శుభకర్మ లాచరింపవచ్చును

**8. ఏకోదర వివాహ విషయము:** ఒక వరునకు నిరువుర సహోదర కన్యల నియ్యదగదు. అన్నదమ్ములకు నక్కచెల్లెండ్ర నియ్యదగదు. ఒకలగ్నమందు భిన్నోదరులనగా - సవతి తల్లి కుమారున్నకైన ఇరువుర కన్నియల నియ్యగూడదు ఒక లగ్నమందు పుత్రీపుత్రులకు వివాహము చేయగూడదు. సోదరుల కిద్దఱకు రెండు వివాహములు గాని రెండు ఉపనయనములుగాని చేయకూడదు మఱియు, నాయన్నదమ్ములందు నొకరికి వివాహమును, ఒకరికి ఉపనయనమును ఒక లగ్నమందు ఒక గృహమునందు చేయకూడదు భిన్నోదరుల్కైన నొకలగ్నమందొక వేదికయందు జేయకూడదు. ఆపత్కాలవిషయమై మన్వాదులు కొందఱు మాసాంతరమున చేయవచ్చునని యు కొందఱు లగ్నాంతమున జేయవచ్చుననియు, కొందఱు ఒక లగ్నమందం శాంతరమునం దన్యగ్రామమున జేవయచ్చుననియు, కొందఱు పుత్రికా వివాహానంతరమందు పుత్ర వివాహము జేయవచ్చుననియు చెప్పియున్నారు పుత్ర వివాహము చేసి ఆరు మాసముల మీద, ఏకోదరులకు ఉపనయన వివాహాదులు శుభకరంబులని చెప్పియున్నారు

**9. తండ్రి మొదలగువారు మరణించిన పిమ్మట వివాహమునకు తగిన కాలము :** తండ్రి చనిపోయిన యెడల ఒక సంవత్సరమును, తలి మరణించిన ఆరు మాసములును, భార్య మరణించిన మూడు మాసములును, సోహదరులు గాని పుత్రులు గాని మృతి చెందిన ఒకటిన్నర మాసమును, ఇతర జ్ఞాతులు మరణించిన ఒక మాసమును విడిచిపెట్టి తరువాత వివాహము చేసికొనవలయును

ఈ విధముగా విడిచిపెట్టుటకు వీలుగాక సంకటము తటస్థించిన యెడల విఘ్నేశ్వర శాంతి చేసి శుభకార్యము చేయవచ్చునని యాజ్ఞవల్క్యయోగి వచించెను

పెండ్లినాడు మొదలు నాల్గు దినములలోపల తద్దినముగాని, అమావాస్యగాని, తటస్థించిన యెడల ఆ కన్య విధవయగును. ఒకవేళ భర్త బ్రతికినను సంతానహీనురాలగును

**10. కుజదోషము :** స్త్రీ పురుషుల జాతకములందు కుజుడు లగ్నమునకు, చంద్రునకు, శుక్రునకు 2-4-7-8-12 స్థానములుందున్న కుజదోషము. స్త్రీకి కుజదోషంబున్న భర్తృమరణమును, పురుషునకు కుజదోషమున్న భార్య మరణమును గలుగును లగ్నము నందుండి 3 భాగములును, చంద్రునందుండి 2 భాగములును, శుక్రునందుండి 1 భాగమును కుజదోషమేర్పడును ఇట్టి దోషములు స్త్రీ పురుషుల కిద్దరకు నుండిన పక్షమున ఆ దంపతులు చిరకాలము జీవించుచు బిడ్డలును సంపదలును కలిగియుందురు. సింహకటక లగ్నములలో బుట్టినవారికి కుజదోషములేదు

**11.** శుక్రదోషము : స్త్రీ పురుషుల జాతకములయందు శుక్రుడు లగ్నమునకు 6-8-12 స్థానములందుండి పాపులతో గూడిన చూడబడిన శుక్రదోషము పురుష జాతకమందున్న స్త్రీకిని, స్త్రీ జాతకమునందున్న పురుషునకు దోషము రెండు జాతకములందున్న శుభకరము

**12.** దోష భంగములు

శ్లో ॥ శుక్రః పంచసహస్రాణి, బుధః పంచశతానిచ।
లక్షమేకంతు దోషాణాం గురుః కేంద్రే వ్యపోహతి॥

కేంద్రమునందున్న శుక్రుడు ఐదు వేల దోషములను, బుధుడు ఐదు వందల దోషములను, గురువు లక్ష దోషములను పోగొట్టుచున్నారు

**13.** బుధ గురు శుక్రులలో నొకరు వివాహ సమయంబున స్వోచ్ఛ మూలత్రికోణ స్వక్షేత్ర మిత్ర క్షేత్రములయందైనను, లగ్నమందైనను 4-5-9-10 స్థానములందైనను నుండరేని అర్బుద సంఖ్యాకంబులకు దోషములను పోగొట్టగలరనుటకు సందియము లేదు (అర్బుద వివరములను వరుస నెం 167 చూడుడు)

**14.** వివాహ కన్యకు బదులు పేరు పెట్టుటకు విధి: వివాహ సమయమునందు (తారాబలము లని సమయమున) పురోహితుడు జలముతో గూడిన క్రొత్త కలశమునకు మఱ్ఱి, మామిడి, జువ్వి, నేరేడు, రావిచెట్టు వీనియొక్క చర్మము తోడను, తెల్లని యావగింజలతోడను, గఱిక రావి చిగుళ్ళతోడను అలంకరించి కన్యకను ఆ జలముచే ప్రోక్షించి, జలప్రోక్షణానంతరము ఒక ముత్తైదువ ఆ కన్నియకు పూర్వమందుంచిన నామమును పరిత్యజింపజేసి శుభకరంబగు మరియొక నామము పెట్టవలయును

**15.** బాలవైదవ్య యోగ పరిహారము : కన్యక జాతకమును బట్టి బాలవైధవ్యయోగ ముండెనేని ఆ కన్యకయొక్క తండ్రి ఆ కన్యక చేతనే సావిత్రీ వ్రతమునుగాని, పిప్పలవ్రతముగాని, చేయించి ఆ కన్యను విష్ణుప్రతిమా అశ్వత్థ ఘటములకు రహస్యముగా నిచ్చి వివాహము చేసి చిరంజీవియైన వరునకిచ్చి వివాహము చేయ వలయును అట్లు రెండుమార్లు పెండ్లి చేసినందున యే దోషమును లేకపోవును.

**16.** స్త్రీ దీర్ఘము : కన్యానక్షత్రము మొదలు తొమ్మిదేసి నక్షత్రముల వరుసను ఎంచగా మొదటి నవకంబునందు వరనక్షత్రమున్న కలహప్రదము, రెండవ నవకమునన్నున్న మధ్యఫలంబును, మూడవ నవకమున నున్న సుఖకరంబునగును ఇది వైశ్యులకు ముఖ్యము

**17.** గణములు - యోనులు

| | నక్షత్రములు | గణములు | యోనులు |
|---|---|---|---|
| 1. | అశ్విని | దేవగుణ | గుఱ్ఱ |
| 2. | భరణి | మానుష | ఏనుగు |
| 3 | కృత్తిక | రాక్షస | మేక |

| | | | |
|---|---|---|---|
| 4 | రోహిణి | మానుష | సర్పము |
| 5 | మృగశిర | దేవగణ | సర్పము |
| 6. | ఆర్ద్ర | మానుష | కుక్క |
| 7 | పునర్వసు | దేవగణ | పిల్లి |
| 8 | పుష్యమి | దేవగణ | మేక |
| 9 | ఆశ్లేష | రాక్షస | పిల్లి |
| 10 | మఖ | రాక్షస | ఎలుక |
| 11 | పుబ్బ | మానుష | ఎలుక |
| 12 | ఉత్తర | మానుష | గోవు |
| 13 | హస్త | దేవగణ | దున్నపోతు |
| 14. | చిత్త | రాక్షస | పెద్దపులి |
| 15. | స్వాతి | దేవగణ | దున్నపోతు |
| 16 | విశాఖ | రాక్షస | పెద్దపులి |
| 17 | అనూరాధ | దేవగణ | లేడి |
| 18 | జ్యేష్ఠ | రాక్షస | లేడి |
| 19 | మూల | రాక్షస | కుక్క |
| 20 | పూర్వాషాఢ | మానుష | కోతి |
| 21 | ఉత్తరాషాఢ | మానుష | ముంగిస |
| 22 | శ్రవణము | దేవగుణ | కోతి |
| 23 | ధనిష్ఠ | రాక్షస | సింహము |
| 24 | శతభిషము | రాక్షస | గుఱ్ఱము |
| 25 | పూర్వాభాద్ర | మానుష | సింహము |
| 26. | ఉత్తరాభాద్ర | మానుష | గోవు |
| 27. | రేవతి | దేవగుణ | ఏనుగు |

**18. గణకూటము :** ఏక గణము ఉత్తమము మనుష్య దేవగణములయిన మధ్యమంబు దేవరాక్షస గణంబు లశుభకరంబులు మానుష రాక్షస గణములైన మృత్యుప్రదము ఇది క్షత్రియులకు ముఖ్యము.

**19. యోని కూటము :** పరస్పర విరోధ జంతువులు - లేళ్ళు - కుక్కలు, సర్పములు - ముంగిసలు, సింహములు - ఏనుగులు, మేకలు - కోతులు, గుఱ్ఱములు - దున్నపోతులు, గోవులు - పులులు, ఎలుకలు - పిల్లులు, వధూవరులకు పరస్పర విరోధ జంతువులు గూడదు భిన్న యోనులయిన శుభప్రదము. ఇది శూద్రులకు ముఖ్యము

**20. వివాహ ముహూర్త నిర్ణయము :** 1 వివాహమునకు మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ మాసములు ఉత్తమము. 2 కార్తీక మార్గశిరమాసములు మధ్యమము

3. తక్కిన మాసములు అదమము - శుక్లపక్షమున విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పూర్ణిమ - బహుళ పక్షమున పాడ్యమి, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి తిథులును, బుధ, గురు, శుక్రవారములును - రోహిణి, మృగశిర, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములును, మేష, వృషభ, మిథున, కటక, సింహ, కన్యా, తులా, ధనుస్సు, మీనలగ్నములును; ఉదయ కాలమున, పూర్వాయామమును, శుభప్రదము. 4 పరిఘాయోగమున పూర్వభాగమును, వ్యతీపాత వైధృతి యోగములును కూడదు 5 మరియు సోమవారమున వివాహము చేసిన పునర్వివాహమగును. 6. ఆది, శనివారములు మధ్యమము 7. మంగళవారము మరణప్రదము 8 వివాహలగ్నమున బుదుడుండినచో స్త్రీ సౌభాగ్యము, గురు, శుక్రులుండిన ఆయుర్వృద్ధి, సూర్యుడుండిన వైదవ్యము, చంద్రుడుండిన స్త్రీకి మరణము, కుజుడుండిన వధూవరుల కిద్దఱకును మృత్యువు, శనియుండిన దారిద్ర్యము, రాహువుండిన సంతాన శూన్యత గలుగును 9 వివాహ లగ్నమునకు 7 ట సూర్యుడున్న వైదవ్యమును, చంద్రుడున్న పునర్వివాహము, కుజుడుండిన మరణము, బుధుడుండిన పుత్రహాని, గురువున్న నాశము, శుక్రుడుండిన స్త్రీ రోగము, శనియుండిన మరణము, రాహువుండిన బందనము కలుగును సప్తమ శుద్ధి యుండవలయును శుక్లపక్ష చంద్రుడును, శుభగ్రహములును, చాయాగ్రహ ములగు రాహుకేతువులును 7 ట నుండిన దోషము లేదని కొందఱి యభిప్రాయము చంద్రుడు లగ్నమునకు 2-3-4-5-9-10-11 స్థానములందు ఏ గ్రహముతోడను చేరకుండవలయును. బుధ, గురు, శుక్రులు లగ్నమునకు 1-2-4-5-9-10 స్థానముల యందును, రవి `కుజ శని రాహుకేతువులు 3-6-11 స్థానములందును, సకల గ్రహములు 11వ స్థానమందుండిన సకల శుభములు కలుగును 7వ యింటనే గ్రహమును ఉండకూడదు శుక్రుడు 6వ యింటను, కుజుడు 8వ యింటను ఉండదగదు సగ్రహచంద్రుడు కూడదు లగ్నమునకు పాపగ్రహకర్తరి కూడదు చంద్రుడు లగ్నమునం దుండగూడదు. యిదియుంగాక ఇరువదియొక్క మహాదోషము లను చూచుకొనవలయును

వివాహదినము మొదలు 15 దినములలో సమదినములందు తిథివారనక్షత్రాది సమస్త దోషములను పాటింపకయే నూతన వధూగృహ ప్రవేశము చేయవచ్చును

**21. వివాహానంతరము చేయరాని కార్యములు :** ఒక కుటుంబములో నొకనికి వివాహము జరిగినయెడల ఆ కుటుంబంలోని వారు ఆరు మాసములు దాటకముందు చెవులు కుట్టుట, ఉపనయనము, తీర్థయాత్ర, నూతన గృహప్రవేశము నూతన వ్రత గ్రహణము, ఉద్యాపనము మొదలగు కార్యములు జరుపగూడదు

**22. వివాహమైన సంవత్సరమున వధువు అత్తవారింట పుట్టినింట నుండు మాసముల వలన దోషము :** వివాహమైన సంవత్సరములో క్రొత్త కోడలు అత్తవారింట ఆషాడమాసము నందున్న యెడల అత్తకు కీడు ఇట్లే క్షయమాసమందున్న

తనకును, జ్యేష్ఠ మాసమందున్న బావకును, పుష్యమాసము మన్న మామకును, అధికమాసమందున్న భర్తకును హాని గలుగును చైత్రమాసమున పుట్టినింట యుండిన యెడల తండ్రికి కీడు గలుగును

23. చిఱుదీపమైనను లేకుండ అనగా చీకటిలో భార్యాభర్తలు సంయోగము చేయరాదు

24. భార్యను దిగంబరముగా చూడరాదు

25. భార్య బొట్టును పెట్టుకొనుసమయమున భర్త చూడరాదు

26. ఇద్దరు సంతానము కలిగిన తరువాత భర్త భార్యను లైంగిక సంబంధమైన దృష్టితో చూడరాదు

27. గడ్డము, మీసము వచ్చిన కుమారునికి వివాహము చేసి, స్నేహితునిగా చూచినస్తూ, యింటి బాధ్యతను అప్పగించుట, తండ్రి చేయవలసిన ప్రధమకర్తవ్యము ముఖ్యముగా యీ కలియుగమున తన గౌరవమును నిలుపుకున్నవాడవుతాడు

## 174. శృంగార ప్రబంధములు

1. విజయవిలాసము, 2 రాధికా సాంత్వనము, 3 వైజయంతీ విలాసము, 4. విల్హణీయము, 5 వీధి నాటకము, 6 శృంగార నైషధము, 7 లంబోదర ప్రహసనము, 8. వాత్స్యాయనకామసూత్రము, 9 కందర్ప చూడామణి, 10 అనంగరంగము 11. రతిరహస్యము, 12 నాగరవల్లభము, 13. నాగరసర్వస్వము, 14. కామతత్త్వము, 15 మన్మధసంహిత, 16. మననిజ సూత్రము, 17 కాదంబరి స్వీకరసూత్రము, 18. కాదంబరీ స్వీకరణ కారిక, 19 నర్మకేళీ కౌతుక సంవాదము, 20 రతిమంజరి, 21.కామతంత్రము, 22. రతికల్లోలిని, 23. పంచసాయక విజయము,24. స్మరదీపిక, 25 గణికాగుణ ప్రవర్తన తారావళి, 26 చంద్రరేఖా విలాసము, 27.శష్పవిజయము

ఇరవైఏడవ సంఖ్య వివరణ సంపూర్ణము

౼౦

# 28వ సంఖ్య

## 175. ముచుకుందుని వృత్తాంతము

కాలయవనుడు వెంటబడగా శ్రీకృష్ణుడు పారిపోతూ ముచుకుందుడు నిద్రించు గుహలో ప్రవేశించి అదృశ్యుడయ్యెను గుహలో ప్రవేశించిన కాలయవనునకు నిద్రించు ముచుకుందుని చూచి శ్రీకృష్ణునిగా భావించి అట్టహాసం చేస్తూ పాదంతో తన్నాడు తన్నగా లేచి మెల్లగా కన్నులు తెరచి చూచి ఎదురుగా వున్న కాలయవనుడు కనబడగానే కళ్ళెర్రజేయగా, ఆ కనుల నుండి అగ్నిజ్వాల వెలువడి కాలయవనుణ్ణి కాల్చి వేసింది వాడు భస్మమైపోయాడు

ముచుకుందుడు మున్ను సురాసురుల సంగ్రామాలలో సురల పక్షం వహించి వారిని గెలిపించాడు. అందుకు వారు వరం కోరుకోమనగా 'మోక్షం' ఇవ్వండని అడిగాడు కాని ఆశక్తి తనకు లేదని విష్ణువు ఒక్కడే మోక్షప్రదాత అని చెప్పారు వారు అలాగయితే విష్ణుదర్శనం అయేవరకు సుఖనిద్ర అనుగ్రహించవలసిందని వారి వల్ల ఆ వరం పొంది, ఆ కొండగుహలో నిద్రాధీనుడైయున్నాడు ముచుకుందుడు

యవనుడు తన చూపులవల్ల భస్మమైన పిమ్మట ఆ మహాత్ముడు లేచి, గుహనలు వైపులా పరికించాడు అంతలో శ్రీకృష్ణుడు అతనికి సాక్షాత్కరించాడు ఆ మహాత్ముని చూచి ఆశ్చర్యపడె "మహాత్మా మీరెవరని ప్రశ్నించగా", శ్రీకృష్ణుడీ విధముగా చెప్పాడు. "రాజా లోక కంటకులయిన రాక్షసులను వధించి భూభారం తీర్చవలసిందని బ్రహ్మ కోరగా యదువంశంలో వసుదేవునికి కుమారునిగా జన్మించాను నాపేరు శ్రీకృష్ణుడు కంసాది పెక్కుమంది రాక్షసులను సంహరించాను ఇంకను సంహరించుచున్నాను నీచేత కాలయవనుని భస్మము చేయించితిని తొల్లి నీవు నన్ను సేవించిన కతమున నిన్ననుగ్రహించుటకై ఈ శైల గుహకు వచ్చితిని భక్తుల శోకమును పోగొట్టుటయే నావిధి కావలసిన వరములడుగుము." అని పలుకగా అతడు శ్రీమన్నారాయణుడగుట యెరిగి, ఇరువది యెనిమిదవ మహాయుగమున నారాయణుడవతరించునని మున్ను గర్గుడు చెప్పుటను తలంచి, సాష్టాంగపడి, పెక్కు విధముల స్తుతించెను "దేవదేవా! చిరకాలము కర్మ ఫలములచే నార్తుడనై, దుర్వాసనలచే సంతప్తుడనై, తృష్ణవిడువక శత్రుషడ్వర్గమును గెలువలేక బాధపడు నాకు శాంతి లేదు నన్ను నిర్భయునిచేసి రక్షింపుము" అని అతడు శ్రీహరిని ప్రార్థించెను శ్రీహరియు "ఓ రాజాగ్రణీ నీకెట్టి కోరికయు లేకుండుట చాల సంతోషము నీవు తొల్లి క్షత్ర ధర్మమున మృగయావినోదమున జంతువులను చంపితివి తపస్సున తత్కర్మవిముక్తుడవై తర్వాతి జన్మమున బ్రాహ్మణ శ్రేష్ఠుడవై నన్ను చెందెదవు" అనెను ముచుకుందుడు శ్రీకృష్ణునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి గుహ వెడలి కలియుగము ప్రాప్తమగునని తలచి ఉత్తరాభిముఖుడై తపోనిష్ఠుడగుచు సర్వసంగములు విడిచి విష్ణునియందే మనసు నిలిపి బదరికాశ్రమము చేరి హరినారాధించుచుండెను

వచనా బాగవతము, దశమస్కందము - 151

ఇరవైఎనిమిదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 29వ సంఖ్య

## 176. శ్రీరాముని అశ్వమేధయాగము

శ్రీరామచంద్రమూర్తి అశ్వమేధయాగమును జూచుటకై 29 మంది మునులు వేంచేసినారు

1 మార్కండేయుడు, 2 మృకండుడు, 3. చ్యవనుడు, 4 ముద్గలుడు, 5. అసితుడు, 6 జామదగ్న్యుడు, 7.దేవలుడు, 8 వ్యాసుడు, 9 క్రతువు, 10 విభాండకుడు, 11. నారదుడు, 12 తుంబురుడు, 13. గాలవుడు, 14. ధౌమ్యుడు, 15 కణ్వుడు, 16 ఏకపాదుడు, 17. ఊర్ద్వాస్యుడు, 18. వృద్దగౌతముడు, 19 ఋష్యశృంగుడు (ఋష్యశృంగుని భార్య శాంత శ్రీరామునియొక్క సోదరి), 20 మతంగుడు, 21. జాబాలి, 22 కుంభసంభవుడగు నగస్త్యుడు, 23 దధీచి, 24 శౌనకుడు, 25. సూతుడు, 26 సుతీక్ష్ణుడు, 27. లోమశుడు, 28. వాల్మీకి, 29 వేదనిధియగు దుర్వాసుడు - వీరును మరికొందరు ఇతర మహర్షులును శిష్యప్రశిష్య తనయాదులతో గూడిన వారయి వచ్చిరి శ్రీరామచంద్రుడు వారల నందరను యథావిధిగా పూజించెను శ్రీరామాయణ సారోద్ధార ఉత్తరకాండము, ప్రదమబాగము = 177

ఇరవైతొమ్మిదవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 30వ సంఖ్య

## 177. సీతాన్వేషణము

శ్రీరామచంద్రుడు, సుగ్రీవుడు హనుమంతుని సహకారముతో అగ్ని సాక్షిగ మిత్రులైనారు. ఇద్దరు భార్యలను కోల్పోయినవారలే శ్రీరాముడు మాటయిచ్చిన ప్రకారము వాలిని సంహరించి సుగ్రీవునికి రాజ్యపట్టాభిషేకము జరిపించాడు

తదుపరి సుగ్రీవుడు తన మాట యిచ్చిన ప్రకారము సీతను వెదకుటకై వానర వీరులను నాలుగు దిక్కులకు పంపిస్తూ వారితో యీ విధంగా చెప్పాడు

విచిన్వంతు ప్రయత్నేన భవంతో జానకీం శుభామ్,
మాసాదర్వాజ్నివర్తధ్వం మచ్చాసన పురస్సరాః,
సీతా మదృష్ట్వాయదివో మాసా దూర్ధ్వం దినం భవేత్,
తదా ప్రాణాంతికం దండం మత్తః ప్రాప్స్యథ వానరాః

భావము : మీచేత శుభాంగి జానకి అత్యంత ప్రయత్నముతో వెదకబడుగాక! ఒక్క మాసము (ముప్పది రోజులు) లోపలనే తిరిగిరండు! ఇది నా ఆజ్ఞ మరువవలదు సీతను చూడక, జాడ తీయక, నెలదాటిన మరుసటినాడు వచ్చిననూ నా నుండి మరణదండననే పొందుదురు అద్యాత్మ రామాయణము, కిష్కంధాకాండము -6వ సర్గ - 233

ముప్పైవ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 31వ సంఖ్య

## 178. శ్రీచక్రపూజా విధానములో ముద్రలు

ము = ముదమును దేవునకు గల్గించును

ద్రా = దుఃఖములను, పాపములను నాశము చేయును

1. మృగీముద్రా : రెండు హస్తముల ఉంగరపు వ్రేళ్ళు మధ్యవ్రేళ్ళు కలిపి క్రిందకు మడచి అంగుష్ఠము పై నుంచి, కనిష్ఠకను, తర్జనిని పైకి వుంచి శిరస్సుపై పెట్టుకొన వలయును రెండు కనిష్ఠకలు కలియవలెను
2. జ్ఞానముద్రా : కుడిచేతి అంగుష్ఠతర్జనులను కలిపి పట్టుకొని మిగిలిన వ్రేళ్ళను జాపవలెను చేయి పృష్ఠభాగము సాధకుని వైపునకు ఉండవలెను
3. ఆవాహనముద్రా : దీనికి సుముఖముద్ర అని కూడ పేరు రెండు అరచేతులను తన ముఖమున కెదురుగా పట్టుకొని రెండు కనిష్ఠకలు కలిసియుండునట్లు ఉంచవలెను అన్నివ్రేళ్ళు కలసి ఉండవలెను చేతులు సాధకుని ముఖము వైపు తిరిగి ఉండవలెను
4. ముద్గరముద్రా : ఎడమచేతి గుప్పెటపై కుడిచేతి గుప్పిట ఉంచవలెను
5. సువృత్తముద్రా : రెండు చేతుల యొక్క నాలుగువ్రేళ్ళను మడచి రెండు అంగుష్ఠము లను, జతపరచి, చేతులను చేర్చి సాధకుని ముఖము వైపు త్రిప్పుకొని యుంచుకొనవలయును
6. చతురశ్రముద్రా : ఎడమ అరచేతిని జాపి దానిని కుడి అరచేతితో పటములో జూపినట్లు మూయవలెను
7. యోనిముద్రా : రెండు చేతులు పైకి చాపి, రెంటిని చేర్చి రెండు కనిష్ఠకలను ముందుకు వంచి, కుడిచేతి ఉంగరపు వ్రేలును, ఎడమచేతి ఉంగరపు వ్రేలును ఒకదానిపై నొకటి ఐమూలగా వంచి పట్టుకొని మధ్యమవ్రేళ్ళ చివరి భాగములు కలియునట్లు పట్టుకొని, కుడిచేతి తర్జనితో ఎడమచేతి ఉంగరపు వ్రేలు చుట్టి పట్టుకొని, అట్లే ఎడమచేతి తర్జనితో కుడిచేతి ఉంగరపు వ్రేలును చుట్టి పట్టుకొని, అంగుష్ఠము లను కనిష్ఠికలను తాకి క్రిందకు వంచి చూపవలెను

| | | |
|---|---|---|
| **8.** సౌభాగ్యదండినీముద్రా | : | ఎడమచేతియొక్క మధ్యమ, అనామిక కనిష్ఠకలను అరచే తిలోనికి మడచి అంగుష్ఠముతో నొక్కి పట్టి తర్జనిని పైకి చూపవలెను |
| **9.** సన్నిరుద్ధాముద్రా | : | రెండు గుప్పెటలలోనికి అంగుష్ఠములను మడచి గుప్పి ళ్ళను చేర్చి పట్టుకొనవలెను గుప్పిటలో అంగుష్ఠము చివర కనిష్ఠక చివరను తాకుచుండవలెను |
| **10.** సన్నితాపనముద్రా | : | రెండు గుప్పిళ్ళనుచేర్చి రెండు అంగుష్ఠములను చేర్చి పట్టుకొనవలెను. |
| **11.** సంస్థాపనముద్రా | : | రెండు అరచేతులను నేలవైపు చూపుచు రెండు అంగుష్ఠములను చేర్చి పట్టుకొనవలెను |
| **12.** కౌళినీముద్రా | : | కుడిచేతిలోనికి ఎడమచేయి త్రిప్పి కుడి అంగుష్ఠమును ఎడమ కనిష్ఠకతోను కుడి తర్జనిని ఎడమ అనామికతోను కుడి మధ్యమను ఎడమ మధ్యమతోను కుడి అనామికను ఎడమ తర్జనితోను, కుడికనిష్ఠకను ఎడమ అంగుష్ఠముతోను తాకించుచు పట్టుకొనవలెను |
| **13.** రిపుజిహ్వాముద్రా | : | ఎడమచేతియొక్క అంగుష్ఠమును గుప్పిటలోనికి మడచి తర్జనిని జాపి పట్టుకొనవలెను |
| **14.** త్రిఖండాముద్రా | : | యోనిముద్రవలెనే పట్టుకొని రెండు కనిష్ఠికలను వెలుప లకు తీసి, భూమివైపు త్రిప్పి, అంగుష్ఠముల రెంటిని ఆకాశము వైపు చూపవలెను రెండు చేతులను చేర్చి జీర్ణకోశము ఆకృతిగా పట్టుకొనవలెను |
| **15.** బంధనముద్రా | : | రెండు అరచేతులను కలిపి, అంగుష్ఠము అంగుష్ఠముతోను, ఇట్లే వరుసగా కనిష్ఠిక కనిష్ఠికతో కలియునట్లు పట్టుకొని నమస్కరింపవలెను |
| **16.** ధేనుముద్రా | : | రెండు చేతులను క్రిందకు జాపి కుడి చేతి కనిష్ఠిక ఎడమచేతి అనామికను, కుడిచేతి అనామిక ఎడమచేతి కనిష్ఠకను, కుడిచేతి మధ్యమ ఎడమచేతి తర్జనిని, కుడిచేతి తర్జని ఎడమచేతి మధ్యమ తాకునట్లు పట్టుకొనవలెను (అంగుష్ఠములు కలియకపోయిన తప్పులేదు) |
| **17.** సమ్ముఖీముద్రా | : | రెండు గుప్పిళ్ళను మూసి నేలవైపు చూపుచు అంగుష్ఠము లను చేర్చి పట్టుకొనవలెను |
| అవకుంఠనముద్రా | : | దీనిని పటములో చూపలేదు రెండు చేతులను గుప్పి ళ్ళను మూసి కుడిచేతి తర్జనితో ప్రదక్షిణముగాను, ఎడమచేతి తర్జనితో అప్రదక్షిణముగాను త్రిప్పవలెను |

**18.** సర్వసంక్షోభిణీముద్రా : (దీని బీజము ద్రాం) రెండు చేతులు తర్జనులను పైకి చూపుచు మిగిలిన వ్రేళ్ళను అంగుష్ఠముపై పెట్టి రెండు అంగుష్ఠములను చేర్చి పట్టుకొనవలెను

**21.** సర్వవిద్రావిణీముద్రా: (దీని బీజము ద్రీం) రెండు చేతుల యొక్క తర్జనులను మధ్యమలను పైకి చూపుచు మిగిలిన వ్రేళ్ళతో సర్వ సంక్షోభిణీ ముద్ర పట్టుకొనినట్లే పట్టుకొనవలెను

**23.** సర్వాకర్షిణీముద్రా : (దీని బీజము క్లీం) సర్వ విద్రావిణీ ముద్రలో పట్టినట్లె అంగుష్ఠముతో అనామికా కనిష్ఠికలను చేర్చి తర్జని మధ్యమలను వంకరగా పట్టవలెను

**24.** సర్వవశంకరీముద్రా : (దీని బీజము బ్లూ) రెండు చేతుల వ్రేళ్ళను పటములో చూపినట్లు జడవలె అల్లి మూసి పటములో చూపినట్లు పట్టుకొనవలెను

**19.** సర్వోన్మాదినీముద్రా : (దీని బీజము సం) అంగుష్ఠ కనిష్ఠక మధ్యమలను చేర్చి మిగిలిన రెండు వ్రేళ్ళను పైకి జాపి రెండు చేతులను పటములో జూపినట్లు పట్టుకొనవలెను

**20.** సర్వమహాంకుశముద్రా : (దీని బీజము క్రోం) రెండు చేతులలో అంగుష్ఠమధ్యమ అనామికలను చేర్చి పట్టుకొని తర్జనిని వంకరగా వుంచి, రెండు కనిష్ఠికలను చేర్చి పటములో చూపినట్లు పట్టుకొనవలెను

**31.** సర్వఖేచరిముద్రా : (దీని బీజము హ్స్ఫ్రం) ఎడమచేతిని శిరస్సు వరకు ఎత్తి దానికి ముందుగా కుడి చేతిని పట్టుకొని రెండు చేతులను ఆకాశము వైపు చూపుచు యోనిముద్రగా పట్టుకొని శ్రీదేవికి చూపవలెను

**22.** సర్వబీజముద్రా : (దీని బీజము హ్సౌః) రెండు అరచేతులను పైకెత్తి రెండును చేర్చి కుడిచేతి కనిష్ఠికను ఎడమచేతి కనిష్ఠికను అడ్డముగా పెట్టి, ఎడమచేతి అనామికతో కుడిచేతి కనిష్ఠికను నొక్కి పట్టి, కుడిచేతి ఉంగరపువ్రేలితో ఎడమచేతి కనిష్ఠికను క్రిందుగా నొక్కి పట్టి, రెండు మధ్యమవ్రేళ్ళను చేర్చి, మిగిలిన వ్రేళ్ళను లోపలకు వంచి యితర వ్రేళ్ళను తాకునట్లు పట్టుకొని అరచేతులొకదాని కొకటి చేర్చి మూయవలెను

నైవేద్య ముద్రాని

**25.** ప్రాణముద్రా : (ప్రాణాయస్వాహా) కుడిచేతి అంగుష్ఠముతో కనిష్ఠిక అనామికలను చేర్చి పట్టుకొని మిగిలిన వ్రేళ్ళను జాపి

చూపవలెను.

26. అపానముద్రా : (అపానాయస్వాహా) కుడిచేతి అంగుష్ఠముతో తర్జని మధ్యమలను కలిపి పట్టుకొని మిగిలినవ్రేళ్ళను జాపి చూపవలెను

27. వ్యానముద్రా : (వ్యానాయ స్వాహా) కుడిచేతి అంగుష్ఠముతో మధ్యమ అనామికలను చేర్చి మిగిలిన వ్రేళ్ళను జాపి చూపవలెను

28. ఉదానీముద్రా : (ఉదానాయ స్వాహా) కుడిచేతి అంగుష్ఠాది నాలుగు వ్రేళ్ళను కలిపి పట్టుకొని కనిష్ఠికను జాపి చూపవలెను

29. సమానముద్రా : (సమానాయ స్వాహా) కుడిచేతియొక్క అయిదువ్రేళ్ళను కలిపి పట్టుకొని చూపవలెను

బ్రహ్మణేస్వాహా : అన్నివ్రేళ్ళను సాధారణముగా పట్టుకొని (నివేదిత వస్తువును) శ్రీదేవికి చూపవలెను. దీనిని పటములో చూపలేదు.

30. తత్త్వముద్రా : ఎడమచేతి అంగుష్ఠముపై అనామిక నుంచి మిగిలినవ్రేళ్ళను పైకి జాపి పట్టుకొనవలెను

గ్రాసముద్రా : నైవేద్యకాలమున కుడిచేతి తర్జని ఎడమ అరచేతి చుట్టు ప్రదక్షిణంగా త్రిప్పవలెను ఎడమచేతిని చాపి నైవేద్యముపైన మూలమంత్రముతో శ్రీదేవికి చూపవలెను.

హేఘంటే సుస్వరే పీతే ఘంటాధ్వని విభూషితే।
వాదయంతి పరానందే ఘంటాదేవం ప్రపూజయేత్॥
ఆగమార్థం చ దేవానాం గమనార్థం తు రక్షసామ్।
కుర్యాత్ ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్॥
ఇతి ఘంటానాదం కృత్వా॥ అమృత తరంగిణి

31వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 32వ సంఖ్య

## 179. భక్తులు చేయకూడని పనులు (నారదునకు శివుడు చెప్పెను)

1. స్నానము చేయకుండ దేవుని మూర్తిని తాకరాదు.
2. అశుచిగా నుండియు (మలవిసర్జన చేసి) తాకరాదు
3. సాక్షాత్తు భోజనము చేసి పాదోదకమును పుచ్చుకొనరాదు

4. నైవేద్యము లేకుండ పూజించరాదు.
5 దేవుడున్న స్థానమునకంటె ఎత్తైన యాసనమున తాను కూర్చుని పూజ చేయరాదు
6. ముట్టుతను (బహిష్టైన స్త్రీని) చూచి పూజించరాదు
7 గంటను నేలమీద నుంచరాదు
8. పుష్పములను నీటితో తడపరాదు కడగరాదు
9 పూజ చేసిన దేవునకు (పెద్దలకు) వీపు చూపరాదు
10. దేవుని (గురుని) ఎదుట గిరగిర తిరగరాదు ఆత్మప్రదక్షిణమనునది దేవుని (గురుని) చుట్టూ చేయవలెనే కాని ఎదుట చేయరాదు
11. దేవుని యెదుట భోజనము చేయరాదు
12 భోజనము చేయక, ఆకలితో నకనకలాడుతూ పూజ చేయరాదు.
13. పూజ చేయునపుడు కంబళము కప్పుకొనరాదు
14. దేవుని పూజాగృహములో ముందు కుడికాలును వుంచవలెనే గాని ఎడమకాలు వుంచి ప్రవేశించరాదు.
15. దేవుని (పెద్దల) దగ్గర ఉమ్మివేయరాదు.
16. నైవేద్యమును దైవ (గురు) ప్రసాదమని భావించవలెనే కాని, కొబ్బరి, పెసరపప్పు గారెలు యని వర్ణించరాదు
17 దేవుని విగ్రహమును దేవుడని భావించవలెనేగాని, రాయి లోహము, పటము అని భావించరాదు.
18. భగవంతుని భజించు భక్తులను సామాన్య మానవులతో సమముగా చూడరాదు
19. ఇతరుల కొఱకు (బంధుమిత్రాదుల కొఱకు) చేసిన పదార్థములను దేవునకు నివేదించరాదు
20. సాధు సజ్జనులను నిందించగూడదు.
21. తీర్థ ప్రసాదములను తీసికొనునపుడు ఒంటిచేతితో తీసుకొనరాదు నేలపై తీర్థమును పడనీయరాదు
22 పూజ చేయునపుడు ఇతరులతో మాట్లాడరాదు తలను గోకుకొనరాదు
23 శివకేశములను భేదబుద్ధితో గాంచరాదు ఇతర మతస్థులను దూషించరాదు
24. ఆచార్యుని (గురువుని) అవమానించరాదు
25. వేదశాస్త్రములను నిందించకూడదు.
26. భగవన్నామ మందర్థవాదము చేయరాదు (అనగా భగవన్నామము భజించుచున్నంత మాత్రమున పాపములు నశించునా? అజ్ఞాన రహితమగునా? యని యనరాదు)
27. భగవన్నామమును అండగా చేసికొని పాపపుపనులను చేయరాదు (అనగా

భగవన్నామ స్మరణాదులు జేసి పాపములను పోగొట్టుకొనవచ్చుగదాయని తలంచి పాపకార్యములలో ప్రవేశింపరాదు)

28. భగవన్నామ స్మరణ దానధర్మాదులతో సమమని తలంచరాదు
29. శ్రద్ధలేని వారికి భగవన్నామోపదేశమును చేయరాదు
30 భగవన్నామ ప్రభావమును వినియు అవిశ్వాసముతో వర్తించరాదు.
31. భగవన్నామ సంకీర్తన (స్మరణ)చేయుటయందు నాయంతటివాడు లేడు అని గర్వము కలిగియుండరాదు.
32 "స్నానే చ భోజనే హోమే జపే మౌనముపాశ్రయేత్" స్నానము చేయుకాలమందు, భోజనము చేయునపుడు, హోమము చేయు సమయమందు, జపము చేయుకాలమందును మౌనముగా నుండవలయును.

(స్కాంద పురాణము)శ్రీ భగవత్పూజామాల 15

# 180. వసిష్ఠుడు

"వసిష్ఠో బ్రహ్మణః సుతః"

వసిష్ఠ మహర్షి బ్రహ్మదేవుని తనయుడు గొప్ప తపస్సంపన్నుడు (మహాతపాః= పూజ్యమగు జ్ఞానము గలవాడు వి.స.నా) సర్వవేదములను చక్కగ తెలిసినవాడు ధర్మాత్ముడు. జపము చేయువారిలో శ్రేష్ఠుడు (జపతాంవరః) ఇక్ష్వాకువంశమునకు పురోహితుడు. ఆధ్యాత్మిక జ్ఞానముయొక్క పూర్ణానుభూతిని బడసినవారు పదునాలువత్సరముల ప్రాయమున శ్రీరామచంద్రునకు పరమార్థ విజ్ఞానమును లెస్సగ ప్రబోధించిన ధీశాలి అదియే వసిష్ఠ విరచితమగు ముప్పది రెండువేల శ్లోకములతో గూడిన "యోగవాసిష్ఠ" మహాగ్రంధము. రామాయణ రత్నాకరము - 390

కాలక్రమేణ ఆ గ్రంథ పరిమాణం తగ్గుతూ వచ్చింది 32 వేల శ్లోకాల బృహద్యోగ వాసిష్ఠ మహారామాయణాన్ని కాశ్మీర దేశస్థుడైన అభినందనుడనే పండితుడు 6 వేల శ్లోకాలకు తగ్గించి లఘు యోగవాసిష్ఠము అను పేరుతో కధగాని విషయక్రమంగాని తగ్గకుండా వుండేటట్లు కుదించాడు. దానికి ఉత్తమసుఖుని శిష్యుడు ఆత్మసుఖుడనే పరివ్రాజకుడు యోగవాసిష్ఠ చంద్రిక అనే వ్యాఖ్యానం సంస్కృతంలో వ్రాసాడు ఆ గ్రంథాన్నే ఆలఘుయోగవాసిష్ఠాన్నే వావిళ్ళవారు ప్రతి శ్లోకానికి తెలుగులో తాత్పర్యం శ్రీ నాగలింగా శాస్త్రుల వారి చేత 1927లో "జ్ఞాన వాసిష్ఠము" అనే పేరుతో ప్రచురించారు. అది కూడా ఇప్పుడు అలభ్యమే.

పిమ్మట అనేక మంది అనేక రూపాల్లో గ్రంథాన్ని కుదించి, రూపాంతరీకరించి వేరువేరు పేర్లతో ప్రచురించారు. ప్రచురిస్తున్నారు యోగవాసిష్ఠం, జ్ఞానవాసిష్ఠం, వసిష్ఠ గీత, వాసిష్ఠ రామయణం ఇట్లా రకరకాల పేర్లతో ప్రచారంలో వున్నాయి "యోగవాసిష్ఠ సారము" సంక్షిప్తీకరణ - శ్రీ నోరి శ్రీనాధ వెంకట సోమయాజులు - 1995సం||)

## 181. అన్నమయ్య

*తిరుమల దివ్యక్షేత్రంలో స్వయం వ్యక్తమై వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామిని ముప్పది రెండు వేల కీర్తనా కుసుమాలతో పాదార్చన చేసి పరమ పదాన్ని చేరుకొన్న హరి అవతారుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు దేశమంతా వ్యాపించిన కీర్తి చంద్రికలకు ఆయన ఆధ్యాత్మిక కీర్తనలే మూలం శృంగార సంకీర్తనల కన్నా, ఆధ్యాత్మిక కీర్తనలు తక్కువైనా అవి భక్తి పరిమళాలను వెదజల్లుతూ, నిత్యమై శాశ్వతమై నిలిచివున్నాయి* శ్రీరామకృష్ణ ప్రభ 12/98

## 182. గ్రంథము

*శ్రీ వాల్మీకి రామాయణము శతకోటి గ్రంధములు గలది గ్రంథమనగా ముప్పది రెండు అక్షరములు గలది* బాలకాండ - 108

*గ్రంధము = ముప్పది రెండక్షరముల శ్లోకము* శబ్ద రత్నాకరము - 355

## 183. స్వామి వారికి జరుపబడు అర్చనలో 32 ఉపచారములు

1. *ఆసనము,* 2. *స్వాగతము,* 3 *అనుమాన,* 4 *పాద్యము,* 5 *ఆచమనము,* 6. *పుష్పము,* 7 *గంధము,* 8. *ధూపము,* 9. *దీపము,* 10 *అర్ఘ్యము,* 11. *ఆచమనము,* 12 *స్నానము,* 13. *ప్లోతవస్త్ర,* 14. *ఉత్తరీయ,* 15. *పవిత్ర,* 16. *ఆభరణ,* 17. *యజ్ఞోపవీత,* 18 *పాద్య,* 19. *ఆచమన,* 20 *పుష్ప,* 21 *గంధ,* 22. *ధూప,* 23. *దీప,* 24. *హవిః,* 25. *పానీయ,* 26. *ఆచమన,* 27 *ముఖవాస,* 28 *బలి,* 29 *ప్రణామ,* 30. *దక్షిణాః,* 31. *పుష్పాంజలి,* 32. *స్తుతి* సప్తగిరి ఆగస్టు / 97 = 39

## 184. భారతీయులు వినాయకుడిని 32 రకాలుగా ఊహించారుఅని ముద్గల పురాణము చెబుతుంది. అవి

1. *బాల,* 2. *తరుణ,* 3. *భక్తి,* 4 *వీర,* 5 *శక్తి,* 6. *ధ్విజ,* 7. *సిద్ధి,* 8 *ఉచ్ఛిష్ఠ* 9. *విఘ్న,* 10. *క్షిప్ర,* 11. *హేరంబ,* 12. *లక్ష్మీ,* 13. *మహా,* 14. *విజయ,* 15 *నృత్య,* 16. *ఊర్ధ్వ,* 17. *ఏకాక్షర,* 18. *ప్రసన్న,* 19. *త్రయ్యాక్షర,* 20. *క్షిప్రప్రసాద,* 21 *హరిద్రా,* 22. *ఏకదంత,* 23. *సృష్టి,* 24. *ఉద్దంత,* 25 *ఋణవిమోచన,* 26 *ధుంఠి,* 27. *ద్విముఖ,* 28. *త్రిముఖ,* 29. *సింహ,* 30. *యోగ,* 31. *దుర్గాగణపతి,* 32 *సంక్షేమ తారా గణపతులు మొత్తము* 32 *అవతారాలన్నమాట*

*కృతయుగంలో వినాయకుడికి చేతులు* 10. *వాహనం సింహం, త్రేతాయుగంలో ఆరుచేతులు నెమిలి వాహనం కలియుగంలో రెండు చేతులు, మూషికవాహనం.*

శ్రీరామకృష్ణప్రభ 8/98=14,15

## 185. ఊర్ధ్వముఖము 32 అక్షరములు గల మంత్రము

ప్రణవం హృదయం పశ్చాత్తతో భగవతే పదం
ఆంజనేయాయ శబ్దం చ చతుర్థ్యంత సమన్వితం।
మహాబలపదం పశ్చాత్తతో హనుమతే పదం
ఉచ్చరేద్వహ్ని దయితాం విద్యైకా సముదీరితా।
త్రయో వింశత్యక్షరోఽయం మంత్ర ఇత్యుచ్యతే బుధైః।
సప్తమంత్రస్థ వర్ణానాం షణ్ణ వత్యుత్తి రామునే। శ్రీ సుందరకాండ శ్రీవిద్య - 73

## 186. కలియుగ తారకమంత్రము

హరేరామ హరేరామ - రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ - కృష్ణ కృష్ణ హరేహరే

*అనెడి ముప్పది రెండక్షరములే కలియుగ తారకమంత్రము ఈ 32 అక్షరములు కలిపి పరిశుద్ధమనస్సుతో, ఆర్తితో సంకీర్తన చేసిన కలిదోషము పోవును.*

*విషయవాసన నశించిన మనస్సు గలవారు మాత్రమే, ముక్తులగుదురని వేదము చాటి చెప్పుచున్నది అని ముక్తి కోపనిషత్తు*

## 187. వాల్మీకి మొదటి శ్లోకము

శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాం త్వ। మగమశ్శాశ్వతీ స్సమాః।
యత్క్రౌంచ మిథునాదేక। మవధీః కామమోహితమ్ ॥

*వాల్మీకి నోటి నుండి పలికిన 32 అక్షరముల అనుష్టుప్ ఛంద శ్లోకము యొక్క అర్థము*

*ఓ నిషాదుడా! క్రౌంచమిథునం నుండి కామమోహితమైన మగపక్షిని వధించావు. కనుక నీవు చిరకాలం ప్రతిష్ఠను పొందకుందువుగాక*

*యిది ఒక అర్థము యింకా అనేక అర్థములున్నవి వాటి కొఱకు వరుస నంబరు 207 చూడుడు* వాల్మీకి రామాయణము - బాలకాండ

32*వ సంఖ్య వివరణ సంపూర్ణము*

*ఓం*

# 33వ సంఖ్య

## 188. భాగవత ప్రశస్తి

1 *నదులలో గంగానది,* 2 *దేవతలయందు బ్రహ్మ,* 3 *తారకలయందు చంద్రుడు,*

4. సముద్రములయందు క్షీరాబ్ధి, 5. పర్వతములయందు మేరువు, 6. గ్రహములందు సూర్యుడు, 7 దైత్యులందు ప్రహ్లాదుడు, 8 మణులయందు పద్మరాగము, 9.వృక్షములందు హరిచందనము, 10 ఋషులయందు నారదుడు, 11 ధేనువులందు కామధేనువు, 12 సూక్ష్మములందు జీవుడు, 13 దుర్జయములందు మనస్సు, 14. వసువులయందు హవ్యవాహనుడు, 15. ఆదిత్యులయందు విష్ణువు, 16 రుద్రుల యందు నీలలోహితుడు, 17 ప్రజాపతులందు భృగువు, 18 సిద్ధులయందు కపిలుడు, 19 అశ్వములందు ఉచ్చైశ్రవము, 20 సర్పములందు వాసుకి, 21 మృగములందు సింహము, 22 ఆశ్రమములందు గృహస్థాశ్రమము, 23. వర్ణములందు ఓంకారము, 24. ఆయుధములందు విల్లు, 25 యజ్ఞములందు జపయజ్ఞము, 26 వ్రతములయం దహింస, 27. యోగముల యందాత్మయోగము, 28 ఓషధులయందు యవలు, 29. భాషణములయందు సత్యము, 30 ఋతువులందు వసంతము, 31. మాసముల యందు మార్గశిరము ఎట్లు ముఖ్యములో, 32 యుగములందు కృతయుగమెట్లో, 33 అట్లే పురాణములందు భాగవతము ముఖ్యము అట్టి భాగవతమును సర్వులూ సర్వవేళలా పఠింతురు గాత వచన బాగపతము 12వ స్కందము - 313

# 189. ముప్పది ముప్వురు

పన్నిద్దరు భాస్కరులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ఇద్దరశ్వినులు (12+8+11+2 =33) కలసి ముప్పది ముప్వురు ముప్పదిమూడుకోట్ల దేవతలని చెప్పబడువారు వీరే. ఈ ముప్పది ముగ్గురు, వీరి సేనలు, పరిచారకులు లోనగువారు గలసి ముప్పది మూడు కోట్లు శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము బాలకాండము - 769

# 190. దేవాలయదేవతలు

దేవాలయ దేవతలు కూడా 33 మంది

1 అంతరాలయ, 2. శుకనాసిక, 3. అగ్ర, 4. ముఖ, 5. మహా, 6 సభా, 7 ఆస్థాన, 8. స్నాపన, 9 యాగ, 10 అలంకరణ, 11. ద్రవ్య, 12 ధన, 13 ధాన్య, 14.వస్త్ర, 15 వాహన, 16 నంది, 17 ధ్వజ, 18 కల్యాణ, 19 మలయ, 20 నక్షత్ర, 21 శయన, 22 పుష్ప, 23 అధ్యయన, 24 కపిల, 25. వీణ, 26. దీప, 27. ధూప (28 నుండి 32 లభ్యము కాలేదు) మొదలైన 32 మండపాలు విమానం 33వదిగా చెప్పబడింది

శరీరానికి కూడా 33 మంది దేవతలు వున్నారు.

5 - పంచభూతాలు, 5 - పంచతన్మాత్రలు, 5 - పంచవాయువులు, 10 - ఇంద్రియదశకం (జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు) 5+5+5+10=25, 26 మనస్సు, 27. బుద్ధి, 28 చిత్తము, 29 అహంకారము, 30 కాలం, 31. కర్మం, 32 దైవం, 33 మూలప్రకృతి మొత్తం 33 మంది

దేహం ఏ విధంగా ఇంద్రియాధిపతులు మొదలైన దేవతలకు నివాసస్థానమయిందో, అట్లే దేవాలయం కూడా దేవతల అధివాసమై ప్రకాశిస్తూ వుంది

దేవాలయం అంటే బ్రహ్మాండం బ్రహ్మాండమంటే దేహం దేహం ప్రజాపతి. ప్రజాపతి అంటే కాలం. కాలమంటే దేవాలయం, ఈ విధంగా అభేదం వుంది

మండపానికి నాలుగు ద్వారాలు దేహంలోని నాలుగు ద్వారాలతో ఇవి సరిపోల్చ బడినాయి

ప్రజాపతి రూపమైన మండపానికి ప్రాగ్ద్వారం ఋగ్వేదం, అధిపతి అగ్నిదేవుడు దేహంలో ప్రాగ్ద్వారం ముఖం.

మండపానికి దక్షిణద్వారం యజుర్వేదం. అధిపతి ఇంద్రుడు దేహంలో దక్షిణద్వారం చెవులు

పశ్చిమద్వారం అధర్వణవేదం. అధిపతి సూర్యుడు దేహంలో ఈద్వారం కళ్ళు

ఉత్తరద్వారం సామవేదం అధిపతి చంద్రుడు. దేహంలో హృదయం యీ ఉత్తరద్వారం. దేహానికి అగ్ని భూతిని (సంపదను) ఇంద్రుడు బలాన్ని, సూర్యుడు ఆరోగ్యాన్ని, చంద్రుడు శాంతిని యిస్తారు ఆలయం పరబ్రహ్మస్వరూపం - ఆలయ దర్శనం బ్రహ్మసాక్షాత్కారం శ్రీరామకృష్ణప్రభ 12/84=480,481

33వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## సంఖ్యలు 34, 35, 36

పై సంఖ్యలకు విషయ సేకరణ చేసి అందించలేనందులకు చింతిస్తున్నాను.

# 37వ సంఖ్య

## 191. ఆదిత్యుడు

ఆదిత్యుడంటే సూర్యుడు అమరకోశమందు వీరికి 37 నామములున్నవి. అవి యకారాది క్రమమున వ్రాయబడుచున్నవి 1. అరుణ, 2 అర్క, 3. అర్యమా, 4 అహర్పతి, 5.అహస్కర, 6. ఆదిత్య, 7. ఉష్ణరశ్మి, 8. గ్రహపతి, 9 చిత్రభాను, 10. తపన, 11.తరణి, 12. త్విషాంపతి, 13 దివాకర, 14. ద్యుమణి, 15. ద్వాదశాత్మా, 16. ప్రభాకర, 17. పూషా, 18 భాను, 19. భాస్కర, 20. భాస్వాన్, 21. మార్తాండ, 22. మిత్ర, 23. మిహిర, 24 రవి, 25. బ్రధ్న, 26. వికర్తన, 27 విభాకర, 28. విభావసు, 29. విరోచన, 30 వివస్వాన్,

31 సప్తాశ్వ, 32. సవితా, 33. సహస్రాంశు, 34 సూర, 35 సూర్య, 36. హంస, 37 హరిదశ్వ

37వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**సంఖ్య 38 ఈ సంఖ్యకున్ను విషయమందించలేకపోతున్నాను.**

# 39వ సంఖ్య

## 192. ఆంధ్ర మహాకవులు

*దేశభాషలందు తెలుగు లెస్స, యని ప్రఖ్యాతి వడసినదీయాంధ్ర భాష ఆంధ్రభాషలో అతి ప్రసిద్ధులయిన కొందఱు కవులను గూర్చి తెలిసికొందాము*

**1.** *నన్నయభట్టు (క్రీ శ 11 వ శతాబ్ది) ఆంధ్ర మహాభారతమున ఆదిపర్వము, సభా పర్వము, అరణ్యపర్వమును సగము వరకు రచించెను భారతమునకు పూర్వము వ్రాయబడిన గ్రంథములేవియు లభింపనందున ఇతడే ఆది కవియని ప్రసిద్ధిగాంచెను. రాజమహేంద్రవరమును బాలించిన రాజరాజనరేంద్రుని యస్థానకవి ఆంధ్ర శబ్ద చింతామణియను తెనుగు వ్యాకరణమును గూడ రచించెనందురు శబ్ద శాసనుడని యితని బిరుదు*

**2.** *తిక్కన సోమయాజి (క్రీ శ 13వ శతాబ్ది) నన్నయ్య తర్వాత భారతము విరాట పర్వమునుండి తుది వరకు గల 15 పర్వములు వ్రాసెను ఇతని యితర కృతి నిర్వచనోత్తర రామయణము కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడని ఇతనికి బిరుదములు ఇతడు నెల్లూరును బాలించిన మనుమసిద్ధిరాజు నాస్థానకవి*

**3.** *ఎఱ్ఱాప్రగడ (క్రీ శ 14వ శతాబ్ది) భారతమున నన్నయ అసంపూర్తిగా వదలిన అరణ్యపర్వమును పూర్తి చేసెను మఱియు నృసింహపురాణము, హరివంశము రచించెను శంభుదాసుడు, ప్రబంధపరమేశ్వరుడు అన్నవి యితని బిరుదములు భారతము వ్రాసిన యీ ముగ్గురు కవులకు కవిత్రయమని పేరు*

**4.** *పాల్కురికి సోమన (12-13 శతాబ్దులు). వీరి శైవమతమును ప్రచారము చేసిన కవి ఆంధ్ర, కర్నాటక దేశములలో ప్రసిద్ధిగాంచినవాడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రయను ద్విపదకావ్యము లితని రచనలలో గొప్పవి*

**5.** *వేములవాడ భీమకవి (12వ శతాబ్ది). ఇతడు తిట్టుకవి రాఘవ పాండవీయము రచించెనని చెప్పుదురు కాని ఆ గ్రంథము లభించలేదు భీమన ఛందమను ప్రసిద్ధిగల కవి జనాశ్రయము నీతడు రచించెను*

**6.** *భాస్కరుడు (12-13శతాబ్దులు). తిక్కన తాతయగు నీతడు రామాయణమును*

వ్రాసెను ఇది తర్వాత కొంత శిథిలమగుటచే హుళక్కి భాస్కరాదులు రచించిరి దీనినే భాస్కర రామాయణమందురు

**7.** రంగనాధుడు (13వ శతాబ్ది) రామయణమును ద్విపదలో రచించెను. ఈ గ్రంధము సులభశైలిలో వ్రాయబడి మిక్కిలి ప్రచారముగలదైయున్నది.

**8.** శ్రీనాధుడు (14-15 శతాబ్దులు): రెడ్డి రాజుల యాస్థానకవియై కవిసార్వభౌముడను బిరుదును గాంచి యనేక గ్రంధరాజముల రచించినాడు శృంగార నైషధము, కాశీ ఖండము, భీమఖండము, హరవిలాసము మున్నగునవి యితని ప్రసిద్ధకృతులు. దేశ సంచారము చేసి యనేక రాజుల దర్శించి కనకాభిషేకాది సత్కారములు గాంచెను ఇతని చాటు పద్యముల సంఖ్యాకములు బహు రసవంతములు బమ్మెర పోతన యితని బావమరిది యందురు

**9.** బమ్మెర పోతన (14-15 శతాబ్దులు) మహాభక్తుడు మహాకవి, మధురమంజుల శైలిలో భక్తిరసమయముగ దివ్యముగ ఆంధ్ర మహాభాగవతమును రచించెను యావదాంధ్రుల ప్రీతిపాత్రమయినది యితని భాగవతము దీనికున్న ప్రచారము మఱేగ్రందమునకు లేదు పోతన వీరభద్ర విజయమును, భోగినీ దండకమును గూడ రచించెను

**10.** గౌరన (14-15 శతాబ్దులు): హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాధ చరిత్రయను ద్విపదకావ్యముల రచించెను

**11.** వేమన (15వ శతాబ్ది) 'విశ్వదాభిరామ వినురవేమ' యను మకుటముగల పద్యములు వేలకొలది చెప్పెను. ఇతడు ప్రజాకవి యోగి

**12.** దూబగుంట నారాయణకవి (15వ శతాబ్ది) పంచతంత్రమును పద్య కావ్యము వ్రాసెను.

**13.** తాళ్ళపాక అన్నమాచార్యుడు (16వ శాతాబ్ది). మహాభక్తుడు. సంకీర్తనాచార్యుడు తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామిపై వేల కొలది సంకీర్తనలు రచించెను.

**14.** శ్రీకృష్ణదేవరాయులు (16వ శతాబ్ది): దక్షిణ భారతదేశమంతయు బరిపాలించిన మహారాజు సంస్కృతాంధ్రములందు మహాకవియై యష్ట దిగ్గజ కవులను బోషించి యాంధ్ర భోజుడను బిరుదము గాంచినవాడు. తెలుగున 'ఆముక్తమాల్యద' యను ప్రబంధమును రచించెను.

**15.** అల్లసాని పెద్దన : మనుచరిత్రమను ప్రబంధమును రచించి కృష్ణరాయల కంకితము చేసెను. రాయలచే కవిగండ పెండేర సత్కారమును బడసెను ఆంధ్ర కవితా పితామహుడని యీతని బిరుదు.

**16.** నంది తిమ్మన : పారిజాతాపహరణమును రచించెను.

**17.** మాదయగారి మల్లన : రాజశేఖర చరిత్రను వ్రాసెను

**18.** ధూర్జటి : శ్రీకాళహస్తి మహాత్మ్యమును వ్రాసెను

**19.** అయ్యలరాజు రామభద్రుడు : రామాభ్యుదయమును రచించెను.
**20.** పింగళి సూరన : రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము మున్నగు మహాకావ్యములు రచించిన మహాకవి
**21.** రామరాజు భూషణుడు : భట్టుమూర్తియని యితని నామాంతరము వసుచరిత్ర, హరిశ్చంద్ర, నలోపాఖ్యానము రచించెను
**22.** తెనాలి రామకృష్ణుడు : పాండురంగ మహాత్మ్యమను గొప్ప కావ్యము రచించెను. ఇతడు వికటకవి ఇతని చాటువులు పెక్కులు
**23.** మొల్ల (16వ శతాబ్ది)' రామాయణమును చిన్న పద్యకావ్యముగ రచించిన కవయిత్రి
**24.** చేమకూరి వేంకటకవి (17వ శతాబ్ది) తంజావూరిని పాలించిన రఘునాధరాయల ఆస్థానకవి విజయవిలాసము, సారంగధర చరిత్ర వ్రాసెను సిద్ధ పద్యలక్షణ గ్రంధమును రచించెను ఇది తెలుగు ఛందస్సు అభ్యసించువారి కవశ్య పఠనీయము
**26.** కూచిమంచి తిమ్మకవి (18వ శతాబ్ది). రసిక జనమనోభిరామము, అచ్చ తెలుగు రామాయణము మున్నగు పెక్కు రసవత్కావ్యముల రచించెను కవి సార్వభౌమ బిరుదము గలవాడు
**27.** తరిగొండ వెంకమ్మ (19వ శతాబ్ది)' వేంకటాచల మహాత్మ్యమును రచించిన భక్త కవయిత్రి ఈమె యింకను పెక్కు కృతులు రచించెను.
**28.** త్యాగరాజు (19వ శతాబ్ది) సుప్రసిద్ధ గాయక చక్రవర్తి. గొప్ప రామభక్తుడు. వందలకొలది కృతులను రచించెను
**29.** కూచిమంచి జగ్గకవి (19వ శతాబ్ది)' 'చంద్రరేఖావిలాపము' అను హాస్యరస ప్రబంధ రాజము, జానకీ పరిణయంబు, నర్మదాపరిణయము, రాధాకథా సుధా నిధానము ద్విపదయు, సుభద్రా పరిణయము, ఉమా సంహితయును, దండకములును, బహుశతకములను రచించెను "క ఈకృతికి సమముగా గృతి
నే కవులను జెప్పజాల రిది బిరుదంబున్"
**30.** సారంగు తమ్మయ్య (19వ శతాబ్ది) మృదుమధుర బంధము వైజయంతీ విలాసము అను నామాంతరము గల విప్రనారాయణ చరిత్రమును రచించెను సారంగు తమ్మయ్య భరద్వాజసగోత్రుడు ఆపస్తంబ సూత్రుడు నియోగి బ్రాహ్మణుడు
**31.** చిన్నయసూరి (19వ శతాబ్ది): నీతి చంద్రికను రచించిన వచన రచనకు చక్కని మార్గమును చూపినవాడు ఇతని బాలవ్యాకరణము తెలుగు భాషకు పరమ ప్రామాణికమై యెల్లర కవశ్య పఠనీయమై యున్నది
**32.** కందుకూరి వీరేశలింగం పంతులు (19-20శతాబ్దులు) నేటి వాఙ్మయ వికాసమునకు మార్గదర్శకుడు నాటకము, నవల, ప్రహసనము, కథ, వ్యాసము, విమర్శ, స్వీయచరిత్రము, శాస్త్రము మున్నగు వివిధ సాహిత్య ప్రక్రియలను తెనుగున ప్రవేశపెట్టినవాడు ఇతని రచనలలో ఆంధ్ర కవుల చరిత్ర సుప్రసిద్ధమయినది వీరు గాక అవధాన

కవి శేఖరులైన

**33.** తిరుపతి వేంకట కవులు (19-20 శతాబ్దులు)

**34.** నవ్యకవితా మార్గదర్శియైన గురజాడ అప్పారావు (19-20శతాబ్దులు)

**35.** పండితప్రకాండులైన వేదము వేంకటరాయశాస్త్రి

**36.** కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మ వీరు శ్రీకృష్ణావతారతత్త్వమును గురించి విపులముగా పండ్రెండు భాగములు వ్రాసినారు ఆ 12 భాగములు 1962వ సంవత్సరములో ఉద్యోగరీత్యా నేను కర్నూలులో ఉన్నప్పుడు చదవడము జరిగింది. శ్రీకృష్ణ తత్త్వమును గురించియే యీ 12 భాగముల రచన సాగింది 12వ భాగములో "శ్రీరాధామాధవ సహస్ర నామస్తోత్రము" 182వ పేజీ నుండి 193వ పేజీ వరకు వుంది)

**37.** ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వావిలికొలను సుబ్బారావు,

**38.** గిడుగు రామ్మూర్తి పంతులు,

**39.** విశ్వనాథ సత్యనారాయణ మున్నగు యిటీవలివారు

ఎందరో మరుగుపడిన ఆంధ్ర సంస్కృత భాషా కవులు ఉండి ఉండవచ్చును నా శక్తి మేరకు సేకరించిన కవుల సమాచారమును గ్రంథ విస్తరణ భీతిచే క్లుప్తముగా పాఠకులకు అందించుచున్నాను.

39వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 40వ సంఖ్య

## 193. పాండవుల బలాబలములు

| | | | |
|---|---|---|---|
| 1. | యుధిష్ఠిరుడు | అతిరథుడు | 2 |
| 2 | భీముడు | అతిరథశ్రేష్ఠుడు | 2 |
| 3. | అర్జునుడు | మహారథుడు | 1 |
| 4. | నకులుడు | సమరథుడు | 3 |
| 5 | సహదేవుడు | సమరథుడు | 3 |
| | ద్రౌపదేయులు అనగా ఉపపాండవులు 5 గురు | | |
| 6 | ప్రతివింధ్యుడు | మహారథుడు | 1 |
| 7 | శ్రుతసోముడు | మహారథుడు | 1 |
| 8. | శ్రుతకీర్తుడు | మహారథుడు | 1 |
| 9. | శతానీకుడు | మహారథుడు | 1 |
| 10 | శ్రుతసేనుడు | మహారథుడు | 1 |
| 11. | ఉత్తరుడు | అతిరథుడు | 2 |

| | | | |
|---|---|---|---|
| 12 | అభిమన్యుడు | అతిరథుడు | 2 |
| 13. | సాత్యకి | అతిరథుడు | 2 |
| 14. | ద్రుపదరాజు | మహారథుడు | 1 |
| 15 | విరాటరాజు | మహారథుడు | 1 |
| 16 | శిఖండి | మహారథుడు | 1 |
| 17 | ద్రుష్టద్యుమ్ముడు | అతిరథుడు | 2 (శిఖండి తమ్ముడు) |
| 18 | ధృతవర్మ | అర్థరథుడు | 4 (ద్రుష్టద్యుమ్నుని సుతుడు) |
| 19 | ధృష్టకేతుడు | మహారథుడు | 1(శిశుపాలుని సుతుడు) |

పాంచాల యువరాజులు ఏడుగురు

| | | | |
|---|---|---|---|
| 20 | ఉత్తమౌజుడు | మహారథుడు | 1 |
| 21 | యుధామన్యుడు | మహారథుడు | 1 |
| 22. | క్షత్రదేవుడు | మహారథుడు | 1 |
| 23. | జయంతుడు | మహారథుడు | 1 |
| 24 | అమేతిజుడు | మహారథుడు | 1 |
| 25. | విరాటుడు | మహారథుడు | 1 (విరాట పర్వములోని విరాటుడు కాదు) |
| 26 | సత్యజితుడు | మహారథుడు | 1 |
| 27 | కేకయరాజులు | మహారథులు | 1 (ఐదుగురు) |
| 28 | కాశీరాజు | మహారథుడు | 1 (ఐదుగురు |
| 29 | నీలుడు | మహారథుడు | 1 విరాటరాజు |
| 30. | సూర్యదత్తుడు | మహారథుడు | 1 సో |
| 31. | మదిరాక్షుడు | మహారథుడు | 1 ద |
| 32 | శంఖుడు | మహారథుడు | 1 రులు) |
| 33. | చిత్రాయుధుడు | మహారథుడు | 1 |
| 34. | జేకితానుడు | మహారథుడు | 1 |
| 35. | సేనాబిందుడు | అతిరథుడు | 2 |
| 36. | పాండ్యుడు | అతిరథుడు | 2 |
| 37. | కాశ్యుడు | సమరథుడు | 3 |
| 38. | కుంతిభోజుడు | అతిరథుడు | 2 |
| 39. | రోచమానుడు | మహారథుడు | 1 |
| 40 | ఘటోత్కచుడు | అతిరథుడు | 2 |

గమనిక : 1. మహారథుడు, 2. అతిరథుడు, 3 సమరథుడు, 4 అర్థరథుడు

మహాభారతము, ఉద్యోగపర్వము నాల్గవ అశ్వాసము, 307 నుండి 310 పుటల నుండి సేకరింపబడినది - పద్యకావ్యము

40వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 41వ సంఖ్య

## 194. సంజయుని శ్లోకములు

*భగవంతుడగు శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని నిమిత్త మాత్రముగ జేసికొని ప్రపంచమున కంతటికిని భగవద్గీత యనెడి దివ్యసందేశమును వినిపించియున్నాడు ఆ పవిత్ర గ్రంథములో సంజయుని శ్లోకములు* 41.

41వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## 42 విషయ సేకరణ చేయలేనందున చింతిస్తున్నాను.

# 43వ సంఖ్య

## 195. శుభ శకునములు

1. *సుమంగలి*, 2. *కన్యక*, 3 *వేశ్య*, 4 *ఇద్దరు బ్రాహ్మణులు*, 5. *మంగళవాయిద్యము*, 6. *పెండ్లి యూరేగింపు*, 7 *మంగళద్రవ్యము*, 8 *పుష్పము*, 9 *ఫలము*, 10. *మండెడి నిప్పు*, 11 *గొడుగు*, 12. *చెరకు*, 13 *అన్నము*, 14. *పాలు*, 15 *పెఱుగు*, 16.*మాంసము*, 17. *రత్నము*, 18. *పట్టువస్త్రము*, 19. *బొరుగుల బియ్యము*, 20 *ఆవు*, 21. *ఎద్దు*, 22 *ఏనుగు*, 23 *గుఱ్ఱము*, 24 *ధ్వజము*, 25. *పూర్ణకుంభము*, 26. *చామరము*, 27. *కల్లుకుండ*, 28. *భ్రమరము*, 29 *నల్లకోతి*, 30. *కుక్క*, 31. *జింక*, 32 *ప్రేతము (పీనుగు) ఇది ఎదురుగ వచ్చినను*, 33 *కల్లు*, 34 *గరుడపక్షి*, 35. *పక్షిగుంపు*, 36 *తెల్లని వస్తువు*, 37. *చేప వీనిని చూచినను*, 38 *మంగళ ఘోషము*, 39 *చుంచుల ధ్వని*, 40. *గుడ్లగూబల ధ్వని*, 41. *గాడిద*, 42. *గుఱ్ఱము సకిలించుట*, 43 *కుక్క చెవి విదల్చుట వీనిని వినినను శుభము కలుగును*

43వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## 44, 45, 46,47 విషయసేకరణ చేయలేనందున చింతిస్తున్నాను.

# 48వ సంఖ్య

## 196. ఆదిత్యహృదయము

అ) ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషాగభస్తిమాన్।
సువర్ణ సదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః॥

ఆ) హరిదశ్వ సహస్రార్చి సప్తసప్తి ర్మరీచిమాన్।
తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్॥

ఇ) హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః।
అగ్నిగర్భోஉదితేః పుత్రః శంఖ శ్శిశిరనాశనః॥

ఈ) వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః।
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీధీ ప్లవంగమః॥

ఉ) ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వ తాపనః।
కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వ భవోద్భవః॥

ఊ) నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోஉస్తుతే॥

31 శ్లోకములు గల ఆదిత్య హృదయములో పైనుదహరించిన 6 శ్లోకములు ఆదిత్యుని 48 నామములు ప్రసిద్ధములని పెద్దలన్నారు అవి

1. ఆదిత్యుడు (అదితిపుత్రుడు), 2. సవిత (జగత్తును ఉత్పన్నము చేయువాడు), 3 సూర్యుడు (సర్వవ్యాపకుడు), 4. ఖగుడు (ఆకాశమున సంచరించువాడు), 5 పూష (పోషించువాడు), 6. గభస్తిమంతుడు (ప్రకాశవంతుడు), 7 సువర్ణసదృశుడు, 8. భానుడు (ప్రకాశకుడు), 9. హిరణ్యారేత (బ్రహ్మాండము యొక్క ఉత్పత్తికి బీజము), 10 దివాకరుడు (రాత్రియందలి చీకటిని పోగొట్టి పగటియందు ప్రకాశమును వ్యాపింపజేయువాడు), 11 హరిదశ్వుడు (దిక్కులందు వ్యాపించువాడు, లేక ఆకుపచ్చ రంగు గల గుఱ్ఱములు గలవాడు), 12 సహస్రార్చి (వేలకొలది కిరణములచే సుశోభితుడు), 13. సప్తసప్తి (ఏడు గుఱ్ఱములు గలవాడు), 14 మరీచిమంతుడు (కిరణములచే శోభితుడు), 15. తిమిరోన్మథనుడు (చీకటిని పోగొట్టువాడు), 16. శంభువు (శుభమునకు స్థానము), 17. త్వష్ట (భక్తుల దుఃఖమును పోగట్టువాడు లేక జగత్తును సంహరించువాడు), 18. మార్తాండకుడు (బ్రహ్మాండమునకు జీవనప్రదుడు), 19. అంశుమంతుడు (కిరణములను ధరించువాడు), 20 హిరణ్యాగర్భుడు (బ్రహ్మ), 21 శిశిరుడు (స్వభావముగనే సుఖము నొసంగువాడు), 22 తపనుడు (వేడిని కలుగజేయువాడు), 23 భాస్కరుడు (అహస్కరుడు) (దినకరుడు), 24 రవి (అందరియొక్క స్తుతికి పాత్రుడు), 25 అగ్నిగర్భుడు (అగ్నిని గర్భమందు ధరించువాడు), 26. అదితిపుత్రుడు, 27 శంఖుడు (ఆనంద స్వరూపుడు మరియు వ్యాపకుడు), 28. శిశిరనాశనుడు (శీతమును నశింపజేయువాడు), 29. వ్యోమనాథుడు (ఆకాశము యొక్క ప్రభువు), 30 తమోభేది (చీకటిని నశింపజేయువాడు),31 ఋగ్యజుస్సామపారగుడు (ఋగ్యజుస్సామ వేదములను లెస్సగ అధ్యయనము చేసినవాడు), 32. ఘన వృష్టి (మహావర్షమునకు కారణభూతులు), 33. అపాంమిత్రుడు (జలమును

ఉత్పన్నమైనదగునవాడు), 34 వింధ్య వీథీప్లవంగముడు (ఆకాశమున వేగముగ బోవువాడు), 35 ఆతపి(ఎండను కలుగజేయువాడు), 36 మండలి (కిరణములను దరించువాడు), 37 మృత్యువు (మృత్యువునకు కారణము), 38 పింగళుడు (పింగళ వర్ణము గలవాడు), 39 సర్వతాపనుడు (సర్వులకు వేడి కలుగజేయువాడు), 40 కవి (త్రికాలదర్శి), 41. విశ్వుడు (సర్వస్వరూపులు), 42 మహాతేజస్వి, 43. రక్తుడు (ఎఱుపురంగు కలవాడు), 44. సర్వభవోద్భవుడు (సర్వుల ఉత్పత్తికి కారణము), 45.నక్షత్ర గ్రహతారాణా మధిపుడు (నక్షత్ర గ్రహతారములకు అధిపతి), 46 విశ్వభావనుడు (జగత్తును రక్షించువాడు), 47. తేజసామపితేజస్వీ (తేజస్సు లందు మహాతేజస్వి), 48.ద్వాదశాత్ముడు (పండ్రెండు రూపములతో అభివ్యక్తమైనవాడు) (ద్వాదశాదిత్యుల పేర్లు కావలయునన్న వరుస నంబరు 91 చూడుడు) అయియున్నవి ఈ పేర్లన్నిటితోను ప్రసిద్ధులైన ఓ సూర్యదేవా! మీకు నమస్కారము

రామాయణ రత్నాకరము- యుద్ధకాండ - 756

# 197. విష్ణువు యొక్క పేర్లు

1. విష్ణువు, 2. నారాయణుడు, 3. శ్రీకృష్ణుడు, 4 వైకుంఠుడు, 5 విష్టరశ్రవుడు, 6. దామోదరుడు, 7 హృషీకేశుడు, 8 కేశవుడు, 9. మాధవుడు, 10. స్వభువు, 11 దైత్యారి, 12 పుండరీకాక్షుడు, 13. గోవిందుడు, 14 గరుడధ్వజుడు, 15. పీతాంబరుడు (పచ్చవలువధారి), 16 అచ్యుతుడు, 17 శార్ఙ్గి, 18 విష్వక్సేనుడు (విష్ణు సేనాధిపతి), 19.జనార్దనుడు, 20 ఉపేంద్రుడు, 21. ఇంద్రావరజుడు, 22 చక్రపాణి, 23 చతుర్భుజుడు, 24. పద్మనాభుడు, 25 మధురిపుడు, 26.వాసుదేవుడు, 27. త్రివిక్రముడు (మూడు లోకములను మూడడుగులుగా కొలిచిన విష్ణువు), 28. దేవకీనందనుడు, 29. శౌరి, 30. శ్రీపతి, 31. పురుషోత్తముడు, 32 వనమాలీ, 33. బలిధ్వంసీ, 34 కంసారాతి, 35 అధోక్షజుడు, 36. విశ్వంభరుడు, 37. కైటభారి, 38 విధువు, 39. శ్రీవత్సలాంఛనుడు, 40. గదాగ్రజుడు, 41 ముంజకేశుడు, 42 దాశార్హుడు, 43 పురాణపురుషుడు, 44. యజ్ఞపురుషుడు, 45 నరకాంతకుడు, 46 విశ్వరూపుడు, 47. ముకుందుడు, 48 మురమర్దనుడు

అమరకోశము - 15

శ్లో॥ విష్ణు ర్నా రాయణః కృష్ణో వైకుణ్ఠో విష్టరశ్రవాః।
దామోదరో హృషీకేశః కేశవో మాధవస్స్వభూః॥

2. దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిందో గరుడధ్వజః।
పీతాంబరో ఽచ్యుత శ్శార్ఙ్గీ విష్వక్సేనో జనార్దనః॥

3 ఉపేంద్ర ఇంద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః।
పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః॥

4. దేవకీనందన శ్శౌరి శ్శ్రీపతిః పురుషోత్తమః।
వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః॥
5. విశ్వంభరః కైటభజి ద్విధు శ్శ్రీవత్సలాంచనః।
గదాగ్రజో ముంజకేశో దాశార్హో దశరూపభృత్॥

# 198. శివుని యొక్క పేర్లు

1. *శంభువు,* 2. *ఈశుడు,* 3. *పశుపతి,* 4 *శివుడు,* 5. *శూలి,* 6 *మహేశ్వరుడు,* 7 *ఈశ్వరుడు,* 8 *శర్వుడు,* 9 *ఈశానుడు,* 10 *శంకరుడు,* 11 *చంద్రశేఖరుడు,* 12 *భూతేశుడు,* 13 *ఖండపరశువు,* 14 *గిరీశుడు,* 15 *గిరిశుడు,* 16. *మృడుడు,* 17 *మృత్యుంజయుడు,* 18 *కృత్తివాసుడు,* 19 *పినాకి,* 20 *ప్రమధాధిపతి,* 21 *ఉగ్రుడు,* 22 *కపర్ది,* 23 *శ్రీకంఠుడు,* 24 *శితికంఠుడు,* 25 *కపాలభృత్తు,* 26 *వామదేవుడు,* 27 *మహాదేవుడు,* 28 *విరూపాక్షుడు,* 29 *త్రిలోచనుడు,* 30 *కృశానురేతనుడు,* 31. *సర్వజ్ఞుడు,* 32. *ధూర్జటి,* 33. *నీలలోహితుడు,* 34. *హరుడు,* 35 *స్మరహరుడు,* 36 *భర్గుడు,* 37. *త్ర్యంబకుడు,* 38 *త్రిపురాంతకుడు,* 39. *గంగాధరుడు,* 40. *అంధకరిపువు,* 41. *క్రతుధ్వంసి,* 42 *వృషధ్వజుడు,* 43 *వ్యోమకేశుడు,* 44. *భవుడు,* 45 *భీముడు,* 46 *స్థాణువు,* 47. *రుద్రుడు,* 48 *ఉమాపతి*

శ్లో॥ శమ్భు రీశః పశుపతి శ్శివ శ్శూలీ మహేశ్వరః।
ఈశ్వర శ్శర్వ ఈశాన శ్శఙ్క రశ్చంద్ర శేఖరః॥
2. భూతేశః ఖండపరశు ర్గిరీశో గిరిశో మృడః।
మృత్యుంజయః కృత్తివాసాః పినాకీ ప్రమాధాధిపః॥
3. ఉగ్రః కపర్దీ శ్రీకంఠ శ్శితికంఠః కపాలభృత్।
వామదేవో మహాదేవో విరూపాక్ష స్త్రిలోచనః॥
4. కృశానురేతా స్సర్వజ్ఞో ధూర్జటి ర్నీలలోహితః।
హరః స్మరహరో భర్గ స్త్ర్యంబక స్త్రిపురాంతకః॥
5. గంగాధరో ఽంధకరిపు క్రతుధ్వంసీ వృషధ్వజః॥
వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః॥ అమరకోశము - 18

48వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 49వ సంఖ్య

## 199. రంతిదేవుడు

భరతుని వంశపరంపరయందు సంకృతి అనువానికి రంతిదేవుడు జన్మించెను అతడు దైవవశమున లభించిన దానితోనే సంతుష్టిని పొందుచుండెను అతడు సంగ్రహముగాని, పరిగ్రహముగాని చేయకుండ ఉన్న వస్తువులను ఇతరులకు దానధర్మము చేయుచుండెను ఒకపుడు నలుబది యెనిమిది రోజులు వరుసగా అతడు ఉపవసింపవలసివచ్చెను త్రాగుటకు నీరైనను లభించలేదు నలుబది తొమ్మిదవరోజు ఉదయమున కొంత ఆహారము లబింపగా దానిని కుటుంబము వారికి తనకు పంచుకొని భుజింప బోవుచుండగా ఒక అతిథి వచ్చెను రంతిదేవుడు సర్వులయందును భగవంతునే దర్శించుచుండెను కావున అతడు తమ యన్నములో నుండి కొంతతీసి ఆ అతిథికి పెట్టెను అతడు భుజించి వెడలిని పిదప మరల వరుసగా ఇరువురు అతిథులు ఒకరి తరువాత మఱియొకరు వచ్చిరి రంతిదేవుడు వారలకు కూడ తమ యన్నమును పూర్తిగా భుజింపజేసి పంపెను. ఇక కేవలము ఒకింత జలము మాత్రమే మిగిలియుండెను దానిని కుటుంబము వారందఱును పంచుకొని త్రాగబోవుచుండగా మఱియొక అతిధి వచ్చి త్రాగుటకు నీరిమ్మని అడిగెను జలమును అతిథికిచ్చి తృప్తిపడెను పరీక్ష పూర్తి అయిన తరువాత బ్రహ్మవిష్ణుమహేశ్వరులచట ప్రత్యక్షమైరి రంతిదేవుడు వారలకు నమస్కరించి భక్తి భావముతో తన మనస్సును బగవంతుని యందు తన్మయమొనర్చెను పరమ పదమును పొందెను కావున త్రిగుణమయమగు మాయ అతనిలో నశించిపోయినది తిథి వార నక్షత్రములు లేకనే అంటే అనుకోకుండా మన గృహమునకు వచ్చు వ్యక్తిని అతిథి అంటారు అతిథి దేవునితో సమానము అతిధిని పూజించిన దేవుని పూజించినట్లేయగును

బాగవతము నవమస్కంధము

49వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 50వ సంఖ్య

## 200. శ్రీ శంకరాచార్యుల వారి ప్రశ్నోత్తరి

ప్రశ్న 1 నిజమైన బానిస ఎవడు?

సమాధానము విషయాసక్త చిత్తుడు

ప్రశ్న 2. ప్రాపంచిక విషయములలో

సమా · మమకార ముండగూడదు

ప్రశ్న 3 మిక్కిలి భయంకరైన నరకమేది?
సమా నీ స్వంత శరీరము
ప్రశ్న 4 స్వర్గలోకమునకు మార్గమేది?
సమా సమస్త వాంఛారాహిత్యము
ప్రశ్న 5. నరలోకమునకు ద్వారమేది?
సమా స్త్రీ
ప్రశ్న 6 స్వర్గలోకమునకు గొంపోవునదేది?
సమా సమస్త జీవులయందు అహింసను పాటించుట
ప్రశ్న 7 శత్రువులెవరు?
సమా మనస్వంత ఇంద్రియములు వాటిని వశమొనర్చుకొన్నప్పుడు అవి మనకు మిత్రులగును
ప్రశ్న 8 నిజమైన దరిద్రుడెవడు?
సమా అనేకమైన కోరికలు గలవాడు
ప్రశ్న 9 ధనవంతుడెవడు?
సమా పూర్ణ సంతృప్తుడు
ప్రశ్న 10 ఏది అమృతము?
సమా మనోజ్ఞమైన నిష్కామ్యత
ప్రశ్న 11 నిజమైన పందెమేది?
సమా : "నాది" మఱియు "నీది" యనెడి అహంభావము
ప్రశ్న 12. సారాయివలె మైకము నిచ్చు పదార్ధమేది?
సమా · యువతి
ప్రశ్న 13. మిక్కిలి అంధుడెవడు?
సమా . మోహపరవశుడు
ప్రశ్న 14. ప్రాణాంతకమైన విషమేది?
సమా : సమస్త విషయ భోగములు
ప్రశ్న 15. ఎల్లప్పుడు దుఃఖపూరితుడై యుండువాడు?
సమా . ఐహిక భోగములయందాసక్తుడై యుండువాడు
ప్రశ్న 16 ఎవరికిన్ని తెలియబడని పదార్థమేది?
సమా · స్త్రీ యొక్క హృదయము మరియు ఆమె యొక్క కార్యములు
ప్రశ్న 17. పశువుతో సమానమైన వాడెవడు?
సమా : జ్ఞానవిహీనుడు

ప్రశ్న 18. పనికిరాని సాంగత్యమేది?
సమా మూర్ఖులు, నీచులు, దుష్టులు మరియు పాపులయొక్క సాంగత్యము
ప్రశ్న 19 హీనదశకు మూలమేది?
సమా యాచన
ప్రశ్న 20. ఉన్నత దశకు మూలమేది?
సమా యాచింపకుండుట
ప్రశ్న 21 నిజముగా జన్మించిన వాడెవడు?
సమా పునర్జన్మ లేనివాడు.
ప్రశ్న 22. నిజముగా మరణించినవాడెవడు?
సమా మరల మరణించనివాడు
ప్రశ్న 23 పరమ శత్రువు లెవరు?
సమా కామము, క్రోధము, అసత్యము, పేరాస మరియు తృష్ణ
ప్రశ్న 24. సమస్త విషయ భోగములచే తృప్తి నొందనిదేది?
సమా కామవాంఛ
ప్రశ్న 25. సమస్త కష్టములకు మూలమేది?
సమా అహంకారము, లేక మమకారము
ప్రశ్న 26 నిజమైన దోపిడి దొంగలెవరు?
సమా దుష్టవాంఛలు.
ప్రశ్న 27 పశువులలో కెల్ల పశువెవడు?
సమా తన కర్తవ్యములను నెఱవేర్చనివాడు, మరియు ఆత్మ జ్ఞానము లేనివాడు
ప్రశ్న 28 మెఱుము వలె పరుగెత్తునదేది?
సమా దనము, యౌవనము మరియు జీవితము
ప్రశ్న 29. నిరంతరము చింతింపదగినదేది?
సమా ప్రపంచము యొక్క మిథ్యాత్వము మరియు బ్రహ్మము యొక్క అస్తిత్వము
ప్రశ్న 30 నిజమైన కర్మ ఏది?
సమా శ్రీకృష్ణునికి ప్రీతికరమైనట్టి కర్మ

వైరాగ్యమునొందుటెట్లు - 128

పైనుదహరించిన ప్రశ్నోత్తరి పరికించారు గదా! స్త్రీని అగ్నితోను, పురుషుని వేరుకున్న నెయ్యితోను పోల్చారు మన పెద్దలు అగ్నితో సమానమైన స్త్రీని కామించి మోహించి వెంటబడిన పురుషుని దహించకమానునా!

పూర్వము కామాంధులై కృత్యాకృత్య వివేక వర్జితులై మెలంగినవారలలో 31. అహల్యకై యింద్రుడును, 32. తిలోత్తమకై సుందోప సుందులును, 33. మేనకకై విశ్వామిత్రుడును, 34 మాంధాత పుత్రికలకై సౌభరియు, 35 ప్రమోచనకై కండు

మహర్షియు, 36. శర్మిష్ఠకై యయాతియు, 37. రతీదేవికై శంబరుడును, 38. తారకై చంద్రుడును, 39. శచీదేవికై నహుషుడును, 40. రంభకై రావణుడును, 41. కుశనాభ పుత్రికలకై వాయుదేవుడును, 42. ద్రౌపదికై సైంధవ, కీచకులును, 43. దమయంతికై దిక్పాలక, కలి, కిరాతకులును, 44. సత్యవతికై ఉగ్రాయుధుడును, 45. ఊర్వశికై పురూరవుడును, 46. కైకేయికై దశరథుడును, 47. సురుచికై యుత్తానపాదుడును, 48 ఋషిపత్నులకై అగ్నిదేవుడును, 49. చిత్రాంగికై రాజరాజనరేంద్రుడును, 50. శైభ్యకైజ్యామఘుడును - యీ విధముగా పెక్కు వనితలకై పెక్కండ్రును, మదన శరకోలముల కగ్గలమై, కామరోగపీడితులై పరిభవమును జెందిరని, శృంగికృశించినవారు గలరని ఎరుగగలరు

# 201. బ్రహ్మబీజము

బ్రహ్మబీజమనగా "కం" బ్రహ్మబీజమని బీజనిఘంటువు నందున్నది మంత్ర ఆద్యంతములయందు ఏడు పర్యాయములు ఈ బ్రహ్మ బీజమును సంధించి జపించిన సూదకద్వయము తొలగును పరాశర సంహితయందు మరియొక విధముగ చెప్పబడినది

"అ"కారము మొదలు "ళ"కారము వరకు 50 (యాభై) వర్ణములనబడును ప్రతి అక్షరమునకు '0' చేర్చి పఠించి మంత్రము జపించిన జాతసూతక నివృత్తి అగును మరల "ళ" కారము మొదలు "అ"కారము వరకు బిందుయుక్తముగా జపించిన మృతసూతక నివృత్తి యగును ఈ రెండు సూతకములు నివృత్తించక మంత్రానుష్ఠానము చేసిన మంత్రము ఫలించదు బీజాక్షరము మంత్రములు సిద్ధించవు చైతన్య రహిత మంత్రములు కేవల వర్ణములు. లక్ష కోటి జపించినను ఫలము నివ్వవు - జపాంతమున అర్ఘ్యపుష్పాదులచే ఉపాసనాదైవము యొక్క దక్షిణ హస్తమందు జపఫలమును సమర్పించవలెను ఇటుల చేసిన సఫలమగును అనంతరము ప్రాణాయామము చేయవలెను

శ్రీ హనుమన్మంత్రానుష్ఠాన ప్రకాశిక - 48

# 202. బ్రహ్మాసనము

50 దర్భలు కలిగినది బ్రహ్మాసనమనియు, అందు సగము (25) దర్భలు గలిగినది విష్టరమనియు స్మృతియందుండుటచే బ్రహ్మాసన విష్టర శబ్దార్థములను పై విధముగా గ్రహించవలయును

శ్రీ మహాభారత సారోద్ధారము - 3వ భాగము, - 571

# 203. భరతుడు

భరతుడు (దుష్యంతుని కుమారుడు కాదు ఋషభ దేవుని పెద్ద కుమారుడు) శ్రీవత్స, కౌస్తుభ, వనమాలాలంకృతుడును, సుదర్శనాదులగు ఆయుధములను ధరించినవాడును, భక్త జనుల హృదయమున నివసించువాడును పరమపురుషుడును

అగు వాసుదేవునియం దధిక భక్తి గలిగి ఏబదిలక్షలవేల సంవత్సరములు రాజ్యమును పాలించి, తాత, తండ్రుల నుండి పరంపరగా వచ్చుచున్న ధనమును తగు రీతిని పుత్రులకు పంచి యిచ్చి, బహు విధములగు సంపదలు గల గృహమును విడిచి పులహాశ్రమమునకు పోయెను    వ భాగవతము, పంచమస్కంధము - 255

## 204. సౌభరి మహాముని

నదిలో స్నానము చేయుచున్న సౌభరిమహామునికి మీనరాజు భార్యతో, పిల్లలతో ఆనందించుటకని, సంసారముపై కోరిక కలిగి తపోబలమున ముసలితనమును విడిచి, యవ్వనవంతుడై ఆకర్షితులైన మాంధాత కుమార్తెలు యాబది మందిని వివాహమాడి సుఖించుచుండెను    వ భాగవతము నవమస్కందము - 577

## 205. దేవదానవ ప్రముఖుల యుత్పత్తి క్రమము

తొల్లి బ్రహ్మ దక్షిణాంగుష్ఠంబున దక్షుండును, వామాంగుష్ఠంబున ధరణియను స్త్రీయు బుట్టిరి ఆధరణియనెడి స్త్రీని దక్షుడు వివాహము చేసికొనె ఆ యిరువురకు వేయి మంది కుమారులుద్భవిల్లిరి వారందరు సంసార విరక్తినింబొంది, సాంఖ్యయోగాభ్యాస పరిపూర్తిని గాంచి, యూర్ధ్వరేతస్కులై ముక్తినిం బొందిరి

అనంతరము దక్షునకు నేబదిమంది కూతురులు గల్గిన వారల నెల్ల దక్షుండు పుత్రులు లేని వాడగుటచే, బుత్రికాకరణంబు చేసెను (కన్యాదానకాలంబున ఓ పెండ్లి కుమారుడా! నేను చేయు కన్యాదానంబు వలన నా కుమార్తెకు నీ వీర్యంబున గల్గు కుమారులందరూ నా కుమారులుగాని నీ కుమారులు గారని యొడంబడికచేసికొని కన్యాదానంబు చేయుట పుత్రికాకరణంబనంబడును) అట్లీతడు పుత్రీకరణంబుగా కన్యాదానంబు చేసిన కుమార్తెలలో 1. కీర్తి, 2 లక్ష్మి, 3 ధృతి, 4. మేధా, 5. పుష్టి, 6 శ్రద్ధా, 7 క్రియ, 8. బుద్ధి, 9. లజ్జ, 10 మతి - యీపదుండ్రను ధర్ముండను మనువునకిచ్చెను 1 అశ్విని, 2. భరణి మొదలుగా గల యిరువదేడ్వురను చంద్రునకిచ్చెను 1 అదితి, 2. దితి, 3 ధనువు, 4 కాల, 5 అనాయుష, 6 సింహిక, 7. ముని, 8. సురభి, 9. వినత, 10. క్రోధవశ, 11. అనంగ, 12. క్రూర, 13. కద్రువ అనువారిని పదుమువ్వురను కశ్యపునకిచ్చెను    మహాభారతము ఆదిపర్వము

## 206. చక్రరూప రఘురాముడు

శ్వేతాశ్వతర ఉపనిషత్తులో పరమాత్మను చక్రంలాగా ఉపాసించే విధానం యివ్వబడింది - అది

మంత్రము : తమేక నేమిం త్రివృతం షోడశాంతం
శతార్ధారం వింశతి ప్రత్యరాభిః

అష్టకైష్షడ్భి ర్విశ్వరూపైకపాశం
త్రివర్గ భేదం ద్వినిమిత్తైక మోహమ్

ఆయనకు ఒకే నేమి (చక్రం చుట్టూ బిగించే ఇనప పట్టా) మూడు వృత్తాలు (ఆవరణాలు - త్రిగుణాలు) పదహారు అంతాలు, యాభై అరలు (ఆకులు), ఇరవై ప్రత్యరలు (చక్రం ఆకుల కొరకు వేయబడ్డ కీలకాలు) ఆరు అష్టకాలుగాను, నానావిధ రూపాలుగాగల కాలమనే పాశాలు కలవాడు ధర్మ అధర్మ జ్ఞానమనే మూడు భేదాలు కలవాడు రెండు రకాల మోహాలు గలవాడు ఆ పరమాత్మ

పంచభూతాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు వెరసి 16 అంతాలు ఐదు విపర్యాయాలు, 28. అశక్తులు, 9 రకాల తుష్టి, 8 సిద్ధులు వెరసి 50 అరలు అవి ఏమిటంటే

**1. తపస్సు :** అనాత్మలైన అష్టవిధ ప్రకృతిలో ఆత్మ బుద్ధినుంచడం

**2. మోహం :** అణిమాది సిద్ధులలోగల ప్రీతి,

**3. మహామోహం :** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలలో గల అభినివేశం (నేను విన్నాను, చూచాను గనక సత్యం అనడం),

**4. తామిశ్రం :** ఈ ఐదు ఇంద్రియాలలో అష్టసిద్ధులను పొందడం కొరకు ప్రయత్నిస్తున్నప్పుడు అవి లభింపకపోవడం వల్ల క్రోధం,

**5. అంధతామిశ్రం :** ఒకవేళ కొంతసాధన తరువాత ఆ అష్టసిద్ధులు లభిస్తే వాటిని అనుభవించేటప్పుడు మరణం ఆసన్నమయినప్పుడు అయ్యో కష్టపడి సంపాదించుకున్న వీటిని పూర్తిగా అనుభవించకుండానే నాకు మరణం ఆసన్నమైందే అని దుఃఖించడం ఇవి 50 అరలలో ఐదు విపర్యాలు.

ఇక అశక్తులు. పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సులలో గల అశక్తులు (చెవులు వినపడక, కండ్లు కనపడక యుండటం మొ||) ఉంటాయి అంతఃకరణంలో పురుషార్థ యోగ్యతాతుష్టి లేకపోవడమనే అశక్తులు 9 రకాలుగా వుంటాయి అష్టవిధ సిద్ధులు పొందడంలో అశక్తత వెరసి 28 రకాల అశక్తులున్నాయి

ఇక తుష్టి - ప్రకృతి, ఉపాదాన, కాల, భాగ్య అని నాలుగు విధాలుగాను విషయో పరమతుష్టి - ఆర్జవ, రక్షణ, విషయ, సంగహింసలను దోషదర్శనం చేత ఐదు విధాలుగా లేకపోవడం కలిసి మొత్తం తుష్టి 9 రకాలుగా వుంటుంది

**1. ప్రకృతి తుష్టి :** ప్రకృతి పరిజ్ఞానం కలిగినంత మాత్రాననే కృతార్థుడనైనానని తలచి తుష్టి పొందడం.

**2. ఉపాదానతుష్టి :** సన్యాసాశ్రమము స్వీకరించినంతమాత్రాననే కృతకృత్యుడనైనానని తుష్టి పొందడం

**3. కాలతుష్టి :** వీటన్నిటివల్ల మనకొరిగేదేమిటి? మనకు మోక్షం రావలసి వుంటే

అదే వస్తుంది అని కాలానికి వదిలేసి ఉపేక్షించి ఊరుకోవడం

**4. భాగ్యతుష్టి :** ఏం చేసినా ఏమీ ప్రయోజనం లేదు. మోక్షం పొందే భాగ్యం మనకు ఉంటే అదే లభించగలదు. అని తృప్తిపొంది ఊరుకోవడం

**5. రక్షణతుష్టి :** సంపాదించడమే కష్టం, ఒకవేళ సంపాదించినా దాన్ని పోకుండా నిలుపుకోవడం మరింత కష్టం అనుకొని ఆ ప్రయత్నం నుండి విరమించడం,

**6. విషయతుష్టి :** మనం కష్టపడి సంపాదించిన దానికన్నా ఎక్కువగా సంపాదించాల్సింది ఉంది అది యింకా లభించలేదే అనే దుఃఖం కలగడంతో ఆ ప్రయత్నం విరమించడం.

**7. సంగతుష్టి :** విషయసుఖాలు ఎంత అనుభవించినా తృప్తి కలుగదు కనుక నాకసలు విషయసుఖాలు వద్దని ఊరుకోవడం.

**8. హింసాతుష్టి :** ఒకరిని కష్టపెట్టక భోగం లభించదు; ఇంకొకరిని పీడించడం అధర్మం అధర్మం వల్ల నరకం లభిస్తుంది కనుక నాకీ భోగాలే వద్దనడం

## ఇక అష్టసిద్ధులు

**1. ఊహాసిద్ధి :** పారమార్థికార్థం తెలుసుకొనే కోరిక కలిగి దాని కొరకు ప్రయత్నిస్తుండగా జన్మాంతర సుకృతం చేత, సంస్కార బలం చేత, గురూపదేశం లేకుండానే యధార్థ జ్ఞానం కలగడం

**2. శబ్దసిద్ధి :** నిరంతరాభ్యాసం లేదా కొద్దిగా సత్ సత్యశ్రవణం చేతనే జ్ఞానం పొందడం

**3. అధ్యయన సిద్ధి :** నిరంతరాధ్యయనం వల్ల కలిగే జ్ఞానం

**4. ఆధ్యాత్మిక సిద్ధి, 5. ఆధిభౌతిక సిద్ధి, 6. ఆధి దైవికసిద్ధి,** ఈ త్రివిధ దుఃఖాలలో ఉదాసీనుడై వుండటం వల్ల శీతోష్ణాది ద్వంద్వాలకు అతీతుడై త్రివిధ జ్ఞానం కలగడం

**7. సహృత్సిద్ధి :** మిత్రుడి మూలకంగా జ్ఞానం కలగడం

**8. దానసిద్ధి :** ఆచార్యుడికి ఇష్టమైన వస్తువేదో గ్రహించి అది ఆయనకిచ్చి ఆయనను తృప్తి పరచి ఆయన ద్వారా జ్ఞానాన్ని పొందడం

ఇవి ఐదు విపర్యయాలు, 28 అశక్తులు, 9 రకాల తుష్టి, 8 సిద్ధులు వెరసి చక్రరూప భగవానుడిలో 50 అరలు (ఆకులు)ఏర్పడతాయి

ఇక ప్రత్యరలు 20, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు కలిసి 10, వాటి విషయాలు 10 మొత్తం 20 ప్రత్యరలు

చక్రరూప భగవానుడిలో ఇక మిగిలిన 6 అష్టకాలు

1. ప్రకృత్యష్టకము, 2. ధాత్వష్టకము, 3. ఐశ్వర్యాష్టకము, 4.భావాష్టకము, 5. దేవాష్టకము, 6. ఆత్మగుణాష్టకము.

1. *ప్రకృత్యష్టకము :* పంచభూతాలు, మనసు, బుద్ధి, అహంకారం అనేవి ప్రకృత్యష్టకం
2. *ధాత్వష్టకం :* చర్మము, త్వక్ మాంసము, రక్తము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్లము - ఇది ధాత్వష్టకము, అమరకోశము
3. *ఐశ్వర్యాష్టకము :* అణిమ, మహిమ, గరిమ, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము వెరసి ఐశ్వర్యాష్టకమవుతుంది
4. *భావాష్టకం :* ధర్మం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, అధర్మం, అజ్ఞానం, అవైరాగ్యం, అనైశ్వర్యము, ఈ 8 భావాష్టకం,
5. *దేవాష్టకం :* బ్రహ్మ, ప్రజాపతి, దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, పితర, పిశాచాలు వెరసి దేవాష్టకం
6. *ఆత్మగుణాష్టకం :* దయ, క్షాంతి, అనసూయ, శౌచం, అనాయాసం, మంగళము, అకార్పణ్యం, అస్పృహ మొదలైన వాటిని ఆత్మగుణాష్టకం అంటారు ఎవరైతే ఒక నేమి మూడు వృత్తాలు, పదహారు అంతాలు, యాభై అరలు, ఇరవై ప్రత్యరలు, ఆరు అష్టకాలుగా వ్యాపించియున్న భగవానుడిని చక్రరూపంలో ఉపాసిస్తారో వారికి ఈతి బాధలు తొలగిపోయి, సాధనలో పురోగమించి ముక్తిని పొందుతారు ఇది ఉపనిషత్ ద్రష్టలు సూచించిన ఉపాసనామార్గం.

*ఇటువంటి చక్రరూప రఘురాముడు శీఘ్రగామియై మా కష్టాలను తొలగించుగాక అని దేవతలు స్తుతించారు.* శ్రీరామకృష్ణ ప్రభ జనవరి 95=29 వేదమంత్రరామాయణము

50వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## 51వ సంఖ్య విషయసేకరణ చేయలేనందులకు చింతిస్తున్నాను.

# 52వ సంఖ్య

## 207. మానిషాద శ్లోక వివరణ

శ్లో॥ మానిషాద మవధీః కామమోహితమ్॥

*వాల్మీకి నోటి నుండి వెలువడిన మొట్టమొదటి శ్లోకము (వరుస నంబరు 187 చూడుడు)నకు తెలుగులో శ్రీ వావిలికొలను సుబ్బారావు గారు 52 అక్షరములతో వ్రాసిన పద్యము చూడండి*

*తే.గీ* తెలియుమా నిషాదుండ ప్రతిష్ఠ నీక 13
ప్రాప్త మయ్యెడు శాశ్వత హాయనముల 13
గ్రౌంచ మిథునంబు నందు నొక్కండు నీవు 13
కామమోహితముం జంపు కారణమున 13

ఈ పద్యమునందు నాలుగు పాదములు ఒక్కొక్క పాదమునకు 13 అక్షరములు. 4 x 13 = 52 అక్షరములు గలవు. సాంఖ్య శాస్త్ర ప్రకారము 13 ప్రణవమును బోధించును ఎట్లన వర్ణసమామ్నాయమందు 13వ అక్షరము 'ఓ' విష్ణువను నర్థము గల మానిషాద శబ్దము 'అ'కారమును సూచించును 'అకారార్థోవిష్ణు' వని కదా ప్రమాణము ప్రతిష్ఠ - ఇది స్త్రీ లింగము. ఇచ్చట స్త్రీ వాచకము ప్రకృష్టమైన ష గలది "విష్ణోరేషాన పాయినీ" యన్నట్టు ఎడబాటులేక విష్ణువుగూడియు నుండునది ప్రతిష్ఠాయనగా నునికి "ప్రతిష్ఠా సమాప్తౌ గౌరవేపిచ కార్య నిర్వాహ సామర్థ్యే ఛందసి స్థితౌ" నానా ప్రతిష్ఠ యనునది లక్ష్మీ వాచకమైన ఉకారమును బోధించును అవధారణార్థకమందును 'ఉ'కారము ప్రయోగింపబడును గాన 'నీకో' యనునది 'ఉ'కారము యొక్క అవధారణార్థకమును తెలుపును. క్రౌంచమిధునంబునందు నొక్కండు ప్రకృతి పురుషులయందు - కుటిల గతి కలది ప్రకృతియనియు దాని సంబంధముచే నల్పమైన జ్ఞానము గలవాడు (బద్ధజీవుడు) పురుషుడనియు గ్రాహ్యము యిది 'మ'కారమును బోధించును

విష్ణుమూర్తీ! ప్రకృతి పురుష విశిష్టమైన యీ దేహము నందు ప్రకృతి సాంగత్యమును నిర్మూలించుటచే బురుషుడు లక్ష్మీ పురుషకార మూలమున మోక్షమును బొంది నిన్నే ప్రాపించును ముక్తిదశయందు జీవునకు ప్రాప్యస్థానము నీవేయనియు నది లక్ష్మీ పురుషకారముచే లభించుననియు సారాంశము - శ్లోకము యొక్క రెండర్థములను గమనించిండి

ఒకర్థము : ఓరీ నిషాదుడా! క్రౌంచ దంపతులయందు గామముచే బెంటితో గూడి మత్తుగొనియున్న యొక్క పక్షిని జంపితివి గావున నీవు దీర్ఘకాలము భూమిపై బ్రతుకవు

రెండవ యర్థము : శ్రీనివాసా! రాక్షసులందు గామముచే దేహమెఱుగక దుష్కార్యములు చేయు మగవానిని జంపితివి గావున నీ కీర్తి లోకమునందు శాశ్వతమగుగాక.

శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము - బాలకాండ - 296

51వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**53, 54, 55 సంఖ్యల విషయ సేకరణ చేయలేనందులకు చింతిస్తున్నాను.**

# 56వ సంఖ్య

## 208. దేశములు

1 అంగము, 2 వంగము, 3 కళింగము, 4 కర్ణాటము, 5. కేరళము, 6. కామరూపము, 7 గౌడము, 8. వనవాసము, 9. కుంతలము, 10 కోంకణము,

11 మగధము, 12. సురాష్ట్రము, 13. మాళవము, 14 లాటము, 15 భోటము, 16 వరాటము, 17 శబరము, 18. కుకురము, 19 కురువు, 20 అవంతి, 21 పాండ్యము, 22. మద్రము, 23 సింహళము, 24 ఘూర్జరము, 25 పారశీకము, 26 మిధిలము, 27. పాంచాలము, 28 శూరసేని, 29 గాంధారము, 30 బాహ్లీకము, 31 హైహయము, 32. తౌళవము, 33 సాల్వము, 34. పుండ్రకము, 35. ప్రాగ్జోతిషము, 36 మత్స్యము, 37. చేది, 38 బర్బరము, 39. నేపాళము, 40 గౌళము, 41. కాశ్మీరము, 42 కన్యాకుబ్జము, 43 విదర్భము, 44 ఖురసాణము, 45 మహారాష్ట్రము, 46 కోసలము, 47. కేకయము, 48. అహిచ్ఛత్రము, 49 త్రిలింగము, 50 ప్రయాగము, 51. కరహాటకము, 52 కాంభోజము, 53 బోజము, 54 చోళము, 55 హూణము, 56 కాశి (దేశములు మఱియు ననేకములు కలవు అందు యివి ముఖ్యములు) శబ్దరత్నాకరము - 560

56వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**57, 58, 59 సంఖ్యల విషయసేకరణ చేయలేదు.**

# 60వ సంఖ్య

## 209. వాలఖిల్యాఖ్యులగు ఋషివరులు

సూర్యుని రథము ఒక్క అహోరాత్రమునందు తొమ్మిది కోట్ల ఏబదియొక్క యోజనముల పరిమాణము గల మానసోత్తర పర్వతము పయి తిరుగుచుండును ఆ మానసోత్తర పర్వతమునందు తూర్పున దేవధాని అను ఇంద్రుని పురము, దక్షిణమున సంయమని యను యముని పట్టణము, పశ్చిమమున నిమ్లోచని యను వరుణుని పట్టణము, ఉత్తరమున విభావరి యను చంద్రుని పట్టణము, శోభిల్లుచుండును ఆ పట్టణములందు వరుసగా ఉదయము, మధ్యాహ్నము, అస్తమయము, నిశీధము అను కాల భేదములు వానియందలి జనులకు కల్గుచుండును సూర్యుడు ఎప్పుడింద్ర నగరమునుండి నడచునో, అది మొదలు పదునైదు గడియ (ఒక ఘడియ లేదా గడియకు 24 నిముషములు)లందు రెండు కోట్ల ముప్పది యేడు లక్షల డెబ్బదియైదు వేల యోజనముల యోజనములు నడచును ఈ రీతి ఇంద్ర యమ వరుణ పురముల మీద చంద్రాది గ్రహ నక్షత్రములతో కూడి సూర్యుడు సంచరించుచు, పంద్రెండంచులు, ఆరు కమ్ములును, మూడు తొలులును గలిగి సంవత్సరాత్మకమై ఏకచక్రంబైన సూర్యుని రథము క్షణకాలములో (ఒక క్షణమనగా నాలుగు నిముషములు) ముప్పది నాలుగు లక్షల ఎనమన్నూరు యోజనములు సంచరించును.

సూర్యుని రథమునకు గల యిరుసొక్కటియె మేరుశిఖరమున చేరియుండును

చక్రము మానసోత్తర పర్వతముపై తిరుగుచుండును ఆ రథము ధ్రువమండలమునంటి సంచరించుచుండును ఆ రథము ముప్పదియారు లక్షల యోజనములు. దాని కాడి పరిమాణము నంతే. ఆ కాడి రథాశ్వముల మెడలపై మోపబడియుండును. గాయత్రీ ఛందస్సు మున్నగు ఏడు ఛందస్సులు గుఱ్ఱములై యుండును రథికుడగు సూర్యునకు ముందు భాగమున అరుణుడు (సూరసూతః, అరుణః, అనూరుః, కాశ్యపిః, గరుడాగ్రజః (గరుత్మంతుని అన్న) యివి సూర్య సారథి పేళ్ళు అమరకోశము 32) కూర్చుండి రథమును నడుపుచుండును బొటనవ్రేలి గనుపంత ప్రమాణము గల వాలఖిల్యులను ఋషులు అరువది వేల మంది సూర్యునిముందు నిలిచి అతనిని సౌరసూక్తములతో స్తుతించుచుందురు. ఇంకను పెక్కు మంది మునులును, గంధర్వ, కిన్నర, కింపురుష గంధర్వాప్సరః, పతంగాంగనలును ప్రతిమాసము వరుస క్రమమున సేవించుచుందురు తొమ్మిదికోట్ల యేబదియొక్క లక్షయోజనముల పరిమాణముగల భూమండలమునందొక క్షణము (నాలుగు నిముషములు)న సూర్యుడు రెండు వేల రెండు యోజనముల దూరము తిరుగుచు ఒక్క యహోరాత్రము (ముప్పది ముహూర్తముల కాలము ముహూర్త మునకు నలుబది ఎనిమిది నిముషములు 48 x 30 = 1440 నిముషములు అనగా ఇరువది నాలుగు గంటలు ఒక రాత్రి ఒక పగలు) నందే యీ భూమండల మంతయు సంచరించును.

భాగవతము పంచమస్కంధము

సూర్యుని గమనము ఒక క్షణమునకు 2002 యోజనముల దూరము తిరుగుచుండును యోజనమనగా 8 మైళ్ళు - 2002 x 8 = 16,016/4 = 4004 మైళ్లు ఒక్క నిముషములో తిరుగును సెకనుకు కావలయునన్న 4004/60=60 73 మైళ్ళు సూర్యుడు ఒక్క సెకనుకు 60.73 మైళ్ళు తిరుగుచుండును

# 210. తెలుగు సంవత్సరములు - 60

(క్రీ.శ 1987 నుండి 2047 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రభవ | 87-88 | 2. | విభవ | 88-89 |
| 3. | శుక్ల | 89-90 | 4 | ప్రమోదూత | 90-91 |
| 5. | ప్రజోత్పత్తి | 91-92 | 6 | అంగీరస | 92-93 |
| 7. | శ్రీముఖ | 93-94 | 8 | భావ | 94-95 |
| 9. | యువ | 95-96 | 10. | ధాతు | 96-97 |
| 11. | ఈశ్వర | 97-98 | 12. | బహుధాన్య | 98-99 |
| 13. | ప్రమాది | 99-2000 | 14. | విక్రమ | 2000-2001 |
| 15. | విషు (వృష) | 1-2 | 16. | చిత్రభాను | 2-3 |
| 17 | స్వభాను | 3-4 | 18 | తారణ | 4-5 |
| 19. | పార్థివ | 5-6 | 20 | వ్యయ | 6-7 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21 | సర్వజిత్తు | 7-8 | 22 | సర్వధారి | 8-9 |
| 23. | విరోధి | 9-10 | 24 | వికృతి | 10-11 |
| 25 | ఖర | 11-12 | 26. | నందన | 12-13 |
| 27 | విజయ | 13-14 | 28 | జయ | 14-15 |
| 29 | మన్మథ | 15-16 | 30 | దుర్ముఖి | 16-17 |
| 31. | హేవిళంబి | 17-18 | 32 | విళంబి | 18-19 |
| 33 | వికారి | 19-20 | 34 | శార్వరి | 20-21 |
| 35 | ప్లవ | 21-22 | 36. | శుభకృత్తు | 22-23 |
| 37 | శోభకృత్తు | 23-24 | 38 | క్రోధి | 24-25 |
| 39. | విశ్వావసు | 25-26 | 40 | పరాభవ | 26-27 |
| 41 | ప్లవంగ | 27-28 | 42. | కీలక | 28-29 |
| 43. | సౌమ్య | 29-30 | 44. | సాధారణ | 30-31 |
| 45 | విరోధికృత్తు | 31-32 | 46. | పరీధావి | 32-33 |
| 47. | ప్రమాదీచ | 33-34 | 48. | ఆనంద | 34-35 |
| 49. | రాక్షస | 35-36 | 50. | నళ | 36-37 |
| 51. | పింగళ | 37-38 | 52. | కాళయుక్తి | 38-39 |
| 53. | సిద్ధార్థి | 39-40 | 54. | రౌద్రి | 40-41 |
| 55. | దుర్మతి | 41-42 | 56. | దుందుభి | 42-43 |
| 57 | రుధిరోద్గారి | 43-44 | 58 | రక్తాక్షి | 44-45 |
| 59. | క్రోధన | 45-46 | 60. | అక్షయ | 46-47 |

శబ్దరత్నాకరము - 1070

ఈ 60 సంవత్సరములు కడచిన వెనుక తిరిగి యివియేవచ్చుచుండును. ప్రతి సంవత్సరమునకు 2 అయనములు 1. ఉత్తరాయణము, 2. దక్షిణాయనము - సంవత్సరములో మాఘమాసము లగాయితు ఆషాఢమాసం వరకు ఉత్తరాయణము, శ్రావణమాసము మొదలు పుష్యమాసం వరకు దక్షిణాయనము సంవత్సరమునకు మూడు కాలములు

1 వేసవికాలము : చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢమాసములు
2. వర్షాకాలము : శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములు.
3 చలికాలము : మార్గశిర, పుష్య, మాఘ, పాల్గుణమాసములు

# 211. విప్రుల సొమ్ము

ఇక్ష్వాకు వంశంబున జన్మించిన నృగమహారాజు నొకనాడు కశ్యపుడను విప్రునకు గోవునొకదానిని దానము చేయగా, అది యెట్లో తిరిగి గోవుల మందలలో కలసిపోయినది.

ఆ గోవునే నృగమహారాజు మరియొక విప్రునకు దానము చేసిన ఫలితముగా ఊసరవెల్లియై పాడునూతిలో పడియుండెను శ్రీకృష్ణుడు వచ్చి ఆ మహాకృకలాసమును ఎడమచేతితో గడ్డిపోచను తీసిన విధమున బయటకు తీయగా అది బంగారు కాంతిగల పురుషుడుగా మారి తన వృత్తాంతమును చెప్పెను

అంత శ్రీకృష్ణుడిట్లు చెప్పెను "పార్థివోత్తములారా! విప్రుల సొమ్ము కంటెను విషమే మేలు గరళమునకు విరుగుడు మందు కలదు కాని విప్రధనమనెడు విషమునకు విరుగుడు లేదు. తన ధనమును పరులచేత గోల్పడిన విప్రుడు దుఃఖముతో రోదనము చేయునప్పుడు పడిన అశ్రుకణములచే భూరేణువులెన్ని తడియునో అన్నివేలయేండ్లు రాజు దారుణ వేదనలు గల కుంభీపాక నరకమును పొందును స్వదత్తమైనను, పరదత్తమైనను ధనలోభమున దుశ్శీలుడై బ్రాహ్మణ క్షేత్రమునందలి ధాన్యాదికమును భుజించిన పాపాత్ముడరువదివేల సంవత్సరములు మల కూపమున క్రిమిరూపమున వర్తించును ఇది తెలిసికొని విప్రుడెంత తప్పు చేసినను, ఎన్ని కొట్టినను, ఎన్ని తిట్టినను అతనికెదురు పలుకక వినయముతో వందనమాచరించు పుణ్యాత్ములు నాపాలిటివారు అదియునుగాకయేనును (శ్రీకృష్ణుడు) ప్రతి దినమును భూసురుల నతివినయమున పూజింతును ఇట్లుచేయక విపరీత వర్తనులైన తామసులను వెదకి నేను దండింతును మీరును బ్రహ్మణుల యెడల పరమభక్తి కలిగి మెలగుడు" అని చెప్పి శ్రీకృష్ణుడు నిజనివాసమునకు పోయెను.

బాగవతము దశమస్కంధము ఉత్తర బాగము - 203

60వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 61వ సంఖ్య

## 212. ప్రాణాయామము

ఐదు వ్రేళ్ళను కలిపి ముక్కు కొనను పుచ్చుకొనుచూ ఓమ్ భూః। ఓమ్ భువః। ఓగ్ం సువః। ఓమ్ మహః। ఓమ్ జనః। ఓమ్ తపః। ఓగ్ం సత్యం। ఓమ్ తత్స వి తు ర్వ రే ణ్యం। భర్గోదేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్। ఓ మా పో జ్యో తీ ర సోఽమృ తం బ్ర హ్మ భూ ర్భు వ స్సు వ రోమ్॥

యీ అరువది యొక్క అక్షరములు గల మంత్రమును ముమ్మారు పఠించినచో ప్రాణాయామము చేసినట్లగును తరువాత సంకల్పమును జెప్పి నిత్యపూజా విధానమును ప్రారంభించవలయును

శ్రీ గాయత్రీ నిత్యపూజా విధానము - 11

61వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## 62, 63 సంఖ్యల విషయసేకరణ చేయలేదు.

# 64వ సంఖ్య

## 213. బలరామకృష్ణుల విద్యాభ్యాసము

*మానవులకెట్టి శక్తియున్నను తొలుత గురూపదేశమును పొందియే దానిని ప్రారంభింప వలసియున్నది కావున రామకృష్ణులు సర్వజ్ఞులయి, జగద్గురువులై, సంపూర్ణులై యున్నను, గురువును సేవించి విద్యలు నేర్చుకొను సంకల్పమున విద్యాభ్యాసమునకై కాశికిపోయి, అవంతీపుర నివాసియు, సకల విద్యావిలాసియునైన సాందీపనియను విద్వాంసుని దర్శించి విద్యనభ్యసించిరి ఆ గురువు సంతుష్టుడై వారికి వేద, వేదాంగములు, ధనుర్వేదము, తంత్రము, మన్వాది ధర్మ శాస్త్రములు, తర్క న్యాయములు, రాజనీతి మున్నగు వానిని బోధించెను. ఆ బాలురు గొప్ప ప్రతిభ కలవారగుటచే అరువది నాలుగు విద్యలను, అరువది నాలుగు దినములలో వినినంత మాత్రముననే సమగ్రముగా గ్రహించిరి. గురువులకెల్ల గురువులై, గురులఘు బావములు లేక మెలగెడి జగద్గురువులు లోకమునకు హితమును బోధించుటకై యిట్లు గురువునకు శిష్యులై మెలగిరి*

138 బాగవతము దశమస్కంధము, పూర్వబాగము

## 214. అఱువది నాలుగు కళలు

**1.** *సంగీతము* **:** *గానము చేయబడునది*

**2.** *వాయిద్యములు* **:** *తాళములు, మద్దెల, వీణ, పిల్లనగ్రోవి.*

**3.** *నాట్యము* **:** *కరణాలనీ, అంగహారాలనీ, విబావాలనీ, భావాలనీ, అనుభావాలనీ, రసాలనీ, ప్రత్యేకమైన అవయవాలతో, కూడియున్నది - నాట్యమనబడును చేతులు, కాళ్ళు, కళ్ళు మొదలైన అవయవములతోను, శరీరముతోను, పైన చెప్పబడిన భావములన్నిటిని ఆనందరసం తాండవిస్తూ ఉన్నదా అన్నట్లు అభినయించుట నాట్యమనబడును*

**4.** *చిత్రలేఖనము* **:** *పటములు వ్రాయుట, రంగులు వేయుట*

**5.** *అలంకారము* **:** *తిలకముతో ముఖమును అలంకరించుట, స్తనములను అలంకరించుకొనుట, శిరోజములను అలంకరించుకొనుట, శరీర అవయవములను అలంకరించుకొనుట*

**6.** *పుష్పాస్తరణము* **:** *శరీరమును, ఆసనములను, శయ్యలను, పటములను, పడకగదిని, పుష్పములతో అలంకరించుట*

**7.** *తండులకు సుమబలి వికారము* **:** పుష్పములతోను, బియ్యము పిండితోను ముగ్గులు పెట్టుట

**8.** *దశనవసనాంగరాగము* **:** దంతములు, శరీరము, (వేళ్ళగోళ్ళు), వస్త్రములు, యివి ఆకర్షనీయముగా నుండునట్లు రంగులతో అలంకరించుకొనుట

**9.** *మణిభూమికాకర్మ* **:** మణులతోటియు, మట్టితోటియు, బొమ్మలు మొదలగునవి తయారుచేయుట

**10.** *శయన రచనము* **:** వసంత ఋతువు మొదలగు ఋతువుల శీతోష్ణస్థితి ననుసరించి శయనముల నేర్పరచుట

**11.** *జలతరంగిణి* **:** ఉదకవాయిద్యము

**12.** *ఉదకఘాతము* **:** పిచ్చికార్లతో నీళ్ళు కొట్టుట

**13.** *చిత్రయోగములు* **:** అనేక రూపములుగా వేషములు ధరించుట

**14.** *మాల్యగ్రధన వికల్పము* **:** పుష్పములతో చిత్రవిచిత్రముగ బంతులు దండలు కట్టుట

**15.** *శేఖరకాద యోజనములు* **:** కిరీటమును తలకు చుట్టును అలంకరించుకొను విధముగను పుష్పములతో తయారుచేయుట.

**16.** *నేపథ్యయోగము* **:** అలంకారము చేసుకొను రీతులు

**17.** *కర్ణపత్రభంగాలు* **:** ఏనుగు దంతములతోను, శంఖములతోను, చెవులకు అలంకారములు కల్పించుకొనుట

**18.** *గంధయుక్తి* **:** సువాసన ద్రవ్యములు తయారుచేయు విధానము నెఱుంగుట

**19.** *భూషణయోజనము* **:** ఆభరణములు ధరించుకొను విధానము

**20.** *ఇంద్రజాలము* **:** ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యలు చేయుట.

**21.** *కౌచుమారము* **:** సుభగం కరణాది యోగములు

**22.** *హస్తలాఘవము* **:** చేతులలో నున్న వస్తువులను మాయ చేయుట మొద లగునవి

**23.** ***విచిత్ర శాక యూష భక్ష్య వికారక్రియ పానక రస రాగాస వయోజనము :*** రకరకముల పిండివంటలు, భక్ష్యములు, పానకములు, షర్బతులు మొదలగునవి తయారు చేయుట పాకకళ

**24.** *సూచీవానకర్మ* **:** రకరకముల గుడ్డలు కుట్టుట

**25.** *సూత్రక్రీడ* **:** దారముతో వినోదము చూపుట.

అనగా దారమును త్రెంపియు, కాల్చియు మరల ఆ దారమును యథాప్రకారము చూపించుట మొదలైనవి.

**26.** ***వీణా డమరుక వాయిద్యములు :*** వీణడమరుకములను వాయిద్యముల యందు నిపుణత కలిగియుండుట

**27.** ప్రహేళికములు : రెండు అర్థములు వచ్చులాగున కవిత్వము (పద్యములు) చెప్పుట.
**28.** ప్రతిమాల : చాటు పద్యములు చెప్పుట
**29.** దుర్వాచక యోగములు : సరిగ అర్థము కాని విధముగ కవిత్వము చెప్పుట.
**30.** పుస్తకవాచనం : రసవత్తరముగ, పురాణములను, కావ్యములను చదువుట
**31.** నాటకాఖ్యాయికా దర్శనము : నాటకములు, కావ్యములు, గద్య గ్రంథములు, చంపువులు, మొదలగు వానికి అర్థము తెలుసుకొనుట.
**32.** కావ్య సమస్యా పూరణము : పద్యపాదములుగ యిచ్చిన సమస్యలను పూర్తి చేయుట
**33.** పట్టికావేత్రవానవికల్పములు : పేముతో కుర్చీలు, మంచములు, బుట్టలు, మొదలగునవి అల్లుట
**34.** తర్కు కర్మలు : విలాసము కొఱకు బొమ్మలు తయారుచేయుట
**35.** తక్షణం : కొయ్యలతో బొమ్మలు, ఇతర వస్తువులు అందముగా తయారుచేయుట
**36.** వాస్తువిద్య : గృహవాస్తు తెలుసుకొనుట
**37.** రూప్య రత్న పరీక్ష : రత్నపరీక్షయందు నిపుణత
**38.** ధాతువాదము : భూగర్భమునందుండు ఖనిజములను తెలుసుకొనుట
**39.** మణిరాగాకరజ్ఞానము : భూగర్భమందు మణులుండు ప్రదేశములను తెలుసుకొనుట.
**40.** మేషకుక్కుట లావకవిధులు : పొట్టేళ్ళు, కోడిపుంజులు, లావకమను పిట్టలు మొదలగు వాటితో పందెములు కట్టురీతులు తెలుసుకొనుట
**41.** వృక్షాయుర్వేద యోగములు : వృక్ష వైద్యము నెఱుంగుట.
**42.** శుక శారికా ప్రలాపములు : చిలుకలు, గోరువంకలు వీటితో మాట్లాడు భాషలు తెలుసుకొనుట
**43.** ఉత్సాదనము : సంవాహనము, కేశమర్దనములలో కౌశలము, ఒళ్ళు పట్టుట, పాదములు పిసుకుట, తల అంటుట మొదలగు పనులు చేయుటయందు దిట్ట
**44.** అక్షరముష్టికా కథనము : చేతితో అక్షరములను వ్రాయుచు కవిత్వము చెప్పుట
**45.** మ్లేచ్ఛిత కవిత్వములు : కవులను దూషించుట
**46.** దేశభాషా విజ్ఞానము : అనేక భాషల నెరుంగుట.
**47.** పుష్పక శకటిక : పువ్వుల పల్లకీ, పువ్వుల రథము తయారుచేయుట.
**48.** నిమిత్తజ్ఞానము : శకున ఫలితములు తెలుసుకొనుట
**49.** యంత్రమాతృకము : యంత్రములను తయారుచేయుట.
**50.** ధారణ మాతృక : ఒకమారు విని పద్యమును తిరిగి తాను చెప్పుట.
**51.** మానసక్రియ : ఆలోచనతో చేయు అష్టావధానము, చతుర్గుణిత అష్టావధానము,

శతావధానము, సహస్రావధానము, త్రిభాషాసహస్రావధానము మొదలగునవి చెప్పుట
**52.** సంపాఠ్యము : అనేక మంది కలసి ఒకే విషయమును చెప్పుట లేక పాడుట.
**53.** కావ్యక్రియ : గ్రంథములను రచించుట
**54.** అభిధానకోశము : వేదములను వర్ణించుట
**55.** ఛందోజ్ఞానము : ఛందస్సు అనగా పద్యములు వ్రాయు పరిజ్ఞానము కలిగి యుండుట.
**56.** క్రియాకల్పనము : కార్యాచరణాసక్తి.
**57.** భవితకయోగము : ఒక వస్తువును వేరొక రూపములో చూపుట
**58.** వస్త్రగోపనం : పూర్వము శ్రీకృష్ణుడు గోపికా స్త్రీల వస్త్రములను మాయము చేసినట్లు వస్త్రములను మాయము చేయు విధానములను తెలుసుకొనుట
**59.** ద్యూత విశేషములు : జూదములాడుట.
**60.** ఆకర్షక్రీడ : త్రాటితో ఆడు ఆటలు.
**61.** బాలక్రీడనకాలు : బాలురు ఆడుకొనుటకు వింతయైన ఆట వస్తువులు తయారు చేయుట
**62.** వైనయికీ జ్ఞానము : గుఱ్ఱములను, ఏనుగులను మచ్చిక చేసుకొనుట
**63.** వైజయికీ విద్యలు : విజయమును పొందుటకు ఉపాయములు తెలుపు శాస్త్రము
**64.** వ్యాయామికీ జ్ఞానము : శరీర వ్యాయామములకు సంబంధించిన విషయముల నెఱుంగుట

వాత్స్యాయన కామసూత్రములు

## 215. తంత్రములు అఱువది నాలుగు

అఱువది నాలుగు తంత్రముల పేర్లు శబ్ద రత్నాకరము నందు గలవు. ఈ తంత్రములననుష్ఠించిన వారిని గూర్చి తెలుసుకుందాం.

శ్రీరామకృష్ణ పరమహంస చరిత్ర తెలియని వారుండరు. వారు అవతార పురుషులు. సాధారణంగా శిష్యులు విద్యాభ్యాస నిమిత్తం గురువుల సాన్నిధ్యానికి వెళతారు కాని యిక్కడ రామకృష్ణ పరమహంసను వెదుక్కుంటూ మహావిదుషీమణి, సాధనానుష్ఠానంలో సిద్ధహస్తురాలైన బ్రాహ్మణి వచ్చి 64 తంత్రాలలోని ముఖ్యసాధన లనుష్ఠింపజేసారు అలా నేర్చిన తంత్రములను స్వయముగా శ్రీరామకృష్ణులే తమ శిష్యులకు చెప్పారు. వాటిని 2/98, 3/98 శ్రీరామకృష్ణ ప్రభలో ప్రచురించారు. వాటిలో కొన్నిటిని మీ ముందుంచే ప్రయత్నం చేస్తున్నాను

పంచముండి పీఠ నిర్మాణం, 64 తంత్రాలలోని సాధనలు

ఈ తాంత్రిక సాధనలకు ఆవశ్యకమైన (1.) పంచముండి (మనిషి పుర్రెతోబాటు మరి నాలుగు జంతువుల పుర్రెలు) గంగానదికి ఆవలి సుదూర ప్రాంతాల నుంచి

తీసుకురాబడినవి తాంత్రిక సాధనలకు అనువైన రెండు పీఠాలు (2) ఒకటి కాళికాలయ ఉద్యానవన ఉత్తర సరిహద్దు వద్దనున్న మారేడు చెట్టుక్రింద, రెండవది శ్రీరామ కృష్ణులు స్వహస్తాలతో నాటిపెంచిన పంచవటి క్రింద నిర్మించబడినవి అవసరం మేరకు యీ రెండు పంచముండి పీఠాలలో ఏదో ఒకదానిమీద ఆశీనులై జపం, పురశ్చరణం, ధ్యానాదులతో గురుదేవులు కాలం గడపసాగారు ఈ రీతిలో రేయింబవళ్ళు, రోజులు, నెలలు, ఎలాగడచిపోయినవో గురుశిష్యులిద్దరికీ ఎరుకే లేదు శ్రీరామ కృష్ణుల ఆసాధానను గురించి యిలా చెప్పేవారు. (3) బ్రాహ్మణి పగటివేళ సుదూరంలో వున్న ప్రాంతాలకు వెళ్ళి తంత్ర శాస్త్రాలలో నిర్దిష్టమైన వస్తువులను సేకరించి వచ్చి, రాత్రివేళలో మారేడు చెట్టు క్రిందనో లేక పంచవటి క్రిందనో ఆ వస్తువుల సమర్చి, నన్నురావించి ఆయా వస్తువులతో యథావిధిగా నాచేత జగన్మాతను పూజింపచేసి, చివరకు జపధ్యానాలలో నన్ను నిమగ్నుడను చేసేది ఆ సమాధి స్థితిలో దివ్యదర్శనాలు ఎన్నికలిగాయో లెక్కించలేను ఈ విధంగా ప్రధాన అర్హవైనాలుగు తంత్రాలు విధించిన సాధనలనన్నిటిని ఒకటొకటిగా బ్రాహ్మణి నా చేత చేయించింది ఈ సాధనలు ఆచరించటంలో ఎందరో పదభ్రష్టు లయ్యేవారు. కాని జగన్మాత అనుగ్రహంతో వీటన్నిటిలోను ఉత్తీర్ణుడనయ్యాను

**(1.)** ఇదానీం శ్రుణుదేవేశి ముండ సాధనముత్తమమ్।
యత్కృత్వా సాధకో యాతి మహాదేవ్యాః పరం పదమ్॥ 51
నరమహిష మార్జాల ముండత్రయం వరాననే।
అథవా పరమేశాని నృముండత్రయమాదరాత్॥ 52
శివా సర్పసారమేయ వృషభాణాం మహేశ్వరి।
నరముండం తథా మధ్యే పంచముండాని హీరితమ్॥ 53
అథవా పరమేశాని నరాణాం పంచముండకాన్।
తథా శతం సహస్రం వాయుతం లక్షం తథైవ చ॥ 54
నియుతాంచాథవా కోటిం నృముండాన్ పరమేశ్వరి।
నరముండం స్థాపయిత్వా ప్రోథయిత్వా ధరాతలే॥ 55
వితస్తి ప్రమితాం వేదీం తస్యోపరిప్రకల్పయేత్।
ఆయామప్ర స్థితోదేవి చతుర్హస్తా సమాచరేత్॥ 56

యోగినీ తంత్రం - పంచమ పటలః (యోగినీ తంత్రం, ఐదవ అధ్యాయము నుంచి)

సంక్షిప్త తాత్పర్యం : పరమేశ్వరీ, అత్యుత్తమమైన ముండసాధనాన్ని గురించి చెబుతాను విను. దీన్ని సాధించేవాడు పరమేశ్వరీ లోకాన్ని పొందుతాడు వీటిలో మొదటిది మూడు పుర్రెలతో చేయబడాలి అవి 1. మనిషి, 2. దున్నపోతు, 3 పిల్లి పుర్రెలు లేదా బదులుగా మూడు మనిషి పుర్రెలతో కూడ చేయవచ్చును రెండవది

ఐదు పుర్రెలతో చేయబడాలి అవి 1 నక్క, 2. పాము, 3. కుక్క, 4. కోడె (కాడి మరపదగిన దూడ), 5. వీటి మధ్య మనిషి పుర్రె లేదా బదులుగా ఐదు మనిషి పుర్రెలతోను చేయవచ్చును (ఈముండ సాధనకు మనిషి పుర్రెలు ఎంత శ్రేష్ఠమైనవంటే ఒక్క అయిదే కాదు వంద, వెయ్యి, లక్ష, పది లక్షలు, కోటి ఎన్ని లభిస్తే అంత మంచిది) యిలా యీ పుర్రెలను భూమిలోపల పాతిపెట్టి దానిమీద ఒక చదరపు వేదికను నిర్మించాలి లేదా ఒకే ఒక్క మనిషి పుర్రెమీద కూడా అలాటి వేదికనే నిర్మించవచ్చును ఇలా నిర్మించబడిన వేదిక మీద ఆసీనమై, గురూపదిష్టానుసారముగా సాధన చేసే వ్యక్తికి ఫలితం సత్వరం లభిస్తుంది

**(2.)** సాధకులు సామాన్యంగా ఐదు పుర్రెలతో కూడిన ఒక్క వేదికనే నిర్మించి జపధ్యానాదులను చేస్తుంటారు కాని తాము రెండు వేదికలను నిర్మించామని గురుదేవులు మాతో చెప్పారు వీటిలో మారేడు చెట్టుక్రింద మూడు మనిషి పుర్రెలతో నిర్మించబడినది తాంత్రిక సాధనలలో సిద్ధిపొందిన ఒకింతకాలం తరువాత, వారా రెండు వేదికలను తొలగించి, ఆ పుర్రెలనన్నిటినీ గంగానదిలో పారవేశారు సాదన చేయటానికి మూడు పుర్రెల ఆసనమే శ్రేష్ఠమైనదనో లేదా ఆ కాలంలో పంచవటి కంటె మారేడుచెట్టు వున్నస్థలం మరింత ప్రశాంతంగా వుండటం చేతనో లేదా అన్ని క్రియానుష్ఠానాలకు అవసరమౌతవనో రెండు వేదికలు నిర్మించబడినవి. లేదా మారేడు చెట్టుకు సమీపంలోనే హోమం చేయటం ప్రమాదమని భావించి రెండవ వేదికను పంచవటి క్రింద నిర్మించి వుండవచ్చును.

**(3.)** విబిన్న సమయాలలో శ్రీరామకృష్ణుల నుండి యీ తాంత్రిక సాధనాదులను గురించి విన్న విషయాలనే మేమిక్కడసందర్భానుసారంగా పొందుపరచినాం.

స్త్రీ మూర్తిలో జగన్మాతను దర్శించటం

"ఒనాడు చూసేసరికి, బ్రాహ్మణి రాత్రివేళ ఎక్కడ నుంచో నిండుయవ్వనంలో వున్న ఒక సుందరాంగిని తీసుకువచ్చి, ఆమెను దిగంబరిని చేసి, దేవీ ఆసనం మీద కూర్చోబెట్టి 'నాయనా ఈమెను జగన్మాతగా పూజించు" అని నాతో చెప్పింది పూజ పూర్తికాగానే 'ఆమె అంక (ఒడి) భాగాన కూర్చుని ఏకాగ్రంగా జపం చేయి! అని బ్రాహ్మణి నన్ను ఆదేశించింది నేను భయకంపితుడనై, దీనంగా విలపిస్తూ 'అమ్మా, అమ్మా, నిన్ను సంపూర్ణంగా శరణుజొచ్చిన వాడికి యిదేమి ఆదేశం యిస్తున్నావు? దుర్బలుడైన నీ బిడ్డకు యిలాటి అగ్ని పరీక్షను తట్టుకోవడం సాధ్యమా? తల్లీ! అంటూ ప్రార్థించసాగాను ఇలా పలికీపలకడంతోనే ఏదో తెలియని శక్తి వచ్చి ఆవహించి, నా హృదయాన్ని అపూర్వ దివ్యబలంతో నింపినది మంత్రముగ్ధుడిలా ఏం చేస్తున్నానో ఎరుకలేకుండానే ఇష్టమంత్రాన్ని జపిస్తూ ఆ స్త్రీ అంక భాగాన కూర్చున్న మరుక్షణంలోనే సమాధిమగ్నుడనయ్యాను బాహ్యాస్మృతి వచ్చాక, నన్ను తిరిగి మామూలు స్థితికి తేవటానికి శ్రద్ధగా ప్రయత్నిస్తూ బ్రాహ్మణి నాకు కన బడింది అప్పుడు నాతో ఆమె 'నాయనా! కార్యకలాపం పూర్తయింది ఎంత

ఆశ్చర్యం! ఇతరులు ఇటువంటి పరిస్థితిలో అతికష్టం మీద తమను సంబాళించుకొని, ఎలాగో ఒకింపసేపు జపం చేసి సరిపుచ్చుకొంటారు మరినువ్వో పూర్తిగా బాహ్యస్మృతిని కోల్పోయి సమాధిమగ్నుడవైనావు. ఆ పలుకులు ఆలకించి ఒక దీర్ఘ విశ్వాసం విడిచాను ఈ అగ్నిపరీక్షలో ఉత్తీర్ణుడను చేసినందుకు పదేపదే జగన్మాతకు ప్రణమిల్లసాగాను

"మరొకరోజు చూసానుగదా, బ్రాహ్మణి మనిషి పుర్రెలో చేపను వండి, జగజ్జననికి తర్పణం అర్పించింది నాతోనూ అలాగే చేయించి, ఆ చేపను నన్ను తినమన్నది ఆమె ఆదేశాన్ని తుచ పాటించాను మనస్సులో ఎలాటి ఏహ్య భావమూ జనించలేదు శ్రీరామకృష్ణప్రభ 2/98

పూర్ణాభిషేకంలో అలా దీక్ష పుచ్చుకొన్న నాటి నుంచి బ్రాహ్మణి నిత్యం నాచేత చేయించిన తాంత్రిక సాధనలకు లెక్కే లేదు ఆయా సందర్భాలలో జరిగిన సంగతులన్నీ నాకిప్పుడు గుర్తులేవు కానీ ఏనాడు తల్లి కృపతో రతిక్రియారక్తులైన దంపతులు సంభోగ మహదానందాన్ని దర్శించి, దాన్లో కేవలం శివశక్తి లీలా విలాసాన్ని మాత్రమే చూసి ఆనందభరితుడనై సమాధి స్థితుడనయ్యానో ఆ సంగతి జ్ఞాపకం ఉన్నది ఆ రోజు బాహ్యస్మృతి కలిగాక బ్రాహ్మణి నాతో ఇలా అన్నది "నాయనా నువ్వు ఆనందాసనంలో సిద్ధిపొంది, దివ్యాభావంలో ప్రతిష్ఠితుడవైనావు. వీరభావంలో ఇదే చివరి మెట్టు" 'కులాగార' పూజను అనుష్ఠించి, పూజ ముగించి ఒక రూపాయి నాలుగణాలు దక్షిణగా సమర్పించి ప్రణామం చేసాను ఆ సాధనా సమయంలో 'కారణాన్ని' (సారాయి)ని పుచ్చుకోలేకపోయాను స్త్రీల నందరినీ జగన్మాతగానే భావించాను కనుకనే వివాహం చేసుకున్న నా భార్యలో కూడా సాక్షాత్తు జగజ్జననిని దర్శించగలిగి, అర్చించి ఆమె పాదాలకు ప్రణమిల్లాను. శ్రీరామకృష్ణప్రభ - మార్చి /98 పుట 18

64వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**65 సంఖ్య విషయసేకరణ చేయలేకపోయాను**

# 66వ సంఖ్య

## 216. అయిదేండ్ల ధ్రువుడు

ఉత్తాన పాదునకు ధ్రువుని తల్లి సునీతి, ఉత్తముని తల్లి సురుచి అను యిద్దరు భార్యలు గలరు ఉత్తముడు తండ్రి తొడపై కూర్చొనుట చూచిన ధ్రువుడు తాను తండ్రి తొడపై కూర్చొన ప్రయత్నించగా, అక్కడ వున్న సవతి తల్లి పలికిన దుర్భాషలకు మనస్సున కలతజెంది తల్లియైన సునీతి అనుమతిని పొంది, ఐదు

సంవత్సరముల బాలుడై "మూడు లోకములందును ఉత్కృష్టమైనదియు, ఇతరులకు అలభ్యమునగు స్థానమును పొందవలెననెడి" దీక్షతో, నారదుని ప్రోత్సాహముతో మధువనమునకు పోయి తపస్సును చేసెను ధ్రువుని ఉగ్రమైన తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమైన నారాయణుడు యిట్లు పలికెను "నాయనా రాజకుమారా! ధ్రువా! నీ మనస్సులోని సంకల్పమును బాగుగా తెలిసికొంటిని అది అసాధ్యమైనదేయైనను నీకొసగుచున్నాను నీకు ధ్రువక్షితియను ఉన్నత స్థానమును గగనమండలమున ఒసంగెదను గోశాలలో కట్టుకంబము చుట్టును గోగణము తిరుగుచుండురీతిని గ్రహనక్షత్ర తారాజ్యోతిశ్చక్రమును, నక్షత్ర రూపమున నున్న ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, ఇంద్రుడు, సప్తర్షులును, తారకాసమేతులై దాని చుట్టును తిరుగుచుందురు ఇంతవరకెవ్వరును ఆ స్థానమును పొందియుండలేదు ప్రళయకాలమున లోకత్రయము నశించినప్పుడు కూడ ఆ స్థానమునకు నాశము కలుగదు అది మిక్కిలి ప్రకాశించుచుండును కాని ఆ స్థానము నీకిప్పుడే లభింపదు అరువది యారువేల యేండ్లు గడచిన పిదపనే లభించును ఈలోగా నీవు, నీ తండ్రివలన రాజ్యము స్వీకరించి ధర్మయుక్తముగా పరిపాలించుచుందువు నీవు ఇహలోక సౌఖ్యములనన్నింటిని అనుభవించి, అంత్య సమయమున నన్నే స్మరించుచు శరీరమును విడిచి, సప్తర్షిమండలముకంటె ఉన్నతమగు నా స్థానమును పొందగలవు" ఇట్లు పలికి పరమ పురుషుడగు శ్రీమన్నారాయణుడు ధ్రువుని యభిలషితార్థముల నిచ్చి అతడు చూచుచుండగనే వైకుంఠమునకు పోయెను బాగవతము చతుర్థ స్కందము - 150

# 217.అలర్కుడు

దీర్ఘతపునకు శ్రీహరియంశమున బహుజన సేవ్యుడు, ఆయుర్వేదజ్ఞుడు నగు ధన్వంతరి జనించెను అతనిని కీర్తించినయెడల సమస్త దుఃఖములు నశించును ఆ ధన్వంతరి వాసుదేవాంశ సంభూతుడగుటవలన యజ్ఞభాగమున కర్హుడయ్యెను ఆ ధన్వంతరికి కేతుమంతుడును, కేతుమంతునకు భీమరథుడును, అతనికి దివోదాసుడనంబరగు ద్యుమంతుడును ఉదయించిరి ఆద్యుమంతునకు ప్రతర్దనుడు జన్మించెను ఆ ప్రతర్దనుడు ఋతధ్వజుడనియు, శత్రుజిత్తనియు కూడ చెప్పబడెను అతనికి కువలయాశ్వుడను పుత్రుడు కలిగెను ఆ కువలయాశ్వుని పుత్రుడు అలర్కుడు అతడు అరువది యారువేల సంవత్సరములు రాజ్యమేలెను అతనివలె రాజ్యమును పాలించిన వారు వేరెవ్వరును లేరు బాగవతము నవమస్కంధము- 620

66వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**67, 68, 69, 70 సంఖ్యలకు విషయసేకరణ చేయలేకపోయాను**

# 71వ సంఖ్య

## 218. విభూతియోగము

శ్రీ భగవద్గీత పదవ అధ్యాయము విభూతియోగములో తన ఉనికిని తెలిపే స్థానములు 71 చెప్పాడు శ్రీకృష్ణపరమాత్మ వాటిని తెలుసుకుందాము

గీత 10వ అధ్యాయము 20 శ్లోకం మొదలు 38 శ్లోకం వరకు

భావము గుడాకేశా! 1 సమస్త ప్రాణుల హృదయములందుండెడి ఆత్మను నేను, 2 సర్వభూతములయొక్క ఆది మధ్యాంతములు నేనే,3. ఆదిత్యులలో విష్ణువు నేను, 4 ప్రకాశక వస్తువులలో చండకిరణుడగు సూర్యుడు నేను, 5 మరుత్తులలో మరీచిని నేను, 6 చుక్కలలో చంద్రుడను నేను, 7. వేదములలో సామవేదము, 8 దేవతలలో దేవేంద్రుడను, 9 ఇంద్రియములలో మనస్సును, 10 భూతములందలి చేతనశక్తి నేను, 11 రుద్రులలో శంకరుడను, 12 యక్షరాక్షసులలో కుబేరుడను, 13 వసువులలో పావకుడును (అగ్ని), 114. పర్వతములలో మేరు పర్వతమును నేనై యున్నాను, 15 పురోహితులలో ప్రముఖుడగు బృహస్పతి నేను, 16 సేనాపతులలో కుమారస్వామినేను, 17 జలాశయములలో సముద్రుడను నేను, 18 మహర్షులలో భృగుమహర్షి నేను, 19. శబ్దములలో ఓంకారము నేను, 20 యజ్ఞములలో జపయజ్ఞము నేను, 21 స్థిర వస్తువులలో హిమాలయము నేను, 22 వృక్షములలో రావిచెట్టును, 23 దేవఋషులలో నారదుడను, 24. గంధర్వులలో చిత్రరధుడను, 25. సిద్ధులలో కపిలమునిని నేను, 26 గుఱ్ఱములలో అమృతము తోడ బుట్టిన ఉచ్చైఃశ్రవము నేను, 27 ఏనుగులలో ఐరావతము నేను, 29. మనుష్యులలో రాజు నేను, 29 ఆయుధములలో వజ్రాయుధమును, 30 ధేనువులలో కామ ధేనువును, 31 ఉత్పాదకులలో మన్మధుడను, 32 పాములలో వాసుకి నేను, 33 నాగులలో శేషుడను నేను, 34 జలదేవతలలో వరుణుడు నేను, 35 పితృదేవతలలో అర్యముడను నేను, 36 నియామకులలో యముడునేను, 37. దైత్యులలో ప్రహ్లాదుడను, 38.గణకులలో కాలపురుషుడను, 39 మృగములలో సింహమును, 40 పక్షులలో గరుడను, 41. వడిగల వస్తువులలో వాయువును నేను, 42 విలుకాండ్రలో శ్రీరాముడను నేను, 43 జల జంతువులలో మొసలి నేను, 44. నదులలో గంగానది నేను, 45 అర్జునా! సృష్టియొక్క ఆది మధ్యాంతములు నేను, 46 విద్యలలో ఆత్మ విద్య నేను, 47 వాదించువారిలోని వాదశక్తి నేను, 48 అక్షరములలో "అ"కారమును నేను, 49 సమాసములలో ద్వంద్వ సమాసము నేను, 50 నశించని కాలమును నేను, 51 సర్వభర్తను సర్వవ్యాపకుడను నేను, 52. సర్వభక్షకులలో మృత్యువును నేను, 53 మీదటి వారికి (ముందు బుట్టబోవు వారికి) ఉత్పత్తి కారణము నేను, 54 స్త్రీలయందుండెడి కీర్తి మాంగల్యము - పలుకుసొంపు -జ్ఞప్తి - ధారణ - ఓర్పు

- ధైర్యము నేనే, 55. సామవేద గానములలో బృహత్సామ వేదగానమును నేను, 56 ఛందస్సులలో గాయత్రిని, 57 మాసములలో మార్గశీర్షమును, 58 ఋతువులలో వసంత ఋతువు నేను, 59. మోసకృత్యములలో జూదము నేను, 60. తేజశ్శాలురలో తేజస్సు నేను, 61 జయము నేను, 62 ప్రయత్నము నేను, 63 సాత్వికులందరి సత్త్వగుణము నేను, 64. యాదవులలో వాసుదేవుడను, 65.పాండవులలో అర్జునుడను, 66 మునులలో వ్యాసుడను, 67 కవులలో శుక్రాచార్యుడను నేను, 68 శాసించువాటిలో దండనీతి నేను, 69 జయాభిలాషులలోని రాజనీతి నేను, 70 గోప్య వస్తువులలో మౌనము నేను, 71 జ్ఞానవంతులలోని జ్ఞానమును నేనే యని గుర్తించుము

అర్జునా అన్ని భూతములకు నేనే మూలబీజము చరాచర వస్తువులలో నేనుకానిది యేదియు లేదు గీత

71వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 72వ సంఖ్య

## 219. రాగములు వాటి పేర్లు

| సప్త స్వరములు | సప్తస్వరధములు | సప్తస్వరములు పుట్టిన దీవులు | సప్త స్వరముల పేర్లు |
|---|---|---|---|
| స | నెమిలి కూతవలెనుండును | జంబూద్వీపము | షడ్జమము |
| రి | ఎద్దు అరుపు | శాక ద్వీపము | రిషభము |
| గ | మేక అరుపు | కుశద్వీపము | గాంధారము |
| మ | క్రౌంచపక్షికూత | క్రౌంచద్వీపము | మధ్యమము |
| ప | కోకిల కూత | శాల్మలీ ద్వీపము | పంచమము |
| ద | గుఱ్ఱపు సకిలింపు | శ్వేతద్వీపము | ధైవతము |
| ని | ఏనుగు ఘీంకారము | పుష్కరద్వీపము | నిషాదము |

| మేళకర్త నామములు | | | | | | | | స్వరభేదములు |
|---|---|---|---|---|---|---|---|---|
| మేళకర్త రాగములు | | | | | | | | |
| శుద్ధ మధ్యమరాగములు | స | రి | గ | మ | ప | ద | ని | |
| 1 కనకాంగి | | 1 శు | 2 శు | 3 శు | | 4 శు | 5 శు | 1. శుద్ధరిషభము |
| 2 రత్నాంగి | | శు | శు | శు | | శు | కై 6 | 2 శుద్ధగాంధారము |

| మేళకర్త నామములు | స్వరభేదములు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మేళకర్త రాగములు | | | | | | | | |
| శుద్ధ మధ్యమరాగములు | స | రి | గ | మ | ప | ద | ని | |
| 3. గానమూర్తి | | శు | శు | శు | | శు | కా[7] | 3. శుద్ధమధ్యమము |
| 4. వనస్పతి | | శు | శు | శు | | [8]చ | కై | 4 శుద్ధదైవతము |
| 5 మానవతి | | శు | శు | శు | | చ | కా | 5. శుద్ధ నిషాదము |
| 6. తానరూపి | | శు | శు | శు | | ష[9] | కా | 6 కైసిక నిషాదము |
| 7 సేనాపతి | | శు | [10]సా | శు | | శు | శు | 7. కాకలి నిషాదము |
| 8. హనుమత్తోడి | | శు | సా | శు | | శు | కై | 8 చతురస్ర దైవతము |
| 9 ధేనుక | | శు | సా | శు | | శు | కా | 9. షట్స్రుతిదైవతము |
| 10 నాటకప్రియ | | శు | సా | శు | | చ | కై | 10 సాధారణగాంధారము |
| 11 కోకిలప్రియ | | శు | సా | శు | | చ | కా | 11. అంతరగాందారము |
| 12. రూపవతి | | శు | సా | శు | | ష | కా | 12. చతురస్రరిషభము |
| 13. గాయక ప్రియ | | శు | [11]అం | శు | | శు | శు | 13. షట్స్రుతిరిషభము |
| 14. వకుళా భరణం | | శు | అం | శు | | శు | కై | 14 ప్రతిమధ్యమము |
| 15. మాయామాళవగౌళ | | శు | అం | శు | | శు | కా | |
| 16 చక్రవాకం | | శు | అం | శు | | చ | కై | |
| 17. సూర్యకాంతం | | శు | అం | శు | | చ | కా | |
| 18. హాటకాంబరి | | శు | అం | శు | | ష | కా | |
| 19 ఝుంకార ధ్వని | | [12]చ | సా | శు | | ష | కా | |
| 20. నటభైరవి | | చ | సా | శు | | శు | కై | |
| 21. కీరవాణి | | చ | సా | శు | | శు | కా | |
| 22. కరహరప్రియ | | చ | సా | శు | | చ | కై | |
| 23. గౌరీమనోహరి | | చ | సా | శు | | చ | కా | |
| 24. వరుణప్రియ | | చ | సా | శు | | ష | కా | |
| 25. మారరంజని | | చ | అం | శు | | శు | శు | |
| 26. చారుకేసి | | చ | అం | శు | | శు | కై | |
| 27. సరసాంగి | | చ | అం | శు | | శు | కా | |
| 28. హరికాంభోజి | | చ | అం | శు | | చ | కై | |
| 29 ధీర శంకరాభరణం | | చ | అం | శు | | చ | కా | |
| 30. నగానందిని | | చ | అం | శు | | ష | కా | |

| మేళకర్త నామములు | స్వరభేదములు | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మేళకర్త రాగములు | | | | | | | |
| శుద్ధ మధ్యమరాగములు | స | రి | గ | మ | ప | ద | ని |
| 31 యాగప్రియ | | 13 ష | అం | శు | | శు | శు |
| 32. రాగవర్ధిని | | ష | అం | శు | | శు | కై |
| 33 గాంగేయ భూషణి | | ష | అం | శు | | శు | కా |
| 34 వాగధీశ్వరి | | ష | అం | శు | | చ | కై |
| 35. శూలిని | | ష | అం | శు | | చ | కా |
| 36. చలనాట | | ష | అం | శు | | ష | కా |
| 37 సాలగము | | శు | శు | 14 ప్ర | | శు | శు |
| 38 జలార్ణవము | | శు | శు | ప్ర | | శు | కై |
| 39 ఝాలవరాళి | | శు | శు | ప్ర | | శు | కా |
| 40. నవనీతము | | శు | శు | ప్ర | | చ | కై |
| 41. పావని | | శు | శు | ప్ర | | చ | కా |
| 42. రఘుప్రియ | | శు | శు | ప్ర | | ష | కా |
| 43 గవాంభోది | | శు | సా | ప్ర | | శు | శు |
| 44 భావప్రియ | | శు | సా | ప్ర | | శు | కై |
| 45. శుభపంతువరాళి | | శు | సా | ప్ర | | శు | కా |
| 46. షడ్విధమార్గిణి | | శు | సా | ప్ర | | చ | కై |
| 47 సువర్ణాంగి | | శు | సా | ప్ర | | చ | కా |
| 48 దివ్యమణి | | శు | సా | ప్ర | | ష | కా |
| 49 ధవళాంగి | | శు | అం | ప్ర | | శు | శు |
| 50. రామనారాయణి | | శు | అం | ప్ర | | శు | కై |
| 51 కామవర్ధని | | శు | అం | ప్ర | | శు | కా |
| 52 రామప్రియ | | శు | అం | ప్ర | | చ | కై |
| 53. గమనశ్రమ | | శు | అం | ప్ర | | చ | కా |
| 54. విశ్వంభర | | శు | అం | ప్ర | | ష | కా |
| 55 శ్యామలాంగి | | చ | సా | ప్ర | | చ | కా |
| 56. షన్ముఖప్రియ | | చ | సా | ప్ర | | శు | కై |
| 57 సింహేంద్రమధ్యమం | | చ | సా | ప్ర | | శు | కా |
| 58 హేమవతి | | చ | సా | ప్ర | | చ | కై |

| మేళకర్త నామములు | స్వరభేదములు | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మేళకర్త రాగములు | | | | | | | |
| శుద్ధ మధ్యమరాగములు | స | రి | గ | మ | ప | ద | ని |
| 59. ధర్మవతి | | చ | సా | ప్ర | | చ | కా |
| 60 నీతిమతి | | చ | సా | ప్ర | | ష | కా |
| 61. కాంతామణి | | చ | అం | ప్ర | | శు | శు |
| 62 రిషభప్రియ | | చ | అం | ప్ర | | శు | కై |
| 63 లతాంగి | | చ | అం | ప్ర | | శు | కా |
| 64 మేచ కల్యాణి | | చ | అం | ప్ర | | చ | కా |
| 65 చిత్రాంబరి | | చ | అం | ప్ర | | ష | కా |
| 66 వాచస్పతి | | చ | అం | ప్ర | | చ | కై |
| 67. సుచరిత్రము | | ష | అం | ప్ర | | శు | శు |
| 68 జ్యోతిస్వరూపిణి | | ష | అం | ప్ర | | శు | కై |
| 69 ధాతువర్ధని | | ష | అం | ప్ర | | శు | కా |
| 70 నాశికాభూషణి | | ష | అం | ప్ర | | చ | కై |
| 71. కోసలము | | ష | అం | ప్ర | | చ | కా |
| 72 రసికప్రియ | | ష | అం | ప్ర | | ష | కా |

1 నుండి 36 = శుద్ధ మధ్యమ రాగములు, 37 నుండి 72 = ప్రతిమధ్యమ రాగములు సంపూర్ణరాగమన్నను, మేళకర్తరాగమన్నను, జనకరాగమన్నను ఒక్కటియే జనకరాగము నుండి పుట్టినవియే జన్యరాగములు

మొత్తము రాగముల సంఖ్య 34, 848 సంగీత విద్యాదర్పణము

సంగీతము అనంతము రాగములు అపారము అవ్యక్తము సంగీతము, సాహిత్యము అను యీ రెండు సరస్వతీ దేవి స్తనములు శ్రీకృష్ణ పరమాత్మ సామగానప్రియుడు

72వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**73, 74, 75, 76, 77 సంఖ్యల విషయసేకరణ చేయలేకపోతిని**

# 78వ సంఖ్య

## 220. భరతుడు

విశ్వామిత్ర మహర్షి మేనకకు కలిగిన సంతానము శకుంతల ఆ శకుంతలను

దుష్యంతుడు గాంధర్వ వివాహానంతరము భరతుడు జన్మించినాడు దుష్యంతుని తదనంతరము రాజుగా సింహాసనమునధిష్ఠించిన భరతుడు ఎదురులేనివాడై ప్రజానురంజకముగా రాజ్యమును పాలిస్తూ యమునా నదీ తీరమున దీర్ఘతపుడు పురోహితుడుగా డెబ్బది ఎనిమిదియు, గంగాతీరమున ఏబదియైదును అశ్వమేధయాగములు చేసెను

భాగవతము, తొమ్మిదవ స్కందము

78వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**79, 80, 81 సంఖ్యల విషయసేకరణ చేయలేకపోతిని**

# 82వ సంఖ్య

## 221. భారతము

బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానీ పాకయాజీ గారు వ్రాసిన భారతసారోద్ధారమున, ఆదిపర్వమున 17 అధ్యాయములు, సభాప ॥ 7 అధ్యా॥, అరణ్యా ప ॥ 6 అధ్యా॥, విరాటపర్వ ॥ 5 అధ్యా॥, ఉద్యోగ ప ॥ 8 అధ్యా॥, భీష్మ ప ॥ 7 అధ్యా॥, ద్రోణ ప ॥ 6 అధ్యా॥, కర్ణ ప ॥ 3 అధ్యా॥, శల్య ప ॥ 3 అధ్యా॥, సౌప్తిక ప 1 అధ్యా॥, స్త్రీ ప॥ 1 అధ్యా, శాంతి ప ॥ 7 అధ్యా॥, అను శాసనిక ప॥ 5 అధ్యా॥, అశ్వమేధ ప ॥ 2 అధ్యా॥, ఆశ్రమవాస ప ॥ 1 అధ్యా॥, మౌసల ప ॥ 1 అధ్యా॥, మహాప్రస్థానిక ప॥ 1 . అధ్యా॥, స్వర్గారోహణ ప॥ 1 అధ్యాయముగను, మొత్తం 82 అధ్యాయములుగ, అధ్యాయమునకు 60 శ్లోకముల వంతున 82 x 60 = 4920 శ్లోకములు రచింపబడెను

బా = సూర్యుడు, రా = అగ్ని, తం = చంద్రుడు, సూర్య, అగ్ని, చంద్రుల యొక్క సంయోగము వలననే సమస్త చరాచర ప్రపంచము యొక్క సృష్టి జరుగుచున్నదని తాత్పర్యము

బారతం - 33

82వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**83 సంఖ్య విషయసేకరణ చేయలేకపోతిని**

# 84వ సంఖ్య

## 222. శ్రీ మద్భగవద్గీతలో అర్జునుని శ్లోకములు 84

## 223. లోకములో 84 లక్షల జీవరాశులున్నవి

## 224. రతి రహస్యమున 84 బంధ భేదములు గలవు

రతిలేక ముదియు నంగన
రతిగలిగిన ముదియునశ్వ రత్నము ధరలో
సతతము భ్రాంతిని జేసెడు
తతరలచే ముదియునరుడు తథ్యము వేమా

*స్త్రీలు సంయోగమము లేక ముసలితనము నొందుదురు పురుషులు సంగమము చేత ముసలి తనము నొందుదురు అలాగే గుఱ్ఱము సంగమముచే ముసలి తనము నొందును*

84వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**85, 86, 87** సంఖ్యల విషయసేకరణ చేయలేకపోతిని

# 88వ సంఖ్య

## 225. విభుడు గా అవతరించిన నారాయణుడు

*ద్వితీయ మన్వంతరమున అగ్నిపుత్రుడగు స్వారోచిషుడు రెండవ మనువు ద్యుమత్సుషేణ, రోచిష్మదాదులాతని పుత్రులు వారు భూమిని పాలించిరి రోచ నుడింద్రుడయ్యెను తుషితాదులు దేవతలైరి ఊర్జస్తంబాదులు సప్తమునులైరి వేద శిరుడను విప్రునకు తుషితయను భార్యయందు శ్రీహరి విభుడను పుత్రుడుగా.అవత రించెను ఎనుబది యెనిమిదివేల మునులు అనుగ్రహింపగా అతడు కౌమార బ్రహ్మచర్య వ్రతము పూనెను* భాగవతము, అష్టమ స్కందము, 457

88వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

**89, 90, 91, 92, 93, 94, 95** సంఖ్యల విషయసేకరణ చేయలేకపోతి

# 96వ సంఖ్య

## 226. తొంబదియారు మాయలు

*అతల లోకమున మయుని పుత్రుడగు బలాసురుడుండెను. అతడు తొంబదియారు మాయలెరిగినవాడు ఆ మాయలను ప్రయోగించుచు అతడు వినోదించుచుండును కొందరు మోహబద్ధులై ఆ మాయలకు లొంగిపోవుచుందురు ఆ బలాసురుని యావులింతల వలన స్వైరిణులు, కామినులు, పుంశ్చలులు అను స్త్రీ గణములుందురు వారు పాతాళ లోకమునకు వచ్చిన పురుషునికి హాటకరసమను సిద్ధరస ఘటిక*

నిత్తురు దాని వలన నతడు రససిద్ధునివలె అగును. అతడా స్త్రీలతో వినోదించుచు మదాంధుడై వివిధ క్రీడల ఆనందించుచుండును. భాగవతము, పంచమ స్కంధము - 296

## 227. తొంబదియాఱు తత్త్వములు

సీ॥ జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు
శబ్దాదులైదు కోశంబులైదు
కరణము ల్నాల్గు రాగాదు లెన్మిది పది
నాళ్ళు వాయువులు పద్నాల్గు నేడు
ధాతువు లైదు భూతము లాఱు చక్రాలు
మలముల మూడవస్థలును నైదు
మూడు మండలములు మూడీషణంబులు
మూడు వ్యాధులు గుణాల్మూడు రెండు

తే గీ తనువులను గూడి షణ్ణ వీత్యాది తత్త్వ
సాక్షి రూపుడవైనావు సత్యముగను
రమ్య గుణధామ భద్రాద్రి రామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ

శ్రీ భద్రాద్రి రామ శతకము -9వ పద్యము

| | | |
|---|---|---|
| 1. | *జ్ఞానేంద్రియములు* | 5 |
| 2. | *కర్మేంద్రియములు* | 5 |
| 3. | *శబ్దాదులు* | 5 |
| 4 | *కోశములు* | 5 |
| 5. | *కరణములు* | 4 |
| 6. | *రాగాదులు* | 8 |
| 7. | *నాడులు* | 10 |
| 8 | *వాయువులు* | 14 |
| 9. | *ధాతువులు* | 7 |
| 10 | *భూతములు* | 5 |
| 11. | *చక్రములు* | 6 |
| 12. | *మలములు మూడవస్థలు* | 3 |
| 13 | *మండలములు* | 8 |
| 14. | *ఈషణములు* | 3 |

| | | |
|---|---|---|
| 15. | వ్యాధులు | 3 |
| 16 | గుణములు | 3 |
| 17. | తనువులు | 2 |
| | | **96** |

**1. జ్ఞానేంద్రియములు :** 1. చెవులు (శబ్ద), 2. చర్మము (స్పర్శ), 3. కనులు (రూపము), 4. నాలుక (రసము), 5. ముక్కు (గంధము)

**2. కర్మేంద్రియములు :** 1. వాక్కు (మాట్లాడుట), 2. పాణి (గ్రహించుట), 3. పాదము (నడచుట), 4. వాయువు (మలవిసర్జన), 5. ఉపస్థ (స్త్రీ పురుషుల మర్మస్థానము)

**3. శబ్దాదులు :** 1. శబ్ద, 2. స్పర్శ, 3. రూప, 4 రస, 5 గంధములు (పంచతన్మాత్రలు)

**4. కోశములు :** 1. అన్నమయ కోశము, 2 ప్రాణమయకోశము, 3 మనోమయకోశము, 4 విజ్ఞానమయకోశము, 5. ఆనందమయకోశము

**5. కరణములు :** 1. మనస్సు, 2. వాక్కు, 3 కాయము, 4 బవాదులు 16

ఆంధ్రవాచస్పత్యము, 2వ బాగము

**6. రాగాదులు :** 1. మాయ, 2. అజ్ఞానము, 3. అవివేకము, 4. అభిమానము, 5. కామము, 6 క్రోధము, 7 లోభము, 8. మోహము

**7. నాడులు :** వరుస నంబరు 76 చూడుడు.

**8. వాయువులు :** 1 అవహుడు, 2. ప్రవహుడు, 3· సంవహుడు, 4. ఉద్వహుడు, 5. వివహుడు, 6. పరివహుడు, 7 పరావహుడని సప్తమరుత్తుల పేర్లు

పూర్తి వివరముల కొరకు 1వ బా వరుస నం. 239, చూడుడు పేజి 211

మరియు

శ్లో ॥ గగన స్పర్శనో వాయు రనిలశ్చ తథాపరః
ప్రాణః ప్రాణేశ్వరో జీవ ఇత్యేతే సప్తమారుతాః॥

1 గగనము, 2. స్పర్శనము, 3. వాయువు, 4. అనిలుడు, 5. ప్రాణము, 6. ప్రాణేశ్వరుడు, 7. జీవుడు అని సప్త మారుతుల పేర్లు గలవు. 7 + 7 = 14

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము బాలకాండ 811, 812

**9. ధాతువులు :** "వస, అస్సృక్, మాంస, మేదోస్థి, మజ్జ, శుక్రాణి ధాతవః" 1. వస = కడుపులో బొడ్డు క్రింద నుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు, 2 అస్సృక్ = రక్తము, 3. మాంస = మాంసము, 4. మేదస్సు = మెదడు, 5. అస్థి = ఎముక, 6 మజ్జ = ఎముకలయందలి నేయి, 7 శుక్రాణి = రేతస్సు (వీర్యము) ఇవి సప్తధాతువులు

అమరకోశము

(1. సువర్ణం = బంగారము, 2 రజతం = వెండి, 3 తామ్రమ్ = రాగి, 4. హారకూటము = ఇత్తడి, 5 లోహము = ఇనుము, 6 త్రపు = కంచు, 7. సీసము = సీసము వీటిని కూడ సప్తధాతువులందురు అమరకోశము

**10. భూతములు :** "పృధి వ్యాపస్తేజో వాయు రాకాశాత్"

1 భూమి, 2. నీరు, 3 తేజస్సు (అగ్ని), 4 వాయువు, 5 ఆకాశము

**11. చక్రములు :** 1. మూలాధారము, 2. స్వాధిష్ఠానము, 3 మణిపురము, 4. అనాహతము, 5 విశుద్ధ, 6. ఆజ్ఞా చక్రములు సాధనరహస్యం 101

**12. మలములు మూడవస్థలు :**

1. యణవమలము భగవంతుని తెలిసికొను విధానము విస్మరించి, దేహమునందు భార్యాపుత్రుల మిత్రులయందు వ్యామోహమును పెంచుకొని సంసార జలధిలో కొట్టుమిట్టాడుట

2 **మాయామలము :** ఇతరుల ధనమున కాసించి, పరులకు అపకారము చేయుట

3. కార్మికమలము ' పురాకృత పుణ్యాపాప ఫలితముగా పుట్టుచు, చచ్చుచుండుట

శ్రీ భద్రాది రామశతకము 37వ పద్యం

1. కర్మమలం పూర్వజన్మ కర్మలు, 2 మాయా మలం = రాగద్వేషాలు ఇవి రెండూ పురుష ప్రయత్న సాధ్యాలు, 3. అనవమలం = అవిద్యా అజ్ఞానాలు ఇది భగవంతుని కృపతోనే తొలగుతుంది. యీ మూడు మలాలే జీవిని బంధిస్తాయి వీటి నుండి విముక్తే మోక్షం శ్రీ రా.ప్రభ డిసెంబరు/95లో మలాల గురించి పై విధంగా వుంది

**13. మండలములు :** విషయ సేకరణ చయలేకపోతిని

**14. ఈషణములు :** 1 దారేషణము, 2. పుత్రేషణము, 3 ధనేషణములు

1. కామ, ధర్మ, అర్థములు కలుగుటకు భార్యను పెళ్ళి చేసికొని నిర్వర్తించవలసినవి నిర్వర్తించుటే దారేషణము

2 పున్నామ నరకము నుండి విముక్తి కలిగించుటకై పుత్రులను కాంక్షించుటే - పుత్రేషణము.

3. దానధర్మము లొనరించుటకు గాను ధనము సంపాదించవలయుననే కోరికే ధనేషణము శ్రీ భద్రాద్రి రామ శతకము, 39వ పద్యము

**15. వ్యాధులు :** వివిధములైన మనః పీడలు కలది వ్యాధి

1. ఆధ్యాత్మిక తాపశాంతియగు గాక, 2. అధి బౌతిక తాపశాంతియగుగాక, 3 అధి దైవిక తాపశాంతియగు గాక. (పూర్తి వివరముల కొరకు ప్రదమభాగం 28వ పేజి చూడుడు)

వ్యాధిత్రయ లక్షణముల గురించి శ్రీ భద్రాద్రి రామశతకములో యిలా వుంది 41వ పద్యము

1. గాలి సంబంధములైన రోగములు 80 అనగా వాతరోగములు

2. పిత్తము (ధాతువు) పైత్య సంబంధమైన వ్యాధులు 82
3 శ్లేష్మము - కఫము సంబంధిత రోగములు 224 మొత్తం 386

**16.** *గుణములు* **:** 1. *సత్త్వగుణము,* 2. *రజోగుణము,* 3 *తమోగుణము*

గీత 14/5

**17.** *తనువులు* **:** 1 *పంచభూతములు* 5, *అహంకారము* 1, *బుద్ధి* 1, *మాయ* 1, *జ్ఞానేంద్రియములు* 5, *కర్మేంద్రియములు* 5, *మనస్సు* 1, *ఇంద్రియగోచరంబులగు శబ్ద స్పర్శాది పంచతన్మాత్రలు* 5 *వెరసి* 24 *తత్త్వములతో కూడినదే స్థూల శరీరము* గీత 14/5

2 *జ్ఞానేంద్రియము* 5, *కర్మేంద్రియము* 5, *పంచప్రాణములు* 5, *మనస్సు* 1, *బుద్ధి* 1, *అనెడి* 17 *అవయవములతో గూడినదే సూక్ష్మ శరీరము* - ఉపనిషత్సార రత్నావళి

96వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## **97, 98** సంఖ్యల విషయసేకరణ చేయలేకపోతిని

# 99వ సంఖ్య

## 228. కపిలుడు దేవహూతికి భక్తియోగమును తెలుపుట

*అమ్మా! సుఖమునకు కారణమగు ధనము దొరకకున్నయెడల జనులు మిగుల దుఃఖమును పొందుట, బగవంతుని యాజ్ఞ చేతనేయని తెలిసికొనుము. అనిత్యములైన గృహారామ క్షేత్రాదులను, సిరిసంపదలను, పుత్రమిత్రాదులను స్థిరములని నమ్మిన వాడు జన్మాంతరమున జంతువుగా పుట్టి నరకము ననుభవించును ప్రాణి జంతుయోనులం బుట్టినను విరక్తుడు కాక, తన దేహమును విడువలేక, అదియే సౌఖ్యము కలిగించునదని యనుకొనును*

*కర్షకుడు ముసలియెద్దును ఏవగించిన రీతిని, వయస్సు మళ్ళి శక్తిహీనుడైన అతనిని దారసుతాదులును ఏవగింతురు ముసలి తనముచే మిక్కిలి బాధపడుచు, తానిదివరలో పోషించినవారు దయతలచి పోషింపగా హీనముగా జీవించుట జఠరాగ్ని మందగించుటచే స్వల్పముగనే భుజించును బలహీనతవలన రోగములకు గురియగును. భార్యాపుత్రులయందు చింతనయుండును మరణసమయమున మిక్కిలి భయంకరాకారులగు యమ భటులను గాంచి భయపడును యమపాశము తన కంఠమున తగుల్కొనగా ఈ శరీరమును విడిచి యాతనా శరీరమును పొంది దుర్గమమైన మార్గమున యమభటులచే తీసికొని పోబడును. ఆకలి దప్పుల బాధయటుండ యమభటులు వానిని పెక్కు విధముల హింసించుచుందురు అతడిట్లు బాధపడుచు "తొంబది తొమ్మిది*

వేల యోజనముల దూరమున నున్న యముని పట్టణమునకు పోవలసియుండును"
పాపాత్ముడైన వానిని యమభటులు పెట్టు బాధలు వర్ణింపనలవి కానివి ఇట్లు
పెక్కు బాధల ననుభవించి, పాపములు క్షీణింపగా మరల నర జన్మ నెత్తును
శ్రీ మహాభాగవతము, తృతీయ స్కంధము - 120

99వ సంఖ్య వివరణ సంపూర్ణము
ఓం

# 100వ సంఖ్య

## 229. కౌరవులు వంద మంది

1. దుర్యోధనుడు, 2. దుశ్శాసనుడు, 3 దుశ్శలుడు, 4. దుస్సహుడు, 5 జలసంధుడు, 6. సముడు, 7. సహుడు, 8 విందుడు, 9. అనువిందుడు, 10 దుర్ధర్షుడు, 11 సుబాహుడు, 12. దుష్ప్రధర్షణుడు, 13. దుర్మర్షణుడు, 14 దుర్ముఖుడు, 15. దుష్కర్ణుడు, 16. కర్ణుడు, 17. వివింశతి, 18 వికర్ణుడు, 19. శలస్సత్త్వుడు, 20. సులోచనుడు, 21 చిత్రుడు, 22 ఉపచిత్రుడు, 23 చిత్రాక్షుడు, 24 చారుచిత్రుడు, 25. శరాసనుడు, 26. దుర్మదుడు, 27 దుర్విగాహుడు, 28. వివిత్సుడు, 29 వికటాననుడు, 30 ఊర్ణనాభుడు, 31. సునాభుడు, 32 నందుడు, 33. ఉపనందుడు, 34 చిత్రబాణుడు, 35. చిత్రవర్ముడు, 36 సువర్ముడు, 37. దుర్విమోచనుడు, 38 అయోబాహుడు, 39 మహాబాహువు, 40 చిత్రాంగుడు, 41 చిత్రకుండలుడు, 42. భీమవేగుడు, 43 భీమబలుడు, 44 బలాకి, 45. బలవర్ధనుడు, 46. ఉగ్రాయుధుడు, 47. సుషేణుడు, 48 కుండధారుడు, 49. మహోదరుడు, 50. చిత్రాయుధుడు, 51 నిషంగుడు, 52. పాశుడు, 53 బృందారకుడు, 54. దృఢవర్ముడు, 55 దృఢక్షత్రుడు, 56. సోమకీర్తి, 57. అనూదరుడు, 58. దృఢసంధుడు, 59. జరాసంధుడు, 60 సత్యసంధుడు, 61. సదస్సువాకుడు, 62. ఉగ్రశ్రవుడు, 63 ఉగ్రసేనుడు, 64 సేనానీ, 65 దుష్పరాజయుడు, 66. అపరాజితుడు, 67 కుండశాయి, 68. విశాలాక్షుడు, 69. దురాధరుడు, 70. దృఢహస్తుడు, 71 సుహస్తుడు, 72 వాతవేగుడు, 73 సువర్చసుడు, 74. ఆదిత్యకేతువు, 75 బహ్వాసీ, 76 నాగదత్తుడు, 77 ఉగ్రయాయి, 78. కవచిక్రదనుడు, 79. కుండి, 80 కుండధరుడు, 81. ధనుర్ధరుడు, 82 ఉగ్రరధుడు, 83 భీమరధుడు, 84 వీరబాహువు, 85. ఆలోలుపుడు, 86 అభయుడు, 87. దృఢరధుడు, 88. అనాధృష్యుడు, 89 కుండభేది, 90 విరావుడు, 91. చిత్రకుండలుడు, 92. ప్రమధుడు, 93. ప్రమాది, 94 దీర్ఘరోముడు, 95 దీర్ఘబాహువు, 96. మహాబాహువు, 97. వ్యూడోరుడు, 98. కనకధ్వజుడు, 99 కుండాశీ,

100. విరజుడు
గాంధారికి ముందుగా దుర్యోధనుడు జన్మించెను కలియంశమున గాంధారికి నొక్కొక్క దివసంబున నొక్కొక్కరుండుగా గ్రమంబున దుశ్శాసనాదులు జన్మించిరి
శ్రీ మహాబారత సారోద్ధారము ప్రదమబాగము - 189

## 230. దితి నూఱేండ్లు గర్భ భారమును వహించుట

ఇది సంధ్యాసమయము. యీ సమయమున భూతపతియైన శివుడు నంది వాహనారూఢుడై భూత గణములతో సంచరించు కాలమున సంగమము నిషిద్ధమని కశ్యపుడు వారించినను, వినని దితి తన అభీష్టమును నెరవేర్చుకొనెను. తత్ఫలితముగా ఆమె గర్భమును ధరించెను నీ పుత్రులలో హిరణ్యాకశిపునకు ఉత్తమోత్తముడు నగు పుత్రుడు హరిభక్తుడై కీర్తి గాంచగలడని భర్త కశ్యపుడు దివ్యశక్తిచే చెప్పగా, ఆ సంతోషముతో దితి నూఱేండ్లు గర్భభారమును వహింపవలసి వచ్చినది
బాగవతము తృతీయస్కందం

## 231. నహుషుడు

పురూరవుని పుత్రుడగు ఆయువునకు నహుషుడును, క్షత్ర వృద్ధుడును, రజియును, రంభుడును, అనేనసుడును అనువారు పుట్టిరి అందు నహుషుడు నూఱు యాగములు చేసి ఇంద్రపదవిని పొంది అహంకరించి, ఇంద్రుని బార్యయగు శచీదేవిని కవయగోరి మునులు మోసిన పల్లకిలో ఆమె కడకు పోవుచు అగస్త్య శాపమున పామై పల్లకి నుండి క్రిందపడెను
బాగవతము, నవమస్కందము - 622

## 232. ఋషభుడు

స్వాయంభువమనెడి మనువునకు ప్రియవ్రతుడను పుత్రుడు కలిగెను అతని కుమారుడు అగ్నీధ్రుడు అతనికి ప్రాజ్ఞుడగు నాభియను పుత్రుడుదయించెను ఆ నాభి కుమారుడు ఋషభుడు, హరిభక్తుడైన ఋషభునకు నూఱుగురు పుత్రులుదయించిరి
బాగవతము, ఏకాదశ స్కందము - 273

## 233. వజ్రాయుధము

ఇంద్రుని కోరిక మేరకు దధీచి తత్త్వావలోకమున బంధములను విడిచి బుద్ధీంద్రియ మానసములలో కూడిన క్షేత్రజ్ఞుని, పరబ్రహ్మ రూపమగు భగవంతునియందు ఐక్యము చేసి యోగమార్గమున దేహమును విడిచెను అప్పుడింద్రుడు అతని శల్యములచే విశ్వకర్మ మూలమున నూఱు వాడియంచుల వజ్రాయుధమును నిర్మింపజేసి దానిని గైకొని ఐరావతము నెక్కి వృత్రాసురుని సంహరింపబోయెను బాగవతము షష్ఠ స్కందము - 349

## 234. ఇక్ష్వాకుడు

మనువొకనాడు గట్టిగా తుమ్మగా వికలుడేమియు గాక అతని ముక్కు రంధ్రముల నుండి ఇక్ష్వాకుడు పుట్టెను అతడు గొప్ప కీర్తిగాంచి, సూర్యవంశ రాజులలో ముఖ్యుడయ్యెను ఇక్ష్వాకునకు నూఱుగురు పుత్రులు గలరు. భాగవతము నవమస్కంధము - 573

## 235. యాగసంరక్షణ

విశ్వామిత్రుని యాగసంరక్షణార్థము వచ్చిన రామలక్ష్మణులకు మారీచుడు, సుబాహుడు అను రాక్షసులు రక్తమును, ఎముకలును వర్షించుచు కానవచ్చిరి పరమధీశాలి శ్రీరాముడు వెంటనే రెండు బాణములను ధనుస్సున సంధించి ఆకర్ణాంతములాగి ఒకేసారి వేర్వేరుగా ఆ యిరువురి రాక్షసుల మీద ప్రయోగించెను అందొక బాణము మారీచుని ఆకాశమున గిరగిర త్రిప్పుచూ, నూఱు యోజనముల దూరమున సముద్రమున పడవైచెను, రెండవ బాణము సుబాహుని భస్మము గావించెను.

అధ్యాత్మ రామాయణము, బాలకాండము - 41

## 236. సముద్రమును దాటుట

ఆనంద సందోహము మూర్తీభవించిన మారుతాత్మజుడు ఆంజనేయుడు శతయోజన విస్తీర్ణమైన సముద్రమును లంఘించుటకుద్యమించి, రామచంద్రుని స్మరించి, బాహువులను పొడవుగా చాచి, వాలమును విస్తరించి, మెడను నిటారుగా నిలిపి, దృష్టిని ఎగువనే నిలిపి, పాదముల జంటను సంకోచించి, దక్షిణాభిముఖుడై వాయు వేగముతో లంఘించెను. ఆధ్యాత్మ రామాయణము, సుందరకాండము - 257

## 237. సేతు బంధనము

అతి సంతోషముతో మహాపర్వత సన్నిభులగు వానరసేనాపతులతో కలిసి పర్వతములతో వృక్షములతో, అతి విశాలమై, నూఱు యోజనముల పొడవు గలిగిన దృఢమైన వారధిని నలుడు నిర్మించెను సాగరమున వానరోత్తముడు మొదటినాడు పదునాల్గు యోజనములు, రెండవనాడు ఇరువది యోజనములు, మూడవనాడు ఇరువదియొక్క యోజనములు, నాల్గవనాడు ఇరువది రెండు యోజనములు, అయిదవనాడు ఇరువది మూడు యోజనములు సేతువును నిర్మించెనని విందుము

అధ్యాత్మ రామాయణము యుద్ధకాండము - 315, 317

## 238. మహర్షుల చరిత్ర

వశిష్ఠ మహర్షి పుత్రులలో జ్యేష్ఠుడు శక్తి మహర్షి ఇతడు అన్నివిధాలా తండ్రికి తగిన తనయుడు అని ప్రసిద్ధి చెందాడు ఋగ్వేదంలో ఈతడు గొప్పగా కీర్తించబడ్డాడు. ఈతడే పరాశరమహర్షి తండ్రి అదృశ్యంతి అను ఆమె శక్తి మహర్షి భార్య

పరాశరుని తల్లి పరాశరుడు తల్లి గర్భంలో ఉన్న సమయంలోనే, అతడి తండ్రియైన శక్తిని, పినతండ్రులైన నూఱ్గుర (వశిష్టుని పుత్రులు)ను రాక్షసుడు చంపి తినివేశాడు. వశిష్టుని కులం నిర్మూలం అయిపోయింది విశ్వామిత్రుని ప్రోత్సాహంతో, రాక్షస రూపాన్ని పొందిన కల్మాషపాదుడను రాజు ఇంతటి ఘోరానికి తలపడ్డాడు విశ్వామిత్రునకు తనకున్న వైరాన్ని, ముందు వెనుకలను, ఆలోచించి యధార్థాన్ని గ్రహించిన వశిష్ఠుడు, ప్రతిగా మళ్ళీ ఎవరినీ శపించలేదు సముద్రమంత పుత్రశోకాన్ని తనలో తానే దిగమింగు కొన్నాడు ఎంత ప్రయత్నించినా పుత్రశోకాన్ని తట్టుకోలేకపోయాడు అందుచేత అతడికి జీవితంపై విరక్తి ఏర్పడింది ఆశ్రమానికి పోవడానికి కూడా ఇష్టపడలేదు వశిష్ఠుని భార్య అరుంధతి కూడ భర్తతో సమానంగా కుమిలిపోయింది "కులమే నిర్మూలం అయిపోయిందే" అనే బాధ వారిద్దరినీ కృంగదీసింది అట్టి పరిస్థితిలో, చిన్నవయసులోనే భర్తను పోగొట్టుకొని మనోవ్యధతో కుమిలిపోతున్న ఉత్తమురాలైన అదృశ్యంతి (పరాశరుని తల్లి) తన దుఃఖాన్ని అణచుకొని, ధైర్యంతో వివేకంతో తన అత్తమామలు చావకుండ కాపాడింది ఆమె మూలంగానే వశిష్ఠుడు అరుంధతి ఆత్మహత్యా ప్రయత్నాన్ని మానుకుని తిరిగి ఆశ్రమానికి చేరారు

భక్తి నివేదన - ఏప్రిల్ / 99 = 30 పుట

ఈ వంశంలో ఐదుగురు మహర్షులుద్భవించారు.

1 వశిష్ఠమహర్షి, 2 వశిష్ఠ మహర్షి కుమారుడు శక్తిమహర్షి, 3 శక్తి మహర్షి కుమారుడు పరాశరమహర్షి, 4. పరాశర మహర్షి కుమారుడు వేదవ్యాస మహర్షి, 5 వేదవ్యాస మహర్షి కుమారుడు శుక మహర్షి

## 239. ఔర్వ్యుడు

తొడ నుండి పుట్టిన ఔర్వ్యుడు తల్లి గర్భమందు నూఱు సంవత్సరములు ఉండి జన్మించినాడు

భక్తి నివేదన ఆగస్టు / 99 = 26 పుట

## 240. ప్రథమ సర్గము

వాల్మీకి రామాయణమున ప్రథమ శ్లోకాక్షరముల సంఖ్యల గూడి వంద అగుటయు, ప్రథమ సర్గమున వంద శ్లోకములే యుండుటయు బూర్వ పీఠికయందు జెప్పబడెను

శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, బాలకాండ - 133

మఱియు వాల్మీకి రామాయణము శతకోటి గ్రంథములు గలది. గ్రంథమనగా 32 అక్షరముల శ్లోకము

బాలకాండ - 108

## 241. మహతి

నారదుని వీణపేరు మహతి యీ మహతి యను వీణకు నూఱు తంతులు గలవు

శబ్ద రత్నాకరము - 852

## 242. వసిష్ఠ మహర్షి

శ్లో॥ మహర్షిర్యో వసిష్ఠస్తు యః పితుర్నః పురోహితః।
ఆహ్నా పుత్రశతం జజ్ఞే తదైవాస్య పునర్హతమ్॥

*(సీతాపహరణానంతరము లక్ష్మణుడు రామునితో నిట్లు చెప్పెను)*

*మన తండ్రియొక్క పురోహితుడగు వసిష్ఠ మహర్షికి ఒకే దినమున నూర్గురు పుత్రులు కలిగిరి మరల ఒకే దినమున వారందరు చంపబడిరి*

రామాయణ రత్నాకరము - అరణ్యకాండ - 617 వరుస నంబరు 238 చూడుడు

## 243. నూఱు అశ్వమేధ యజ్ఞములు

*శ్రీరాముడు రాజ్యమును పొంది పదునొకండు వేల సంవత్సరములు దానిని పాలించెను. మఱియు నూఱు అశ్వమేధ యజ్ఞములను ఆచరించెను.*

రామాయణరత్నాకరము, యుద్ధకాండము - 787

## 244. "ఏతి జీవనమానన్దో నరం వర్ష శతాదపి"

*"బ్రతికి యున్నచో నూఱు వత్సరములైన పిదప కూడ మనుజునకు ఆనందము లభించును" అను ఆర్యోక్తి నిజమని నేడు నాకు తెలియుచున్నది - అని భరతుడు తన ఆనాందాను భవమును వ్యక్తమొనర్చెను* రామాయణ రత్నాకరము - 344

## 245. దేవేంద్రుడు

"శతం క్రతూనామాహృత్య దేవరాట్ త్రిదివం గతః"

*దేవరాజగు ఇంద్రుడు నూఱు యజ్ఞముల నాచరించి స్వర్గలోకమును బొందెను*

రామాయణరత్నాకరము - అయోధ్యకాండ - 570

## 246. మణిమాల

*సరళహృదయుడు మితభాషి, మాహితుడు, సన్నిహితుడు ప్రౌఢకవి శ్రీ బండ్లమూడి సత్యనారాయణగారి మణిమాల (ఆంధ్రీకృత పద్య సుభాషితములు) నుండి ఓ ఆటవెలది*

వంద కాసులున్న వాడు సంపన్నుడు
వందయూళులున్నవాడు రేడు
వంద వాజులున్నవాడు మహారాజు
వంద పద్యమెరుగువాడు బుధుడు

మణిమాల - 19

## 247. శతమానం భవతి

శతమానం భవతి
శతాయుః పురుషః శతేంద్రియ
ఆయు ష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి

*పురుషుడు నూటికి నూరేండ్లు జీవిస్తాడు వయః ప్రభావము, ఇంద్రియములయందు కాక ఆయువునందు మాత్రమే యుంటుంది*

100వ సంఖ్య వివరణ సంపూర్ణము
ఓం

# 101వ సంఖ్య

## 248. నూటొక్క నాడులు

*శరీరమందనేక నాడులు కలవు అందు హృదయము (ఆత్మ)నకు సంబంధించినవి నూటొక్క నాడులు* 1983 డైరీ - 204

## 249. నూటొక్క పుత్రులు

*గాధికి అగ్నితేజము వంటి తేజస్సు గల విశ్వామిత్రుడు పుత్రుడై జన్మించి తనతపో బలమున రాజ ధర్మములను విడిచిపెట్టి బ్రహ్మర్షియై నూటొక్క పుత్రులను కనెను.*

బాగవతము -9వ స్కందం - 619

## 250. శ్రీరాముడు రావణుని శిరము 101 సార్లు ఖండించుట

"క్ష్మాతల భర్త నూఱు నొకమాఱునుద్రుంచె సురారి మూర్ధముల్"

*శ్రీరాముడు రావణుని శిరమును ఖండించగా మరల మొలచుచుండెను ఈ విధముగా నూటొక్క మార్లు ఖండించెను అప్పుడు చింతించుచున్న శ్రీరామునితో దేవేంద్రుని రధసారథి మాతలి యీ విధముగా గుర్తు చేసెను రామచంద్రా! శీఘ్రముగా వీని వధార్థమై బ్రహ్మాస్త్రము ప్రయోగించుము - దేవతలు యీతని నాశము కొరకై నిర్ణయించిన సమయము ఆసన్నమైనది అంత క్రోధారుణనేత్రుడై రాముడు బ్రహ్మాస్త్రమును వేసి రావణుని నిర్జీవుని చేసెను*

శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము, యుద్ధకాండ - 2466వ పద్యం - 1073 పుట

## 251. నూటొక్క వంశములు

*శ్రీకృష్ణునకు రుక్మిణీదేవి వలన ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సుదేష్ణుడు, సుచారువు,*

*చారుదేహుడు, చారుగుప్తుడు, చారుచంద్రుడు, విచారువు, చారువు నను పది మంది పుత్రులు గలిగిరి ఇట్లే సత్యభామ, జాంబవతి, కాళిందీ, నాగ్నజితి, మిత్ర విందా, భద్ర, లక్షణలకు వేర్వేరుగా పదుగురేసి భద్రమూర్తులైన కుమారులుదయించిరి ఇట్లే పదారువేల సతులందును ఒక్కొక్క తెకు పదిమంది పుత్రులు కలిగిరి పిల్లచెర కీనినట్లా పుత్రులకు పౌత్రులును కలిగి శ్రీకృష్ణుని కుటుంబము తామర తంపరయై వర్ధిల్లెను. అతని బంధు వంశములు యాదవ వృష్ణి భోజఅంధకాది నామధేయములు కలిగి నూటొక్క వంశములైనవి ఆ వంశములలోని బాలురకు విద్యగరపుటకు మూడు కోట్ల ఎనుబది ఎనిమిది వేల నూఱుగురు గురువులుండిరన్న, ఆ బాలుర సంఖ్య యెంతయో ఊహింపవచ్చును వారిలో శ్రీకృష్ణుని పుత్రుడైన ప్రద్యుమ్నునకు రుక్మి కుమార్తెయం దనిరుద్ధుడను పుత్రుడు కలిగెను*

బాగవతము - దశమస్కంధము - ఉత్తర భాగము - 189

101వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

# 102వ సంఖ్య

## 252. ధృతరాష్ట్రుని సంతానము

*గాంధారీదేవికి వందమంది కుమారులు, మరియు ఒక కుమార్తె దుశ్శల జన్మించిరి ధృతరాష్ట్రునకు వైశ్య స్త్రీ వలన యుయుత్సువు అను కుమారుడు గలడు ధృతరాష్ట్రుని సంతానము 102 మంది కురుక్షేత్రములో యుద్ధము ప్రారంభించుటకు పూర్వము ధర్మరాజు సేనామధ్యమమున నిలిచి ఎవ్వరైననూ నాకు సాయము చేయవచ్చుచో వారిని నేను స్వీకరింతునని ఎలుగెత్తి ముక్త కంఠమున బిలువ కౌరవసేననుండి 'యుయుత్సుడు' పాండవులవైపుకు మరలుట జరిగినది*

శ్రీ మహాబారత సారోద్ధారము, ప్రథమభాగము - 189

102వ సంఖ్య వివరణ సంపూర్ణము

ఓం

## 103, 104, 105, 106, 107 సంఖ్యల విషయసేకరణ చేయలేదు

# 108వ సంఖ్య

## 253. ప్రాణప్రతిష్ఠ

*దేవాలయాలలో విగ్రహ ప్రతిష్ఠ చేయునప్పుడు, ఆగమశాస్త్ర మంత్రాలతో పాటు "ప్రాణస్య శివం ప్రాణేశ స్వాహా" అని 108 సార్లు వల్లించి ప్రాణప్రతిష్ఠ చేస్తారు*

అప్పుడు ఆ విగ్రహమునకు ప్రాణశక్తి వస్తుందని పెద్దలంటారు

## 254. 27 నక్షత్రములకు 108 భాగములు (పాదములు)

గ్రహములు సంచరించుచున్న మార్గమును మన పెద్దలు జ్యోతిశ్చక్రముగా ఊహ చేసి, దానిని 12 భాగములుగా (రాసులు) భాగించినారు ఒక్కొక్క భాగములో నున్న నక్షత్రములు రాసులకు ఒక్కొక్క పేరు పెట్టినారు నక్షత్రములు మొత్తం 27. ఒక్కొక్క నక్షత్రమునకు 4 భాగములు (పాదములు) ఊహించి అటువంటి నక్షత్ర బాగములను 9ని ఒక రాశిగా నిర్ణయించినారు వాని రూపములను ఊహించి ఆ ప్రకారము రకరకముల పేర్లు పెట్టినారు ఒక్కొక్క నక్షత్రమునకు 4 భాగముల వంతున 27 నక్షత్రములకు 108 భాగములు (పాదములు) అయినవి.

## 255. ఉపనిషత్తులు

మొత్తము ఉపనిషత్తులు 1180లో 108 ముఖ్యము యిందులో 12 ముఖ్యము అవి 1 ఈశావాస్య, 2 కేన, 3 కఠ, 4 ప్రశ్న, 5. ముండక, 6 మాండూక్య, 7 తైత్తరీయం, 8 ఐతరేయోపనిషత్తు, 9 ఛాందోగ్య, 10 బృహదారణ్యక, 11 శ్వేతాశ్వతర, 12. కౌషీతకి వీటికి శంకరాచార్యులవారు భాష్యం వ్రాసారు అని సాధన రహస్యం 210వ పేజీలో వ్రాయబడింది

ఉపనిషత్తుల గురించి "ఉపనిషత్సార రత్నావళిలో యిలా వుంది శ్రుతి॥ స్మృతి - ర్మమైవాజ్ఞా = వేదములు నా ఆజ్ఞా వాక్యములు ఆ వేదములే శ్రుతులనియు చెప్పబడును - అందులో ఋగ్వేదము 21 శాఖలుగాను, యజుర్వేదము 109 శాఖలుగాను, సామవేదము 1000 శాఖలుగాను, అధర్వణవేదము 50 శాఖలుగాను ఉండును మొత్తం 1180 శాఖలు అందు ఒక్కొక్క శాఖయందును ఒక్కొక్క ఉపనిషత్తు గలదు వానియందు ముఖ్యముగా 108 ఉపనిషత్తులు ముఖ్యములు యిందులో (1) 1 ఐతరేయ, 2 కౌషీతకీ, 3. నాదబిందు, 4. ఆత్మప్రబోధ, 5 నిర్వాణ, 6. ముద్గల, 7. అక్షమాలికా, 8 త్రిపురాసార, 9. సౌభాగ్య, 10. బహ్వృచలు అని ఋగ్వేదంబున పది ఉపనిషత్తులు ముఖ్యంబులు

(2). 1. ఈశావాస్య, 2. బృహదారణ్యా, 3. జాబాల, 4. హంస, 5 పరమహంస, 6 సుబాల, 7. మంత్రిక, 8. నిరాలంబి, 9. త్రిశిఖీ బ్రాహ్మణ, 10 మండలబ్రాహ్మణ, 11. అద్వయతారక, 12 పైంగల, 13. భిక్షుక, 14 తురీయాతీత, 15 అధ్యాత్మ, 16 తారాసార, 17.యాజ్ఞవల్క్య, 18 శాట్యాయనీ, 19 ముక్తికోపనిషత్తులు 19 దిన్ని శుక్ల యజుర్వేదంబున ముఖ్యంబులు

(3) 1 కఠవల్లీ, 2 తైత్తరీయ, 3 బ్రహ్మ, 4 కైవల్య, 5 శ్వేతాశ్వతర, 6 గర్భ, 7 నారాయణ, 8 అమృతబిందు, 9. అమృతనాద, 10 కాలాగ్నిరుద్ర, 11 క్షురికా, 12. సర్వసార, 13. శుకరహస్య, 14 తేజోబిందు, 15. ధ్యానబిందు,

16 బ్రహ్మవిద్యా, 17. యోగతత్త్వ, 18. దక్షిణామూర్తి, 19 స్కంద, 20. శారీరక, 21. యోగ శిఖా, 22. ఏకాక్షర, 23 అక్షి, 24 అవధూత, 25 కఠ, 26. రుద్రహృదయ, 27. యోగకుండలినీ, 28 పంచబ్రహ్మ, 29. ప్రాణాగ్నిహోత్ర, 30. వరాహ, 31 కలి సంతరణ, 32. సరస్వతీ రహస్యములనెడి 32 ఉపనిషత్తులు కృష్ణ యజుర్వేదంబున ముఖ్యంబులు

(4). 1. కేన, 2 ఛాందోగ్య, 3 అరుణి, 4. మైత్రాయణీ, 5 మైత్రేయీ, 6 వజ్రసూచీ, 7. యోగచూడామణి, 8. వాసుదేవ, 9. సన్యాస, 10 అవ్యక్త, 11. కుండికా, 12. సావిత్రి, 13. జాబాలీ, 14. దర్శన, 15. దరుద్ర (ద్రాక్ష ) జాబాలోపనిషత్తు, 16. మహోపనిషత్తులు 16న్ను సామవేదము నందు ముఖ్యంబులు.

(5) 1. ప్రశ్న, 2. ముండక, 3. మాండూక్య, 4 అభిర్వశిర, 5. అధర్వశిఖా, 6 బృహజ్జాబాల, 7 నృసింహతాపినీ, 8. నారద పరివ్రాజక, 9. సీతా, 10 శరభ, 11. త్రిపాద్విభూతి మహానారాయణ, 12. రామరహస్య, 13. రామతాపినీ, 14. శాండిల్య, 15 పరమహంస పరివ్రాజక, 16. అన్నపూర్ణ, 17. సూర్య, 18. ఆత్మ, 19 పాశుపత, 20 పరబ్రహ్మ, 21. త్రిపురాతపన, 22 దేవీ, 23. భావన, 24 భస్మజాబాల, 25 గణపతి, 26. మహావాక్య, 27. గోపాల తాపన, 28. కృష్ణ, 29. హయగ్రీవ, 30. దత్తాత్రేయ, 31 గారుడములని 31 ఉపనిషత్తులు అధర్వణ వేదమునందు ముఖ్యములు

వీనిని ఒకటియైనను గురుముఖంబున పరమభక్తితో పఠించినవాడు సాయుజ్య పదవిని బొందును

ఇందులో మాండూక్యము మాత్రము గురు ముఖంబున తాత్పర్యముతోడ జది విని వాడు అడ్డి లేక నిజమోక్షముంజెందును

ముక్తికోపనిషత్తు రీతిగా నువ్వులయందు నూనె వుండునట్లు, వేదములయందు కడపట జ్ఞానకాండంబున బ్రహ్మజ్ఞానమును దృఢముగా బోధించు వాక్యములే వేదాంతములనియు ఉపనిషత్తులని చెప్పబడును.

సంస్కృత భాషయందు (షదల్) అను ధాతువునుండి ఉపనిషత్తు అనెడి శబ్దము పుట్టెను. (షదల్) అనెడి సంస్కృత ధాతువునకు నాశము చేయుట, హింసించుట, పోవుట, ముగియుట అని అర్థము. ఉపనిషత్తు అను శబ్దమునకు అజ్ఞాన బీజమగు సంసార వృక్షమును నిర్మూలముగా ఖండించి, బ్రహ్మలక్షణమును, తదైక్య జ్ఞానమున్ను, బోధించి, జనన- మరణములు లేక జేయునదని వ్యుత్పత్తి అర్థము

శ్లో ॥ ఉపనీయ మహాత్మానాం - బ్రహ్మోపాస్తి - ద్వయం తతః -
నిహంత్య విద్యాం - తజ్జాంచ - తస్మా - దుపనిషన్మతమ్ ॥

అనెడి ప్రమాణ రీతిగా బ్రహ్మమిట్టిదని తెలియపరచి అజ్ఞానమును పారద్రోలి బ్రహ్మైక్యమును బోధించునదే ఉపనిషత్తనబడును ఉపనిషత్సార రత్నావళి

# సింహావలోకనం

మొత్తము 1180 శాఖలలో 108 ఉపనిషత్తులు ముఖ్యమని మన పూర్వీకులు (ఋషులు) చెప్పారు ఆ 108

| | | | | |
|---|---|---|---|---|
| ఋగ్వేదంబున | - | 10 | - | ముఖ్యములు |
| శుక్లయజుర్వేదంబున | - | 19 | - | ముఖ్యములు |
| కృష్ణయజుర్వేదంబున | - | 32 | - | ముఖ్యములు |
| సామవేదంబున | - | 16 | - | ముఖ్యములు |
| అధర్వణ వేదంబున | - | 31 | - | ముఖ్యములు |
| మొత్తము | | 108 | | |

యిందులో 10 ముఖ్యమన్నారు ఈ పదిలో మాండూక్యోపనిషత్తు ముఖ్యమన్నారు

## 108 ఉపనిషత్తుల నామములు

1 ఈశావాస్యోపనిషత్తు,
2 కేనోపనిషత్తు,
3 కఠోపనిషత్తు,
4 ప్రశ్నోపనిషత్తు,
5 ముండకోపనిషత్తు,
6. మాండూక్యోపనిషత్తు,
7. తైత్తరీయోపనిషత్తు,
8. ఐతరేయోపనిషత్తు,
9. ఛాందోగ్యోపనిషత్తు,
10. బృహదారణ్యకోపనిషత్తు,
11 బ్రహ్మోపనిషత్తు,
12. కైవల్యోపనిషత్తు,
13. జాబాలోపనిషత్తు,
14. శ్వేతాశ్వతరోపనిషత్తు,
15 హంసోపనిషత్తు,
16. అరుణికోపనిషత్తు,
17 గర్భోపనిషత్తు,
18. నారాయణోపనిషత్తు,
19 పరమహంసోపనిషత్తు,
20. అమృతబిందూపనిషత్తు,
21 అమృతనాదోపనిషత్తు,
22. అధర్వశిరోపనిషత్తు,
23 అధర్వ శిఖోపనిషత్తు,
24. మైత్రాయణ్యుపనిషత్తు,
25. కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తు,
26. బృహజ్జాబాలోపనిషత్తు,
27 నృసింహతాపిన్యుపనిషత్తు,
28 కాలాగ్ని రుద్రోపనిషత్తు,
29. మైత్రేయోపనిషత్తు,
30. సుబాలోపనిషత్తు,
31 క్షుతికోపనిషత్తు, (క్షురికో)
32. మంత్రికోపనిషత్తు,
33 సర్వసారోపనిషత్తు,
34 నిరాలంబోపనిషత్తు,
35 శుకరహస్యోపనిషత్తు,
36 వజ్రసూచ్యోపనిషత్తు,
37 తేజోబిందూపనిషత్తు,
38. నాదబిందూపనిషత్తు,
39 ధ్యానబిందూపనిషత్తు,
40 బ్రహ్మవిద్యోపనిషత్తు,

41 యోగతత్త్వోపనిషత్తు,
42 ఆత్మ(ప్ర)బోధోపనిషత్తు,
43 నారదపరివ్రాజకోపనిషత్తు,
44 త్రిశిఖీ (ఖి) బ్రాహ్మణోపనిషత్తు,
45 సీతోపనిషత్తు,
46. యోగచూడామణ్యుపనిషత్తు,
47 నిర్వాణోపనిషత్తు,
48. మండలబ్రాహ్మణోపనిషత్తు,
49 దక్షిణామూర్త్యుపనిషత్తు,
50. శరభోపనిషత్తు,
51 స్కందోపనిషత్తు,
52 త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్తు,
53. అద్వయతారకోపనిషత్తు,
54. రామరహస్యోపనిషత్తు,
55 రామతాపిన్యుపనిషత్తు,
56 వాసుదేవోపనిషత్తు,
57 ముద్గలోపనిషత్తు,
58 శాండిల్యోపనిషత్తు,
59 పైంగలోపనిషత్తు,
60 భిక్షుకోపనిషత్తు,
61. మహోపనిషత్తు,
62 శారీరకో (శారికో)పనిషత్తు,
63 యోగశిఖోపనిషత్తు,
64 తురీయాతీతావధూతోపనిషత్తు,
65 సన్యాసోపనిషత్తు,
66 పరమహంసపరివ్రాజకోపనిషత్తు,
67. అక్షమాలికోపనిషత్తు,
68 అవ్యక్తోపనిషత్తు,
69 ఏకాక్షరోపనిషత్తు,
70. అన్నపూర్ణోపనిషత్తు,
71 సూర్యోపనిషత్తు,
72 అక్ష్యుపనిషత్తు,
73 అధ్యాత్మోపనిషత్తు,
74. కుండికోపనిషత్తు,
75 సావిత్ర్యుపనిషత్తు,
76. ఆత్మోపనిషత్తు,
77 పాశుపత బ్రహ్మోపనిషత్తు,
78 పరబ్రహ్మోపనిషత్తు,
79. అవధూతోపనిషత్తు,
80 త్రిపురా తాపిన్యుపనిషత్తు,
81 దేవ్యుపనిషత్తు,
82. త్రిపురతారోపనిషత్తు,
83 కరవల్ల్యుపనిషత్తు,
84 భావనోపనిషత్తు,
85 రుద్రహృదయోపనిషత్తు,
86 యోగకుండలిన్యుపనిషత్తు,
87 భస్మజాలోపనిషత్తు,
88 దరుద్ర (ద్రాక్ష) జాబాలోపనిషత్తు,
89 గణపత్యుపనిషత్తు,
90. దర్శనోపనిషత్తు,
91 తారాసారోపనిషత్తు, (తార)
92 మహావాక్యోపనిషత్తు,
93. పంచబ్రహ్మోపనిషత్తు,
94 ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు,
95. గోపాల తాపిన్యుపనిషత్తు,
96 కృష్ణోపనిషత్తు,
97. యాజ్ఞవల్క్యోపనిషత్తు,
98 వరాహోపనిషత్తు,
99. శాట్యాయనోపనిషత్తు,
100. హయగ్రీవోపనిషత్తు,
101 దత్తాత్రేయోపనిషత్తు,
102. గారుడోపనిషత్తు,
103 కలిసంతరణోపనిషత్తు,
104. జాబాల్యుపనిషత్తు,

105. సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు, 106. సరస్వతీ రహస్యోపనిషత్తు,
107. బహ్వృచోపనిషత్తు, 108. ముక్తికోపనిషత్తు, ఉపనిషత్సార రత్నావళి

# 256. దేవీ స్థానములు నూటయెనిమిది

*మా బాల్యమిత్రుడు డా॥ శివలెంక ప్రకాశరావు, ఎంఎ పిహెచ్‌డి రీడర్, ఆంధ్రశాఖ, కాకినాడ నివాసి వ్రాసిన "దేవీభాగవతం" రెండవ భాగము నుండి దేవీస్థానములు 108 పరమ సిద్ధినీ విభూతినీ కోరువారు ఏప పీఠాలలో ఏప పేర్లతో దేవినుపాసించి ధ్యానిస్తారో చెపుతాను*

1. శ్రీ గౌరీముఖం పడిన చోట కాశి. అచటిదేవిని విశాలాక్షి అంటారు, 2 నైమిశారణ్యంలో దేవి లింగధారిణి, 3. ప్రయాగలో లలిత, 4. గంధమాదనంలో కాముకి, 5. మానస సరోవరమున కుముద, 6 దక్షిణాదిన విశ్వకామ, 7 గోమంతమున గోమతి 8. మందరంలో కామచారిణి, 9 చైత్రరథంలో మదోత్కట, 10 హస్తినాపురంలో జయంతి, 11 కన్యాకుబ్జమున గౌరి, 12 మలయాచలంలో రంభ, 13 ఏకామ్రపీఠంలో కీర్తి, 14. విశ్వపీఠమున విశ్వేశ్వరియు, 15 పుష్కరమున పురుహూత, 16 కేదారమున సన్మార్గదాయిని, 17 హిమవంతంలో మంద, 18 గోకర్ణంలో భద్రకర్ణిక, 19 స్థానేశ్వరంలో భవాని, 20. బిల్వకంలో బిల్వపత్రిక, 21 శ్రీశైలంలో మాధవి, 22 భద్రేశ్వరమున భద్ర, 23. వరాహశైలంలో జయ, 24 కమలాలయంలో కమల, 25 రుద్రకోటిలో రుద్రాణి, 26 కాళంజరగిరిమీద కాళి, 27 శాలగ్రామాన మహాదేవి, 28 శివలింగాన జలప్రియ, 29 మహాలింగాన కపిల, 30 మాకోటంలో ముకుటేశ్వరి, 31 మాయాపురియందు కుమారి, 32. సంతాన పీఠంలో లలితాంబిక, 33 గయలో మంగళ, 34. పురుషోత్తమ (జగన్నాథం)లో విమల, 35 హిరణ్యాక్షంలో మహోత్పల, 36 విపాశలో అమోఘాక్షి, 37 పుండ్రవరంలో పాటలి, 38 సుపార్శ్వమున నారాయణి, 39 త్రికూటంలో రుద్రసుందరి, 40 విపులంలో విపుల, 41 మలయాచలంలో కళ్యాణి, 42 సహ్యగిరిపై ఏకవీర, 43 హరిశ్చంద్ర పీఠములో చంద్రిక, 44. రామతీర్థంలో రమణి, 45 యమునలో మృగావతి, 46 కోట తీర్థంలో కోటలియు, 47 మాధవీవనమున సుగంధ, 48. గోదావరిలో త్రిసంధ్య, 49. గంగాతీరాన (హరిద్వారము) రతిప్రియ, 50. శివగుండంలో శుభానంద, 51. దేవికా నదీ తటాన నందిని, 52 ద్వారకలో రుక్మిణి, 53. బృందావనంలో రాధ, 54. మథురలో దేవకి, 55 పాతాళంలో పరమేశ్వరి, 56. చిత్రకూటంలో సీత, 57. వింధ్యాద్రిపై వింధ్యవాసిని, 58 కరవీర (కొల్హాపురం)లో మహాలక్ష్మి, 59 వినాయకంలో ఉమాదేవి 60. వైద్యనాథంలో ఆరోగ్య, 61. మహాకాళంలో మహేశ్వరి, 62. ఉష్ణతీర్థంలో అభయ, 63 వింధ్య గిరిపై నితంబ, 64. మాండవ్యంలో మాండవి, 65. మహేశ్వరీపురంలో స్వాహా, 66. భగండాన ప్రచండ, 67. అమర కంటకంలో

చండిక, 68. సోమేశ్వరంలో వరారోహ, 69. ప్రభాసంలో పుష్కరావతి, 70. సరస్వతిలో దేవమాత, 71. సాగరతటంలో పారావార, 72. మహాలయంలో మహాభాగ, 73 పయోష్ణిలో పింగళేశ్వరి, 74 కృతశౌచంలో సింహిక, 75. కార్తికంలో అంతిశాంకరి (యశస్కరి), 76. ఉత్పలావర్తంలో లోల, 77 శోణసంగాన సుభద్ర, 78 సిద్ధవనంలో లక్ష్మీమాత, 79. భరతాశ్రమంలో అనంగవతియు, 80. జాలంధరంలో విశ్వముఖి, 81. కిష్కింధ పర్వతమున తార, 82. దేవదారు వనమున పుష్టి, 83 కాశ్మీరమండలమున మేధ, 84. హిమవంతమున ఉమాదేవి (భీమాదేవియని పారాంతరము), 85. విశ్వేశ్వరీ క్షేత్రంలో తుష్టి, 86. కపాలమోచనంలో శుద్ధి, 87. కాయావరోహణంలో శ్రీమాత (మాయ), 88. శంఖోద్ధారంలో ధరయు 89 పిండారకమున ధృతి (భృతి)యు, 90. చం - పందు కళ, 91 అచ్ఛోదమున శూలధారిణి, 92 వేణలో అమృత, 93. బదరివనములో ఊర్వశి, 94 ఉత్తర కురుదేశములందు ఔషధియు, 95. కుశద్వీపాన కుశోదక, 96. హిమకూటంలో మన్మథయు, 97. కుముదవనంలో సత్యవాదిని. 98 అశ్వత్థంలో వందనీయ, 99. వైశ్రవణాలయంలో నిధి, 100. వేదవదనమున గాయత్రి, 101 శివసన్నిధిలో పార్వతి, 102 దేవ లోకంలో ఇంద్రాణి, 103. బ్రహ్మముఖంబున (బ్రహ్మంగమున, బ్రహ్మలోకమున) సరస్వతియు, 104. సూర్యబింబమున ప్రభ, 105 మాతృలోకమున (గణాలలో)వైష్ణవి అని శ్రీదేవికి క్షేత్రభేదంతో వ్యవహారం, 106 పతివ్రతలలో అరుంధతీదేవి, 107. రామలయందు (అందకత్తెలలో) తిలోత్తమ, 108 సర్వ శరీరధారుల (అందరి చిత్తాల)లో చిత్కలాశక్తిగా దేవి విలసిల్లుతోంది యివి మొత్తం నూట యెనిమిది శ్రీదేవి పీఠాలు శ్రీదేవి నామాలు నూటయెనిమిదిగా ప్రసిద్ధిగాంచాయి. దేవీ శరీరము నుండి ఏర్పడిన దేవీ పీఠాలు ఇవి ఎవడీ 108 దేవీ పీఠనామాలు స్మరిస్తాడో వింటాడో, చదువుతాడో, వ్రాస్తాడో వాడు సర్వపాప విముక్తుడై తుదకు దేవీసాలోక్య మందుతాడు

(మత్స్యపురాణము) దేవీభాగవతము - 62 2వ భాగము

## 257. శ్రీ లక్ష్మీ అష్టోత్తర శత నామావళి

1 ఓం ప్రకృత్యై నమః
2 ఓం వికృత్యై నమః
3. ఓం విద్యాయై నమః
4. ఓం సర్వభూతహితప్రదాయై నమః
5. ఓం శ్రద్ధాయై నమః
6 ఓం విభూత్యై నమః
7. ఓం సురభ్యై నమః

8 ఓం పరమాత్మికాయై నమః
9. ఓం వాచే నమః
10 ఓం పద్మాలయాయై నమః
11 ఓం పద్మాయై నమః
12. ఓం శుచయే నమః
13. ఓం స్వాహాయై నమః
14. ఓం స్వధాయై నమః
15. ఓం సుధాయై నమః
16 ఓం ధన్యాయై నమః
17. ఓం హిరణ్మయ్యై నమః
18. ఓం లక్ష్మ్యై నమః
19. ఓం నిత్యపుష్టాయై నమః
20. ఓం విభావర్యై నమః
21. ఓం అదిత్యై నమః
22 ఓం దిత్యై నమః
23 ఓం దీప్తాయై నమః
24. ఓం వసుధాయై నమః
25 ఓం వసుధారిణ్యై నమః
26 ఓం కమలాయై నమః
27 ఓం కాన్తాయై నమః
28. ఓం క్షమాయై నమః
29. ఓం క్షీరోద సంభవాయై నమః
30. ఓం అనుగ్రహపరాయై నమః
31 ఓం బుద్ధయే నమః
32 ఓం అనఘాయై నమః
33 ఓం హరివల్లభాయై నమః
34. ఓం అశోకాయై నమః
35 ఓం అమృతాయై నమః
36. ఓం దీప్తాయై నమః
37 ఓం లోకశోక వినాశిన్యై నమః
38. ఓం ధర్మనిలయాయై నమః
39. ఓం కరుణాయై నమః

40. ఓం లోకమాత్రే నమః
41 ఓం పద్మప్రియాయై నమః
42 ఓం పద్మహస్తాయై నమః
43 ఓం పద్మాక్ష్యై నమః
44 ఓం పద్మసుందర్యై నమః
45. ఓం పద్మోద్భవాయై నమః
46 ఓం పద్మముఖ్యై నమః
47 ఓం పద్మనాభప్రియాయై నమః
48 ఓం రమాయై నమః
49 ఓం పద్మమాలాధరయై నమః
50 ఓం దేవ్యై నమః
51 ఓం పద్మిన్యై నమః
52. ఓం పద్మగంధిన్యై నమః
53. ఓం పుణ్యగంధాయై నమః
54. ఓం సుప్రసన్నాయై నమః
55. ఓం ప్రసాదాభిముఖ్యై నమః
56 ఓం ప్రభాయై నమః
57 ఓం చంద్రవదనాయై నమః
58 ఓం చంద్రాయై నమః
59 ఓం చంద్రసహోదర్యై నమః
60 ఓం చతుర్భుజాయై నమః
61 ఓం చంద్రరూపాయై నమః
62 ఓం ఇందిరాయై నమః
63 ఓం ఇందుశీతలాయై నమః
64. ఓం ఆహ్లోదజనన్యై నమః
65. ఓం పుష్ట్యై నమః
66 ఓం శివాయై నమః
67 ఓం శివకర్యై నమః
68 ఓం సత్యై నమః
69 ఓం విమలాయై నమః
70 ఓం విశ్వజనన్యై నమః
71 ఓం తుష్ట్యై నమః

72 ఓం దారిద్ర్యనాశిన్యై నమః
73 ఓం ప్రీతి పుష్కరిణ్యై నమః
74. ఓం శాంతాయై నమః
75 ఓం శుక్లమాల్యాంబరాయై నమః
76. ఓం శ్రియై నమః
77 ఓం భాస్కర్యై నమః
78. ఓం బిల్వనిలయాయై నమః
79. ఓం వరారోహాయై నమః
80 ఓం యశస్విన్యై నమః
81 ఓం వసుంధరాయై నమః
82. ఓం ఉదారాంగాయై నమః
83. ఓం హరిణ్యై నమః
84 ఓం హేమమాలిన్యై నమః
85. ఓం ధనధాన్యకర్యై నమః
86 ఓం సిద్దయే నమః
87 ఓం స్త్రైణసౌమ్యాయై నమః
88 ఓం శుభప్రదాయై నమః
89 ఓం నృపవేశ్మగతానందాయై నమః
90 ఓం వరలక్ష్మై నమః
91 ఓం వసుప్రదాయై నమః
92. ఓం శుభాయై నమః
93 ఓం హిరణ్యప్రాకారాయై నమః
94 ఓం సముద్రతనయాయై నమః
95 ఓం జయాయై నమః
96. ఓం మంగళాదేవ్యై నమః
97. ఓం విష్ణువక్షస్స్థల స్థితాయై నమః
98. ఓం విష్ణుపత్న్యై నమః
99 ఓం ప్రసన్నాక్ష్యై నమః
100 ఓం నారాయణ సమా శ్రితాయై నమః
101. ఓం దారిద్ర్య ధ్వంసిన్యై నమః
102 ఓం దేవ్యై నమః
103 ఓం సర్వోపద్రవ వారిణ్యై నమః

104 ఓం నవదుర్గాయై నమః
105 ఓం మహాకాళ్యై నమః
106 ఓం బ్రహ్మవిష్ణు శివాత్మికాయై నమః
107. ఓం త్రికాలజ్ఞాన సంపన్నాయై నమః
108 ఓం భువనేశ్వర్యై నమః

శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామావళి సంపూర్ణము

## 258. శ్రీకృష్ణ పరమాత్మ ధ్యానము

1. పరమేశ్వరా!, 2 పరమపావనా!, 3. పరమ కల్యాణ గుణాభరణా!, 4 పాపహరణా!, 5. పుండరీకవరదా!, 6. పురాణ పురుషోత్తమా!, 7. భక్తవత్సలా!, 8 భవబంధవిమోచనా!, 9 పుండరీకనయనా!, 10 భుజగేంద్రశయనా!, 11. కరుణాకరా!, 12. కామితార్థప్రదా(తా)!, 13 నందకుమారా!, 14. నవనీతచోరా!, 15. ఇందిరా రమణా!, 16 ఇభరాజగమనా!, 17 సుందరాకారా!, 18. మంద రోద్ధారా!,19 అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకా!, 20 ఆదిమధ్యాంతరహితా!, 21 అప్రమేయా!, 22. ఆనందరూపా!, 23 అనాధరక్షకా!, 24 ఆపద్బాంధవా!, 25. కవిలోకరంజనా!, 26 కాళీయ గర్వభంజనా!, 27. సదానందా!, 28 సచ్చిదానందా!, 29 ముకుందా!, 30. గోవిందా!, 31. గజరాజవరదా!, 32. గరుడధ్వజా!, 33. దానవమర్దనా!, 34. జనార్ధనా!, 35. ధర్మవర్ధనా!, 36 దీనజనశరణ్యా!, 37. గోవర్ధనోద్ధరణా!, 38. గోపికావస్త్రాపహరణా!, 39. మధుసూదనా!, 40. మునిజనవందితా!, 41. ముచుకుందనందితా!, 42. ముక్తిప్రదాయకా!, 43. మురళీగానవినోదా!, 44 కనకమయవసనా!, 45 కంసవిధ్వంసనా!, 46. రాధామనోహరా!, 47 రాకేందువదనా!, 48 నీలమేఘశ్యామా!, 49 నిర్మలనామా!, 50 సర్వేశ్వరా!, 51 సర్వతోముఖా!, 52 సర్వలోక పూజితా!, 53. సత్యసంకల్పా!, 54 సత్యపరాయణా!, 55 సత్యజనకా!, 56. సత్యనిలయా!, 57 సత్యాశ్రయా!, 58 సత్యనేత్రా!, 59 సత్యసంధా!, 60 సజ్జనప్రియా!, 61. శాంతస్వభావా!, 62 అధోక్షజ!, 63 అర్జున సఖా!,64 అభిమాన రహితా!, 65. పాండవపక్షా!, 66 ద్రౌపదీ మానరక్షకా!, 67 దేవకీనందనా!, 68. యశోదా నంద వర్ధనా!, 69 అనంతా!, 70 అచ్యుతా!, 71 అవాఙ్మానసగోచరా!, 72 అమోఘశాసనా!, 73. నరకాంతకా!, 74 నరవరేశ్వరా!, 75. నిర్గుణా!, 76 నిష్కళంకా!, 77. నిరుపద్రవా!, 78. నిరంజనా!, 79. నిరింద్రియా!, 80 నిర్వికల్పా!, 81. నిరాకారా!, 82. నిర్వికారా!, 83 నారాయణ!, 84. నారసింహా!, 85. దామోదరా!, 86 వాసుదేవా!, 87. వామన!, 88 వైకుంఠవాసా!, 89. విశ్వంభర!, 90 పరమపురుషా!, 91 పరంజ్యోతి స్వరూపా!, 92 పరంధామా!,

93. పురుషోత్తమా!, 94. పుణ్యస్వరూపా!, 95. పుణ్యనిలయా!, 96 పుణ్యభావనా!, 97 దేవదేవోత్తమా!, 98 దేవతా సార్వభౌమా!, 99 స్వయం ప్రకాశా!, 100. పరతత్వదీపా!, 101. పరిపూర్ణా!, 102. జ్ఞానప్రదా!, 103 యోగీశ్వరేశ్వరా!, 104 కుచేలవరదా!, 105 గుప్త ప్రవర్తనా!, 106 విశ్వరూపా!, 107 విశ్వనేత్రా!, 108. విమలచరిత్రా!, హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం, పాహిమాం పాహి పాహి పాహి

అని మిక్కిలి దీనతతో స్తోత్రము చేయుచుండిన శ్రీకృష్ణపరమాత్మ తప్పక దర్శనమీయగలడు

శ్రీకృష్ణ పరమాత్మ ధ్యానము సంపూర్ణము

# 259. అమూల్యవాక్కులు

1 తత్వశాస్త్రములతోపాటు, సకల ధర్మశాస్త్రములు చదివిన పండితుడైనను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది సకలదేవతలను పూజించినప్పటికిన్ని, దానధర్మములయందు ధర్మాత్ముడైనను, ఆత్మజ్ఞానము లేనియెడల పైజెప్పినవన్నియు నిష్ప్రయోజనము

2. గురుకటాక్షములేక ఆత్మజ్ఞానము లభింపదు ఆత్మజ్ఞానము లేక ముక్తి లభింపదు

3 శరీరమిట్టిదని శరీరలక్షణము తెలియనియెడల ఆత్మ యిట్టిదని ఆత్మజ్ఞానము కలుగుజాలదు

4 స్థూల శరీరము, సూక్ష్మ శరీరము, కారణ శరీరమని మూడు విధములు పంచభూతములు 5, అహంకారము 1, బుద్ధి 1, మాయ 1, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియ ములు 5, మనస్సు 1, పంచతన్మాత్రలు 5, మొత్తం 24. వీనినే చతుర్వింశతి తత్త్వములందురు ఇదియే స్థూల శరీరము

పంచప్రాణములు 5, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనస్సు 1, బుద్ధి 1, యీ 17 తత్త్వములతో కూడినదే సూక్ష్మశరీరము ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములనెడు యీ మూడు కోశములుగూడి సూక్ష్మశరీరము లేక లింగశరీరమనబడును

జీవుడు తాను స్థూలశరీరముతో అనుభవించిన పుణ్యపాపకర్మలు, స్వర్గ, నరకలోకములలో సుఖదుఃఖములనుభవించునదే కారణశరీరము లేదా యాతనాశరీరమందురు.

24 తత్త్వములతో కూడియున్నది శరీరము 25వ తత్త్వమే ఆత్మ ఆత్మయనగా (దేహి) శరీరము, జీవుడు, బ్రహ్మము, బుద్ధి, మనస్సు, స్వభావము, ధైర్యము, ప్రయత్నము అని అర్థములున్నవి

జీవునిగూర్చి వాల్మీకి రామాయణము అరణ్యకాండలో యిలా వుంది

"వాలాగ్ర శతభాగస్తు కల్పితస్చే త్సహస్రధా
తస్య భాగాచ్చత తమాజీవ సూక్ష్మ ఉదాహృతః"

వెండ్రుకకొనను నూఱుభాగములు చేసి యందొకభాగమును వేయి భాగములు చేసి అయొకభాగమును నూఱు భాగములుగా విభజించితిమేని యెంతయుండునో జీవుడంతటివాడు

వడ్లగింజంతకాని యవధాన్యపు గింజంతగాని శ్యామాక ధాన్యమంతగాని శ్యామాకపు బియ్యపు గింజంతగాని సూక్ష్మమగువాడగు నంతరాత్మ (జీవుని)యందు హిరణ్మయ పురుషుడు పొగలేని జ్యోతిస్సుగానున్నాడు "ఆరాగ్ర మాత్రో హ్యవరోపి దృష్టః" జీవుడు ముల్లుకొనయంత సూక్ష్మముగ జూడబడినాడు ఆత్మసర్వవ్యాపియను వాదము నిరస్తము

ఈ శరీరమునందు ఆత్మ, తనకు శరీరములేక నాశరహితుడై వసించుచున్నాడు శ్రుతి॥ "ఆధాయ - మ శరీరో -మృతః" (బృహదారణ్యోపనిషత్తు) ఈ శరీరమునందుండు తనకు ఆత్మ నాశనము లేనివాడు, శరీరము లేనివాడు శ్రుతి"॥ అయమాత్మా బ్రహ్మ"॥ (బృహదారణ్యోపనిషత్తు) ఈ దేహమునందు వసించు ఈ ఆత్మయే పరబ్రహ్మము

కఠోపనిషత్తు : ఈ లోకమున చీమలకంటెను మిక్కిలి సూక్ష్మమైన జంతువులయొక్కయు, ఏనుగు వంటి లేక మహామేరు పర్వతము వంటి మిగులగొప్పజంతువులయొక్కయు శరీరములందు ఆత్మవసించుచుండును. ఈ లోకమున యీ శరీరమందుండు యీ ఆత్మయే అపరలోకమందలి పరబ్రహ్మముగా నున్నది ఆ పరలోకమునందలి పరబ్రహ్మమే యీ లోకమునందు యీ శరీరమునందు ఆత్మస్వరూపముగా నివసించియున్నది కాబట్టి ఆత్మవేఱు, పరబ్రహ్మము వేఱని భేదముగా దలంచువారు జనన మరణ దుఃఖసాగరమున మునిగి దుఃఖించుచుందురు ఒక్క ఆత్మయే అనేక దేహములందు వ్యాపించి అనేక ఆత్మలుగా దోచుచున్నాడు ఈ ప్రపంచంబున ముందు వెనుక కుడిదిక్కున యెడమ దిక్కున లోపల వెలుపల క్రిందమీద సర్వత్ర పరిపూర్ణముగా ఆత్మనిండియున్నాడు ఈ శరీరమునకే బాల్య యౌవన కౌమార వార్ధక్యాది అవస్థలు గలదుగాని, ఆత్మకు పై అవస్థలు లేవు భయనాశనములు లేనివాడు ఇతడే పరబ్రహ్మము చావు పుట్టుకలు లేని పరబ్రహ్మమగు యీ ఆత్మ ఒకరిచేత చంపబడడు తానున్ను ఒకరిని చంపడు ఎందువల్లననగా కాళ్ళు చేతులు మొదలగు అవయవములు లేనివాడు గనుక ఒకరిని చంపజాలడు రూపనామములు లేనివాడు గనుక తానున్ను ఒకరి చేత చంపబడడు, మూఢులు మాత్రము ఆత్మ చచ్చుచున్నాడనియు, పుట్టుచున్నాడనియు తలంతురు గీత 2/23 నుండి 25

'ఆత్మయొక్క పరిమాణం కేశాగ్రమంత అని వేదాలలో చెప్పబడింది తలవెంట్రుక యొక్క చివరి భాగములో పది వేలవ వంతు ఎంత పరిమాణం వుంటుందో '**ఆత్మ**' అంత పరిమాణంలో వుంటుందంటారు ఈ పరిమాణం ఊహించటం చాలా దుర్లభం ఎంత శక్తివంతమైన సూక్ష్మదర్శినిని ఉపయోగించినా చూడటం

సాధ్యం కాదు అని అనుపమాన ప్రసాదం చెబుతుంది 45వ పేజీలో

"తత్త్వమసి" అనగా జీవుడవగు నీవు ఆ పరబ్రహ్మమే అగుచున్నావని అర్థము.

దేహమిట్టిదనియు, దేహి యిట్టివాడనియు తెలియుటే సాంఖ్య విచారణ మన బడును "యద్దృశ్యం - తన్నశ్యం" నీ కంటికి కనబడు వస్తువులన్నియు రూపులేక నశించిపోవునట్టివే "దృశ్యం - సర్వమనాత్మేతి, దృగేవ పరమాత్మా - తదా" నీ కంటికి కనబడు వస్తువులన్నియు జడములుగాక, అసత్యములగుచున్నవి ఇన్నిటి నెరుగుచుండెడి సర్వసాక్షియగు నీవు ఒక్కడే ఎన్నటికిని నాశము లేని పరిపూర్ణ పరబ్రహ్మము నీకంటెను వేరుగా ఏమియునులేదు నీలో నిన్నుజూచి ఆనందిపుము యిదియే శరీర లక్షణము, ఆత్మతత్త్వము

ఆత్మ విచారము నెరుగని (సేయని) పామరజనుల దుఃఖములకు దేహమే మూలమవుతుంది. అహంకారము కారణముగా దేహమేనేను అను బుద్ధి కలుగుచున్నది అది సంసారమునకు మూలమగుచున్నది స్వర్గమునకేగి సుఖములను పొందుదును అని జీవుడు సంకల్పించుకొనుచు ఆనందముతో అచట గొప్ప సుఖమును చాలా కాలము అనుభవించి పుణ్యరాశి క్షీణించగానే కర్మచోదితుడై తాను కోరకయే క్రిందపడుచున్నాడు మొదట అతడు చంద్రమండలముపై పడును తరువాత చంద్రకిరణముల మూలమున పొగమంచులో కలిసి భూమి పైబడి ధాన్యాదులయందు చాలకాలము నిలిచి తరువాత నాల్గు విధములైన భోజ్యములుగా పురుషుని చేత భుజింపబడును. అంతట రేతస్సుగా మారి ఋతుకాలమున స్త్రీ గర్భమునందు ప్రవేశించును

5. 18 పురాణములలో పద్మపురాణము పెద్దది మార్కండేయ పురాణము చిన్నది.
6. దేవతలందరిలో వేద నిర్ణయం ప్రకారము అగ్ని చిన్నవాడు విష్ణువు అంద రికంటే పెద్దవాడు.
7 ప్రతిఫలాన్ని ఆశించని దానం, ప్రయోజనాన్నికై ఎదురుచూడని సేవ ఉత్తమము.
8. బూడిద గుమ్మడికాయను బుధవారంనాడు యింటి ముఖద్వారం వద్ద వ్రేలాడగట్టిన ఆ యింటివారికి నరఘోష వుండదు దృష్టిదోషం తగలదు. అదృష్టం కలిసివస్తుంది మంచిది పెద్దదైన కొబ్బరికాయను గురువారంనాడు యింటి ముఖద్వారం వద్ద వ్రేలాడగట్టిన, నరఘోష తగలదు అదృష్టం కలసివచ్చును
9 అప్పు బుధవారమున ఇవ్వరాదు ఇచ్చిన తిరిగిరాదు తిరిగి ఇవ్వమనిన విరోధమౌను
10. సంతతిలేనివాడు పరమ లోభిగానుండు తాను తినడు యితరులకు పెట్టడు దానమసలే చేయడు చచ్చిన కట్టుకుపోవునా?
11 భిక్షకుని రెండు మాటలు - దైవమిచ్చిన సొమ్మును దానము చేయకయే మావంటి జన్మమును తెచ్చుకొనకండి, దానము చేయుచు మీ వంటి జన్మమును తెచ్చుకొనుడి "దైవం మానుషరూపేణ" మనుష్యరూపంలో నున్న దైవానికి

దానం చేయండి, అదియు మనస్ఫూర్తిగ

12. నిత్యమూ పూజించు తులసి చెట్టునుండి దళములు కోయరాదు. పూజించని తులసిచెట్టునుండి దళములు కోయవచ్చును అదియును పురుషులే కోయవలయును స్త్రీలు కోయరాదు

13. దరిద్రునకు ఆకలధికము, ధనికునకు అజీర్తివ్యాధి

14 కోపము వచ్చినప్పుడు మాట్లాడకుండుట, లేక ఆ స్థలము నుండి వీడుట తక్షణ కర్తవ్యము అసలు కోపము మీద కోపము తెచ్చుకుంటే!

15. భోజనము చేయుటకు ముందు వెనుక పాదములు చేతులు కడుగుకొనవలయును

16. జపము చేసికొను మాలను మెడలో ధరించరాదు, మెడలో ధరించు మాలతో జపము చేయరాదు

17 నోటిమాట పొగడును నొసలు వెక్కిరించును

18. తల్లిగర్భంలో నున్న శిశువుకు 9వ మాసంలో తన పూర్వజన్మ తెలియును అంత తాను జన్మించిన తరువాత నీతిగా జీవించి పరమాత్మను తెలిసికొనవలెనని నిర్ణయించుకొనును కాని జన్మించిన తదుపరి 'కలినీళ్ళు' పడగా యీ విషయం మరచిపోవును

19 నీవలనే అందరినీ భావించు, అందరివంటి వాడవే నీవను కొనుము యజుర్వేదం 40వ అధ్యాయం, 6వ మంత్రము

20. అన్ని జీవులు ఒకప్పుడు పరమాత్మ నుండి వచ్చినవే ఈ జన్మలో భక్తి జ్ఞాన వైరాగ్యములతో దానధర్మములు చేయుచు తిరిగి పరమాత్మలో చేరుట మానవజీవిత పరమార్థము

21. ఉదయమే దైవమును స్మరించుచు కుడి నుండి లేచుట మంచిది

22 చమురు శిరస్సునకు వంటికి మర్దన చేసి స్నానము చేయుట మంచిది

23 యింటి యజమాని గృహమునకు దక్షిణదిశలో నున్న గదిలో తూర్పుదిక్కున శిరస్సునుంచి పరుండవలెను

24 నిద్రకోసం పరుండువాడు సంసారి నిద్రవచ్చినప్పుడు పరుండువాడు సన్యాసి

25 రాత్రి రాగిపాత్రలో నీరుపోసి తెల్లవారుఝామున త్రాగుట మంచిది.

26 పొన్నగంటి కూర, తోటకూర, క్యారెట్ కంటికి చాలా మంచిది

27 గాలి వెలుతురు రాని యింటికి వైద్యుడు వచ్చునని సామెత

28 తనమనస్సే తనకు శత్రువు తన మనస్సును ఎవరు జయిస్తారో వారు దేవతలకు కూడా ప్రభువు

29 ఆచమనము చేయునప్పుడు, తీర్థము తీసుకొనునప్పుడు, సంధ్యావందనమున సూర్యున కర్ఘ్యమిచ్చునప్పుడు జలము క్రిందపడరాదు

30. సంధ్యావందనములో ఉదయము గాయత్రిని, మధ్యాహ్నము సావిత్రిని, సాయంత్రము సరస్వతిని ధ్యానింతురు. ఉదయము బాలరూపిణి, మధ్యాహ్నము తరుణీరూపిణి, సాయంత్రము వృద్ధరూపిణియైయుండును

31 సతతము సత్యమును పలుకవలెను అప్పుడు శక్తి పెరుగును అసత్యమాడిన దివ్యశక్తి తరుగును

32 మండువాలోగిలిలో దూలముక్రింద కూర్చుండరాదు, తుమ్మరాదు, భుజించరాదు, పరుండరాదు

33 కలియుగములో తపస్సుకంటె, నామ సంకీర్తనము, దానము గొప్పవి

34 గీతలో మొదటి శ్లోకము "ధర్మ" అను రెండక్షరములలో గీతసారమున్నది అధర్మము నశించును ధర్మము జయించును.

35. 'సత్యంవద, ధర్మంచర' వేదవాక్యము భారతం దీనిని చక్కగా వివరించెను

36 వేదముల సారమే ఉపనిషత్తులు వీటి సంఖ్య మొత్తం 1180. వీటిలో 108 ముఖ్యమని, యిందులో 10 ముఖ్యమని, చివరకు మాండూక్యోపనిత్తు ముఖ్యము అని పెద్దలన్నారు 1180లో షుమారు 800 కర్మకాండ, 300 ఉపాసనాకాండ, 108 జ్ఞానకాండ 108 సార్లు జపము చేయుటకిదియే కారణము

37 తనకొరకే వండుకొని ఇతరులకు పెట్టకుండ తినువాడు బ్రతికుండియు చచ్చినవానితో సమానము

38. ఉసిరికాయను రాత్రిపూట ఆదివారము తినరాదు (ఎందుకో కారణము తెలియదు) ఉసిరిపచ్చడి కాని, పచ్చిది కాని తినవచ్చును యవ్వనము కలిగించు చ్యవనప్రాస లేహ్యమును దీని నుండి తయారుచేయుదురు

39. 'ఎ' విటమిను వెన్నలో, ఆకుకూరలలో, బొప్పాయిలో, కరివేపాకులో మామిడిపండులో గలదు

40 నిత్యము కొన్ని తులసిదళములు తినిన అనేక రోగములు పోవును

41. తేనె నీరు, నిమ్మరసము నీరు కలిపి త్రాగిన లావు, బరువు తగ్గును

42 స్నానానికి ముందు తలకు నూనె వ్రాయనిచో తలలోనికి నీరు యింకి తలనొప్పివచ్చును అప్పుడు కుక్కవామిటాకు దంచి తలకు కట్టిన నీరంతటిని లాగివేసి బాధ తగ్గించును

43. లేత గుమ్మడికాయ, ముదురు వంకాయ, పొట్టు తీసిన పెసంపప్పు విషంతో సమానం తినరాదు

44. ఉబ్బసం తగ్గుటకు నిత్యం ఒక లేత బిల్వ పత్రి (మారేడు పత్రి ఉదయం నమిలి మింగాలి. కొన్ని మాసాలు)

45 జ్ఞాపకశక్తికి నిత్యము 3 సారులు దాల్చిన చెక్క ముక్కలు తినాలి

46 5 నారింజలబలం ఒక్క నిమ్మపండులో వున్నది వాత పిత్త కఫదోషములను హరించును నిత్యం నీరు, నిమ్మరసం, పంచదార కలిపి త్రాగినవారికి కలరా రాదు జీలకర్ర నిమ్మరసంతో నూరి రాసిన పార్శ్వపు నొప్పి తగ్గును తులసి ఆకులు తులసి గింజల, నిమ్మరసముతో కలిపి నూరి రాసిన చర్మవ్యాధులు నశించును

47 తేనెత్రాగిన మూత్రపిండాలకు మంచిది. గుండె జబ్బుకు మంచిది సుగర్వ్యాధిని తొలగించును అజీర్ణం పోగొట్టి ఆకలిని కల్గించును

48 అజీర్ణం పోవుటకు పుదీనాపచ్చడి తినాలి, చింతచిగురు పప్పుగాని పచ్చడిగాని అన్నంతో తినాలి

49. ఉల్లి కామాన్ని పెంచును మరియు కడుపులో వాయువులను (Gases) పెంచును ఉల్లి కొద్దిగా వాడాలి

50. సపోటాలో చక్కెర, భాస్వరము, ఇనుము, పొటాషియం పుష్కలముగా యున్నవి బలము కలిగించును

51 నేరేడు పండ్లు తింటే కడుపులోని తలవెంట్రుకలు కరిగి బయటకి పోవును

52. తేలు కుడివైపు కుట్టిన వ్యక్తి ఎడమచెవిలో ఉల్లిపాయరసము పిండిన బాధ తగ్గిపోవును ఎడమవైపు కుట్టిన కుడిచెవిలో పిండవలెను

53. పాము కరచిన చోట కోడిముడ్డి పెట్టిన, కోడిముడ్డి విషము పీల్చుకొనును వెంటనే కోడి చనిపోవును వెంటనే రెండవకోడిని తీసుకొచ్చి దాని ముడ్డి పెట్టిన అది కూడా చనిపోవును అట్లు కోడి బ్రతికేవరకు పెట్టవలయును అంత విషము పోయి మనిషి బ్రతుకును.

54 ధన్వంతరి తన ఆయుర్వేద గ్రంథమున దైవనామ సంకీర్తనచే సమస్త రోగములు నివారించునని వ్రాసెను

55. వేడిగంజి త్రాగిన తలనొప్పి పోవును

56 నత్తల కూర తింటే మూలవ్యాధి తగ్గును

57 మజ్జిగ - ఘోలము, మథితము, ఉదశ్విత్తు, తక్రము అని నాలుగు విధాలు ఘోలమంటే పెరుగులో నీళ్ళుపోయకుండా మీగడతో పాటు చిలికిన మజ్జిగ, నీళ్ళు కలపక మీగడ మాత్రం తీసివేసి చిలికితే ఆ మజ్జిగను మథితమంటారు పెరుగు ఎంత వుంటుందో దానికి నాలుగవంతు నీళ్ళను చేర్చి చిలికితే దాన్ని తక్రమంటారు అర్ధ భాగము నీళ్ళుపోసి చిలికితే ఉదశ్విత్తు అంటారు మజ్జిగ అన్ని రోగాలను పోగొడుతుంది పాలకన్నా త్వరగా జీర్ణమవుతుంది

57. రోజూ మజ్జిగ వాడేవారు ఎలాంటి రోగాలను పొందరు దేవతలకు అమృతంలాగ మానవులకు మజ్జిగ సర్వరోగాలను పోగొట్టి సుఖాన్నిస్తుంది.

58 చుక్కకూర కాలేయానికి మంచిది కామెర్లు తగ్గును చుక్క ఆకుల రసం

త్రాగితే పాము విషం దిగిపోవును దాని వేరు పంటిపైనొక్కితె పళ్ళ సలుపు పోవును ఇగుళ్ళ వెంబడి రక్తం కారుట తగ్గును

59 తీర్థయాత్రలు చేయుటకంటె వేదాధ్యయనముకంటె సత్యము పలుకుటవలన పుణ్యము

60 బాలయోగి అష్టావక్రుడు అష్టవంకరలు గలవాడు జనకమహారాజా ఆ స్థానంలో ప్రవేశించాడు అక్కడ విద్వత్సభ జరుగుతుంది అతని వికారాకారాన్ని చూసి ఆ విద్వాంసులు ఫక్కున నవ్వారు "ఇది వేదాంతుల సభ అనుకొన్నాను, కాని ఇది గొడారివాళ్ళు, కసాయి వాళ్ళున్న చోటా? నేరాతగదు అన్నాడు సభ నివ్వెరపోయింది వివరంగా చెప్పు అన్నాడు జనకుడు. "నేను అంటే నా ఎముకలు, మాంసము, చర్మమే అనుకొన్నారా పెద్దలు మాంసం, ఎముకల వ్యాపారం కసాయివాడిది, తోలు వ్యాపారం గొడారివాడిది నిజమైన వేదాంతి సర్వజీవుల్లోను ఒకే ఆత్మను సందర్శిస్తాడు" అన్నాడా మహర్షి

61. లక్ష్మి ఇట్లా అనుకుంటుంది శూరుణ్ణి ఆశ్రయిస్తే వైధవ్యం రావచ్చు ఉదారుణ్ణి ఆశ్రయిస్తే వాడునన్ను ఎవరికైనా దానం చేయవచ్చు పండితుణ్ణి ఆశ్రయిస్తే నాకు సరస్వతితో సవతిపోరు వస్తుంది అందుచేత లోభివాణ్ణి ఆశ్రయిస్తాను

62 నిత్యం 10 ముదురు కరివేపాకులను 3 మాసాలు నమిలి మ్రింగితే సుగర్ వ్యాధిపోయి వారసత్వంగా రాదు

63 సజ్జనులు ఎన్నికష్టాల్లో వున్నా తమ స్వభావమును విడువరు.

64 బాటసారికి నీడనివ్వవు పళ్ళా అందుబాటులో వుండవు అంత ఎత్తుగా వున్న తాడిచెట్టు, ఖర్జూరపు చెట్లవల్ల ఏ ప్రయోజనము లేదు ఇట్టి పెద్ద లుండి ఏమిలాభం?

65 గర్భిణీ స్త్రీలు శీతలపానీయాలు ఎక్కువగా తీసుకున్నట్లయితే పుట్టబోయే బిడ్డల ఆరోగ్యం బాగుండదు

66. "శుభ్రంగా పెళ్ళి చేసుకో పెళ్ళాం అనుకూలవతి అయిందా సుఖపడతావు కాదూ వేదాంతివవుతావు - (సోక్రటీసు)

67 "వివాహం పిదప అర్ధనిమీలితనేత్రుడవై వుండొచ్చు కాని వివాహానికి ముందు మాత్రం బాగా కళ్ళు తెరచి వుంచు" - బెంజిమన్ ఫ్రాంక్లిన్

68. "ఆడదాని చరిత్ర పెళ్ళితో అఖరవుతుంది మగవాడి చరిత్ర పెళ్ళితోనే మొద లవుతుంది" - టాల్‌స్టాయ్

69. " ఒక మంచి స్త్రీతో వివాహం తుఫానులో దొరికిన ఒడ్డులాంటిది చెడు స్త్రీతో వివాహం ఒడ్డున లేచిన తుఫాను వంటిది " - జెవిసేన్

70. "వివాహం అందమైన మలుపు ఆ మలుపులో తప్పేం జరిగినా జీవితాంతం బాధపడాలి" - గోపీచంద్

71. "ఒడ్డుననున్న వాళ్ళను పెళ్ళి అనే ఏట్లోకి లాగడం అందరికీ సరదా తరువాత వాళ్ళు మునిగినా తేలినా ఎవరికీ పట్టదు" -రస్కిన్

72 దానితోపొందు మర్యాదను, వేశ్యతో పొందు ధనమును, విధవతో పొందు ఆయుస్సును, పరస్త్రీతో పొందు సర్వమును నశించును

73. ధనముపై తృప్తి, విద్యపై ఆశకావలెను
గృహిణికి సిగ్గు అలంకారము, వేశ్యకు సిగ్గు నష్టము

74 శ్రీ శంకరాచార్యులవారు ప్రపంచములోని బాధలన్నిటిని ఒక తరగతిగను, ఆకలి బాధను మరియొక తరగతిగను విభజించెను ఏలయనగా ప్రపంచములోని బాధలన్నియు యింకొకని సహాయముచే తొలగిపోగలవు కాని ఆకలి బాధ మాత్రము తనకు తాను భుజించి నివారించుకొనవలసినదే - వివేకచూడామణి.

75. బోజరాజు 5 రోజులు సరస్వతీ యజ్ఞము చేయగా సరస్వతి వచ్చి (అదృశ్యంగా)
"కవిర్దండి, కవిర్దండీ, భవభూతిస్తు పండితః"
అని ఊరుకొన్నది కాళిదాసు తాళలేక
"కోహం రండే" అనగా
"త్వమేవాహం త్వమేవాహం న సంశయః"
దండకవి భవభూతి పండితుడని చెప్పెను తన పేరు చెప్పలేదని కోపముతో కాళిదాసు నేనెవరినే ముండా యనగా సరస్వతి నీవే నేను నేనే నీవనెను దానితో కాళిదాసు ఘనత ఆకాశమంటెను

76 భోజరాజొకసారి సభలో మోక్షమున కెవరు పోయెదరో చెప్పుమనగా "నేను" పోతే పోతానన్నాడు కాళిదాసు 'నేను'అను అహంకారము పోవాలి, అప్పుడే మోక్షార్హుడు

77. శ్రీరామకృష్ణ పరమహంస, కొరడా దెబ్బలు తినే ఆవును చూచినప్పుడు బాధతో ఏడ్చాడు ఆయన వీపుపై ఎర్రని వాతలు తేలాయి వేరొకసారి పచ్చిక బయలులో మేసే ఎద్దు యొక్క గిట్ట గుర్తు గల గాయం ఆయన గుండెపై పడింది జీవుల బాధలు తమ బాధగా భావించినప్పుడు ఈ విధంగా జరుగును

78. ఒకసారి వ్యాసుడు తన శిష్యుడైన జైమినిని వ్రాయమని శ్లోకం చెప్పాడు "బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంసమపి కర్షతి" బలీయమైన ఇంద్రియ సమూహం విద్వాంసులను సైతం పెడత్రోవను పట్టిస్తుంది కాని తన ఆత్మ నిగ్రహం పట్ల నమ్మకమున్న జైమిని పదాలనిలా మార్చాడు.
"బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంసం నాపకర్షతి"
(ఇంద్రియ సమూహం ఎంత బలీయమైనప్పటికీ విద్వాంసుని పెడత్రోవను పట్టించలేదు) అని మార్చివ్రాసాడు వ్యాసుడు అది గమనించి అప్పటికి ఊరుకొన్నాడు.

జైమిని అడవిలోని ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్నాడు ఒకరోజు రాత్రి గాలివానలో ఒక స్త్రీ వచ్చి రక్షణ కోరగా జైమిని ఆమెను ప్రేమించి తన కోరికను తెలుపగా గురువర్యుడు వ్యాసుడు తన నిజరూపము జూపెను వ్యాసుడే స్త్రీ రూపంలో వచ్చి శిష్యుని పరీక్షించెను జైమిని సిగ్గుపడి పరుగిడి తను వ్రాసిన శ్లోకాన్ని యథాప్రకారం మార్చెను.

79 గబ్బిలాలకు ఆకలెక్కువ ఒక పెద్ద గబ్బిలం ఒక గంటలో వెయ్యి పురుగులకు పైగా తినగలదు

80. "ఏ పిల్లయినా సుఖపడాలంటే తాను వరించిన వానికంటె తనను వరించిన వానిని పెండ్లి చేసుకోవాలి" -వాత్స్యాయనుడు

81. మంచి గ్రంథములు చదివి వాని సారము వ్రాయనిచో మరచిపోదుము ఆచరించ నిచో వృధాశ్రమయగును

నేడు దురదృష్టవశాత్తు జీవితమునకు ఉపయోగపడని చౌకబారు పుస్తకములు చదివి అమూల్యమైన కాలము వృధా పుచ్చుచున్నారు

82 శ్రీరాముడు శబరి ఆహారమును స్వీకరించెను శ్రీకృష్ణుడు శూద్రుడైన విదురు నింట భుజించెను రామకృష్ణ పరమహంస ఉపనయన సమయమున విశ్వబ్రాహ్మణ స్త్రీ యొద్ద ఆహారముగొనెను వివేకానందుడు హరిజనునింట భుజించెను. పాకీవానితో భంగుపీల్చెను. పైవారంతా ఎదుటి మనిషిలోని గుణములను చదివారు అంటే జ్ఞానదృష్టితో మరియు విజ్ఞానదృష్టితో (అందరిలో నున్న భగవంతుని జూచుట విజ్ఞాన దృష్టి) మరి యిప్పుడు అజ్ఞాన దృష్టితో అనగా కులమునే చూచుట జరుగుతున్నది మనిషిలోని గుణాలను విద్వత్తును చూచుట లేదు గీత 5/18 చూడండి

83 వేదాంతములో ఒక సిద్ధాంతమున్నది "ఓం"కారము జపించిన నరకము లేదు అట్లే 27 చెట్లు పెంచిన వారికి నరకము లేదు. చెట్లున్న యింట రోగముండదు చెట్టు మనకు ప్రాణవాయువునిచ్చును పండుకొన్నప్పుడు చాలా మంది ముఖము కప్పుకొందురు దానివల్ల విడచిన బొగ్గుపులుసు వాయువును తిరిగి పీల్చు టచే మానవుడు త్వరగా మరణించుచున్నాడు అయితే దోమల బాధ వుంది గనుక కనీసము దుప్పటికొక కన్నము పెట్టి ముక్కైనా బయపెట్టుకొని పండుకొనవలయును.

84. 1 గంగ, 2 గోవు, 3 గాయత్రి, 4. గ్రంథములు, 5. గీత, 6. గాంగేయుడు, 7 గోవిందుడు, ఈ ఏడును మనల నుద్ధరించుటకు వచ్చినవి

85 నీవు అహంకారము లేక దుమ్ము కణముకంటె అధముడ వనుకొంటె ప్రకా శించెదవు

86. తనకొరకు వేచియున్న వంద మందిని విడిచియైనా వేళకు భోజనము చేయవలెను. వేయి మందిని విడిచియైనా స్నానం చేయవలెను లక్ష మందిని విడిచియైనా

దానము చేయవలెను కోటి మందిని విడిచియైనా ప్రార్థన చేయవలెను

87 పేదవానికి దానం, జీర్ణాలయంలోని దైవపూజ, అనాధ ప్రేత సంస్కారము, యీ మూడు అశ్వమేధ సమఫలమిచ్చును

88 సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము తోడబుట్టినవాడు, దయ స్నేహితుడు, శాంతి భార్య, క్షమ కుమారుడు, యీ యారుగురు నాకు బాంధవులని ధర్మరాజు చెప్పెను

89 హితమును కోరువాడు బంధువు, పోషించినవాడే తండ్రి, విశ్వాసము గలవాడే స్నేహితుడు, సుఖింపజేయునదే భార్యయగును

90. మేకల కాలిదువ్వ, గాడిద కాలిదువ్వ, చీపురు కట్టదువ్వ, స్త్రీ కాలిదువ్వ ఇవి పైబడిన నింద్రునకైన నైశ్వర్యము తొలగిపోవును దువ్వ = దుమ్ము

91 కోకిలకు స్వరమే రూపము, స్త్రీలకు పాతివ్రత్యమే రూపము కురూపునకు విద్యయే రూపము యతులకు శాంతమే రూపము

92. ఈలోకమంతయు దైవాధీనమైయున్నది ఆ దైవము సత్యమున కాధీనమై యున్నది, ఆసత్యము ఉత్తములయందున్నది కాబట్టి ఆయుత్తమ భక్తులే నాకు దైవమని శ్రీకృష్ణమూర్తి చెప్పెను

93 పుస్తకములోని చదువు, పరులచేతి కిచ్చిన ధనము, ఇవి సమయమునకుపయోగించవు

94 శ్రీకృష్ణ మంత్రములు

1."క్లీం కృష్ణాయ స్వాహా" 2."గోపీజనవల్లభాయ స్వాహా", 3 "క్లీం హృషీకేశాయ నమః", 4 "శ్రీం హ్రీం క్లీం కృష్ణాయస్వాహా", 5. "శ్రీం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ స్వాహా", 6 "ఓం నమో భగవతే రుక్మిణీ వల్లభాయ స్వాహా", 7."ఐం క్లీం కృష్ణాయ హ్రీం గోవిందాయ శ్రీం గోపీజనవల్లభాయ స్వాహా స్వాః" 8." ఓం క్లీం ఓం నమో భగవతే నందపుత్రాయ బాలదివ్యపురుషే శ్యామలాయ గోపీజనవల్లభాయ స్వాహా", 9. "ఓం క్లీం హ్రీం శ్రీం గోపీజన వల్లభాయ స్వాహా" అను యీ తొమ్మిది శ్రీకృష్ణ మంత్రములను నిరంతరము చదువుచున్న యెడల శ్రీకృష్ణపరమాత్ముడనుగ్రహమును పొందెదరు. తలచిన కార్యములు వెంటనే సిద్ధించును

95. శ్రీమృత్యుంజయ యంత్రము - మూలమంత్రము

జీం హాం జీం జూంసః భూర్భువస్సువః
త్ర్యంబకం యజామహే సుగంధిం
పుష్టి వర్ధనం। ఉర్వారు కమివబంధ నా
న్మృత్యోర్ముక్షీయ మామృతాత్
భూర్భువస్సువరోం జూంసః హాం ఓం"

96 శ్రీకృష్ణావతార తత్త్వ స్వరూప స్వభావములను గురించి పద్మపురాణములో పార్వతీ పరమేశ్వరుల సంవాదమును తిలకించండి

గోపస్త్రీలు అందరు మనోహరంబగు బృందావనంబున కాళిందీపులినంబుల (ఇసుక దిన్నెల) యందు పూలపాన్పు పైన నిర్భయులై కృష్ణునిగూడి ప్రతిదినంబును కేళి సలిపిరి అనిన విని శివునితో బార్వతి యిట్లనియె ధర్మ సంస్థాపనార్థంబై జగతి యవతరించిన జనార్దనుడు పరదారగమనంబెట్లు చేసెననిన పార్వతికి రుద్రుండిట్లనియె సర్వజగత్తును ఆ భగవంతుని శరీరమే గాని తద్వ్యతిరిక్తంబు కాదు, అట్లగుటంజేసి తన శరీరమును తానాలింగనము చేసికొనినట్లయ్యె కావున పరాంగనలనియు, రతియొనర్చుటనియు నతనికి లేదు మఱియు నమ్మహాపురుషునికి స్త్రీ పురుష భేదంబును లేదు స్వభావముగ దానందఱకు భర్తయగుట వలనను ఆత్మేశుండగుటవలనను, సకలంబునకును స్వామియగుటవలనను పాపంబుల నశింపజేయువాడగుటవలనను, సమస్తమునందును వ్యాపించి యుండువాడగుటవలనను ఆ పరమాత్మునికి ఒక్క దోషంబును లేదు అని శివుడు పార్వతికి చెప్పెను

97 మనుజుని శరీరములో 8 1/2 కోట్ల రోమములున్నవి చిత్ర మేమిటంటే వీనినెట్లా లెక్కబెట్టారు (వరుస నంబరు 88/2 చూడుడు)

98. కుమారునకు ఋణము మిగిల్చిపోయిన తండ్రి శత్రువు, పుత్రునకు వ్యభిచారిణియైన తల్లి శత్రువు, భర్తకు రూపవతి యైన భార్య శత్రువు, తండ్రికి విద్యలేని కొడుకు శత్రువు

99 పరగడుపున ఉసిరికాయయు, భోజనానంతరము రేగు పండును భుజింపవచ్చును ఎప్పుడును వెలగపండు పథ్యకరము అరటిపండు ఒకప్పుడు పథ్యకరము కాదు

100 గయ్యాళియైన భార్య, కుత్సితుడైన స్నేహితుడు, అహంకారము గలిగిన బంటు, సర్పము గల గృహమందు వాసము ఇవి మనుష్యునకు నిస్సంశయముగా మరణావస్థను గలుగజేయును

101 ఆఱుమారులు భూ ప్రదక్షిణంబులు, పదివేల మారులు గంగాస్నానంబులు, అనేక శతావర్తు సేతుస్నానంబును గావించినందున గలుగు ఫలము తమ తల్లికి ప్రీతిపూర్వకముగా వందన మాచరించుట వలన గలుగును

102. సతీదేవి శివుని మాట నమ్మక శ్రీరాముని పరీక్షింపనెంచి సీతవేషములో సీతకై విలపించు రాముని చెంతకు వచ్చెను అంతరాముడు "ఏమమ్మా సతీదేవి" ఎందుకొచ్చావని యడుగ ఆమె శ్రీరాముడు దేవుడేయని తెలిసికొని భర్తతో తెలిపెను అంత శివుడు కోపించి లోకమాత సీతవేషము వేశావు గనుక నీవు నేటి నుండి నా తల్లితో సమానమని పొమ్మనెను ఆ కారణముచే సతీదేవి తండ్రి యజ్ఞములో దేహత్యాగము చేసెను రామనామము సర్వపాపహరణము

103 రామకృష్ణ పరమహంస 'మీరు దేవున్ని చూసారా' అని వివేకానందుడడుగగా 'చూచితిని నిన్నెంత స్పష్టముగా చూచుచుంటినో అంత స్పష్టముగా చూచితినన్నారు నాకు చూపించగలరా అనగా అట్లే చూపెద రమ్మని వివేకానందునిపై చేయివేయగానే ఆయన మహాభక్తుడై 'దేవుడున్నాడు దేవుని చూచితిననెను

104 శ్రీరామునికి శత్రువర్గంలోని విభీషణుడు, ఇంద్రాదిదేవతలు తోడ్పడ్డారు రావణునికి దేవతలతోపాటు సోదరుడే విరోధుడయ్యాడు దీనిని బట్టి మంచి వారికి అందరూ సహాయపడతారు చెడ్డవారికి సొంత మనుషులే దూరమవుతారని తెలుచున్నది

105 ఒక అర్ధరాత్రి ఒక హరిజనుడు"అమ్మా! సీతమ్మగారు ఆకలి రక్షించాలి" అని ఆర్తనాదము చేయగా డొక్కా సీతమ్మ గారు అన్నము పెట్టింది అతడదితిని నమస్కరించి కృతజ్ఞత తెలిపాడు

కొద్ది రోజుల తరవాత ఒకాయన భార్యతో సీతమ్మ గారి యొద్దకు వచ్చి "తల్లీ నా భార్యకు పిశాచం పట్టి పీడిస్తున్నది మీరు ఒక అర్ధరాత్రి హరిజనునకు పెట్టిన అన్నదాన ఫలితము ధారపోస్తే పోతానంటున్నది దయతో ధారపోయమన్నాడు" వెంటనే సీతమ్మగారు ఆ ఫలితాన్ని ధారపోయగా పిశాచం వదలిపోతూ భూతవైద్యులు అడుగగా తన పూర్వ చరిత్ర నీవిధముగా చెప్పినది "మేమిరువురు అన్నదమ్ములము ఆస్తికొరకై నేను నా తమ్ముని యాత్రకు తీసుకుపోయి విషమిచ్చి చంపితిని ఆ రోజునుండి నేను రోగగ్రస్తుడనై యమ బాధలుపడి చివరకీరీతి పిశాచమునైతిని పూర్వము అన్నదానపలము వినియుండుటచే దానిని నేను కోరితిని నాకు మంచిదారి దొరికినది పోవుచుంటి" నని పరుగెత్తెను (డొక్కా సీతమ్మగారి జీవితచరిత్ర నుండి)

106 భోజరోజొకసారి కాళిదాసుతో నాకు అనంతములగు శాస్త్రములు చదువుటకు తీరికలేదు మన శాస్త్రముల సారము ఒక శ్లోకములో చెప్పుమనెను అంత కాళిదాసు అర్ధ శ్లోకములో చెప్పెద వినుమని

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"అని నుడివెను పరుల -కుపకారము చేయుట పుణ్యము పరులను పీడించుట పాపము

ఇందు ఒక విశేషమేమనగా దైవధ్యానము చేయుమని కూడ చెప్పలేదు పరోపకారమే చెప్పెను అందుకే మానవసేవ మాధవసేవయే యందురు జీవులకు సేవ చేసిన పరమాత్మ సంతసించును

ప్రతి దుఃఖజీవి కన్నీటి బిందువును తుడుచుటయే వేదాంతము

107 ఒకసారి భోజరాజు కాళిదాసు భుజించుచుండగా భోజరాజు భార్య అన్నంపెట్టి పెసరపప్పు వడ్డించింది అంత భోజరాజు "ముద్గదాళీ గదవ్యాళీ కవీంద్ర విదుషా కథం" అన్నారు అనగా రోగములను పోగొట్టు గుణము గల

వెసరపొట్టును పప్పు నుండి ఎందుకు తీసివేయవలెను? అంతప్రక్కనున్న కాళిదాసు భోజరాజు కోపమును తగ్గించదలచి "అంధోవల్లభ సంయోగే జాతా విగత కంచుకా" అన్నారు అనగా అన్నమనెడు భర్తను కలియుటకై పోవుచున్న పప్పు అనెడి భార్య రవికను విడిచి వెళ్ళినది" కాళిదాసుయొక్క యీ అద్భుత ప్రయోగమున కందరు సంతోషించిరి పెసలను పొట్టుతో తినవలెనని 2000సంవత్సరముల క్రితము వ్రాయబడినది పొట్టు తీసిన పెసరపప్పు విషముతో సమానము ఆలుగడ్డ కూడా తొక్కతో తినవలయును

108 శ్రీకృష్ణుని శిరస్సుపై నెమిలి పించము ఎందుకు పెట్టాలి? మబ్బుల సమయంలో మగనెమిలి ఆనందముతో పురివిప్పి నాట్యము చేయును ఆడునెమిలి మగనెమిలియొక్క నాట్యానికి, అందానికి ప్రేమించి దగ్గరకు వెళ్ళును వెంటనే మగ నెమిలి కంటి నుండి ఆనందభాష్పాలు (వీర్యము) కార్చును ఆడ నెమిలి దాన్ని మ్రింగి వెంటనే గర్భము ధరించును సృష్టిలో అన్నిటికి స్త్రీ పురుష సంయోగముండును కాని నెమిళ్ళకు లేదు శ్రీకృష్ణుడు కూడా అస్ఖలిత బ్రహ్మచారి నెమిలి వంటివాడు కాబట్టి శిరముపై నెమిలి పింఛము దరిస్తాడు

ఇక్కడ మరొక్క విషయము చెప్పవలసియుంది "నాట్యమయూరి" అని బిరుదు నిచ్చి నాట్యము చేసిన స్త్రీని సత్కరిస్తారు నాట్యము చేయునది ఆడనెమిలి కాదు మగనెమిలి ఆశ్చర్యముగా వుంది కదూ!

# 260. శ్రీకృష్ణ అష్టోత్తర శతనామావళి

1 ఓం శ్రీకృష్ణాయ నమః
2 ఓం కమలనాథాయ నమః
3 ఓం వాసుదేవాయ నమః
4 ఓం సనాతనాయ నమః
5. ఓం వసుదేవాత్మజాయ నమః
6 ఓం పుణ్యాయ నమః
7 ఓం లీలా మానుషవిగ్రహాయ నమః
8 ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః
9 ఓం యశోదావత్సలాయ నమః
10 ఓం హరయే నమః
11. ఓం చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యుదాయుధాయ నమః
12 ఓం దేవకీనందనాయ నమః
13. ఓం శ్రీశాయ నమః
14 ఓం నందగోపప్రియాత్మజాయ నమః

15 ఓం యమునావేగ సంహారిణే నమః
16. ఓం భలభద్రప్రియానుజాయ నమః
17 ఓం పూతనాజీవితహరాయ నమః
18. ఓం శకటాసురభంజనాయ నమః
19. ఓం నందవ్రజ జనానందినే నమః
20. ఓం సచ్చిదానందవిగ్రహాయ నమః
21. ఓం నవనీతవిలిప్తాంగాయ నమః
22. ఓం నవనీతనటాయ నమః
23 ఓం అనఘాయ నమః
24. ఓం నవనీతనవాహారాయ నమః
25. ఓం ముచి (చు)కుంద ప్రసాదకాయ నమః
26. ఓం షోడశ స్త్రీ సహస్రేశాయ నమః
27. ఓం త్రిభంగినే నమః
28 ఓం మధురాకృతయే నమః
29 ఓం శుకవాగమృతాబ్ధీందవే నమః
30 ఓం గోవిందాయ నమః
31. ఓం యోగినాంపతయే నమః
32. ఓం వత్సవాటచరాయ నమః
33 ఓం అనంతాయ నమః
34. ఓం ధేనుకాసురభంజనాయ నమః
35. ఓం తృణీకృత తృణావర్తాయ నమః
36. ఓం యమళార్జున భంజనాయ నమః
37. ఓం ఉత్తాలతాలభేత్రే నమః
38. ఓం తమాల శ్యామలాకృతయే నమః
39. ఓం గోపగోపీశ్వరాయ నమః
40 ఓం యోగినే నమః
41 ఓం కోటి సూర్యసమప్రభాయ నమః
42. ఓం ఇలాపతయే నమః
43. ఓం పరంజ్యోతిషే నమః
44. ఓం యాదవేంద్రాయ నమః
45 ఓం యదూద్వహాయ నమః
46 ఓం వనమాలినే నమః

47. ఓం పీతవాససే నమః
48 ఓం పారిజాతాపహారకాయ నమః
49. ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః
50 ఓం గోపాలాయ నమః
51 ఓం సర్వపాలకాయ నమః
52. ఓం అజాయ నమః
53 ఓం నిరంజనాయ నమః
54 ఓం కామజనకాయ నమః
55. ఓం కంజలోచనాయ నమః
56. ఓం మధుఘ్నే నమః
57 ఓం మధురానాధాయ నమః
58. ఓం ద్వారకానాయకాయ నమః
59. ఓం బలినే నమః
60 ఓం బృందావనాంత సంచారిణే నమః
61. ఓం తులసీదామ భూషణాయ నమః
62 ఓం శమంతకమణే హర్త్రే నమః
63 ఓం నరనారాయణాత్మకాయ నమః
64. ఓం కుబ్జా కృష్ణాంబరధరాయ నమః
65. ఓం మాయినే నమః
66 ఓం పరమ పురుషాయ నమః
67 ఓం ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదాయ నమః
68 ఓం సంసారవైరిణే నమః
69. ఓం కంసారయే నమః
70 ఓం మురారయే నమః
71 ఓం నరకాంతకాయ నమః
72. ఓం అనాది బ్రహ్మచారిణే నమః
73. ఓం కృష్ణా వ్యసన కర్శకాయ నమః
74. ఓం శిశుపాలశిరశ్ఛేత్రే నమః
75. ఓం దుర్యోధన కులాంతకాయ నమః
76. ఓం విదురాక్రూరవరదాయ నమః
77 ఓం విశ్వరూపప్రదర్శకాయ నమః
78 ఓం సత్యవాచే నమః

79 ఓం సత్యసంకల్పాయ నమః
80. ఓం సత్యభామారతాయ నమః
81. ఓం జయినే నమః
82. ఓం సుభద్రా పూర్వజాయ నమః
83. ఓం విష్ణవే నమః
84 ఓం భీష్మ ముక్తిప్రదాయకాయ నమః
85. ఓం జగద్గురవే నమః
86. ఓం జగన్నాథాయ నమః
87. ఓం వేణునాదవిశారదాయ నమః
88 ఓం వృషభాసుర విధ్వంసినే నమః
89 ఓం బాణాసుర కరాంతకాయ నమః
90 ఓం యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రే నమః
91. ఓం బర్హి బర్హావతంసకాయ నమః
92 ఓం పార్థసారథయే నమః
93. ఓం అవ్యక్తాయ నమః
94. ఓం గీతామృతమహోదధయే నమః
95. ఓం కాళీయఫణి మాణిక్య రంజిత శ్రీపదాంబుజాయ నమః
96. ఓం దామోదరాయ నమః
97 ఓం యజ్ఞభోక్త్రే నమః
98. ఓం దానవేంద్రవినాశకాయ నమః
99. ఓం నారాయణాయ నమః
100. ఓం పరస్మై బ్రహ్మణే నమః
101 ఓం పన్నగాశనవాహనాయ నమః
102. ఓం జలక్రీడాసమాసక్త గోపీవస్త్రాప హారకాయ నమః
103 ఓం పుణ్యశ్లోకాయ నమః
104. ఓం తీర్థపాదాయ నమః
105. ఓం వేదవేద్యాయ నమః
106 ఓం దయానిధయే నమః
107 ఓం సర్వతీర్థాత్మకాయ నమః
108. ఓం సర్వగ్రహరూపీ పరాత్పరాయ నమః

శ్రీకృష్ణ అష్టోత్తర శతనామావళి సంపూర్ణము

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణార్పణమస్తు

శ్లో॥ సోఽభివవ్రేఽచలాం భక్తిం తస్మిన్నే వాఖిలాత్మని।
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ దయాంపరామ్॥

సుదాముడు శ్రీకృష్ణునిల్లాప్రార్థించాడు "నీయందు నాకు అచంచల భక్తిని, నీ భక్తులయొక్క సాంగత్యమును, సర్వభూతములయందును అపార కరుణను ప్రసాదింపుము"

శ్రీకృష్ణకదామృతము - 317

శ్లో॥ శృణ్వతాం స్వకధాః కృష్ణః పుణ్యశ్రవణ కీర్తనః।
హృద్యన్తః స్థోహ్యభద్రాణి విధునోతి సుహృత్సతామ్॥

"పుణ్యశ్రవణ కీర్తనుడు, సత్పురుషులను రక్షించువాడునగు శ్రీకృష్ణ భగవానుడు తన కథలను శ్రవణము చేయువారి హృదయములలో నుండి పాపవాసనలను నశింపజేయును"

శ్రీకృష్ణకదామృతము - 237

"విపద్విస్మరణం విష్ణుః సంపన్నారాయణ స్మృతిః"
భగవానుని మరచిపోవడమే ఆపద జ్ఞాపకముంచుకోవడమే సంపద

శ్లో॥ స్వస్త్యస్తు విశ్వస్యఖలః ప్రసీదతాం।
ధ్యాయన్తు భూతాని శివం మిథో ధియా।
మనశ్చ భద్రం భజతాదధోక్షజే।
ఆవేశ్యతాం నో మతిరప్యహైతుకీ॥

దేవా! ప్రపంచము క్షేమముగ నుండుగాక! దుష్టులబుద్ధి శుద్ధపడుగాక! ప్రాణులందరియందును పరస్పరము సద్భావనయుండు గాక! అందఱును ఒకరి హితమును మఱియొకరు కోరుచుందురుగాక! మామనస్సు శుభమార్గమున ప్రవృత్తమగు గాక! మాయందఱి బుద్ధి నిష్కామభావముతో భగవంతుడగు శ్రీకృష్ణునియందు ప్రవేశించుగాక

భాగవతము, పంచమస్కంధము

శ్లో॥ నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనమ్।
ప్రణామో దుఃఖశమనస్తం నమామి హరిం పరమ్॥

ఏ భగవంతుని నామములయొక్క సంకీర్తనము సమస్త పాపములను సంపూర్ణముగ నశింపజేసివేయునో, ఏ భగవంతుని పాదములకు గావింపబడు ఆత్మసమర్పణము, ప్రణామము సదా సమస్త దుఃఖములను పోగొట్టునో, పరమతత్త్వ స్వరూపులగు ఆ శ్రీహరికి నేను నమస్కరించుచున్నాను

భాగవతము

శ్లో॥ ఓం సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వేసంతు నిరామయా।
సర్వే భద్రాణి ప్రశ్యంతు మాకశ్చిద్దుఃఖ మాప్నుయాత్॥

ఈ ప్రపంచమున నందఱును సుఖమునే పొందుదురుగాక! సర్వులును దుఃఖరహితులగుదురుగాక! శుభములనే గాంచుదురుగాక! ఒకడేని క్లేశము నొందకుండును గాక!

దీనిని చదివినను వినినను వినినదానిని మరొకరికి చెప్పినను పాపరహితులై దుఃఖ రహితులై భక్తులై యుందురు భక్తుడనగా భగవంతునితో మాట్లాడువాడు

లోకా సమస్త సుఖినోభవంతు
ధర్మస్య జయోస్తు
అధర్మస్య నాశోస్తు
విశ్వస్య కళ్యాణమస్తు

ఎనిమిది నుండి నూట ఎనిమిది సంఖ్యల వివరణ సంపూర్ణము.

వేదాంతచూర్ణిక (సంఖ్యాప్రాశస్త్యము)
ద్వితీయ భాగము సంపూర్ణము
హరిః ఓమ్ తత్ సత్
ఓమ్



**ఓం నమః పర్మాత్మనే**

**ద్వితీయ పుష్పం వేదాంతచూర్ణిక ప్రథమభాగము, తృతీయపుష్పం శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రమ్ రామానుజ భాష్యమ్‌పై ప్రముఖుల ప్రశంసలు.**

౧౯౫౫వ సంవత్సరములో ఏలూరు అశోక్‌నగర్‌లో నున్న "కొండపార్వతి దేవి థియోసాఫికల్ హైస్కూలు"లో నేను ఎస్ ఎస్ ఎల్ సి చదువుకునే రోజుల్లో సైన్సు మాష్టారుగా వుండి నాకు విద్యాబుద్ధులు గరపిన గురుతుల్యులు, సాధుశీలి బ్రహ్మశ్రీ **భోగరాజు నటరాజ ప్రకాశరావు** M A BEd గారు సత్రంపాడులో వున్నారని తెలిసి, నేను మా బాల్యమిత్రుడు శ్రీమాన్ **శ్రీరామమూర్తిగారు** కలిసి 18-7-2000 తేదీన నా రచనలు, మూడు గ్రంధములు 1. **మిత్ర శతకము**, 2. **వేదాంతచూర్ణిక ప్రథమభాగము**, 3 **శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రము**, నామావళి అర్థ సహితము (రామానుజ భాష్యము) తీసుకొని సత్రంపాడు వెళ్లి గురువు గార్కి నమస్కరిస్తూ యిచ్చాను

గురువుగారు మూడు గ్రందములను ఆమూలాగ్రముగా చదివి నన్ను ప్రశంసిస్తూ ఒక జాబు వ్రాసారు అందులోని సారాంశములతో కూడిన పూర్తి వివరములు నిందు పొందుపరుస్తున్నాను

1 శ్రీ శేషగిరిరావు గార్కి, నమస్కరిస్తున్నందుకు క్షమార్హుడను మీరు వేదాంత విజ్ఞానంలో నాకు గురువులు "ఇదే గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె" అనే నానుడికి ఒక ఉదాహరణ

ఇదివరలో వేదాంతగుళికలు ( Hard to Crack) కొన్ని మింగలేక ఉక్కిరి బిక్కిర అయ్యాను మీ చూర్ణికలో ఒక అజ్ఞాన రోగికి హోమియోపతి మాత్రలు ( Item No 263) తయారు చేసారు చిన్న చిన్నవిగా, తియ్య తియ్యగా ఇదే అలోపతి వైద్యంలో రోగికి బలాన్నిచ్చే గ్లూకోజులా నాలికమీద వేసుకోగానే కరిగి శరీరంలో అన్ని రక్త అణువులలో సులభంగా చేరుతుంది ఇక

**మిత్రా!** **వే** (చిన) **పూరి** (పద్యాలు) **లోయ్**

**మిత్రా!** వేగమె రావోయి

**మిత్రా!** మక్కువతో తినవోయ్

**మిత్రా!** మనసు తేలికోనోయ్

**మిత్రా!** ఇవి అసతోమా సద్గమయ **లోయ్**

**మిత్రా!** **కారు చీకట్లలో కారు లైట్లోయ్**

**మిత్రా!** ఈ కలికాలంలో **అమృతధారలోయ్**

**మిత్రా!** తాగి సేద తీరవోయ్

కొన్ని శతాబ్దాల క్రితం మూడు భాషల (తెలుగు, తమిళ, మళయాళం) మూలపుటమ్మ **(సంస్కృతం)** ఇప్పుడు '**మమ్మీ**' (ఈజిప్టు పెరమిడ్స్‌లో ఎండి పండిన శవాలు) '**డాడీ**' చదువులు వచ్చాక తెలుగుకు తెగులు పట్టింది

పాప పాకుతుంది కన్నపాప పాకుద్ది అని మదించి పరవశించి పోతున్నారు భాషా ప్రయోగాలు మరికొన్ని శతాబ్దాలకు ఇది ఒక జంబాడి భాషగా మారినా ఆశ్చర్యపడక్కర్లేదు

అట్టి తరుణంలో మన ఆంధ్ర భీష్ముడు '**శేషుడు**' అర్థసహితముగా ఆదివిష్ణుని అన్ని నామాలు అందించి మనల్ని ఆనందింపజేసారు

ఈయన **సీతారాముల** పుత్రుడే **కాని** లవుడు కాడు, కుశుడు గాడు మరి ఎవరు? 'ఆ' ఈశ్వర **గిరి**యే ఎందుకంటే, ఈశ్వర ఉవాచ **శ్రీరామరామేతి!** అందుకనే వీరి తండ్రి గారు ఆయన నామాన్ని ఆధునికం చేసి శేషగిరిరావన్నారు! అని తమకున్న ఆ ఈశ్వరుని మీద భక్తితో, ఆఖరిదైనా అతిముఖ్యమైనది. ఏ వృత్తిలోనైనా ప్రతిమే **స్త్రీ**కి ఒక స్త్రీ సహాయం వుంది మన లలాటఫలకుడు '**కస్తూరి**' తిలకుడవటం వల్లనే వారి **మన**స్సులోని మంచంతా వాక్కుల కర్మ (రచనల) ద్వారా గుబాళింపు తెచ్చుకుంది

పై పిచ్చి వ్రాతలు వ్రాసి ధన్యుడయ్యాననుకుంటున్నా

ఏలూరు — బి.హెచ్.ఎస్. ప్రకాశరావు

15-9-2000 — హెడ్మాస్టర్ (రిటైర్)

(వీరు జనవరి 2001 లో కీర్తిశేషులైనారు వీరి ఆత్మకు శాంతి కలగాలని కోరుకుంటూ వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతి)

2 ప్రియమిత్ర శ్రీ శేషగిరిరావు గారికి శుభాభివందనములతో ఉభయ కుశలోపరి వ్రాయునది

మీ 'వేదాంతమార్జిక' ఆమూలాగ్రంగా చదివాను కాదు పరిశీలించాను ఏనాటి నుంచో మీరు చేసిన కృషికి ఫలితంగా రూపొందిన ఈ గ్రంధం సర్వోత్కృష్టంగా వుంది ఎన్నో గ్రంధాలను పఠించి పరిశీలించి, పరిశోధించి, ఏర్చి ఒకచోట కూర్చిన ఇందులోని విషయాలు సర్వామోదాలు, సర్వామోదకాలు అనడంలో ఎలాంటి సందేహం లేదు ఈ గ్రంధ రచనకు ప్రేరకమైన విషయం చాలా ఆశ్చర్యకరమైనదే నిజంగా ఏదో మిషతో

భగవంతుడు మీ చేత ఈ గ్రంథ రచనను చేయించి, మీలోని భక్తి తాత్పర్యాల సార్థకత చేకూర్చాడు **1** నుండి **7** సంఖ్యలకే **240** పుటలు ముద్రించిన మీ కలం మీ భక్త్యావేశం **8** నుండి **108** అంకెలతో ప్రచురించే రెండో భాగం తలకుమించిన భారంగా ఇంకెన్ని వందల పేజీలలో రూపొందుతుందో అని భయపడుతున్నాను అందుకే ఈ గ్రంథ సంకలనంలో నా దృష్టికి తోచిన కొన్ని సూచనలు అందిస్తున్నాను సహృదయంతో స్వీకరిస్తారనీ, అన్యదా భావించరని విశ్వసిస్తున్నాను లేకపోతే మిత్రభావానికి అర్థమే ఉండదను కుంటాను రెండో పుస్తకమ్మైనా సవరించుకుంటే పేజీలు తగ్గుతాయి చూడండి ఏమ్మైనా మీ కృషి అభినందనీయం జయోస్తు శుభం భవతు

కాకినాడ మీ

12-6-2000 శివతెంక ప్రకాశరావు

3 శేషగిరిరావు గారికి

౨ సెప్టెంబర్ ౨౦౦౧ న మీరు రచయిత అనే మంచి సంగతిని మొదటి సారిగా తెలుసుకున్నాను త్రిదండి అనగానే రామానుజాచార్యుల వారి శిష్యులు అని తెలుస్తున్నది ఆ పేరు ఎందుకు వచ్చిందో తెలియదు ఏకదండి అంటే స్మార్తులు కాబోలు త్రిదండి వేరు. శ్రీ చిన్న జియ్యరు స్వామి వారిని గురువుగా పొందగలిగిన అదృష్టవంతులు మీరు వేదాంతచూర్ణిక కోసం మీరు ఎంతగానో శ్రమించి వుండాలి. చక్కగా తుడిచిన మంచి అద్దమునకు ఉండే నైర్మల్యము, నైగనిగ్యము దానికి ఉన్నాయి ఎన్నో ఆసక్తికరమ్మైన, ఉపయోగకరమ్మైన, విజ్ఞానదాయకమ్మైన అంశాలతో నిండి ఉన్నది అన్నీ ముత్యాలు, రత్నాలు ఈ రచనకు ప్రత్యక్షముగగాని పరోక్షముగ కాని సాయపడిన వారిపట్ల మీకు వున్న గౌరవము ఎనలేనిది ఇది శుభసూచకము ఎంతో హర్షణీయము మీరు సేకరించిన సమాచారము, దానిని పొందికగకూర్చి అందించిన రీతి ప్రశంసనీయము మీ కృషి అభినందనీయము భౌతిక, మనోవికాసాలకు తోడ్పడే రచనలు రచయితల కలాల నుండి వెలువడడం ఎంతైనా అభిలషణీయం వేదాంత చూర్ణిక వెల డెబ్బై రూపాయలు విలువ? ఎన్నలేను

విషయము సంఖ్యానామ మంత్రములో 'ఓం' కు గల స్థానము

నారాయణ మంత్రాన్ని అష్టాక్షరీ మంత్రం అంటున్నాము నమో నారాయణాయ అన్నప్పుడు 7 అక్షరాలు మాత్రమే వున్నాయి దీన్ని అష్టాక్షరి అని పిలవాలంటే ఓం చేర్చాలి (లేదా వేరే శ్రీ లాంటి అక్షరం ఏదన్నా చేర్చాలి)

శివమంత్రాన్ని పంచాక్షరీ మంత్రం అన్నప్పుడు దానికి 'ఓం' చేర్చనక్కర

లేదు 'నమశ్శివాయ' అంటే సరిపోతుంది 5 అక్షరాలు ఉన్నాయి

నారాయణమంత్రం విషయంలో 'ఓం' విధిగా చేర్చాలి చేర్చకపోతే అష్టాక్షరి అవదు శివమంత్రం విషయంలో చేర్చనే కూడదు చేరిస్తే అది పంచాక్షరి అవదు షడక్షరి అవుతుంది ఈ తేడా ఎందుకు?

ఒక మంత్రానికి సంఖ్యానామము ఇచ్చినప్పుడు ఆ మంత్రములోని అక్షరముల సంఖ్యని ఆధారము చేసుకొనే గదా! 'ఓం' సంఖ్యానామ మంత్రములోని అంతర్భాగమా కాదా అన్నది ప్రశ్న అంతర్భాగము అయితే మంత్రములోని అక్షరముల సంఖ్యకు విధిగా దాన్ని కలపాలి అపుడే మననామకరణము సార్థకము అవుతుంది

నారాయణ మంత్రం విషయ్‌లో 'ఓం' ని అంతర్భాగంగా పరిగణించి, శివమంత్రం విషయంలో అంతర్భాగంగా పరిగణిచకుండ ఉన్న పరిస్థితి ఏర్పడింది

ఒక మంత్రానికి ఓం చేర్చవచ్చునా, కూడదా అని కాదు మన ప్రశ్న, చేరిస్తే తప్పేముంది? చేర్చే అవకాశమున్నప్పడు 'ఓం'ని ఒక సంఖ్యానామ మంత్రానికి చేర్చినపుడు దీన్ని మంత్రంలోని అంతర్భాగంగా భావించి ఆ మంత్రానికి నామకరణం చేసేటప్పడు దాన్ని కూడా లెక్కించి అక్షరాల సంఖ్యకు కలపాలా వద్దా అన్నదే ఇక్కడి ప్రశ్న

ఒక మంత్రములోని బీజాక్షరం యొక్క వరుస సంఖ్యని గుర్తించేటప్పడు కూడా ఈ ప్రశ్న ఉదయించవచ్చు

'ఓం' ని ఏకాక్షరి మంత్రముగ పరిగణిస్తే దాన్ని 1వ సంఖ్య క్రింద చేర్చవచ్చునేమో! 12 గురిలో ఏకైక స్త్రీ ఆళ్వార్ గోదాదేవి, 5వ సంఖ్య - పంచదైవ వృక్షములు, 6వ సంఖ్య - షడంగములు (గోవునుంచి వచ్చే 6) పంచగవియము + గోరోచనము (ఆవు కడుపులోనుండి యెత్తెడి ఒక వస్తువు) 7వ సంఖ్య - సప్తకుల పర్వతములు, సప్తసంతానములు, సప్తమాతలు తులసిని గురించి మీ పుస్తకములో వ్రాసినారు

"తులసీ అమృతసంభూతే" అనే శ్లోకము కూడా చేర్చవచ్చునను కుంటాను

మీ రచన "మిత్రశతకము" చదివాను అయితే ఒక సంగతి దానిలోని మొదటి పద్యం రసరాజు గారిని ఆకర్షిస్తే, ఆయన పొదుపుగ అరపేజిలో దాన్ని అంతరార్థం వెలికి వచ్చేలా చేసిన విశ్లేషణ నన్ను ఆకట్టుకున్నది

లోకజ్ఞానం, ఆత్మజ్ఞానము బోధించే "మిత్రశతకం"లోని పద్యాల ద్వారా లౌకిక, పారలౌకిక విషయాలపై మీకున్న అవగాహన వెల్లడి అవుతోంది

పారమార్థికతయే ఈ శతకానికి నిజంగా ఊపిరి మిమ్మల్ని కవిగా నిలబెట్ట గల సామర్థ్యం ఉన్నది దీనికి. శ్రీకృష్ణకుచేలుల స్నేహబంధం ఆదర్శమైత్రికి ప్రతీకగ భావించినట్లు తెలియపరచే బొమ్మను శతకం పేరు సార్థకం చేస్తున్న 'ముఖచిత్రం' కోసం ఎన్నుకోవడం ఔచిత్యానికి నిదర్శనం ఈ క్రింది అంశాలకు సంబంధించిన కొన్ని పద్యాలు (మరీ ముఖ్యంగ 32, 39, 75, 79, 91, 104, 107, 108) ప్రత్యేకంగా పేర్కొనదగినవి మీకు నా హార్దిక అభినందనలు.

తల్లి (37వ పద్యం), భార్య (89వ పద్యం), ధనము (96వ పద్యం), దానము (104వ పద్యం), ఆరోగ్యము (11,25వ పద్యం), రాజకీయము (48వ పద్యం), దైవానుగ్రహము (39వ పద్యం), సద్గురు కటాక్షము (106వ పద్యం), వేదముల సారము (21వ పద్యం), మతముల సారము (108వ పద్యం), సత్యము (94వ పద్యం), అంతఃసౌందర్యము (12వ పద్యం), స్నేహము (16,35వ పద్యం), ఆత్మజ్ఞానము (72,75,79,91, 107వ పద్యం),

"వేదాంతచూర్ణిక" రెండవభాగం ప్రచురితం కావాలని కోరుకుంటు న్నాను అందుకు మీకు దైవాశీస్సులు ఉండనే ఉన్నాయి

వంగూరు — శ్రీహూన్ పరిగొండ నాగేంద్రరావు

28-9-2001 — మౌనవ్రత దీక్షా దక్ష శిఖామణి

B A, (Hons), M A , (Andhra), M A , (Poona), PG D T E , PG D E S (C I E F L )

4 శ్రీమతే నారాయణాయ నమః

"సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యయంబకే దేవి నారాయణి నమో ఽస్తుతే"

" ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం"

" గేయం గీతా 'నామసహస్రం'। ధ్యేయం శ్రీపతిరూపమజస్రం"॥

శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రం స్తోత్రములన్నింటిలోను ఉత్తమోత్తమ మైనట్టిది సహస్రమూర్తులతో సహస్రపాద బాహువులతో వెలుగు విశ్వరక్షకుడైన శ్రీ మహావిష్ణువు భగవానుని సహస్రనామములను స్తోత్రమాలికగా గుచ్చి వ్యాసభగవానుడు జగజ్జనుల ఉజ్జీవమునకు

సంజీవినివలె అందించినారు భగవంతుడైన విష్ణువే వ్యాసమహర్షి రూపమున లోకముపై అపారమైన కరుణతో అందించిన దివ్యామృత భాండము "శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము" 'నారాయణనామ సుధా పారాయణ మొసంగును గద! పరమపదమ్మున్' అన్నట్లు విష్ణు సహస్ర నామ పారాయణ ఆర్తులకు, విషణ్ణులకు భయభీతులకు వ్యాధిగ్రస్తులకు శోకోపశమనము గావించి సుఖశాంతుల నందించి కైవల్యమును ప్రసాదించును

సత్కవులు ఆధ్యాత్మిక సంపన్నులు ముముక్షువులైన శ్రీ వేపూరి శేషగిరిరావు గారు విష్ణు సహస్రనామస్తోత్రములోని సహస్రనామములకు విడివిడిగా సకల జనులకు సుభోధకముగా పండిత పామర జనరంజకముగా అర్థతాత్పర్యములను రచించి అందించుట భగవత్ భక్తులకు పరమానందదాయకము ఒక విష్ణ్వంశ ఒక వ్యాసాంశ వారిలో ప్రవేశించి ఈ మహత్‌కార్యమును చేయించి లోకోపకారము చేయించినది విష్ణుసహస్రనామస్తోత్రము ఒక మంత్రరాజము విశ్వవ్యాపకుడైన శ్రీ మహావిష్ణువు యొక్క విశ్వరూపమును సమగ్రముగ నిర్ణయించిన స్తోత్రకదంబము అణువులోని అణువుగా మహత్తులలో మహత్తగ జగములన్నింట నిండిన జగన్నాధుని గుణరూపమహిమాతిశయములను శబ్దబ్రహ్మముగా రూపొందించి వ్యాసుడందించిన నామ సముచ్చయము నకు శ్రీ శేషగిరిరావుగారు విశేష అర్థములను భాసురమైన శైలిలో అందించి తరించినారు మంత్రార్థము నెరిగి మంత్రమును అనుష్ఠించ దలచినవారికి ఈ అర్థ వివరణము మిక్కిలి సహాయకారి కాగలదు విష్ణుశబ్దార్థ సమగ్రావగాహనము భక్తకోటికి ఇహపర సుఖముల నందించి ఆనందమయులను చేయగలదు శ్రీమన్నారాయణుడు శతా నందుడు ఆయన అందించు సంపూర్ణమైన ఆనందము ఈయొక్క స్తోత్ర పారాయణ మందించును ఈ శబ్దార్థవివరణము ఇతోధికముగా అందించును అర్థార్థులకు ఈ అర్థ వివరణము విశేష జ్ఞాన ప్రదాయ కముకాగలదు ఇంతటి మహత్తర కార్యమును సమర్థులై నిర్వహించిన మీకు శ్రీమన్నారాయణస్వామి వారు సదా హృదయస్థులై ఆనందా మృతమును ప్రసాదించవలెనని ఆకాంక్షిస్తున్నాను

"సర్వదేవ నమస్కారః కేశవంప్రతిగచ్ఛతి" నమస్కృతులతో

భద్రాచలం ఇట్లు భవదీయుడు

28-7-2000 అమరవాది జగన్నాథాచార్యులు

5 ప్రియమిత్రులు శ్రీ వేపూరి శేషగిరిరావు గార్కి.

సుహృదభివందనములు విలువ గల గ్రంధాలు రెండు విష్ణు సహస్రనామస్తోత్రమ్ + వేదాంతచూర్ణికలు తాము దయతో పంపించి నారు కృతార్థుడను

విష్ణుసహస్రనామము - భగవత్ రామానుజులవారి భాష్యంతో వున్నది అంకిత పద్యం మీరు వ్రాసినది ఒకటి "ప్రబంధ శతాయతే" అనిపిస్తుంది

వేదాంతచూర్ణికలోని శ్లోకాలు కాలప్రవాహానికి ఎదురీది చిరంజీవము లైనవి ఎన్నో ఎన్నైనా వున్నాయి నావయస్సు ౩౦ సవంత్సరాలు ఇప్పడు నాకు మనశ్శాంతి చేకూర్చే గ్రంధాలు కావడము చేతనే అయాచితంగా అనుగ్రహించారు తాము నాకు చేసిన మేలు మరువరానిది

సికింద్రాబాద్ సందూరి రామకృష్ణమాచార్యులు
28-7-2000

6 ఉ వెన్నుని వేయిపేరులను వెన్నెల కాచిన చందమాయె, నీ
సన్నుత భాష్యమున్గన ప్రసన్నత గన్నుల నీరు లూరుగా
చెన్నగు భావుకాళికిని చిన్మయ సంపదరాశి వాసికిన్
మన్నన శేష్గిరీసుకవి మండిత పండిత వేపురీ శుభమ్

మీరంపిన విష్ణు సహస్రనామస్తోత్రమ్, అర్థసహితం పఠించి, పరిశీలించి, ఆనందకందలిత హృదయరస్థానందంతో తిరుగువాయునమిస్తున్నా పుచ్చుకోమ్మా - వేంగీ మండల కోకిలా వేయి నామాల నల్లనయ్యా! కోవెలా! ఆశీ: 'శుభమ్' భూయాత్

యాళ్ళవానిగరువు, పాలకొల్లు అడ్డాల సూర్యచంద్ర శ్రీరామమూర్తి
29-7-2000 కొల్లేటి కవి

7. శ్రీ శేషగిరిరావు గారికి నమస్సులు.

ఆర్యా! మీరు పంపిన 'విష్ణుసహస్రనామస్తోత్రమ్' అందింది గతంలో మిత్రశతకం, ఇప్పడు ఆధ్యాత్మిక విషయమైన 'విష్ణుసహస్రనామస్తోత్రమ్' అర్థవివరణతో బాగా ప్రచురించారు ఇది ఆస్తికులకు ఉపయోగించు గ్రంధం

తణుకు భవదీయ
5-8-2000 సుశర్మ ప్రధానకార్యదర్శి, నన్నయ భట్టారకపీఠం,

8. విష్ణుసహస్రం

నమస్తే

విష్ణుసహస్రం అందింది చాలామందికి ఉపయోగపడే పనిచేసారు దన్యవాదాలు

కాకినాడ డా. గరికపాటి నరసింహారావు

4-8-2000 మహాసహస్రావధాని

9. పూజ్యకవి పరివ్రాజకులు

శ్రీ వేపూరి శేషగిరిరావు గారికి నమస్సుమాంజలి.

'విష్ణుసహస్రనామస్తోత్రమ్', 'వేదాంతచూర్ణిక' క్షేమంగా అందాయి మిత్ర శతకం గురించి నా అభిప్రాయం ప్రకటించినందులకు కృతజ్ఞుడ్ని

సహస్రనామం చదివాను 'కృష్ణ', 'నైకశ్యంగ' నామాలకు సుదీర్ఘ వివరణ బాగుంది సుందరచైతన్య స్వామి ప్రకటించిన "విష్ణు సహస్ర నామార్థ వివరణ" యిప్పటి దాకా వచ్చిన వాటిలో సమగ్రమైనది విస్తృతార్థ వివరాలు కలదిగాను భావిస్తున్నాను

వేదాంతచూర్ణిక పైపైన చూచాను ఎన్నో తెలియని వివాదాత్మక విషయాలు అందులో విశ్లేషించారు బాగుంది

భద్రాచలం సదా మీ

29-7-2000 చింతపల్లి వెంకటేశ్వర్లు

10 శ్రీమాన్ శేషగిరిరావు గారికి హార్థికాభివందనములతో

మహోదయా! మీరు అభిమానపూర్వకంగా పంపిన వేదాంత చూర్ణిక, విష్ణు సహస్రనామస్తోత్రమ్ గ్రంధాలు అందినవి అత్యంతాభినివేశంతో పరిశీలించినాను చాలా ఆనందం, ఆశ్చర్యం కలిగినవి వాటి వెనుక మీ పరిశోధనాత్మకమైన కృషి విశ్వతో ముఖమైనది వేదాంతచూర్ణిక రెండవ భాగం కూడా వెలుగులోకి వస్తే అర్థవిజ్ఞాన సర్వస్వంగా రూపొందుతుంది విష్ణుసహస్ర నామానికి శంకరభాష్యం కూడా పరిశీలించదగినది

రామానుజాచార్యులు ప్రతిపాదించినది విశిష్టాద్వైతము మధ్వాచార్యులు ప్రతిపాదించినది ద్వైతమతము మీ రచనలో పొరపాటున

వ్యత్యస్తంగా ముద్రితమైనది తాత్త్విక చింతనతో జీవితాన్ని సద్వినియోగ పరచుకుంటున్న మీకు పరమేశ్వరుడు సంపూర్ణాయురారోగ్యాలు ప్రసాదించుగాక

నల్లూరు                స్వస్తి మీ అభిమానపాత్రుడు

31-7-2000                యార్లగడ్డ వెంకటసుబ్బారావు

11 కవిమిత్రులు శేషగిరిరావు గారికి నమస్సులు.

విష్ణు సహస్రనామస్తోత్రమ్ + వేదాంతచూర్ణిక రెండూ అందాయి ఆదరానికి సంతోషం చూర్ణికలో చాలా విషయాలను పొందుపరచారు శారీరక, మానసిక వికాసాలకు ఇవి ఎంతగానో దోహదపడగలవు అంతస్సూత్రంగా జ్ఞానం ఇందులో ద్యోతకమవుతుంది దాచుకోదగిన పుస్తకం ఇది ఒక నిధి రెండవ పుస్తకంలో ప్రతి పదానికి మూలార్థం వివరించారు ఇదియొకదారి శ్లోక స్వరూపం తెలిసికోవడానికి రెండూ మంచి ప్రయత్నాలే

తణుకు                కృతజ్ఞతలతో

21-8-2000                సినీకవి - రసరాజు

ప్రియమైన శేషగిరిరావు

క్షేమము నీవు ఎంతో శ్రద్ధ తీసుకొని పంపించిన 16 పుస్తకములు, శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రము సక్రమముగా చేరినవి సరిపోనువున్నవి ముఖ్యమైన వారికి అభిరుచి వున్నవారికి యిచ్చుట జరిగినది మిగుల సంతోషము రామానుజాచార్యుల భాష్యమును ఆధారముగా తీసుకొని వైష్ణవ సంప్రదాయానికి తలమానికం వంటి స్తోత్రము ఎంతో భక్తి శ్రద్ధలతో తయారగుట మాత్రమేగాక బాపుగారి అట్ట చిత్రము ప్రత్యేకముగా పసుపురంగు చాలా బాగా యున్నది ప్రతులు చాలును అవసరమగుచో నేను వ్రాయగలను

బాల్యస్నేహితుని కృషికి, సాధనకు నాకు గర్వముగా యున్నది

1-8-2000 చెన్నై                నీ ప్రియమైన

మరణము 28-3-2001                ఎం.వి. రంగారావు

ఓం నమః పరమాత్మనే
శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యోనమః

# పరిశీలనా గ్రంథపట్టిక

1. త్రికాల సంధ్యావందనము, శ్రీరామకృష్ణప్రభ
2 తైత్తరీయ సంధ్యోపాసనము
3. శ్రీకృష్ణావతారతత్త్వము
4. శ్రీమద్భాగవతము - పద్యకావ్యము పోతన
5. శ్రీమద్భాగవతము గౌడీయమఠం వారు
6. శ్రీభాగవతరత్నాకరము - శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారు
7 శ్రీభాగవమము - శ్రీ స్వామి సుందర చైతన్యానంద
8 వచన భాగవతము
9. రామాయణ రత్నాకరము - శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారు
10. శ్రీ వాల్మీకి రామాయణము - మందరము - వావిలికొలను సుబ్బారావు
11. రామాయణ చూర్ణిక - శ్రీ భద్రాచలం రామదాస విరచితము
12. ఆధ్యాత్మ రామాయణము
13. రామాయణ సారోద్ధారము, ఆశ్చర్య రామాయణము
14. శ్రీమదుత్తర మహాభారత సారోద్ధారము
15. మహాభారతోపన్యాసములు
16 మహాభారతము - ఉద్యోగపర్వము - పద్యకావ్యము
17 విష్ణుసహస్రనామస్తోత్రము, రామానుజబాష్యము
18 శ్రీమద్భగవద్గీత
19. శ్రీమద్భగవద్గీత గూడార్థ దీపిక
20 సప్తగిరి
21. శుభవార్త
22. భక్తినివేదన - శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు
23. శ్రీ సుందరకాండ శ్రీవిద్య
24. సాంధ్యదీపిక
25 శ్రీరామకృష్ణబోధామృతము

26. శ్రీ మళయాళ స్వామి జీవిత చరిత్ర
27 ఆదిత్య హృదయము
28 ఆదిత్యహృదయ రహస్యము
29 శ్రీ శుష్కవేదాంతతమోబాస్కరము - శ్రీ మలయాళస్వాములవారు సం॥ 1934
30 పద్మపురాణము
31 మత్స్యపురాణము
32 విష్ణుపురాణము
33. వరాహపురాణము
34 అమృతతరంగిణి
35 అర్చావతారము వైఖానసులు
36. అర్చావతారము
37. పంచాంగం వికారినామ సం॥ 1960
38 పెద్దబాలశిక్ష
39 ఉత్తరగీత
40. ఓంకారప్రభావము
41. కళాశాస్త్రము
42 వాత్స్యాయన కామసూత్రములు
43. రతిరహస్యము
44. శబ్దరత్నాకరము
45 భగవత్పూజామాల
46 జ్ఞానామృతము
47 పరాశరస్మృతి
48. ఉపనిషత్సార రత్నావళి
49. శ్రీ భద్రాద్రి రామశతకము - శ్రీ పరశురామనృసింహదాసు సం॥ 1926
50 శ్రీకృష్ణలీలామృతము
51. శ్రీ హనుమన్మంత్రానుష్ఠాన ప్రకాశిక
52. భగవదారాధన విధానము
53 నిత్యప్రార్థనావళి
54. శ్రీవేంకటేశాధిపూజాపంచరత్నమాల

55 సాధనరహస్యము
56. ఆంధ్రవాచస్పత్యము 2వ భాగము
57 గీతామకరందము
58 రాజయోగము
59 ముక్తికోపనిషత్తు
60 ఆంధ్రసచిత్రవారపత్రిక 1-8-1997 Page 13 / 27-7-84 Page - 61
61 కాశీమజిలీ కథలు 3వ భాగము
62. నారదభక్తి సూత్రములు
63. సూర్యరాయాంధ్ర నిఘంటువు
64 జ్యోతిషప్రభావము
65 అమరకోశము
66. పారమార్థిక ప్రదర్శనము
67 నిత్యపూజావిధానము
68 వాస్తుశాస్త్రము
69 సుందరకాండ
70 భారతీశతకము
71. దేవీభాగవతము 2వ భాగము
72 మణిమాల
73. శ్రీకృష్ణకర్ణామృతము
74. విశ్వదేవార్చన దైవప్రార్థన
75. శ్రీ గాయత్రీ నిత్యపూజావిధానము
76 శ్రీ గాయత్రీ హృదయరహస్యము
77. శ్రీ గాయత్రీ దివ్యశక్తి
78 వైరాగ్యమునొందుటెట్లు
79. సంగీత విద్యాదర్పణము
80 కఠోపనిషత్తు
81 అనుపమాన ప్రసాదము
82 వివేక చూడామణి
83 ముహూర్తభాగము
84 శ్రీశైలప్రభ

సీ: కేశవ గోవింద కృష్ణ దామోదర
నారాయణాచ్యుత నారసింహ
మధుసూదన త్రివిక్రమ జనార్దన ముకుంద
వైకుంఠ వామన వాసుదేవ
పుండరీకదళాక్ష పురుషోత్తమోపేంద్ర
పరమాత్మ పరమేశ పద్మనాభ
మాధవాధోక్షజ మధువైరి శ్రీహరి
విష్ణు విశ్వంభర విశ్వనాథ

గీ: శ్రీధరానంత చిద్రూప శ్రీనివాస
పుణ్య చారిత్ర సురనుత పుణ్యపురుష
రమ్య గుణధామ భద్రాద్రిరామ సత్య
కామ కరుణాలలామ లోకాభిరామ

## గ్రంథకర్త రచనలు

1. **మిత్రశతకము**
2. **వేదాంతచూర్ణిక**(సంఖ్యాశాస్త్రము) ప్రథమభాగము
3. **విష్ణుసహస్రనామస్తోత్రము - రామానుజభాష్యము**
4. **వేదాంతచూర్ణిక** (సంఖ్యాప్రాశస్త్యము) ద్వితీయభాగము
5. **నిత్యానుష్ఠానము** (అముద్రితము)
6. **శ్రీకృష్ణ విశ్వరూపాలు** (అముద్రితము)